# భాగవత వైజయంతిక

(వ్యాస సముచ్చయము)



సంపాదకుడు
కరుణశ్రీ




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

**Bhagavata Vaijayanthika** - A Collection of Essays on Pothana's Andhra Maha Bhagavathamu, Edited by Sri Jandhyala Papaiah Sastry (Karunasri).

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004.



ప్రచురణ : 343

ప్రథమ ముద్రణ : 1983

ప్రతులు : 2,000



**వెల రూ. 9-50**

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు-500 004.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు-500 001.

# తొలి పలుకు

మ్మెర పోతన వ్రాసిన శ్రీ మహాభాగవతం తెలుగు వారి దైనందిన
పెనవేసుకొనిపోయిన కావ్యం. నిరీహుడై, నిస్సంగుడై భక్తిభావ
కోసం కావ్యరచన చేసిన ఆ మహనీయుడు పడుపుకూటిని ఆశించక
నంతో రాచరికాన్ని ఎదిరించి నిరాడంబరుడై జీవయాత్రను సాగించినాడు.
మ్మనది అనగలిగిన ధైర్యశాలి అతడు. ఒకరి మెప్పుకోసం కావ్యం
డు కాడతడు. భగవంతుని నమ్మి ఆయన మహిమలను మధురనాదా
మణీయ అర్థాలతో, సుందరమైన భాషలో మహాకావ్యంగా మలచి మనకు
నాడు. పోతన భాగవతంతో పరిచయం అందమైన తెలుగు భాషతో
ం.

మ్మెర పోతన పంచశతి జయంతి ఉత్సవ సందర్భంగా సాహిత్య అకా
యన భాగవతాన్ని పరిశీలించి వ్రాసిన వ్యాసాలను కొన్నింటిని ఎంపిక
సంకలనంగా ప్రచురించాలని నిశ్చయించింది. పలు దృక్కోణాలతో
సాహిత్యాన్ని ఈ వ్యాసాలలో విద్వాంసులు పర్యాలోచన చేసినారు. వీనిలో
వ్యాసాలు ఇంతవరకు వివిధ పత్రికలలో, పుస్తకాలలో ప్రచురింప
అయితే వాటిలో పోతన కావ్య పరిచయాన్ని సామాన్యులకూ, పండి
కలిగించాలనే ఉద్దేశంతో ఈ వ్యాసాల ఎంపిక జరిగింది.

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) గారి సంపాదకత్వంలో ఈ
దంబం వెలువడుతున్నది. శ్రీ శాస్త్రిగారు ఉత్తమ కవులు, సహృదయ
లు. వ్యాసాలను ఎన్నుకొనడంలో ఆయన తమ ప్రతిభాపాండిత్యాలను
వినియోగించుకొని ఈ సంపుటిని విద్వాంసులకూ, విమర్శకులకూ,
మానులకూ ప్రయోజనకరంగా తీర్చిదిద్దినారు. పోతనగారి కవితా
ప్రతీకలుగా ఉన్న చక్కని పద్యాలను కూడా ఈ సంకలనంలో అక్క
చేర్చి ఈ "పోతన వైజయంతిక" ను వెలువరించినారు.

ఈ సంపుటిలోని వ్యాసాలను రచించిన మనీషులకు మా కృతజ్ఞతలు.

సాహిత్య అకాదమి కోరిక మేరకు ఈ వ్యాస సంకలనాన్ని ఏర్చి కూర్చి
సహకరించిన శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి మా ధన్యవాదాలు,
దనాలు.

బాదు,
1983.

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి

# విషయసూచిక


| | | | పుట |
|---|---|---|---|
| 1. | పోతన్నగారూ! ధన్యులండీ మీరు<br>—శ్రీ కరుణశ్రీ | ... | 1 |
| 2. | పోతన జన్మస్థలము<br>—శ్రీ కందుకూరి వీరేశలింగము | ... | 11 |
| 3. | పోతన వంశము, కాలము, కృతులు<br>—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ | ... | 19 |
| 4. | ఆంధ్ర భాగవత వైశిష్ట్యము<br>—ఆచార్య నిడుదవోలు వేంకటరావు | ... | 30 |
| 5. | పోతన శయ్యా సౌభాగ్యము<br>—శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రి | ... | 43 |
| 6. | బమ్మెర పోతన్నగారు<br>—శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి | ... | 48 |
| 7. | పోతనామాత్యుని కవితాశిల్పం<br>—డాక్టర్ దాశరథి | ... | 57 |
| 8. | పోతరాజుగారి లోకజ్ఞత<br>—శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి | ... | 70 |
| 9. | బమ్మెరవారి భక్తి సామ్రాజ్య వైభవం<br>—డాక్టర్ జంధ్యాల జయకృష్ణ బాపూజీ | ... | 75 |
| 10. | బమ్మెరవారి కమ్మతెమ్మెరలు<br>—శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు | ... | 87 |
| 11. | పోతన - తిక్కన<br>—ఆచార్య పింగళి లక్ష్మీకాంతము | ... | 91 |
| 12. | పోతన - శ్రీనాథుడు<br>—శ్రీ వానమామలై వరదాచార్యులు | ... | 94 |

13. పోతన కవితోన్మీలనము ... 98
—శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

14. నేను బమ్మెరవారి బాలకృష్ణుడను ... 106
—డాక్టర్ ధారా రామనాథశాస్త్రి

15. పోతన కవిత్వ పటుత్వము ... 114
—శ్రీ తాపీ ధర్మారావు

16. పోతన - శృంగార రసపోషణము ... 120
—శ్రీ దేవులపల్లి రామానుజరావు

17. పోతన వ్యాజస్తుతి - వ్యంగ్య వైభవము ... 124
—ఆచార్య దివాకర్ల వేంకటావధాని

18. పోతనామాత్యుని స్త్రీ పాత్రలు ... 135
—శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

19. ఆంధ్రమహాభాగవతము - రసానుభూతి ... 142
—డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యం

20. కుచేలోపాఖ్యానము ... 150
—శ్రీ శివశంకరస్వామి

21. పోతన వ్యక్తిత్వము ... 156
—ఆచార్య సి. నారాయణరెడ్డి

22. సహజపాండిత్యులవారి వరదాలు ... 166
—శ్రీ ఆరుద్ర

23. పోతనార్యుని వైశిష్ట్యము ... 174
—ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము

24. ద్రౌపది మాతృహృదయము ... 177
—ఆచార్య యస్వీ జోగారావు

25. ఆంధ్ర మహాభాగవతము - అనువాద వైఖరి ... 188
—డాక్టర్ ప్రసాదరాయ కులపతి

26. సత్యభామా స్వరూపము ... 201
—డాక్టర్ రాజేశ్వరి

27. పోతనార్యుని కథాకథనశిల్పము ... 210
— డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి

28. భాగవతము - సామాజిక భక్తి ... 223
—డాక్టర్ తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రి

29. భాగవత భక్తి - ప్రహ్లాదుడు ... 229
—శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

30. పోతన - సూరదాసు ... 233
—శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

31. తపః ఫలము ... 240
—శ్రీ కేశవ తీర్థస్వామి

32. పోతనామాత్యుని అభేద దృష్టి - పాఠపరిశీలనము ... 242
—శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

33. భాగవతము - రసపోషణము ... 252
— శ్రీ సేపూరి లక్ష్మీనరసయ్య

34. మహాకవి పోతన ... 261
— శ్రీ కల్లూరు వేంకటనారాయణరావు

35. పోతన తాత్త్వికచింతన ... 266
—శ్రీ ఎ. వేంకటసుబ్బయ్య

36. పోతన స్వప్నచర్చ ... 271
—శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

37. పోతన పద్యరత్నములు ... 274

38. అనుబంధము I

1. "శాలరసాలసాల" పదార్థపర్యాలోకనము ... 279

—శ్రీ కాళీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి

2. "పుట్టం బుట్టి" పద్యార్థము ... 281

—శ్రీ కుమారదేవ

3. "పుట్టం బుట్టి" పద్యార్థ పరామర్శము ... 283

—శ్రీ నల్లాన్ చక్రవర్తుల వరదాచార్యులు

39. అనుబంధము II

పుష్పాంజలి ... 286

40. అనుబంధము III

కవితాంజలి ... 290

41. అనుబంధము IV

మౌక్తికమాల ... 295

42. అనుబంధము V ... 298


———

# సహృదయులకు స్వాగతం

''గుడులు కట్టించె కంచర్ల గోపరాజు
రాగములు కూర్చె కాకర్ల త్యాగరాజు
పుణ్యకృతి చెప్పె బమ్మెర పోతరాజు
రాజు లీ మువ్వురును భక్తి రాజ్యమునకు.''

అన్నట్లు గోపన్న కొండల్లో బండల్లో రాముడికి గుళ్ల కట్టిస్తే - పోతన్న తెలుగు గుండెల్లో కృష్ణుడికి గుళ్ల కట్టించాడు.

త్యాగరాజు తన తంబురా తీగలమీద ''రఘుకుల తిలకుణ్ణి'' ఊరేగిస్తే - పోతరాజు తన ''బాల రసాలసాల మృదుపల్లవ 'శయ్యలమీద' యదుకుల తిలకుణ్ణి'' ఉయ్యాల లూగించాడు.

రాజుకాని రాజు - రాజ్యంలేని రాజు - రాజభోగాలు ఆశించని కవిరాజు - ఆడంబరాలకూ, అహంకారాలకూ త్రోసిరాజు - మన బమ్మెర పోతరాజు.

భాగవతాన్ని భూమిలో పూడ్చిపెట్టినా "బాలరసాలసాలమై" పైకిలేచింది. పోతన్న భాగవతం ఎప్పుడు చూచినా - "అప్పుడు తీసిన వెన్న." అందుకే దాన్ని వదలిపోలేడు చిన్నికిష్టన్న.

బమ్మెరవారి పద్యాలు —
పాలుతాగిన లేగదూడల్లాగా పరుగులు తీస్తాయి.
వెన్నెల్లో ఆడుకునే కన్నెపిల్లల్లాగా గంతులు వేస్తాయి.
లలితరసాల పల్లవాల్లాగా మెత్తమెత్తగా చిత్తానికి హత్తుకుంటాయి.
నిర్మల మందాకినీ వీచికలై —జలజల ప్రవహిస్తాయి.
మందార మకరందాలై - చవులూరిస్తాయి.

"అమ్మా ! ఏదయినా పద్యం చెప్పమ్మా" అంటే - "అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ..." అంటూ మొదలుపెడుతుంది బంగారుతల్లి.

''అన్నా ! ఏదన్నా మంచి పద్యం చెప్పరా'' అంటే-''సిరికింజెప్పడు శంఖ చక్రయుగమున్ జేదోయి సంధింపడు'' - అంటూ ప్రారంభిస్తాడు మహా పండితుడులాగా.

"నాన్నగారూ! మీరేమయినా చదవండి" అంటేచాలు-"నల్లనివాడు పద్మ నయనంబులవాడు కృపారసంబు పైజల్లెడువాడు మౌళి పరిసర్పిత పింఛమువాడు" ......అని సాగిస్తాడు ఆయనగారు.

"తాతయ్యా ! నాకేదయినా పద్యం నేర్పవూ" అనటమే ఆలస్యం-"చేతులారంగ శివుని పూజింపడేని, నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని"......అని చేతులు తిప్పుతాడు పాపం.

"అక్కయ్యా ! నువ్వేదయినా ఒక చక్కని పద్యం పాడవే" అనగానే-"మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబు పోవునే మదనములకు" ......అని పాటకచ్చేరీ ప్రారంభమౌతుంది.

అమ్మమ్మ దగ్గరకెళ్లి "నీకేమయినా పద్యాలు వచ్చునా" అంటే ''రాకేం నాయనా ! విను" అని "ఓయమ్మ నీకుమారుడు మా యిండ్లను పాలుపెరుగు మననీడమ్మా''......అంటూ కూనిరాగాలు సాగతీస్తుంది.

"చెల్లీ! నీకు వచ్చిన ఒక చిన్ని పద్యం వినిపించమ్మా" అంటే-"పెద్దదే వచ్చు'' అని - "తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతఁ బూనితిఁ నీవు నా యుల్లంబందుననిల్చి''......అంటూ గుక్కపడుతుంది.

''ఒరే తమ్ముడూ ! ఏదీ ఒక కమ్మని పద్యం''......అంటూండగానే వాడు గొంతెత్తి-"బాలరసాలసాల నవపల్లవ కోమల"......అని గడగడ అప్పజెబుతాడు తడబడకుండా.

అయ్యవారిని కదిలిస్తే—అలవైకుంఠపురంబులో నగరిలో......

పిల్లవాణ్ణి కదిలిస్తే—ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు......

ఏమిటీ ఇంద్రజాలం! ఇల్లంతా భాగవతమే! ఇంటింటా భాగోతమే! ఏమిటీ విశేషం! ''ఇందుగల డందులేడని సందేహము వలదు'' అన్నట్లు సర్వత్రా పోతన్నగారే-ఇళ్ళల్లో-గుళ్ళల్లో-బళ్లల్లో-అంతటా బమ్మెరవారి కమ్మతెమ్మెరలే! ఏమిటో ఈ చిత్రం - కలయో ! వైష్ణవమాయయో......

పోతన్నగారు మనలో ఎంతగా కలిసిపోయారు! మనసులో, మాటలో, పాటలో, పద్యంలో, నుడికారాలలో, ఆచారాలలో, వెలుగులా - వెన్నెలలా - మలయమారుతంలా కలసిపోయారు. తెలుగువారి నిత్యజీవితాలలో, నిండు గుండెలలో, ఉచ్ఛ్వాసనిశ్వాసాలలో ఆయన నిండి ఉన్నాడు. కూర్చుండి ఉన్నాడు.

ఉదయభానుని కిరణాలలో - యదుకిశోరుని మృదుచరణాలలో, చల్ల లమ్మే గొల్లభామల్లో - విల్లుపట్టిన సత్యభామల్లో, కుచేలుని అటుకుల్లో - కన్నక చేలుని కిటుకుల్లో, వల్లవాంగనల వలపుల్లో - పిల్లనగ్రోవి పిలుపుల్లో ఆయన కనిపిస్తాడు, వినిపిస్తాడు, ''ఆహా'' అనిపిస్తాడు.

కదలే హలాలలో - కదంత్రొక్కే కలాలలో - పండివంగిన పొలాలలో - ప్రవహించే జలాలలో- పల్లెసీమలో- చందమామలో- పారిజాతం పువ్వుల్లో- పసిపాపల నవ్వుల్లో- నాగలి చాళ్లలో- విరహిణి కన్నీళ్లలో సహజ పాండిత్యుని మహనీయమూర్తి కన్నుల విందు చేస్తుంటుంది. ఆయన కవిత్వ మహత్వం అంతటిది. ఆయన భాగవత ప్రభావం అటువంటిది. ఆయన పురాకృతసుకృతం అంత గొప్పది.

భాగవతం విప్పితే చాలు- పుటలు తిప్పితే చాలు-

''నీకున్ మ్రొక్కెద త్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ'' అంటూనో -
''రావే ఈశ్వర ! కావవే వరద ! సంరక్షించు భద్రాత్మకా !'' అంటూనో-
''ఒక సూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కడై తోచుపోలిక'' అంటూనో-
''కమలాక్షునర్చించుకరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ' అంటూనో-
''తృప్తింబొందని మనుజుడు సప్తద్వీపములనైన చక్కంబడునే!'' అంటూనో-
''ఘనుడా భూసురుడేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో'' అనుకుంటూనో-
''కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ బొందరే వారేరీ?'' అంటూనో-
''ఫీరెవ్వరు శ్రీ కృష్ణులుగారా ! ఎన్నడును వెన్నగానరటగదా'' అంటూనో-
''నీ పాదకమలసేవయు నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును తాపసమందార! నాకు దయసేయగదే!'' అంటూనో-
'అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న! రమ్మన్న!' అంటూనో-
''వనితా! ఏమితపంబు చేసెనొకొ ఈ వంశంబు వంశంబులోన్'' అంటూనో-

కుంతీదేవిగా, గజేంద్రుడుగా, ఆచార్య భీష్ముడుగా, ప్రహ్లాదుడుగా, వామనమూర్తిగా, రుక్మిణీకన్యగా, బలిచక్రవర్తిగా, యశోదమ్మగా, మాలాకారుడు సుదాముడుగా, రంతిదేవుడుగా, వ్రేపల్లె గోపికగా వేషాలు మార్చి, గొంతులు మార్చి పోతన్నగారు మనకు దర్శనమిస్తూనే ఉంటారు. భాగవత పాత్రలతో ఆయన తాదాత్మ్య మటువంటిది.

సహజ పాండిత్యులవారి సహజసుందర శయ్యా సౌభాగ్యంతో ఉయ్యాల లూగే ఈ తియ్యని పద్యాల ఒయ్యారం గమనించండి—

పాంచాలీ కబరీ వికర్షణ మహాపాపక్షతాయుష్కులన్
జంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందు డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ, గల్పించెన్ మహాఖ్యాతిఁ, జే
యించెన్ మూడు తురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్.

రాజఁట ధర్మజుండు! సురరాజ సుతుండఁట ధన్వి! శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట! సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రియట! యుగ్రగదాధరుఁడైనభీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునట! యాపద గల్గు టిదేమి చోద్యమో!

త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ, బ్రాభాత నీ
రజ బంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప, మా
విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.

మృదుమధుర పదబంధాలతో ముద్దులు మూటగడుతూ దిద్దితీర్చినట్లున్న ఈ అందాల కందాలను సందర్శించండి - శ్రీశుకుడు పరీక్షిత్తుతో అంటాడు-

చిత్రంబులు త్రైలోక్య ప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజన వన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

శౌనకాదిమహర్షులు సూతమహర్షితో అంటారు -

పావనములు దురిత లతా
లావనములు నిత్యమంగళప్రాభవ సం
జీవనములు లక్ష్మీ సం
భావనములు వాసుదేవ పదసేవనముల్.

కన్నతండ్రి హిరణ్యకశిపుడు చిన్నికొడుకు ప్రహ్లాదునితో అంటాడు -

అనుదిన సంతోషణములు
జనితశ్రమ తాపదుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకును కర్ణయుగళ సద్భూషణముల్.

వామనమూర్తి బలిచక్రవర్తిని ప్రశంసిస్తూ అంటున్నాడు -

ఏలితివి మూడు జగములు
తోలితి వింద్రాదిసురలఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణములఁ
జాలితి వీరాక్షసులను సంరక్షింపన్.

బమ్మెరవారి కవిత్వం ఆబాలగోపాలాన్నీ ఆకట్టుకోటానికి సహజ సుకుమారమైన ఆయన సంభాషణాత్మకశైలి కారణం. విదురుడు పాండవుల పంచలో పడివున్న ధృతరాష్ట్రునితో అంటున్నాడు -

పుట్టంధుండవు! పెద్దవాడవు! మహాభోగంబులా లేవు; నీ
పట్టెల్లం జెడిపోయె; దుస్సహ జరాభారంబు పైఁ గప్పె; నీ
చుట్టా లెల్లను బోయి; రాలు, మగఁడున్, శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయల పంచనుండఁదగవే! కౌరవ్యవంశాగ్రణీ!

"బిడ్డలకు బుద్ధి సెప్పని
గ్రుడ్డికిఁ బిండంబు వండికొనిపొండిదె పైఁ
బడ్డాఁ"డని భీముం డొర
గొడ్డెము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా!

హిరణ్యకశిపుడు కొడుకును లాలిస్తూ అడుగుతున్నాడు -

నిన్నున్ మెచ్చరు నీతి పాఠమహిమన్ నీ తోడి దైత్యార్భకుల్
గన్నారన్నియుఁ జెప్పనేర్తురుగదా గ్రంథార్థముల్ దక్షులై;
యన్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁ డౌదంచున్ మహావాంఛతో
నున్నాడన్ ననుఁ గన్నతండ్రి! భవదీయోత్కర్షమున్ జూపవే!

చోద్యం బయ్యెడి నింతకాలమరిగెన్; శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు చెప్పిరో గురువు; లేవెంటం బఠింపించిరో;
విద్యాసార మెఱుంగఁగోరెద భవద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యమ్మొక్కటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా!

ద్రౌపది పుత్రఘాతియైన అశ్వత్థామతో అంటున్నది-
భూసురుఁడవు ! బుద్ధిదయా
భాసురుఁడవు ! శుద్ధ వీరభట సందోహా
గ్రేసరుఁడవు ! శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ !

ఉద్రేకంబున రారు ! శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు ! కిం
చిద్ద్రోహంబును నీకుఁజేయరు ! బలోత్సేకంబుతోఁ జీఁకటిన్
భద్రాకారులఁ బిన్నపాపల రణప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింపనకటా ! నీచేతు లెట్లాడెనో !

"అసురేంద్రుండు పదత్రయం బడుగ నీయల్పంబు నీ నేర్చునే!" అన్న బలితో వామనుడు-

గొడుగో ! జన్నిదమో ! కమండలువొ ! నాకున్ ముంజియో ! దండమో !
వడు గేనెక్కడ ! భూములెక్కడ ! కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ ! నిత్యోచితకర్మ మెక్కడ ! మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్.

తన సందేశాన్ని నందనందనునికి అందించి ఆయనను కొనివచ్చిన అగ్ని ద్యోతనునితో రుక్మిణి తన కృతజ్ఞత ప్రకటిస్తూ పలుకుతుంది-

జలజాతేక్షుఁ దోడితెచ్చితివి నా సందేశముంజెప్పి; నన్
నిలువంబెట్టితి; నీకృపన్ బ్రతికితిన్; నీయంతపుణ్యాత్మకుల్
గలరే! దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింపగానేర, నం
జలిఁ గావించెద భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!

పోతన చిరంజీవి. ఆయన భాగవతం మృత్యుంజయం. తెలుగువారు అదృష్టవంతులు.

అయిదువందల వసంతాలు గడచిపోయినా బమ్మెరవారి భాగవత బాలరసాల నవపల్లవాలు వసివాడలేదు. కసుగందలేదు. భాగవతంకోసమే పోతన్నగారు పుట్టారు: పోతన్నగారి కోసమే పూర్వకవులెవ్వరూ ముట్టుకొనకుండా భాగవతాన్ని అట్టిపెట్టారు.

తనకు వ్యాసులవారి భాగవతం ప్రాప్తించటం తన పురాకృత సుకృత విశేషం అన్నారు పోతన్నగారు; మనకు పోతన్నగారి భాగవతం లభించటం మన జన్మజన్మాల పుణ్యవిశేషం.

ఏవంవిధమైన బమ్మెరపోతన్నగారి భాగవతాన్ని ప్రశంసిస్తూ ప్రముఖులు వ్రాసిన వ్యాసాలన్నిటినీ ఒక సంపుటంగా ఏర్చికూర్చే సదవకాశాన్ని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారు నాకు కలిగించారు. నా శక్తికొలదీ ప్రయత్నించి ఈ విధంగా ఈ సారస్వత సంపుటాన్ని సంసిద్ధం చేశాను.

ఈ సందర్భంలో తమ గ్రంథాలయాలలోని ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలనూ, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలనూ, భారతి, పరిశోధన, ఆంధ్రజ్యోతి, తెలుగువాణి, తెలుగు విద్యార్థి ఇత్యాది పత్రికలనూ అందించి నాకు సహకరించినందుకు రాజమండ్రి "గౌతమీగ్రంథాలయం" అధినేతలకూ, వేటపాలెం సారస్వతనికేతనం అధినేతలకూ నా సాధువాదాలు.

సారవంతాలయిన తమ వ్యాసాలతో ఈ సారస్వత సంపుటానికి సొంపు సంపాదించిపెట్టిన వ్యాసరచయితలందరికీ నా అభివాదాలు.

ఈ సత్కార్యానికి నన్ను ప్రోత్సహించిన సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికీ, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికీ, కార్యదర్శి శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారికీ నా ధన్యవాదాలు.

ఈ సారస్వత వ్యాస సంపుటికి "భాగవత వైజయంతిక" అని పేరు పెట్టటం జరిగింది. విజయపతాకను "వైజయంతి" అంటారు. విష్ణుమూర్తి మెడలోని విరిదండనూ "వైజయంతి" అనే అంటారు. త్రిలోకాధినాథుడైన దేవేంద్రుని సౌధాన్నికూడా "వైజయంతి" అని పిలుస్తారు.

పోతనకవీంద్రుని కవితా సామ్రాజ్యానికి ఎత్తిన జయపతాక కనుక ఇది "భాగవత వైజయంతిక."

భక్తిసుగంధాలు విరజిమ్మే సూక్తి సుమనస్సులతో కూర్చిన మాల కనుక ఇది "భాగవతవైజయంతిక".

ఎందరెందరో కవి పండితుల సహకారంతో స్వరూపం ధరించిన సహజ పాండిత్యుని పోతన కవీంద్రుని యశస్సౌధం కనుక ఇది "భాగవత వైజయంతిక."

రండి! దయచేయండి! మా స్వాగతం అందుకోండి! ఈ భాగవత వైజయంతికలో ప్రవేశించండి. ఎందరో కవులు, పండితులు, కళాప్రపూర్ణులు, విమర్శకులు ఏకత్ర సమావేశమై సాహిత్య గోష్ఠి జరుపుతున్నారు.

కొందరు పోతన్నగారి జన్మస్థలాన్నీ కాలాన్నీ కృతులనూ సమీక్షిస్తుంటే కొందరు ఆయనగారి భాగవత వైశిష్ట్యాన్ని ఉగ్గడిస్తున్నారు.

కొందరు సహజ పాండిత్యుల శయ్యాసౌభాగ్యాన్ని వెల్లడిస్తుంటే కొందరు ఆయన అసల్పు కవితాశిల్పాన్ని గొంతెత్తి చాటుతున్నారు.

కొందరు పోతన వ్యక్తిత్వాన్ని వ్యక్తీకరిస్తుంటే కొందరు ఆయనగారి భక్తిసామ్రాజ్య వైభవాన్ని ప్రస్తుతిస్తున్నారు.

కొందరు పోతరాజుగారి లోకజ్ఞతకు అద్దంపడుతుంటే కొందరు బమ్మెర వారి కమ్మతెమ్మెరలకు గవాక్షాలు తెరుస్తున్నారు.

కొందరు ఇతర మహాకవులతో పోతన్నగారిని పోల్చిచూస్తుంటే కొందరు ఆయన సజీవ పాత్ర చిత్రణాన్ని కొనియాడుతున్నారు.

కొందరు బమ్మెరవారి బాలకృష్ణులై అభినయిస్తుంటే కొందరు ఆయన కవిత్వ పటుత్వాన్ని పరామర్శిస్తున్నారు.

కొందరు పోతనగారి కవితోన్మీలనాన్ని అభినందిస్తుంటే కొందరు ఆయన శృంగార రసపోషణాన్ని విశ్లేషిస్తున్నారు.

కొందరు పోతరాజుగారి వ్యాజస్తుతినీ వ్యంగ్యవైభవాన్నీ వివరిస్తుంటే కొందరు ఆయన స్త్రీ పాత్రలను చిత్రీకరిస్తున్నారు.

కొందరు ఆంధ్ర మహాభాగవతంలోని రసానుభూతిని ప్రస్తరిస్తుంటే కొందరు సహజ పాండిత్యులవారి సరదాలను ప్రకటిస్తున్నారు.

కొందరు ఆంధ్ర మహాభాగవతకర్త అనువాద వైఖరిని విశదీకరిస్తుంటే కొందరు ఆ మహాకవి కథాకథనశిల్పాన్ని ప్రశంసిస్తున్నారు.

కొందరు పోతనామాత్యుని అభేదదృష్టిని అభివర్ణించి పాఠపరిశీలనానికి ఉపక్రమిస్తే కొందరు పోతనగారి తాత్త్వికచింతను పేర్కొన్నారు.

కొందరు పోతన కవీంద్రుని సామాజిక భక్తిని నిరూపించితే కొందరు మహాకవి పోతనను మన కనులముందు సాక్షాత్కరింపజేశారు.

కొందరు పోతన స్వప్నచర్చను చేస్తే కొందరు పోతన పద్యాలను పర్యాలోకనం చేశారు.

ఎందరో మహానుభావులు ఈ విధంగా పుష్పాంజలులూ కవితాంజలులూ మౌక్తికమాలలూ సహజ పాండిత్యులకు సమర్పించుతున్నారు. ఈ వైజయంతికను విజయవంతం చెయ్యటానికి సహృదయులందరికీ హృదయపూర్వక స్వాగతం.

**సంపాదకుడు.**

# పోతన్నగారూ! ధన్యులండీ మీరు!

—శ్రీ కరుణశ్రీ

ఎవరూ? పరమభక్తాగ్రగణ్యులైన బమ్మెర పోతన్న గారా! నమస్కారమండీ! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు కన్నుల విందుగా కనిపించారు! ఎప్పటినుంచో మిమ్మల్ని సందర్శించాలనీ, పరమపవిత్రమైన మీ పాద పద్మాలు భక్తితో సంస్పృశించాలనీ, ఆప్యాయంగా బుజ్జగించి కవితాసరస్వతి కన్నీళ్ళు తుడిచిన మీ చేతివ్రేళ్ళు ముద్దు పెట్టుకోవాలనీ, కమ్మని పద్యాలను గ్రుమ్మరించిన మీ గంటాన్ని కన్నుల కద్దుకోవాలనీ ఎంతగానో ఉవ్విళ్ళూరాను. ఎన్నెన్నో కలలు గన్నాను. ఇన్నాళ్ళకు నా కోరిక తీరింది. నా తపస్సు ఫలించింది. సహజ పాండిత్యులవారు సాక్షాత్కరించారు.

"మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అన్న సుకవి సూక్తికి ఉజ్జ్వలమైన ఉదాహరణం మీరు. "కవిత్వ"మనే పాలల్లో "భక్తి" అనే పంచదార కలిపి భాగవత రసాయనాన్ని పాకం చేసి లోకానికి అందించిన అమృత హస్తం మీది. "బాల రసాల సాల నవపల్లవ కోమల" అయిన మీ కావ్యకన్యక తెలుగు గుండెల్లో "మందార మకరందా"లను చిందించింది. తెలుగు జాతిని "నిర్మల మందాకినీ వీచికల్లో" ఓలలాడించింది.

"బాలరసాలసాల" అంటే గుర్తుకొచ్చింది. అన్నట్టు పోతన్న గారూ! మీ ఇంటి ముందు నవపల్లవాలతో నవనవలాడే బాలరసాలం ఉంది కదండీ! ఆ గున్నమామిడి క్రింద తిన్నెమీద కూర్చుండేగా మీరు భాగవతం వ్రాసింది! అవునంటారా?

పోతరాజు గారూ! మరొక్క చిన్న సందేహం. ఇదిగో ఇలా చూడండి. మీ అరచేతులు అలా కాయలు కాచాయే? హలం పట్టి పొలం సేద్యం చేయడం మూలానా? గంటం పట్టి పద్యం వ్రాయడం మూలానా? అసలు మీరు కవులా?

కర్షకులా ? లేకపోతే కవి కర్షకులా ? కాకపోతే కర్షక కవులా ? ఇంతకూ మీకు కలమంటే యిష్టమా ? హలమంటే యిష్టమా ? కొంచెం సెలవీయండి, ఇదేమిటి వీడు ఇలా అడుగుతున్నాడు అనుకోకండి. మీ అవిరళకృషి ఆంధ్ర సారస్వత క్షేత్రాలను పదునుచేసి కవితాబీజాలు చల్లి బంగారు పంటలు పండించింది గదండీ !

చూశారా మరి ! మీరు ఊర్ధ్వపుండ్రాలు ధరించి ఉంటారనుకున్నాను గాని మీ ఫాలాన విభూతిరేఖలూ, కంఠాన తులసిపేరులూ ఉంటాయనుకోలేదండీ! అవునులెండి. హరిహరాద్వైత దృష్టి కదా మీది.

అయ్యో ! మీ తండ్రి కేసన మంత్రిగారు శైవాచార సంపన్నులు. మీ తల్లి లక్కమాంబ గారు సదా శివపాదయుగార్చనాపరురాలు. మీ అన్న తిప్పన్న ఈశ్వర సేవాకాముడు. ఇక మీరో ''పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుణ్ణి'' అని స్వయంగా చెప్పుకొన్నారు. అటువంటి శైవకుటుంబంలో జన్మించిన మీరు శ్రీరామభక్తులై భాగవతం వ్రాయడం చిత్రంగా లేదండీ !

''అభ్రంకష సముత్తుంగ తరంగ'' అయిన గంగలో స్నానము చేసి మహనీయ మంజుల పులినతల మధ్యంలో మహేశ్వరధ్యాన తత్పరులై మీరు కూర్చొనడమేమిటి ? సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడు మీ కన్నులముందు సాక్షాత్కరించి "మన్నామాంకితంబుగా భాగవతంబు తెనుగు సేయు''మని మీకు ఆనతీయడ మేమిటి ? ఎంత చిత్రంగా ఉందండీ ! శ్రీరాముడు తనకు అంకితం చేయమన్న భాగవతాన్ని మీరు ''హరికి నందగోకుల విహారికి గోపనితంబినీ మనోహారికి'' అని షష్ఠ్యంతాలు వ్రాసి శ్రీకృష్ణునికి అంకితం చేయడం అంత కంటే విచిత్రంగా లేదటండీ ! ఇదంతా శివుడికీ-శ్రీరాముడికీ; రాముడికీ-కృష్ణుడికీ భేదం లేదని ధ్వనింపచేయటానికి కాకపోతే మరేమిటంటారు ? ఈ పరమార్థాన్నే భాగవత మహాగ్రంథాన్ని ప్రారంభిస్తూ మీరు —

చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగ నేటికి తల్లుల కడుపుచేటు.

అన్న చిన్న గీతపద్యంలో ఎంత చక్కగా నిరూపించారు !

వ్రేపల్లెలో నందులవారి గుమ్మం ముందు దుమ్ములో ఆడుకొంటున్న బాలకృష్ణుని వర్ణిస్తూ –

తనువున నంటిన ధరణీపరాగంబు
    పూసిన నెఱిభూతి పూత గాగ
ముందర వెలుగొందు ముక్తాలలామంబు
    తొగల సంగడికాని తునుక గాగ
ఫాలభాగంబుపై పరగు కావిరి బొట్టు
    కాముని గెలిచిన కన్ను గాగ
కంఠమాలికలోని ఘననీల రత్నంబు
    కమనీయమగు మెడకప్పు గాగ
హారవల్లు లురగహారవల్లులు గాగ
బాలలీల బ్రౌఢబాలకుండు
శివుని భంగి నొప్పె శివునకు దనకును
వేఱులేమి తెల్ప వెలయునట్లు.

అన్నారు. ఆ బాలకృష్ణుడికి ఆ భావం ఉందో లేదో కాని శివుడికీ, కృష్ణుడికీ వేఱులేదని తెల్పాలనే భావం మీకు ఉన్నదనడంలో సందేహం లేదండీ! కావాలని వర్ణించిన ఈ సీసపద్యం మీ అద్వైత భావానికి మచ్చలేని మచ్చుతునుక.

పోతన్న గారూ! మీరెంత ముందు చూపు గలవారండీ! గ్రంథారంభంలో వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు మొదలైన సంస్కృత కవులకు నమస్కరించారు. బాగుంది. నన్నయ్య గారినీ, తిక్కన గారినీ, ఎఱ్ఱన గారినీ కైవారం చేశారు. ఇంకా బాగుంది, మిగిలిన పూర్వకవు లందరినీ సముచితంగా సంభావించారు. చాలా బాగుంది. చివరకు వర్తమాన కవులకు ప్రియం పలికారు. మరీ బాగుంది. అంతటితో ఊరుకున్నారా! ఎప్పుడో ముందు రాబోయే భావికవులను కూడా భావించి బహూకరించి శుభం పలికిన మీ విశాల హృదయానికి ఈ అయిదువందల ఏండ్లలో జన్మించిన కవులంతా చేతులెత్తి నమస్కరించక తప్పదు. ఏమంటారు?

కవిగారూ! మీరు మీ భాగవతానికి శ్రీకారం చుడుతూనే ''శ్రీ కైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్'' అని లోకరక్షైకారంభకుడూ, భక్తపాలన కళా సంరంభకుడూ, దానవోద్రేక స్తంభకుడూ, కేళీలోల విలసద్దృగ్జాల సంభూత నానాకంజాతభవాండకుంభకుడూ అయిన మహానందాంగనా డింభకుణ్ణి సంస్మరిస్తూ వ్రాసిన మొదటి పద్యంలోనే భాగవత మహాగ్రంథంలోని ప్రధాన కథాఘట్టాలన్నీ స్ఫురించేటట్లు చేశారు. అత్యంత సుందరమై అంత్యప్రాస విలాస విన్యాసాలను వెదజల్లే ఈ పద్యం అనవద్యం. హృద్యం. సహృదయ హృదయైక వేద్యం.

మహాకవీ! లలితస్కంధమూ, కృష్ణమూలమూ, శుకాలాపాభిరామమూ, మంజులతాశోభితమూ, సువర్ణసుమనస్సుజ్ఞేయమూ, సుందరోజ్జ్వల వృత్తమూ, మహాఫలమూ అయిన భాగవత కల్పవృక్షాన్ని తెలుగువారి సొంతం చేసిన మీ ప్రతిభ అప్రతిమానం.

''విద్యావతాం భాగవతే పరీక్షా'' అని కొమ్ములు తిరిగిన పండితులకు కూడా ''కొరకరాని కొయ్య'' అయిన శ్రీమద్భాగవతం మీ అమృతహస్త స్పర్శతో "బాలరసాలంగా'' పరిణమించి పల్లవించి పుష్పించి ఫలించి ఆబాల గోపాలానికి రసానందాన్ని అందించింది,

చూడండి పోతన్నగారూ! పురాణ గ్రంథాలను ఆంధ్రంలోకి అనువదిస్తూ నన్నయ తిక్కనలు భారత రామాయణాలను మాత్రమే గ్రహించి భాగవతాన్ని నిజంగా మీ కోసమే అట్టి పెట్టారండీ! అది కేవలం మీ పురాకృత సుకృత విశేషం మాత్రమే కాదు. ఆంధ్రులందరి అపూర్వ పూర్వ పుణ్య విశేషం. శ్రీమద్భాగవతాన్ని తెనిగించడం మూలాన మీకు మాత్రమే కాదు - ఆ భాగవతానికి కూడా పునర్జన్మ అన్నది లేకుండా పోయింది.

భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధవరుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపరుతు.

అన్న మీ వినయ విన్రమతకు వేయి నమస్కారాలు. ఎంత చక్కగా పలి కారండీ -

పలికెడిది భాగవతమట;
పలికించు విభుండు రామభద్రుండట; నే
పలికిన భవహర మగునట;
పలికెద వేఱొండు గాథ పలుకగ నేలా !

అవును. మీ పలుకు పలుకులో రామభద్రుడు పలుకుతూనే ఉన్నాడు. మీ దృఢ సంకల్పం, మీ ఆత్మవిశ్వాసం అనన్య సామాన్యాలండీ ! పాఠకుల్ని ఉద్దేశించి మీ రిలా అన్నారు -

కొందఱకు తెలుగు గుణమగు;
కొందఱకును సంస్కృతంబు గుణమగు, రెండున్
గొందఱకు గుణములగు; నే
నందఱ మెప్పింతు గృతుల నయ్యై యెడలన్.

అవునులెండి. ''ఉభయ కావ్యకరణ దక్షులు'' గదా మీరు. మీకు సాధ్యం కాని దేముంటుంది ? అక్షరాలా అన్నంత పనీ చేశారు.

భక్తకవీ ! మహాభక్తులైన మీరు పొంగి పులకించిన హృదయంతో గజేంద్ర మోక్షంలో, వామన చరిత్రంలో, ప్రహ్లాద వృత్తాంతంలో, రుక్మిణీ కల్యాణంలో, నరకాసురవధలో, కృష్ణలీలల్లో, గోపికాగీతల్లో, కుచేలోపాఖ్యానంలో ప్రతిభాపాండిత్యాలను ప్రదర్శించి మూలాన్ని పెంచి సర్వాంగ సుందరంగా ఆ ఘట్టాలను దిద్ది తీర్చారు. కొన్నిచోట్ల మూలంలోని మూడు శ్లోకాలను ముప్పై మూడు పద్యాలుగా ప్రపంచీకరించారు.

చూడండి ! గజేంద్రమోక్షంలో ఒక చమత్కారం జరిగింది. ''అల వైకుంఠపురంబులో - ఆ మూల సౌధంబు దాపల'' మందారవనంలోని అమృత సరోవరం ప్రక్కన ఉన్న చంద్రకాంత శిలావేదికపై కలువపూల పాన్పు మీద కూర్చుండి ఉన్న ఆపన్నప్రపన్నుడు గజేంద్రుడి మొర ఆలకించాడు. చెంత నున్న శ్రీదేవికి చెప్పకుండానే, శంఖ చక్రాలు ధరించకుండానే ఆయన కరిని

కాపాడటానికి పరుగెత్తుకొంటూ వచ్చాడు. అవక్రమైన చక్రంతో నక్రం కంఠాన్ని ఖండించి కరిరాజును కాపాడాడు. అంతా సక్రమంగానే జరిగిపోయింది. ఆయనకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది లక్ష్మీదేవి పైట చెరగు తన చేతిలో ఉన్న దని. శ్రీ హరి "దరహసిత ముఖకమల" అయిన కమలతో ఇలా అన్నాడు -

బాలా ! నా వెనువెంటను
హేలన్ వినువీథి నుండి యేతెంచుచు నీ
చేలాంచలంబు పట్టుట
కాలో నే మంటి నన్ను నంభోజ ముఖీ !

అనగానే ''అరవిందమందిరయైన యయ్యిందిరాదేవి మందస్మిత వదనారవింద'' యై ముకుందునితో ఇలా పలికింది - ''స్వామీ ! ఏం చేసేది. మీ పాదాలు సేవించటమే నా కర్తవ్యం. మీరు ముందు పరుగెత్తుతుంటే మీ వెంట నేనూ వస్తున్నాను.'' ఇలా పలికించి ఊరుకున్నారా మీరు. ఆ లక్ష్మీదేవిచేత దేవదేవుడికి ఒక యోగ్యతా పత్రం ఇప్పించారు.

దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవన పొందన్
దీనావన ! నీ కొప్పును
దీనపరాధీన ! దేవదేవ ! మహేశా !

ఈ విధంగా దేవాదిదేవుడైన వాసుదేవుణ్ణి ఆపద్బాంధవుడుగా భక్తరక్షణ పరతంత్రుడుగా చెప్పించారు. బాగానే ఉంది - కాని ఇక్కడ ఒక్క అను మానం ఉందండీ. "అల వైకుంఠపురంబులో'' అని యెత్తుకున్నారు మత్తేభవృ త్తంలో. ఆ తరువాత శ్రీమహావిష్ణువు పరుగెత్తుకు రావడంతో ''సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపడు'' అని మత్తేభవృత్తాన్నే అనుసంధిం చారు. ఆ తరువాత అప్పటి పరిస్థితిని అభివర్ణిస్తూ "తన వెంటన్ సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్'' అంటూ మళ్లీ మత్తేభాన్నే పరువెత్తించారు. అనంతరం "తన వేంచేయు పథంబు పేర్కొన దనాథ స్త్రీ జనాలాపంబుల్ వినెనో" అంటూ మత్తేభంలోనే మీ భావాన్ని వెలిబుచ్చారు. ఆపైన "వినువీథిం జనుదేర గాంచి రమరుల్'' అన్న పద్యం కూడా మత్తేభ విక్రీడితమే. అటు పిమ్మట "చను

దెంచెన్ ఘను డల్లవాడె హరిపజ్జన్ గంటిరే లక్ష్మి'' అంటూ మళ్లీ మత్తేభాన్నే నడిపించారు. చివరకు ''కరుణాసింధుడు శౌరి వారిచరమున్ ఖండింపగా బంపె'' అన్న పద్యంలో కూడా మత్తేభాన్నే పైకెత్తారు. ఈ విధంగా వరుసగా ఈ ఘట్ట మంతా మత్తేభమయంగా నడిచిందే, ఇందులో ఏమైనా రహస్యం ఉందా? అని సందేహం. అవునులెండి! మీరెందుకు చెబుతారు. మధురమధురంగా మందహాసం చేస్తున్నారు. పోనీలెండి. నేనిలా ఊహిస్తున్నాను-

మొదట్లో ''మత్తేభయూథంబు మడుగు సొచ్చె'' అన్నారు కదూ! ఆ మత్తేభాన్ని మకరి పట్టుకుంది కదూ! అప్పుడు మత్తేభం ''రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా;'' అని భగవంతుణ్ణి ప్రార్థించింది. అప్పుడు ''మత్తేభరక్షణాయత్తచిత్తుడై'' అడావుడిగా పరుగెత్తుకుంటూ వచ్చిన భగవంతుడి హృదయంలో అడుగడుగునా మత్తేభవృత్తాంతమే మెదులుతున్నది. ఆయన మనస్సు ''మత్తేభమయ'' మయింది. అటువంటి దేవుణ్ణి మీరు మనస్సులో భావించారు. మీకూ శ్రీహరికీ సాధారణీకరణం ఏర్పడింది. అందువల్ల మీ గంటంలో అడుగడుగునా ఒకదానివెంట ఒకటిగా మత్తేభవృత్తాలే దొరలి దొరలి వచ్చాయి. ''పలికించెడు వాడు రామభద్రుడే'' కదండీ. ఏమంటారు? లేకపోతే అనుకోకుండా అన్ని మత్తేభాలు ఎలా వస్తాయి? ఎందుకు వస్తాయి?

పోతన్నగారూ! మీరు సహజపాండిత్యులు. మీకు గోపాలుడంటే ఎంత ఆదరమో గోవులన్నా అంత అనురాగం. గోపాలకృష్ణుని చేత ఒక్కొక్క ఆవుకు ఒక్కొక్క అందమైన పేరుపెట్టి ఆప్యాయంగా పిలిపించడమంటే మీ కెంత సంతోషమో మాకు బాగా తెలుసు.

''రా పూర్ణచంద్రికా! రా గౌతమీగంగ!
రమ్మ భగీరథరాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘమాలిక!
రమ్ము చింతామణి! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ!
రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి!
రమ్మ మందాకిని! రా శుభాంగి!''

అబ్బ! ఎంత చక్కని పేర్లు పెట్టించారు. ఎంత చక్కగా పిలిపించారు. ఆ ఆవులకు కూడా ముద్దుల గోపాలుని మురళీగానమంటే ఎంత ఆనందమో! "చతుర నటమూర్తి" అయిన ఆ "గోపాల చక్రవర్తి" వేణువును మధురాధరం మీద చేర్చి "బ్రహ్మగాంధర్వ గీతాన్ని" ఆలపించగా బృందావనం పులకించింది. కాళింది పొంగి పొరలింది. ప్రకృతి పరవశించింది. లేళ్లు మైమరచాయి. మోళ్లు పల్లవించాయి. రాళ్లు ద్రవించాయి. ఆవులన్నీ మేతలు మాని "మమతన్ మోములు మీదికెత్తుకుని రోమంథంబు చాలించి" ఆనందబాష్పాలు కారుస్తూ నిశ్చలంగా నిలబడి ఆలకించాయి కదూ! ఇక గోవత్సాలంటారా! "తల్లుల చన్నుబాలు" త్రాగడం మానేసి కదలకుండా తదేకధ్యానంతో అదే పనిగా ఆ మురళీధరుడి ముద్దుమోము వంకే చూస్తున్నాయి కదూ!

అన్నా! పోతన్నా! ఆ మాధవుడి మధురమధుర వేణుగానంలో మైమరపించి పాప మా అమాయకలైన గోపికలను ఎన్ని తిప్పలు పెట్టించావయ్యా! చూస్తూ చూస్తూండగానే అదృశ్యమైపోయిన ఆ వంశీధరుడి కోసం-

"పున్నాగ కానవే పున్నాగవందితు
　　తిలకంబ కానవే తిలకనిటలు" అనీ
"మానినీ మన్మథు మాధవు గానరే
　　సంఫుల్లోదార వత్సకములార!" అనీ
"అదె నందనందనుం డంతర్హితుండయ్యె
　　పాటలీతరులార! పట్టరమ్మ!" అనీ

"ఓ మల్లియలార! మీ పొదల మాటున లేడుగదమ్మ చెప్పరే! అనీ" బృందావనంలోని చెట్టు చెట్టుకూ గుట్ట గుట్టకూ తిరిగి తిరిగి విసిగిపోయారే ఆ కుసుమకోమలులు!

పోతన్నగారూ! మీ భాగవతంలోని పాత్రలు మా హృదయాలలో చెరగని ముద్ర వేసుకున్నాయి. "నీకున్ మ్రొక్కెద త్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!" అని కృష్ణుణ్ణి ప్రార్థించే కుంతీదేవి, "నా తోడన్ ప్రతిభాషలాడెదు! జగన్నాథుండ, నాకంటె నీ భూతశ్రేణికి రాజు లేడొకడు" అని ప్రహ్లాదుణ్ణి

గద్దించే హిరణ్యకశిపుడూ, "తిరుగన్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య! వేయేటికిన్" అని పలికే దానవీరుడు బలిచక్రవర్తీ, "అమ్మా! మన్ను దినంగ నే శిశువునో ఆకొంటినో వెఱ్ఱినో" అని తల్లి దగ్గర ముద్దులు గురిసే బాలగోపాలుడూ, "ఒంటివాడ నాకు ఒకటి రెండడుగుల మేర యిమ్ము" అంటూ బలిచక్రవర్తిని చేజాచి యాచించే చిట్టిపొట్టి వామనుడూ, "కలడు కలం డనెడివాడు కలడో లేడో!" అని నక్రానికి చిక్కి ఆక్రోశించే గజేంద్రుడూ, "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!" అని కన్నతండ్రికి సమాధానం చెప్పే ప్రహ్లాదుడూ, "నవనీతంబుల ముద్ద కాదు వినరా నా ముష్టి గోపార్భకా!" అని బారలు చాచే చాణూరమల్లుడూ, "తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో" పతి వెంట పరువెత్తుకు వస్తున్న శ్రీదేవీ, "నా దయితు కట్టనేటికి శ్రీ దయితా చిత్త చోర! శ్రితమందారా!" అని శ్రీహరిని కన్నీళ్ళతో ప్రశ్నిస్తున్న బలిచక్రవర్తి భార్య వింధ్యావళీ, "విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా!" అంటూ దేవకీ గర్భస్థుడైన దేవదేవుణ్ణి చేతులు మోడ్చి ప్రార్థిస్తున్న ముక్కోటి దేవతలూ, "గుఱ్ఱము గొనిపో ముద్దుల కుఱ్ఱడ!" అని సగర పౌత్రుడైన అంశుమంతుణ్ణి ఆప్యాయంగా అభినందిస్తున్న కపిల మహర్షీ, "అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావు మన్న" అంటూ తన ప్రాణాన్ని కూడా లెక్కించకుండా తన దగ్గర ఉన్న కాసిని నీళ్లూ అతిథికి ధారపోస్తున్న రంతిదేవుడూ, "వీడదే రక్కసి విగతజీవగ చన్నుబాలు త్రాగిన మేటి బాలకుండు" అని మేడల మీద నుంచి కుతూహలంతో కృష్ణుణ్ణి చూస్తున్న మధురానగర నారీమణులూ, "ముని నీరు సొచ్చి వెడలదు చనియెడు ద్వాదశియు" అని ద్వాదశీవ్రతభంగానికి ఆందోళనచెందే అంబరీషుడూ, "మన సారథి మన సచివుడు... మనలను విడనాడి చనియె మనుజాధీశా!" అని కన్నీళ్లు తుడుచుకుంటూ అన్నగారికి కృష్ణనిర్యాణం విన్నవిస్తున్న అర్జునుడూ, "వీరెవ్వరు శ్రీకృష్ణులు కారా! ఎన్నడును వెన్న గానరటగదా!" అంటూ వెన్నదొంగను వెన్నాడి పట్టుకొని కట్టుకుంకించే యశోదమ్మా, "అసురకృత్యంబు ధర్మమగునే? తండ్రీ!" అని పుత్రఘాతి అయిన అశ్వత్థామను ప్రశ్నిస్తున్న పాంచాల రాజపుత్రీ, "నీ పాదకమల సేవయు నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాంతాపారభూతదయయును తాపసమందార! నాకు దయసేయగదే" అని గోపాలదేవుణ్ణి ప్రార్థించే సుదాముడూ, "ఘను డా భూసురు డేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో" అని శ్రీకృష్ణుడి రాక

కోసం వేయి కన్నులతో నిరీక్షించే రుక్మిణీకన్యా, ''అన్న! శమింపుమన్న! తగ దల్లుడు గాడిది మేనకోడలా'' అని కంసుణ్ణి బతిమాలే దేవకీదేవి, ''వనితా! ఏమి తపంబు చేసెనొకొ ఈ వంశంబు వంశంబులోన్'' అని మురళిని చూచి గ్రుక్కిళ్లు మ్రింగుతున్న బృందావన గోపికా మా కన్నులముందు కలకాలం కదలాడుతూనే ఉంటారు.

పోతన్నగారూ! ధన్యులండీ మీరు!

భీష్మునిపైకి కుప్పించి లంఘించు గో
        పాలకృష్ణుని కుండలాలకాంతి
కరిరాజు మొరవెట్ట పరువెత్తు కరివేల్పు
        ముడివీడి మూపుపై బడిన జుట్టు
సమరంబుగావించు సత్య కన్నులనుండి
        వెడలు ప్రేమక్రోధ వీక్షణములు
కొసరి చల్దులు మెక్కు గొల్లపిల్ల వ్రేళ్ల
        సందు మాగాయ పచ్చడి పసందు

ఎపుడు కనుగొంటివయ్యా? నీ కెవరు చెప్పి
రయ్యా! ఏ రాత్రి కలగంటివయ్యా! రంగు
కుంచెతో దిద్ది తీర్చి చిత్రించినావు
సహజ పాండితి కిది నిదర్శన మటయ్యా!

మీ క్రాంత దర్శిత్వానికి కైమోడ్పులండీ!

అన్నగారూ! మీరన్నా మీ భాగవతమన్నా మాకెందుకండీ యింత యిష్టం! నిజంగా ఇది మా జన్మజన్మాల అదృష్టం! మీ కవిత చిరంజీవిని, లోకపావని. ఆ 'జగన్మోహిని' కి ఆ 'పుల్లాబ్జాక్షి' కి ఆ 'సరస్వతి' కి ఆ 'భగవతి'కి ఆ 'పూర్ణేందుబింబానన'కు ఇవే మా శతసహస్ర ప్రణామాలు.

(ఆంధ్రజ్యోతి, 14-3-1982)

# పోతన జన్మస్థలము

— శ్రీ కందుకూరి వీరేశలింగము

శ్రీమద్భాగవతము నాంధ్రీకరించిన బమ్మెర పోతరాజు ఒంటిమిట్టి వాఁడని కొందఱును, ఓరుగంటి వాఁడని కొందఱును కొంతకాలము నుండి పరస్పర విజయార్థులై పట్టుదలతో పోరాడుచున్నారు. నే నాంధ్రకవుల చరిత్రమును వ్రాసినప్పుడు తెలుఁగు భాగవతమును ముద్రించినవారు తమ పీఠికలో వ్రాసిన దానిని నమ్మి పోతన యొంటిమిట్టవాఁడనియే చెప్పితిని గాని యిటీవల బైలు వెడలిన వాదానువాదములను బట్టి నా తొంటి యభిప్రాయమును మార్చుకొని యోరుగంటివాఁడని నే నీ నడుమ సంస్కరించి ప్రకటించిన కూర్పులోఁ బ్రచురించిన వాఁడనైతిని. అట్లు చేసినందులకై బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు నన్ను బహువిధముల దూషించి పరిషత్పత్రికలో నొక వ్యాసమును వ్రాసి ప్రకటించిరి. దూషణము లెప్పుడును వాద దౌర్బల్యమునకు సూచనలగుట విచారించి వారి దూషణవచనముల నాశీర్వాదములుగా స్వీకరించి సత్యగ్రహణ పరాయణులగువారి యుపయోగార్థముగా నా పూర్వాభిప్రాయమును మార్చుకొనుటకుఁ గల యాధారములను సంక్షేపించి వ్రాయుచున్నాను.

పోతనార్యుని భాగవతములో నొంటిమిట్ట యనిగాని, యోరుగల్లని గాని లేదు. దానిలో "ఒక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్ర సముత్తుంగభంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి... మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి" అని యేకశిలానగర మని మాత్రము చెప్పఁబడినది. దీనినిబట్టి యిందుఁ జేర్కొనఁబడిన యేకశిలానగర మేది యని నిర్ణయింపవలసియున్నది. శిలాతామ్రశాసనములయందును, పూర్వగ్రంథముల యందును ఓరుగంటికే యేకశిలానగరనామము వ్యవహరింపఁబడియుండుట నిర్వివాదాంశము. ఏకశిలానగర నామ మొంటిమిట్టకే శాసనమునందును ఏ గ్రంథమునందును వాడఁబడలేదు. నూఱుసంవత్సరముల క్రిందట మెకాంజీగారు గ్రామస్థుల వలన కైఫీయతులు

మొదలైనవానిని సంగ్రహించి కూర్చిచేర్చిన స్థానికచరిత్రముల (Local Records) లోని యొంటిమిట్ట కైఫీయతులలోను శాసనములలోను ఒంటిమిట్ట కొంటిమిట్ట యన్న పేరేకాని ''యేకశిలానగర''మన్న పేరెక్కడను గానఁబడదు. అంతేకాక యొంటిమిట్ట యను పేరాగ్రామమున కొంటఁడు, మిట్టఁడు నను బోయల వలన వచ్చినదని కూడ చెప్పఁబడినది. ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలములో ననఁగా మన పోతన్నకు నూఱు సంవత్సరములు ముం దోరుగంటి యందే వాసము చేయుచుండిన విద్యానాథకవి తన ప్రతాపరుద్రీయములో ''రాజ న్నేకశిలానగరాధీశ'' యని యనేకస్థలములలో నోరుగంటి ''నేకశిలానగర'' మని వాడియున్నాడు. ఒంటిమిట్టలో నున్న కవులలో నొక్కరును ఒంటిమిట్ట నేకశిలానగరమని చెప్పలేదు. ఒంటిమిట్ట కవులలో మొదటివాఁడగు తిప్పనా మాత్యుఁడు తన శతకములో నొంటిమిట్ట రఘువీరుఁ డనియే చెప్పెనుగాని యేక శిలానగరనామ ముచ్చరించలేదు. ఒంటిమిట్ట రఘువీర శతకములో రెండు పద్య ములనిం దుదాహరించుచున్నాను.

కారుణ్యోదయ! యొంటిమిట్టపురి నాథా! నీకు నేఁ బద్యముల్
నూఱుం జెప్పిన నూరుఁబేరు వెలయున్ నూత్నంబుగా; నంతనా
నోరుం బావనమౌను; నీ కరుణఁ గాంతున్ భక్తి నన్నుందఱున్
రా రమ్మందురు గారవించి రఘువీరా! జానకీనాయకా!

అతులప్రౌఢిమ మీఱ రాయకవి యయ్యలరాజు సత్పుత్రుఁ డం
చితభక్తిం ద్రిపురాంతకుండు రచియించెన్ దెన్గు పద్యంబులన్
శతకం బొక్కటి; దీని నీవు విని యాచంద్రార్కమై నిల్పు ప
ర్వత కన్యానుత! యొంటిమిట్ట రఘువీరా! జానకీనాయకా!

ఈ కవికాలములో నొంటిమిట్ట యందున్న దేవుఁడు కోదండరామస్వామియే యై యుండిన యెడల శతకమకుటమునందు ''గుణధామా! మహదొంటిమిట్టనగరీ కోదండరామా! ప్రభూ!'' అని వేసియుండును.

రెండవ కవియైన యయ్యలరాజు రామభద్రకవి తన రామాభ్యుదయా శ్వాసాంత గద్యమునందు సంస్కృత సమాసమున సహితము ''శ్రీమదొంటిమిట

రఘువీర శతక నిర్మాణకర్మఠ జగదేకఖ్యాతి ధుర్యాయ్యలరాజు తిప్పయ మనీషి పర్వతాభిధాన పౌత్ర'' యనియే చెప్పెనుగాని యేకశిలానగర మని చెప్పలేదు.

ఏకశిలానగర శబ్దార్థమును బట్టి విచారించినను ''ఒక్క రాయి'' యని యర్థమిచ్చు నోరుగంటి కది చెల్లును గాని ''యొక్క కొండ'' యని యర్థమిచ్చు నొంటిమిట్టకుఁ జెల్లదు. శిల యనఁగా శైల మనియు శైల మనఁగా శిల యనియు నర్థము చెప్పెడు బుద్ధిమంతుల యర్థమెంత యుక్తియుక్తమైనదో మతిమతు లూహించి తెలిసికోఁగలరు. అట్టివారి మతమును బట్టి శ్రీశైలమనకు శ్రీపర్వతము శ్రీనగరము గాక శ్రీశిల యని చెప్పవచ్చును కాబోలును! అట్లనవచ్చినచో దన్మతానుసారిగా రుబ్బురాతిని రుబ్బుకొండ యనియు, రుబ్బుశైల మనియు గూడ చెప్పవచ్చును. ఒంటిమిట్ట కేకశిలానగరనామము సమర్థించుటకై గ్రామ దేవాలయసమీపమున నొక మెట్ట యుండుటచేత నాపేరు వచ్చినదని యొక చోటను: దేవాలయములోని సీతారామలక్ష్మణ విగ్రహములు మూఁడును నొక్క రాతితోఁ జేయఁబడి యుండుటచే నాపేరు కలిగినదని వేఱొకచోటను చెప్పి యున్నారు. దేవాలయములోని విగ్రహములన్నియు, నతుకులు లేక యేకశిలతో నే చేయఁబడియుండును గాన గ్రామములన్నియు నేకశిలానగరములే కావచ్చును. ఇది యిట్లుండగా స్థలచరిత్ర మాపే రొంటఁడు, మిట్టఁడు నను బోయల పేరును బట్టి కలిగినదని చెప్పుచుండుటచేత నీ రెండు వ్యుత్పత్తులును గూడ పొసఁగక పోవుటయేకాక యేకశిలానగరనామ మోంటిమిట్ట కసలే పనికిరాని దగును.

పేరులకై పెనఁగులాడెడి యీ శుష్కవాదము నింతటితో విడిచి పెట్టి యిఁక బమ్మెరపోతరాజకృత గ్రంథములవలన నీ విషయమేమైన తేలునేమో చూతము. పోతన చేసిన గ్రంథములు నాలుగు- వీరభద్రవిజయము, భోగినీ దండకము, నారాయణ శతకము, భాగవతము. ఈ నాలిగింటిలో ముందుగా నేకశిలానగరనామమును జెప్పిన భాగవతమును గూర్చి విచారింతము. ఓరుగ ల్లేకశిలానగర మగుట భాగవతరచనకు పూర్వమే సుప్రసిద్ధము కావున భాగ వతమునందు జేర్కొనఁబడిన యేకశిలానగర మోరుగల్లే యని విశేషవిచార మక్కఱలేకయే స్థూలబుద్ధికి సహితము గోచరమగును. అది యట్లుండగా భాగ వతమును బట్టి యేకశిలా నగరము గంగకు కొన్ని దినముల ప్రయాణములో నన్నట్లు కనఁబడుచున్నది. గంగ యనుపేరు గౌతమికిని భాగీరథికిని గూడ

నాంధ్రదేశమున సామాన్యముగా వ్యవహారమందున్నది. రాజమహేంద్రవర ప్రాంతమున గౌతమీనది సాధారణముగా గోదావరి యను నామముతో వ్యవహరింపఁబడుచున్నను ఓరుగల్లు ప్రాంతమున సామాన్యముగా గంగ యను పేరితోనే వ్యవహరింపఁబడుచున్నది. అందుచేత నేకశిలానగరమే యోరుగల్లయ్యెడు పక్షమున నక్కడకుఁ గొన్నిదినముల ప్రయాణములో నున్న గంగ భాగీరథికాక గౌతమియే యగును. ఈ గంగకు కొన్ని దినముల ప్రయాణములో నున్నదగుటచే నేకశిలా నగరనామ మోరుగల్లునకే చెల్లునుగాని యొంటిమిట్టకు గాని - తన్నామమును ధరించిన యే యితరపురమునకుఁగాని చెల్లదు.

ఒంటిమిట్టకు సమీపమునఁ గొన్నిదినములలోఁ జేరఁదగిన నది యేదియు లేదు. వ్యవహారములో లేకపోయినను నేదో స్థలమాహాత్మ్యములో గంగ యనఁబడిన పినాకినీనది యొంటిమిట్టకు సమీపములో నున్నను ఆ పెన్న యొంటిమిట్టకు భాగవతములోఁ జెప్పఁబడినట్లు కొన్ని దినముల ప్రయాణములో లేక కొన్ని గంటల ప్రయాణములోనే యున్నందున నందుఁ బేర్కొనఁబడిన గంగ పెన్న గాదనుట నిశ్చయము. సామాన్యముగా జలసామాన్యమును 'గంగ'యని జనులు వ్యవహరింతురు గాన నందుదాహరింపఁబడిన గంగ కొన్నిదినముల ప్రయాణములో నున్న యే చెఱువునీరో యే యేటినీరో యను విద్వాంసులకు సమాధానము చెప్పుట నావంటి మితజ్ఞునకు సాధ్యము కాదు. కొన్ని దినము లనఁగా నెన్నిమాసములైనను కావచ్చునను పండితులను సమాధానపఱచుటయు నసాధ్యమే. పినాకిని యన్న పేరు రెండునదుల కున్నప్పు డుత్తరపినాకిని దక్షిణ పినాకినియని పిలుచుచున్నట్లుగానే గంగ యనుపేరు రెండు నదులకు సామాన్యమై యుండుట చేత నుత్తరమున నున్న భాగీరథి నుత్తరగంగ యనియు దక్షిణమున నున్న గోదావరిని దక్షిణగంగ యనియు పిలుచుట వాడుకయై యున్నది. అయినను గోదావరిని దక్షిణ శబ్దప్రయోగము లేక కేవలము గంగయని పిలుచుటయు వాడుకలోఁ గలదు.

పోతనతోడి సమకాలికుఁడైన శ్రీనాథ మహాకవి రాజమహేంద్రవరమును వర్ణించుచు- ''ప్రవహించు నేపీటి పశ్చిమప్రాకార, మొరసి గంగమ్మ సాగరము కొమ్మ'' అను సీసపాదమున గోదావరిని గంగ యని చెప్పియున్నాఁడు. గోదా

వరీ నామముతో గౌతమిని సాధారణముగా వ్యవహరించు రాజమహేంద్రవరములో నున్న శ్రీనాథుఁడే దక్షిణశబ్దవిరహితముగా వాడినప్పుడు, గంగ యనెడి యేకనామముతోనే వ్యవహరించు దేశమునం దుండిన పోతనామాత్యుఁడు దక్షిణ గంగ కనక "యత్రభంకశశ్రభసముత్తుంగభంగ యను గంగ" కని ప్రయోగించుటలో వింత యేమున్నది? దక్షిణపదాను పూర్వకముగా ప్రయోగించినను ప్రయోగింపవచ్చును, దక్షిణపదమును విడిచి ప్రయోగించినను ప్రయోగింపవచ్చును. "దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన గోదావరియు" నని నన్నయ భట్టారకుఁడు దక్షిణశబ్దపూర్వకముగా ప్రయోగించెను.

భాగవతభాగములను రచించిన బమ్మెరపోతన్న యొక్కయు, వెలిగందల నారాయణకవి యొక్కయు, ఏర్చూరి సింగన్న యొక్కయు గృహనామములు గల యీ ఓరుగంటికి సమీపములో నుండుటచేత భాగవతోదాహృతమైన యేక శిలానగర మోరుగల్లే యని సిద్ధాంతమగుచున్నది. ఓరుగల్లు కాదని యొంటిమిట్టనే సిద్ధాంతము చేయు తలఁపుతో ఈ నామములకు ప్రతిగా ఏర్చూరున కేల్చూరును, వెలిగందలకు వెలిగండ్లయు మేనమామ పోలికగల రెండు గ్రామముల నొంటిమిట్టకు చేరువనుండు వాని నొంటిమిట్ట వారు కష్టపడి కనిపెట్టఁగలిగిరి గాని ప్రధానగ్రామమైన బమ్మెరతోడి సమానాక్షర సంబంధము గల గ్రామకల్పమును దేనిని తత్సమీపమునఁ గనిపెట్టఁజాలక బొమ్మవరమును బమ్మెర యందుమనిరి. బొమ్మెర బమ్మెర కాదని వాదించెడి యీ ఘనులకు తక్కిన యక్షరముల మాట యటుంచినను బొమ్మెరలో మొదటనున్న బొకారముతో నారంభమయ్యెడు బొమ్మవరము నెట్లు చెప్ప సాహసము గలిగెనో! ఈపే రొంటిమిట్టవాదులకే సరి పడక దానిని గప్పిపుచ్చుటకై బమ్మెర యూరిపేరే కాదనియు, పోతన పూర్వులూరూరు తిరుగువా రగుటచే భ్రమణశబ్దభవమైన బమ్మెర వారియింటిపే రయ్యెననియు అపూర్వపాండిత్య ప్రభావులైన యొంటిమిట్టవాదులు తమ పాండిత్య విశేషముచేత విశేషార్థకల్పనము చేసిరి. బమ్మెర గ్రామమగునో కాదో పూర్వ కవి యైన పట్టమట్ట సరస్వతీ సోమయాజి కృతమైన "పృథుచరిత్రము" లోని యీ క్రింది పద్యమును జదివి వారు గ్రహింతురు గాక!

పరుల కసాధ్యమై పరఁగు భాగవతంబు రహస్య మంతయున్
హరి కృపచే నెఱింగి మృదులాంధ్రవచోరచనాచమత్క్రియా

కరణమహాప్రబంధముగా రచియించిన భానుతేజు బ
మ్మెరపుర పోతరాజు నసమీకృతభోజు నుతింతు నెంతయున్.

గ్రామనామము బొమ్మెర యని వాడుకలో నుండుటచే నది బమ్మెరకాదని వాదించుచున్నారు గదా, ఓరుగంటివైపు వారు బమ్మెరపోతరాజు నిప్పటికిని బొమ్మెర పోతరాజనియే చెప్పుచున్నారు. తొంబది సంవత్సరముల క్రిందట నఁగా 1829 వ సంవత్సరమునం దింగ్లీషున దక్షిణహిందూస్థాన కవుల చరిత్రమును ప్రకటించిన కావలి వేంకటరామస్వామిగారు పోతరాజు గృహనామము బొమ్మెరవారని వ్రాసియుండుట మీరు చూచియుండలేదా? ఇంతకును మీ రేకశిలా నగర మనెడిది వంటిమిట్టా? ఒంటిమిట్టా? "వంటిమిట్టలోను వసతిగాను" అని స్థలపురాణములో వకారాదిగా నున్నప్పుడు బమ్మెర బొమ్మెర కాదని వాదించెడు మీరు వంటిమిట్టయే యొంటిమిట్ట యని యెట్లు చెప్పుదురు? గ్రామము వంటిమిట్టయే యైన పక్షమున దాని కేకశిలార్థమే రాక మీ వాదము నిర్మూలమగును గదా!

భాగవతములో కవి వ్రాసిన రెండు ముక్కలను బట్టియే యేకశిలానగర మోరుగల్లనుటయే సంభావ్యముగా నున్నది. ద్వాదశ స్కంధములలో దేనిలోను కృతిపతియగు రాముని సంబోధించుటలో నొక్కచోటనైనను నొంటిమిట్ట కోదండ రామా! యని కాని తుదకు కోదండరామా! యని కాని లేకపోవుటచేతనే పోతనార్యుని యిష్టదైవతము సాక్షాద్రామమూర్తియే కాని యొంటిమిట్టలోఁగాని మఱి యే గ్రామములోఁ గాని యుండిన యర్చావిగ్రహము కాదని స్పష్టపడుచున్నది. పోతరాజు తనకు ప్రత్యక్షమైనట్లు చెప్పిన రాజముఖ్యుని వర్ణనను బట్టియైనను మూడవచరణములోని— "వల్లీయుత తమాలవసుమతీజము భంగి, బలువిల్లు మూఁపున బరఁగువాఁడు" అను దానిని బట్టి కోదండరాముఁడని యూహించుట కంటె ప్రథమ చరణములోని— "మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి, నువిద చెంగట నుండ నొప్పువాని" అను దానిని బట్టి సీతారాముఁడని యూహించుట యధికవిశ్వాసయోగ్యము కాదా! పోతన విరచిత నారాయణ శతకములోని యీ క్రింది పద్యము వలనఁగూడ భాగవతమునఁ బేర్కొనబడిన యేకశిలానగర మోరుగల్లే యని యూహింపఁబడఁదగి యుండలేదా?

అపరాధంబులు నిన్ను నమ్మి విను మే నాజన్మపర్యంతమున్
విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీవే దిక్కు నాలోనికిన్
గపటం బింతయు లేక దండధరుకుం గట్టీక రక్షింపుమీ
కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ! నారాయణా!

ఇందలి ధర్మపురి నైజాము రాజ్యములో మంథెన సమీపమున గోదావరి తీరమునం దున్నది. పోతన భాగవతమునఁ జెప్పఁబడినట్లు చంద్రగ్రహణ పుణ్యకాలమున గంగాస్నానార్థము పోయిన దీ పట్టణమునకే యైయుండును. మహేశ్వరధ్యానంబు చేసి కించి దున్మీలితలోచనుండై యుండినప్పుడు రామభద్రుఁడు కవికిఁ గన్నుఁగవ కెదుటఁ గానఁబడుట యిచ్చటనే యైయుండును. అందుచేత నావఱకు శివభక్తుఁడై యుండిన పోతనార్యుఁ డాకస్మికముగా విష్ణుభక్తుఁడుగా మాఱి యాయూరి నారాయణునిపై నక్కడనే నారాయణ శతకమును జెప్పియుండును. అక్కడనుండి మరలి కొన్నిదినములలో నేకశిలానగరమునకు వచ్చి శ్రీకృష్ణస్తుతితో భాగవతపురాణాంధ్రీకరణము నారంభించియుండును. ధర్మపురీశ్వరునిఁ బేర్కొనుటచే బమ్మెరపోతరాజు స్నానమునకుఁ బోయినది యా పురముకడనున్న గౌతమీగంగకే యనియు, గోదావరి నుండి కొన్నిదినములలో వచ్చిన యేకశిలానగర మోరుగల్లే యనియు సులభముగాఁ దెలిసికోవచ్చును. ఈ పుస్తకద్వయమునకు ముందుగా రచియింపఁబడిన భోగినీ దండకమునఁ బేర్కొనఁబడిన సింగమనాయఁడు గోలుకొండ రాజ్యములోని రాచకొండ, మెతుకు సంస్థానాధీశ్వరుఁడగుట కూడ బమ్మెర పోతరా జొంటిమిట్ట నివాసి కాఁడనియు, నోరుగల్లనఁబరఁగిన యేకశిలానగర వాసియే యనియు ఘోషించుచున్నది.

పోతనార్యుఁడు ప్రప్రథమమున రచించిన శైవగ్రంథమగు వీరభద్రవిజయము గూడ కొంతవఱకాతఁ డోరుగల్లు పురవాసియని స్థాపించుచున్నది. ఈ గ్రంథము కవి మిక్కిలి చిన్నవాడై శైవమత పక్షపాత మధికముగా కలిగియుండిన కాలములో చేయఁబడినది. మతగురువైన యివ్వటూరి సోమనారాధ్యుఁడు కవి నుద్దేశించి చెప్పినట్లున్న వీరభద్రవిజయములోని యీ క్రింది పద్యము గ్రంథరచనారంభకాలము నాఁటికి పోతనార్యుఁడు పిన్నవాఁడని స్పష్టపఱచుచున్నది.

2)

చిన్నవాఁడ ననియుఁ జెక్కు సత్కృతులను
విననివాఁడ ననియు వెలఁపు మాను
మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైనఁ
గవిత చెప్ప లావు గలుగు నీకు.

పోతన కులగురువైన సోమనారాధ్యుని యింటిపేరు ఇవ్వటూరి వారు. ఇది గ్రామనామ మగుటకు సందేహము లేదు. ఇవ్వటూ రోరుగల్లు పట్టణమునకు ముప్పదిమైళ్ళ దూరములో నున్నది. అందుచేత—

"అనఘుఁ డివ్వటూరి యారాధ్యచంద్రుండు
సోమనాథసముఁడు సోమవిభుఁడు"

అని కవి వర్ణించిన సోమనారాధ్యగురుఁడును, ఆ గురువుచే వీరభద్ర విజయ విరచనమునకు నియమింపఁబడిన తచ్ఛిష్యుఁడగు పోతనయును ఓరుగల్లు ప్రాంతమువారని యేర్పడుటనుగాన భాగవతము నందుఁ జెప్పఁబడిన యేకశిలా నగర మోరుగల్లేయని నిశ్చయమగుచున్నది.

(ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, *1919*)

*

శ్రీకైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెద న్లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాతభవాండ కుంభకు మహానందాంగనాడింభకున్.

క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్.

# పోతన వంశము కాలము కృతులు

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

పోతన జన్మస్థానము, చరిత్ర, సమకాలికులు అన్నది నేటి ఉపన్యాస విషయము. చరిత్ర రసహీనమైన పేలపిండి వంటిది. ఇతరాంధ్ర కవుల విషయమున వలెనే పోతనగారి విషయమునను మనకు తెలిసినది స్వల్పము. తెలిసినదెల్ల పోతనగారు శ్రీమదాంధ్ర మహాభాగవతములో తన వంశమును గురించి, తన తాత, ముత్తాతలను గురించి భక్తిగౌరవ పురస్సరముగ సంస్మరించుకొన్న విషయమే. ఏది తెలిసినను, ఏది తెలియకపోయినను పోతనగారు జన్మించిన తోడనే తెలుగుదేశంలో భక్తికల్పలతిక మొగ్గతొడిగి పూవులు పూచినదను విషయము మాత్రము బాగుగా తెలియును. ఆయన రచించిన మహాభాగవతము తెలుగులోని కవతరించుటతో తెలుగువారి హృదయసీమల భక్తిరసధునులు పొంగులెత్తినవను విషయము తెలియును. శ్రీరామచంద్ర కరుణాకటాక్షమును పొంది భాగవతము నాధారముగాగొని తెలుగువారి మనఃకేదారములలో భక్తి బీజములు వెదవెట్టిన హాలికుడు పోతన్నగారు.

మధుర భక్తిప్రధానములైన శతకములు తెలుగులోనికి వచ్చినది పోతనగారి ఆంధ్ర మహాభాగవతావతరణమునకు తరువాతనే. కటకము గజపతి వంశజుల పరిపాలన కాలమున బంగాళ దేశమునుండి చైతన్యస్వామి తెలుగు దేశమునకు వచ్చుటతో తెలుగు శతక కవితలో నీ మధుర భావమునకు ప్రాచుర్యము హెచ్చినది.

పోతనామాత్యుడు మహాభాగవత రచనమునకు పూనుకొను నాటికి తెలంగాణములో వైష్ణవమతము ముమ్మరముగ వ్యాపించినది. ఇట్లనుటచేత తెలంగాణములో వైష్ణవ మదివరకు లేనేలేదని నా యభిప్రాయము కాదు. వైష్ణవము వాతాపి చాళుక్యుల కాలము నుండియు నున్నది. ఇందుకు వాతాపి, కల్యాణి చాళుక్యుల శాసనములును, వారి కాలమున మలచబడిన విష్ణ్వవతార ప్రతిమలు

తారాణ్కణములు. చెన్నకేశవాలయములు తెలంగాణమున ఎక్కువగా నుండెను. అయినను కాకతీయుల కాలములో శైవమెట్లు రాజమతమై జనాదర పాత్రమయ్యెనో యదే విధముగా వైష్ణవము రాజమతమై గొప్పవ్యాప్తిని పొందినది. వైష్ణవము విజయనగరాధీశ్వరుల కాలములోవలె తెలంగాణమున అమితవ్యాప్తినందినది. రాచకొండ, దేవరకొండ రాజ్యాధిపతులైన రేచెర్ల వంశజుల కాలములోనే శ్రీవిద్యారణ్య శ్రీపాదులకు సమకాలికులైన శ్రీ వేదాంత దేశికులవారి కుమారుడు శ్రీనైనాచార్యులవారు సింగయ మాధవేంద్రుని యాస్థానమునకు వచ్చి విమత వాదుల నోడించి యా రాజేంద్రునికి వైష్ణవమత మిచ్చినట్లు వైష్ణవ గ్రంథములు నుడువుచున్నవి. రాజు వైష్ణవమతావలంబి యైనప్పుడు సామంతనృపులును తద్ధర్మము నవలంబించిరి. పోతనగారి భాగవత రచనకి వైష్ణవ మతవ్యాప్తి కూడ ప్రోత్సాహకమయ్యెనేమో !

పోతన్నగారి జన్మస్థలము విషయమునను, కాలము విషయమునను, సమకాలికుల విషయమునను అన్నియు సమస్యలే యైనవి. ఆయన వంశగోత్రాదికములను గూర్చి తాను రచించిన ఆంధ్ర మహా భాగవతములో పోతన్నగారే చెప్పుకొన్నందువలన వివాదము లేకుండపోయినది. పోతనగారు కౌండిన్య గోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. కేసయ లక్కసానుల కుమారుడు. తిప్పన అనుజుడు. ఎల్లన, సోమన మంత్రులాయన పితామహ ప్రపితామహులు. అన్నయ, భీమన లాయన మాతామహ తండ్రి తాతలు. కేసనమంత్రియు, లక్కసానియు శివారాధన తత్పరులు. సానియను పదమిప్పుడు నీచార్థబోధకమైనది. పూర్వమది గౌరవవాచకమే. పోతనగారు తన తండ్రిని గురించి "శైవశాస్త్ర మతము గనియె" ననియు, తన తల్లిని గూర్చి "సదా శివపాదయుగార్చనానుకంపాసంయవాగ్భవాని" యనియు, తన యగ్రజుని గూర్చి "ఈశ్వర సేవాకాము" డనియు చెప్పియుండుటచే పోతన తలిదండ్రులు ఈశ్వర సేవాసంసక్తచిత్తులనుటకు సందియము లేదు. తండ్రివలెను, అగ్రజునివలెను పోతనగారును శివ ధ్యానతత్పరులే. అట్లని కేశవుని మీద భక్తి లేనివారు కాదు.

శ్రీమదాంధ్ర మహాభాగవతావతరణమును గురించి పోతనగారే తమ గ్రంథమున తెలిపియున్నారు. ఆయన శ్రీమన్నారాయణ కథా ప్రపంచవిరచనా కుతూహలుడై ఒకనాటి సోమోపరాగ కాలమున గంగకు జని క్రుంకులిడి తన్నదీ

పులినతలంబున మహేశ్వరధ్యానాయత్త చిత్తుడై కించిదున్మీలిత లోచనుడై యున్న సమయమున శ్రీరామచంద్రమూర్తి కన్గవకు గానబడి పేరు చెప్పి తన పేర భాగవతంబు తెనుగునేయుమని యానతిచ్చి యంతర్హితుడయ్యెనట. అటు తరువాత "శ్రీమహాభాగవత పురాణ పారిజాత పాదపసమాశ్రయంబునను, హరి కరుణా విశేషంబునను కృతార్థత్వంబు సిద్ధించె'' నని తలచి మరల కొన్ని దినములకు ఏకశిలా నగరమునకు జనుదెంచి అందు ''గురువృద్ధ బుధబంధుజనానుజ్ఞాతుడై'' పోతన కవీంద్రుడు భాగవత రచనమునకు పూనుకొనెను. 'బమ్మెర' యని ఇంటి పేరుండుట వలన పోతన పూర్వుల నివాస స్థలము బమ్మెరగ్రామమై యుండవలెను. బమ్మెర యనునది ఓరుగల్లు చెంత నున్నదనియు, ఆ గ్రామము నందు కౌండిన్యసగోత్రులగు నియోగుల కుటుంబ మొక్కటి కలదనియు, ఆ కుటుంబమువారు పోతనామాత్యుడు తమ వంశమువాడని చెప్పుకొనుచున్నారనియు, ఈ బమ్మెరలో పోతరాజు గద్దెయని నాలుగురాళ్లు పాతిన స్థలమొకటి కలదనియు శతావధానులు శ్రీ శేషాద్రి రమణ కవులు వ్రాసియున్నారు. కాని ఏకశిలా నగర మోరుగల్లనియు, గంగ గోదావరి యనియు నిరూపితమైన గాని బమ్మెర యదియే యని స్థిరపడదు. ఏకశిలానగర మేది, గంగ యేది అను విషయమున కొంతకాలమునకు పూర్వము కొమ్ములు తిరిగిన పండితులలో ప్రచండ వాదోపవాదములు చెలరేగినవి. ఏకశిలానగర మన్నది కడప జిల్లాలోని ఒంటిమిట్ట యని కొందరును, తెలంగాణములోని ఓరుగల్లని మరి కొందరును, గంగ గోదావరియే యని కొందరును, కాదని వేరొక కొందరును ఆవేశములు పెంచుకొని వాదులాడిరి. పోతన రాయలసీమ వాడని కొందరు పోరాడగా తెలంగాణమువాడే యని మరి కొందరు వాదించిరి. ప్రచండ ఝంఝామారుతము వలె రేగిన ఆ వాదము చాల కాలము వరకు నుపశమింపలేదు. ఆ వాదప్రతివాదము లిట నుటంకించుట గ్రంథ విస్తరము, ననవసరమును గూడ. ''విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి'' ని స్థాపించి ఆంధ్రదేశ సాంస్కృతిక, వైజ్ఞానికోద్యమములకు శ్రీకారము చుట్టిన మహామేధావి, పరమ పూజ్యులు అయిన కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ఈ వాదప్రతివాదముల నన్నిటిని సాకల్యముగ విమర్శించి తుదకు న్యాయాధిపతివలె తీర్పు చెప్పియున్నారు. ఈ విషయమును గురించి ఎవ్వరేమి చెప్పినను వారి ననువదింప వలసినవారే. అంతటి న్యాయ సమ్మతమైన దా తీర్పు. అయినను ఏకశిలా నగరమును గురించియు, గంగను గురించియు ఒకటి రెండు మాటలు చెప్పెదను.

ఏకశిలా నగరమన్నది కాకతీయుల రాజధానియైన యోరుగంటికే రూఢియైన పేరని కొరవి గోపరాజకృతమైన సింహాసన ద్వాత్రింశికలోని ఈ క్రింది పద్యముల వలన స్పష్టమగుచున్నది-

ఆకడ నీతిశాస్త్రవిదుఁడై గురు వీద్కొని యేగె వేడ్కతోఁ
గాకితమూలశక్తి గనిగా నొనరించిన పైడిచట్టు నా
నేకశిలాభిధానమున నెన్నికకెక్కి ధరిత్రిలోన నే
పోకలఁ బోనియట్టి సిరి పుట్టిన యింటికి నోరుగంటికిన్.

చందనగంధులున్ విటులు జాణలు దానవినోదులుం బ్రభా
సుందరమూర్తులుం గవులు శూరులు బెద్దలు నుల్లసిల్ల సం
క్రందన వైభవాఢ్యుఁడగు కాకతిభూపతి రాజ్యలక్ష్మి బెం
పొందెడు నప్పురంబున మహోత్సవలీలల నుండె నేర్పునన్.

ఈ పద్యముల వలన ఏకశిలానగరము కాకతి భూపతుల రాజధానియైన ఓరుగల్లే కాని కడప మండలములోని ఒంటిమిట్ట కాదని తేలుచున్నది. ఇక గంగ యన్నది గోదావరి నదియే యని నిరూపితమైన గాని పై నిర్ణయము స్థిరపడదు. ఈ యంశము కూడ కొరవి గోపరాజ కృత సింహాసన ద్వాత్రింశికలోని ఈ క్రింది పద్యము వలన నిరూఢమగుచున్నది-

ఆతఁడు త్ర్యంబకశిఖరో
ద్భూతను విఖ్యాతఁ బరమపూతఁ ద్రిలోకీ
మాత మహాపాతకసం
ఘాత విఘాతానుయాతఁ గనియెన్ గంగన్.

ఈ పద్యమున గంగ త్ర్యంబకశిఖరోద్భూత యనుట వలన అది నాసికా త్ర్యంబకమున నుదయించిన గోదావరీ నది యనుటకు సంశయింప బనిలేదు. పోతనగారి జన్మస్థలమైనను కాకపోయినను వారి పూర్వులది బమ్మెర. ఇది తెలంగాణములోనిది. తరువాత కొంత కాలమాయన ఓరుగంటిలో నుండెను. అక్కడ నుండగనే ఆయన మహాభాగవత రచనమునకు పూనుకొని పూర్తిచేసెను,

ఆంధ్ర మహాభాగవతము గాక వీరభద్ర విజయ, భోగినీ దండకములును పోతనామాత్య ప్రణీతములను ప్రసిద్ధి కలదు. వీనిలో నాలుగాశ్వాసములతో గూడిన వీరభద్ర విజయము నందలి కృతికర్తృ వంశాభివర్ణనము ననుసరించియు, నాశ్వాసాంత గద్యము ననుసరించియు నది పోతనామాత్య కృతమని యున్నను, దానినతడు రచింపలేదనువారు నున్నారు. వీరభద్ర విజయములోని కవిత్వము నకును, ఆంధ్ర మహాభాగవతములోని కవిత్వమునకును వ్యత్యాస మున్నదన్న మాట నిజమే. వీరభద్ర విజయ కవిత్వము భాగవత కవిత్వమంత ప్రౌఢమైనదియు కాదు; తప్పులును చాల గలవు. అందువలన పోతన్నగారు రచించిన గ్రంథములలో ఇది మొదటి దనవచ్చును. కాని ఈ కృతి ఆయన రచియింపనే లేదనుటకు సాహసింపలేను. జాగ్రత్తగా పరిశీలించినచో భాగవతములోని పద్యములకును వీరభద్ర విజయములోని పద్యములకును పోలికలు కలవు. ఏ పోలిక లున్నను ఈ క్రింది-

భాగవత ప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షదు
ర్యాగ కథా ప్రసంగమున నల్పవచస్కుఁడనైతి; తన్నిమి
త్తాగతవక్త్రిదోష పరిహారముకై యజనైకశైవశా
స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్క నా మదిన్.

అను పద్యము పోతన కృతము కాదనియు, ప్రక్షిప్తమనియు నా విశ్వాసము. ఇదియే కాదు ఆంధ్ర మహాభాగవతములోని-

ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

అను పద్యమును ప్రక్షిప్తమనియే నా నమ్మకము. పోతనామాత్యుడు మహాభక్తుడు, పరిణత హృదయుడు. ఆయన మనస్తత్వమే వేరు. భాగవత రచనా కాలమున ఆ పద్యము నాయన వ్రాసెననుట ఆయన కపచారము కావించుటయే. ఆయన యటువంటి పద్యము వ్రాసియుండడు; వ్రాయలేడు. ఆయన నిగర్వ చూడామణి. ఆయనది నిండైన మనస్సు. మనస్సెంత నిండైనదో

ఆయన వాక్కును అంత నిండైనదే. భాగవతమే ఇందుకు ప్రమాణము. కృతి కర్త శైలియు, రచనయు నతడెట్టివాడో తెలుపు దర్పణములు. వానిలో అతని మూర్తిని, అతని హృదయమును కనుగొనగలము. భాగవతమును రచింపుమని పోతనగారి కన్నుల యెదుట సాక్షాత్కరించిన శ్రీరామచంద్రమూర్తి ఆదేశించిన వెంటనే ఆయన భక్త్యావేశపరవశుడైనాడు-

పలికెడిది భాగవతమట;
పలికించు విభుండు రామభద్రుండట; నేఁ
బలికిన భవహరమగునట;
పలికెద వేరొండుగాథ పలుకగనేలా!

ఏదీ ఈ విధముగా భక్తిభావ తన్మయుడై పలికిన మరొక యాంధ్రకవి ? నన్నయ తిక్కనాది కవులు పురాణములు తెనుగుజేయుచు నంతకు మున్నె భాగవతమును తెనుగుజేయకపోవుట తన "పురాకృతశుభాధిక్య" మని మురిసి పోవుచున్నాడు పోతనామాత్యుడు. పునర్జన్మము లేకుండ జన్మ సఫలము చేసి కొందునని ఆంధ్ర మహాభాగవత రచనమే ఒక తపస్సుగా భావించిన పరమ పుణ్యశాలి ఆయన. ఆయన గంట మెప్పటికిని పూర్వోదాహృతములైన "భాగవత ప్రబంధ మతిభాసురతన్", "ఇమ్మను జేశ్వరాధములకిచ్చి" అను పద్యములను వ్రాయలేదు. అట్టి పద్యములను రచించుట పోతనగారి కశక్యమని కాదు; ఆయన మనస్తత్వ మట్టిది కాదనియే నా భావము.

భోగినీదండక కర్తృత్వ విషయమునందు కూడ వివాదము కలదు. ఏతద్గ్రంథాంతమున గల-

"పండిత కీర్తనీయుఁడగు బమ్మెరపోతన యా సుధాంశు మా
ర్తాండకులాచలాంబు నిధి తారకమై విలసిల్లు భోగినీ
దండకమున్ రచియించె బహుదాన విహర్తకు రావుసింగ భూ
మండలభర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్."

అను పద్యము వలన ఈ భోగినీదండక కృతికర్త పోతనామాత్యుడనియే స్పష్టపడుచున్నను ఈ కృతి నాయన రచింపలేదని, ఆ పద్య మాయనది కాదని

వాదించువారు కలరు. చాలమంది కవుల విషయమున వారి జన్మస్థానమును గురించి, వారి కాలమును గురించి, తుదకు వారు రచించిన కృతులను గురించి కూడ నిట్టి సందేహము లుండుట ఆంధ్రుల దౌర్భాగ్యము. గ్రంథము స్వయంభువు; అంతియ కాని కవియే లేడను స్థితికింకను మనము రాకపోవుట మన యదృష్టము. భోగినీదండకము పోతన కృతమనియే నా విశ్వసము. దానిని పోతన రచియించె నన్నంత మాత్రమున ఆయన ఖ్యాతికి కళంకము రాదు. ఆయనకు వాసి తగ్గదు. పోతనగారు భక్తాగ్రేసరు లన్నంత మాత్రమున బాల్యము నుండియు నట్లే యుండెనని భావింప నక్కరలేదు. ఆయనయు మానవుడే. ఆయన కూడ మొదట రావు సింగభూపాలుని కాశ్రయుడుగా నుండియుండ వచ్చును. ఆయనను సంతోషపరచుటకు భోగినీదండకమును వ్రాసియు నుండ వచ్చును. క్రమక్రమముగ లోకానుభవము ముదిరి మనస్సు పరిపక్వమైన కొలది అభిరుచులు మారవచ్చును. ఆశయాదర్శములు మారవచ్చును. ఆముష్మికచింత బలపడవచ్చును: వయసు పెరిగిన కొలది పోతనగారిలో అదియే జరిగినదని నా నమ్మకము. భాగవత మాయన కడపటి గ్రంథము, దీనికి పూర్వపుది ఆయన భోగినీదండకము.

ఇక పోతనామాత్యుని కాలము. దీనిని నిర్ణయించుటకు నికరమైనవి లేక పోయినను మూడాధారము లున్నవి. కొండవీటి పెదకోమటి వేమారెడ్డి యాస్థానమునందు విద్యాధికారిగా నుండిన శ్రీనాథ కవిసార్వభౌముడు పోతన్నగారికి సమకాలికుడును, బావమరదియు నని చెప్పుగాథ లుండుటవలన శ్రీనాథుని కాలము ననుసరించి పోతనగారి కాలమును నిర్ణయించుట యొక పద్ధతి. రావు సింగభూపాలుని కాలమును బట్టి పోతనగారి కాలమును నిశ్చయించుట మరొక పద్ధతి. బమ్మెర పోతనగారి ప్రపౌత్రులైన కేసకవి మల్లకవులు రచియించిన దాక్షాయణీ పరిణయము ననుసరించి కాలనిర్ణయము చేయుట వేరొక పద్ధతి.

వీనిలో మొదటిది అనగా శ్రీనాథు ననుసరించి పోతన కాలమును నిర్ణయింపబూనుకొనుట ప్రమాదభూయిష్ఠమైనది. ఏలన, పరంపరగ వచ్చు గాథలను ప్రమాణముగా విశ్వసింపలేము. నన్నయ భట్టారక, తిక్కన సోమయాజులకు మధ్య రెండువందల సంవత్సరముల యెడమున్నను వారుభయులు నేక కాలము వారని చెప్పు గాథలు కూడ నున్నవి. అందువలన శ్రీనాథుడు పోతనకు సమకా

లికుడగునో కాదో, వారుభయులకును బంధుత్వమున్నదో లేదో నిర్ణీతమైనగాని శ్రీనాథు ననుసరించి పోతన కాల నిర్ణయము చేయ గుదురదు.

ఇక దాక్షాయణీ పరిణయకృతి ననుసరించి పోతన కాలనిర్ణయము చేయు విషయమును గురించి యాలోచింతము. పోతనామాత్యుని ప్రపౌత్రులైన కేసకవి మల్లకవులు తమ దాక్షాయణీ పరిణయ కృతిని గురిజాల చినమల్లన సోమయాజి కంకిత మిచ్చిరి. ఈ చినమల్లన సోమయాజి ప్రపౌత్రుడైన పార్వతీశ్వరుని కుమారుడు పేరమంత్రికి పోడూరి పెదరామామాత్యుడు ధాత సంవత్సర ఆశ్వ యుజ బహుళ దశమీ సోమవారము నాడు దాక్షాయణీ పరిణయమునకు ప్రతి వ్రాసి యిచ్చెను. దీనికి సరియైన ఇంగ్లీషు తేదీ 1756 అక్టోబరు 18 వ తేదీ సోమవారమైనది. దీని ననుసరించి తరమునకు 25 లేక 30 సంవత్సరముల చొప్పున పేరమంత్రి నుండి చినమల్లన సోమయాజి వరకు లెక్కించినచో ఆతనికి దాక్షాయణీ పరిణయమును కృతి యిచ్చిన కేసకవి మల్లకవుల కాలము తెలియ గలదు. వీరి కాలము తెలిసిన పిదప తరమున కాపద్ధతినే లెక్కకట్టి వారి ప్రపి తామహుడైన పోతనగారి కాలమును నిర్ణయింపవలసి యుండును. ఈ పద్ధతిని చూచినచో పోతనగారు క్రీ.శ. పదునైదవ శతాబ్ది యుత్తరార్థములోని వాడగును. ఇక రావుసింగభూపాలుని అనుసరించి కాలనిర్ణయము చేయబూనినను ఇంచు మించుగ పోతన ఆ కాలమునకే వచ్చును.

రావు సింగభూపాలుడు రేచెర్ల వంశజుడు. ఈతడు రాజాచల దుర్గాధిపతి. భోగినీదండకమున ఈతడు కుమారాన్న పోతవనీనాథ సూనుడనియు, రావు సింగక్ష్మానాథపౌత్రు డనియు. పోచమాంబాలసద్గర్భసంజాతు డనియు, వసం తావనీనాథ సోదరు డనియు చెప్పబడినాడు. ఇన్ని యానవాళ్ళియబడుట వలన ఇతనిని గుర్తించుట సులభమే. రాచకొండ రాజ్యమును పరిపాలించిన రేచెర్ల వంశజులలో ముగ్గురు రావుసింగనామధేయులు కలరు. అనవోత మాదానాయకుల తండ్రి మొదటి సింగమ నాయకుడు అనవోతానాయని కుమారుడు కుమార సింగ భూపాలుడు. ఇతడే "రసార్ణవసుధాకర" మను అలంకార గ్రంథమును రచిం చెను. ఈతడు క్రీస్తు శకము పదునాలుగవ శతాబ్ది ఉత్తరార్ధములో నుండిన వాడు. కుమార సింగభూపతి పౌత్రుడును, కుమారాన్నపోత భూపాలుని పుత్రు డును అగు రావు సింగభూవరుడు మూడవ వాడు. ఈతని యనుజుడు వసంతా

వనీనాథుడు. ఈ రావుసింగభూపాలుని ముమ్మడి సింగభూపాలు డనియు వ్యవహరింతురు. ఈతడు క్రీస్తు శకము 1430 మొదలు 1475 వరకు పాలించునట్లు ఆతని శాసనములు మొదలైన వాని వలన చెప్పవచ్చును. ఈతనికి సర్వజ్ఞ బిరుదము కలదు. ఈ సింగభూపాలుని కోరికపైనే పోతనామాత్యుడు భోగినీ దండకమును రచించెను. ఈ విధమున జూచినను పోతనామాత్యకవి పదునైదవ శతాబ్ది యుత్తరార్ధమున నుండినట్లు స్పష్టమగుచున్నది.

ఎటుల మెప్పించెదో నన్ను నింక మీద
రావు సింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొని యుండి నీవు
సకల సద్గుణ నికురంబ ! శారదాంబ !

అని శ్రీనాథ కవిసార్వభౌముడు శారదను ప్రార్థించినది ఈ సర్వజ్ఞ సింగభూపాలుని ఆస్థానమునకు వెళ్ళినప్పుడే. అందువలన శ్రీనాథుడు కూడా పోతనామాత్య కవీంద్రునికి సమకాలికుడే. అయితే కొంచె మతనికంటె పెద్దవాడేమో కాని ఆతడు పోతన్న గారి బావమరది యని చెప్పుట కాధారము లేవియు లేవు. రాకపోకల కానుకూల్యములు విశేషముగా నేర్పడిన ఈనాడే మధ్యాంధ్రదేశీయులు తెలంగాణా వారితో వియ్యమందుట అరుదుగా కనబడుచున్నప్పుడు ఆ కాలములో మధ్యాంధ్రదేశీయుడైన శ్రీనాథుడు వైవాహిక సంబంధము వలన పోతరాజునకు బావమరిది యయ్యెనన్న విషయము విశ్వాసపాత్రమైనదిగా తోచుటలేదు. వారుభయులును బావమరదులని చెప్పు గాథలన్నియు వట్టి పుక్కిటి పురాణములే యని నా నమ్మకము.

పోతనామాత్యుడు మహాభాగవతము పంద్రెండు స్కంధములను పూర్తిగా రచించెననియు, నందు కొన్ని భాగములుత్సన్నము లగుటచేత వెలిగందల నారయాదులు వానిని పూరించిరనియు చెప్పుదురు. ప్రకృతము మన కుపలబ్ధమగు నాంధ్ర మహాభారతములో ఏకాదశ ద్వాదశ స్కంధములు వెలిగందల నారయ కృతములు. షష్ఠస్కంధము ఏర్చూరి సింగన విరచితము. ఇక పంచమ స్కంధము నందలి ప్రథమాశ్వాస, ద్వితీయాశ్వాసములు గంగన కృతములు. ఈ విధముగా ఆంధ్ర మహాభాగవత ముత్సన్నమగుటకు చెప్పబడు ఒక గాథ మన దేశమున చిరకాలానుగతముగ వచ్చుచున్నది. రాచకొండ రాజ్యాధిపతియైన

రావు సర్వజ్ఞ సింగభూపాలుడు భాగవతమును దన కంకిత మీయవలసినదని పోతనామాత్యు నభ్యర్థింపగా నాతడందులకు నిరాకరించెననియు, అందు మీదట నా రాజేంద్రుడు కుపితుడై బలాత్కారమున నా గ్రంథమును గైకొని దానిని భూమిలో పాతిపెట్టించెననియు, కొంతకాలమైన వెనుక దానిని బయటికి తీయగా అప్పటికే యా గ్రంథము నందలి తాళపత్రములు కొన్ని చివికి శిథిలమై పోయిన వనియు, ఈ కారణముననే భాగవతము నందలి కొన్ని భాగములుత్సన్న మగుట సంభవించెననియు చెప్పుదురు. కాని యిది విశ్వసింపదగిన విషయముగా గన్పట్టదు. ఒకవేళ రావుసింగభూపాలు డా గ్రంథమును నశింపజేయ సంకల్పించు కొన్నచో దానిని సులువుగా తగులబెట్టి యుండవచ్చును. అట్లు చేయక దానినేల పాతిపెట్టించెనో తెలియదు. మొత్తము మీద ఇది తలతోకలు లేని గాథ.

భాగవతమును రచించుచుండగనే పోతనామాత్యుడు లోకాంతరగతుడై యుండునని నాయూహ. ఏకాదశ, ద్వాదశస్కంధముల నాయన రచియింపనే లేదనియు, అందువలననే భాగవత సంపూర్ణార్థము పోతనామాత్య ప్రియశిష్యుడైన వెలిగందల నారయ తన గురువుగారి మీదగల భక్తి గౌరవముల వలన వానిని రచించియుండుననియు ననుకొనుచున్నాను. మిగిలిన యాంధ్ర మహా భాగవతమును పోతనామాత్యుడే రచించి యుండవలెను. దీనిలో పంచమ, షష్ఠస్కంధము లుత్సన్నము లగుటకు ప్రాయికముగా ఆనాటి రాజకీయ పరిస్థితులే కారణమై యుండవచ్చునని నేనూహించుచున్నాను.

ముమ్మడి సింగమ నాయకుని కాలమున కించుక పూర్వము నుండియే బీదరు రాజధానిగ పరిపాలించుచుండిన బహ్మనీ సుల్తానులకును, రాచకొండ దుర్గాధిపతులకును వైరానలము ప్రజ్వరిల్లినది. అహ్మదుషా రాజ్యకాలము చివర తెలంగాణముపై మహమ్మదీయులు దండెత్తి రాచకొండ రాజ్యాధిపతుల కోటలను గొన్నిటిని బట్టుకొనిరి. అహ్మదుషా అనంతరము బహ్మనీ సుల్తానులకును, రాచకొండ రాజాధిపతులకును జరిగిన యుద్ధము లనేకములు. వానితో తెలంగాణము నిప్పులపుంత యైనది. రాచకొండ దుర్గాధిపతులు కటకము గజపతుల సాయముతో మరల ఓరుగల్లు, భువనగిరి మొదలైన దుర్గములను గెలుచుకొనిరి. శాశ్వతముగ ఈ దుర్గములు రేచెర్ల ప్రభువుల అధికారము క్రింద నుండలేదు. తుదకు క్రీ.శ. 1474-75 నాటికి తెలంగాణమున రాచకొండ, దేవరకొండ ప్రభువుల రాజ్యమంతరించినది. అది పూర్తిగా రెండవ మహమ్మదుషా రాజ్య

కాలమున అతని యధికారము క్రిందికి వచ్చినది. ఈ బహ్మనీ, రేచెర్ల వంశముల యుద్ధమున తెలంగాణమున శాంతిభద్రత లంతరించినవి. గ్రామదహనము లతిశయించినవి. భాగవతమున కొన్ని భాగము లుత్పన్నమగుట కప్పటి రాజకీయ సంక్షోభమే కారణము కావచ్చును. ఇది యూహ మాత్రమే. పోతనామాత్య విరచితమైన భాగమే భాగవతమున అధికముగ నిలిచియుండుట ఆంధ్రుల యదృష్టమని చెప్పవచ్చును.

పోతనామాత్యుని కవిత్వము అతిమృదుమధుర పదసంఘటితమై, శబ్దార్థాలంకార పరిశోభితమై, వీనులకు విందొనర్చుచు అమందానందము కలిగించుచుండును. పోతనగారే చెప్పుకొన్నారు-

కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ,
గొందఱకు సంస్కృతంబు గుణమగు, రెండుం
గొందఱకు గుణములగు, నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

అని ఆయన యెంత ధైర్యముతో, ఆత్మవిశ్వాసముతో చెప్పిన మాటలో ఇవి. అందువలననే రసానుగుణముగ తెనుగును, సంస్కృతమును సరిసమానముగ సార్థకముగ వాడగలిగిన ప్రతిభాశాలి ఆయన.

తెలుగుదేశములో ఆంధ్రమహాభారతమును జదువని వారుండిన నుండవచ్చును. కాని ఆంధ్ర మహాభాగవతమును జదువనివారు చదువనేర్చిన వారిలో అరుదు. భాగవతమునందలి గజేంద్రమోక్షము, రుక్మిణీ కల్యాణము, కుచేలోపాఖ్యానము మొదలైన కథలను నేటికిని కంఠస్థము కావించుకొని ప్రతిదినము చదువువారున్నారు. పల్లెటూళ్ళలో సమాన్యమైన దా భాగవతము. పోతనగారే దానిని కల్పతరువుతో పోల్చినారు. ఈ క్రింది పద్యమును చిత్తగింపుడు-

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

(ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు, 1957)

# ఆంధ్ర భాగవత వైశిష్ట్యము

ఆచార్య నిడుదవోలు వేంకటరావు

ఆధ్యాత్మిక విద్యా సంపన్నమైన యాద్య భారతీయ వాఙ్మయమున అష్టాదశ పురాణములలో నొకటియై, ఆద్యంతము భగవద్భక్తి తత్వ ప్రతిపాదకమై, భక్తిరస సిద్ధాంతమున కాలంబమై, ప్రామాణికమైనది శ్రీ మహా భాగవతము. సంస్కృతమున శ్రీ వేదవ్యాస మహర్షి ప్రణీతమై ఆ మహర్షి తనయుడగు శుకమహర్షిచే పఠితమైన యా భాగవతమును తెనుగు భాషలో రచించిన మహాకవి బమ్మెర పోతన. పోతన రచిత భాగవత మాంధ్ర వాఙ్మయ ప్రపంచమున నవతరించి నేటి కైదు శతాబ్దులు-అనగా నైదు వందల సంవత్సరములైనది. నాటినుండి నేటివరకు ప్రసిద్ధిగన్న గ్రంథములలో నాంధ్ర ప్రజానీకమున ఆబాల గోపాలమును అత్యధికముగ నాకర్షించినది పోతన భాగవతమే. పండితులు-పామరులు, బాలురు-వృద్ధులు. స్త్రీలు-పురుషులు వారు వీరు అననేల సమస్తాంధ్ర మహాజన హృదయములను జూరగొనినది భాగవతమే. పల్లెలలో నేమి పట్టణములలో నేమి భాగవతమునందలి పద్యములు ప్రజలకు కంఠస్థములు. పద్యములే కాదు, ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షము, రుక్మిణీ కల్యాణము మొదలగు ఘట్టములన్నియు కంఠస్థములే. ఈ యిరువదియవ శతాబ్దిని గూడ తెల్లవారు జామున గజేంద్ర మోక్షమున పద్యములను నిత్యము పఠించువారున్నారు. భాగవతమున భీష్మస్తవము, అక్రూర దండకము, గోపికా గీతలు, భ్రమర గీతలు నేటికిని పారాయణము చేయబడుచున్నవి.

ఈనాడేకాదు, క్రైస్తవ శకము పదునారవ శతాబ్దిని విజయనగర సామ్రాజ్యాధీశులైన కర్ణాట రాజులు తెలుగు భాగవత ఘట్టములను పఠించువారని వారి దినచర్యను దెలుపు 'రాయవాచకము' అను గ్రంథమునుండి తెలియుచున్నది.

"విద్యా నగరమందు వీరనృసింహ రాయలవారు బ్రాహ్మీ ముహూర్తాన లేచి ఆరాధ్యుల నామావళులున్నూ, అధ్యాత్మ సంకీర్తనలున్నూ, పాండవ గీతలు, భ్రమరగీతలు, గజేంద్ర మోక్షం, భారత సావిత్రి, గంగావతరణమున్నూ భారతం, భాగవతం, ముచికుంద స్తుతి, అక్రూర స్తుతియున్నూ ... పఠించి విని."

పైన యుదాహరించిన వన్నియును సంస్కృతములు కావు. ఆరాధ్యుల నామావళు లనగా సహస్ర గణమాలిక. ఇది కన్నడమున తెనుగునగాని సంస్కృతమున లేదు. అధ్యాత్మ సంకీర్తన లనగా తాళ్లపాక అన్నమయ్యగారి సంకీర్తనలు. ఇవి తెలుగుననే యున్నవి. కాబట్టి భ్రమర గీతలు, గజేంద్ర మోక్షము మొదలగునవి పోతన భాగవతము నుండియే యని మనకు స్పష్టమగు చున్నది.

ఇట్లు సార్వజనీనత్వము, సార్వకాలికత్వము, సార్వదేశికత్వము సంపూర్ణముగ మూర్తీభవించిన తెలుగు కృతి పోతన భాగవతము.

తెలుగు భాషలో భాగవతమునకంత యధికవ్యాప్తి కలుగుటకు పోతన యప్రతిమాన భక్తి విశేషమును, అనితర సాధ్య కవితా మహత్త్వమును కారణములు. భక్తిలో బుట్టి భక్తిలో బెరిగి భక్తిరససిద్ధుడైన మహనీయుడు కావుననే పోతన భక్తి విషయులగు భాగవత పాత్రలతో తాదాత్మ్యమును పొందినాడు. భక్త్యనుభూతిని హృదయముల యందు ముద్రించినాడు. ఇట్టి భక్తిరసానుభవావిష్కరణమునకు నమృతరస మాధురీధురీణంబగు నాంధ్రభాష పోతనకు వశ్యమైనది. చదువుటకు మొదలిడిన తోడనే శ్రవణ మనోహరములై సమ విభక్తములైన యనుప్రాస పదవిన్యాసములును, కోమలశయ్యా సౌభాగ్యమును, భక్తి మాధుర్య ప్రసారిత భావ సంపదయు ప్రతి పాఠకుని హృదయమును పారవశ్యము జెందించును. ఒక గ్రంథమున కథా సూత్రమున నిమిడి యుండియు, ప్రతి పద్యమును నొక ముక్తమువలె ప్రత్యేక ప్రత్యేకముగ పఠనీయముగ నుండునట్లు రచింపగల యీ తిలోకోత్తర కవితాశక్తి పోతనకున్నట్లు మరియే తెలుగు కవికి లేదు. ఇట్టి ప్రత్యేకత చేతనే పోతన భాగవత పద్యము లలో నొకటియైన ప్రతి యాంధ్రుని నాలుకపై నాట్యమాడుచునే యుండును.

తెలుగున స్పష్టముగ నుచ్చారణ యలవడని జానపదుడు గూడ భాగవత పద్యములను తనకు సహజముగు నస్పష్టోచ్చారణతోనైన జదువుచు నానందించు నన్నచో పోతన భాగవతమునకు నాంధ్ర ప్రజాహృదయసీమ నెట్టి శాశ్వత స్థానమున్నదో ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

భాగవత రచనా ప్రారంభ కాలము నుండియే పోతన భక్తి మాహాత్మ్యములు లోకమందు వ్యాపించినవి. వానిని ప్రజా సామాన్యములో కర్ణాకర్ణిగా చెప్పుకొనుచుండిరి. అవి కొంతకాలమునకు గ్రంథస్థములైనవి. ఐహికేచ్ఛా విముఖుడయ్యెను. పోతన సంసారము చేయుచు 'సర్వం విష్ణుమయం జగత్' అను సూక్తి ననుసరించి నిర్లిప్తుడై పరమేశ్వర భక్తి భావనతో జీవితము గడపెడివాడు. దరిద్రావస్థలో నున్నను, ధారుణీపతులను తృణీకరించి ధనాశా పాశము నామూలముగా విదారించినాడు. స్థిరమును, శ్రేష్ఠమును నగు భక్తి తత్పరత చేత జీవితకాలములో భగవత్సాక్షాత్కారమును బొందిన పోతనను దైవముగా ప్రజలారాధించిరి. అతని భాగవతము భగవద్దత్తమైన మహా ప్రసాదముగా భావించిరి.

తెలుగు భాగవతము యొక్క మహిమ యద్వితీయమైనది. పాషాణ హృదయములైన నందలి పద్యములు ద్రవింపజేయును. పచ్చి కసాయివానినైన పరమ భక్తాగ్రేసరునిగా నొనరించును. బాలునైన మహా పండితునిగా దిద్ది తీర్చగలుగును. ఇక భక్తాగ్రగణ్యులకది పారాయణమై విలసిల్లుననుటలో సందేహమేమున్నది?

పోతన భాగవత ప్రశస్తి మన యాంధ్రము దాటి మహారాష్ట్ర దేశమున మన్నన గన్నది. శివాజీ మహారాజునకు గురువులైన సమర్థ రామదాస స్వామి వారు తమ 'దాసబోధ' గ్రంథమున పోతన భక్తి ప్రపత్తిని ప్రశంసించి యున్నారు.

అఖిల సంగీత ప్రపంచమునకు సర్వ స్వరూపుడై నాదబ్రహ్మయై నారదావతారమగు త్యాగరాజు పోతన భాగవతమును ప్రతిదినమును పారాయణము చేసెడివాడు. ఆ భాగవత ప్రతి నేటికిని చెక్కుచెదరకుండ తాళ

పత్రరూపమున తిరువయ్యూరిలో త్యాగరాజస్వామి గృహమున భద్రపరుపబడి యున్నది. ఈ విషయ మొక్కటియు తెలుగు భాగవత దివ్యత్వమును తేట పరచును.

తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి 'సిల కవియరశర్' (కొందరు కవిరాజులు) అను వ్యాసమున పోతన మహాకవిని ప్రశంసించెను.

హరికథా పితామహుడై సంగీత సాహిత్య నిధియై చతుర్భాషా పండితుడై ఆటపాట మాటల మేటియైన అజ్జాడాదిభట్ట నారాయణ దాసునకు నైదవయేట భాగవతముతోడనే యక్షరాభ్యాసమైనది. భాగవత భక్తి రసాస్వాదనచేత నాతని రచనలు హరికథా రూపమున నాంధ్ర సాహితిని రంజింపజేసినవి. ఆంధ్ర భాగవతావతరణ కాలము నుండియు కవులు పోతనను స్మరించుచునే యున్నారు.

ఆధ్యాత్మిక భక్తి భావనతో గాకున్నను ఆంధ్ర భాషా సారస్వత చారిత్రక పరిణామ దృష్టితో నైన నేడు సాహితీ విమర్శకులు, చారిత్రకులు, కవులు, గాయకులు, సహృదయులును పోతనకు భక్త్యంజలులు సమర్పించుచునే యున్నారు.

మంత్ర ద్రష్టలగు మహర్షులవలె మహాకవులు దేశకాలజాత్యాదులచే విభాజ్యులు కారు. అమృతములు, నఖిలలోక కల్యాణాత్మకములు, నగు వారి రచనలు నట్టివే. ఆంధ్ర వాఙ్మయమున పోతన అట్టి మహాఋషి, మహాకవి. ఆతని భాగవత పురాణమును అట్టి యజరామర కృతి.

ప్రణవమునందలి మూడు మాత్రలవలె నందుండి యావిర్భవించిన యాంధ్ర వాఙ్మయ జగత్తునకు రామాయణ భారత భాగవతములు మూడును మూల స్తంభాయమానములు. మన ప్రాచీన సంస్కృత సంప్రదాయము ననుసరించి రామాయణము కావ్యము. భారతము ఇతిహాసము, భాగవతము పురాణము. కాని తెలుగున నీ మూడిండికి 'పురాణములు' అనియే వాడుక గలదు.

ఆంధ్రుల భక్తిమయ జీవిత రంగమున పోతన యవతరించునాటికి భారత రామాయణములు రెండును తెనుగులోనికి ననూదితములైనవి. భారతము

నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల చేతను, రామాయణము భాస్కరాదుల చేతను రచితములైనవి. వీనిలో నాద్యమగు భారత మఖిలాంధ్ర వాఙ్మయ సౌధమునకు పునాదియై కవితా గౌరవము చేత, ప్రామాణికత్వము చేత సకలాంధ్ర కవులకు నుపజీవ్యమై విరాజిల్లినది. భారతము రచించిన కవులలో నన్నయ శబ్దశాసనుడు, తిక్కన కవి బ్రహ్మ, ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడు. ముప్వురు ఋషి కల్పులు, తపస్సంపన్నులు. కావుననే తెనుగున రామాయణ రచనలో కవితా రామణీయకమున్నను భారతమే కవితా ప్రపంచమున నగ్రస్థాన మధిష్ఠించినది. పురాణ రచనమునకు కేవలము ప్రతిభా సంపదయే కాక ఆత్మశుద్ధి, తపస్సిద్ధియు కూడ నత్యావశ్యకములు.

భాగవత పురాణము పై రెండింటికన్న ప్రత్యేక విశిష్టత గలది. కొందరు భగవత్తత్వార్థ ప్రతిపాదనమున భగవద్గీతకు పిమ్మట భాగవతమునే పరిగణింతురు. మరి కొందరు భగవద్భక్తి ప్రతిపాదనమున భాగవతమునే ప్రధాన గ్రంథముగా ప్రామాణికముగా గైకొందురు.

భగవత్తత్వమును భక్తి తత్త్వముతో సమ్మేళనము చేసి వ్యాసమహర్షి ప్రణీత శుకయోగి పఠిత మహాభాగవతము నాంధ్ర వాఙ్మయమునకు ప్రసాదించుటకు నాంధ్రుల బహుజన్మకృత పుణ్య పరిపాకవశమున బమ్మెర పోతన పదునైదవ శతాబ్ది నవతరించెను.

భాగవతాంధ్రీకరణము కొరకు పోతన, పోతనకొరకు భాగవతాంధ్రీకరణము క్రీస్తు శకము పదునైదవ శతాబ్ది వరకు వేచియున్నట్లుగా భాగవతావతారిక నుండి యీ క్రింది పద్యమువలన గ్రహింపవచ్చును.

ఒనరన్నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్
తెనుగుం జేసియు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుగుంజేయరు మున్ను భాగవతమున్, దీనిం దెలింగించి నే
జననంబున్ సఫలంబుఁ జేసెద పునర్జన్మంబు లేకుండగన్.

పోతన భారత రామాయణములను పురాణములుగనే పరిగణించినను జన్మసాఫల్యము భగవద్భక్తి ప్రధానమగు భాగవతము వలననే కలుగునని

పై పద్యమున స్పష్టపరచినాడు. దీనికి గారణము 'నానా రసాభ్యుదయోల్లాసి' యైన భారతము కన్నను, రసోల్లసితమైన రామాయణము కన్నను భక్తిరసము ప్రధానముగా నందు ప్రపంచితమగుటయే యని పోతన యాశయము.

కర్మ జ్ఞాన భక్తి మార్గములలో భక్తిమార్గ మందర కందుబాటులో నుండు రాజమార్గము. అది సర్వజన సుగమము. కర్మజ్ఞానములు మనుజునకు సహజములు గావు. కొన్ని పట్టుల సాధ్యములును గావు. కాని భక్తి మార్గ మట్టిదిగాదు. అది సహజము. స్వతస్సిద్ధము. బ్రహ్మజ్ఞానము చేత పదునాల్గు జన్మములకైన పొందరాని కైవల్యమును ఫలాపేక్షలేని నిశ్చల భక్తిచే నొక్క జన్మ చేతనే సులభముగ పొందవచ్చును. అట్టి భక్తి ప్రతిపాదకమగు భాగవత గ్రంథమును తెనుగు జేసినందువలన జన్మరాహిత్యము పోతనకేకాదు, సర్వాంధ్ర జనులకు కలిగినది. ఈ పద్యమున నింకొక విశేషము గలదు. పునర్జన్మము లేకుండుట తనకేకాదు, తాను రచించిన భాగవతాంధ్రీకరణమునకు గూడ నని యర్థము. ఆంధ్రీకరణమునకు పునర్జన్మయనగా వేరొక కవి భాగవతాను వాదమును పోతన కన్న రసవత్తరముగా వెలయించుట. పోతన కాలము నాటినుండి నేటివరకు భాగవతమున పోతన రచింపక వదలిపెట్టిన భాగవతాంధ్రీ కరణములే యున్నవి కాని పోతన కృతమని చెప్పదగిన భాగములకు పోటీయై నిలిచి వేరుగానున్న భాషాంతరములు లేవు. ఇకముందు నుండవేమో! పోతన రచనలతో తులతూగు రచనను చేయగల మహాకవి తెలుగున 'నభూతో నభవిష్యతి.'

విష్ణుభక్తి మార్గమును తొలుత నాంధ్ర వాఙ్మయ ప్రపంచమున భాగవత మూలమున పోతన సుప్రతిష్ఠితము గావించెను. కాని యది సామాన్య కార్యము గాదు. అతిలోకోత్తర కృషి. భాగవత మాహాత్మ్యమును దెలుపుచు పోతనయే యిట్లు వ్రాసియున్నాడు—

భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు.

కలంగుడి నటేశ శాస్త్రియు తమిళమున ననువదించెను. తమిళ సారస్వతమున కంబ మహాకవి విరచిత రామాయణమునకు గల వ్యాప్తి, ఆదరణ భారత భాగవతముల కెంత మాత్రమును లేవు.

కన్నడము :

కన్నడ భాషలో చాటు విఠలనాథుడను కవి భాగవతమును క్రీ.శ. 1530 ప్రాంతమున భామినీ షట్పదీ వృత్తములతో రచించెను. ఆ యనువాదమున కవియే తాను భాగవతార్థమును సంగ్రహించితినని వ్రాసి యుండుటచే నిది భాగవతమునకు సంపూర్ణానువాదము కాదు. కన్నడ భాషతో జైన, శైవ వాఙ్మయములు ప్రధాన స్థాన మాక్రమించినవి. భారత భాగవతముల కంత ప్రచారము లేదు. విఠలనాథునిది విశిష్టాద్వైత సంప్రదాయము ననుసరించినది. కుమార వ్యాసుని భారతమున కున్నంత వ్యాప్తియు దీనికి లేదు.

మలయాళము :

మలయాళ భాషలో ఎజుతచ్చన్ పేర భాషా భాగవతము గలదు. అందు మొదటినుండి తొమ్మిది స్కంధము లొకరి రచనముగను, తక్కినవి పుర యన్నూర్ నంబూద్రిపాదుని చేతను, ప్రన్న సేరినంబి యను వానిచేతను భాషాంతరీకరింపబడినవి. ఈ ఎజుతచ్చన్ భాగవత రచనను గూర్చి భేదాభి ప్రాయములు గలవు. అతడు దానిని వృద్ధాప్యమున రచించెననియు, తిరిగి దానిని సంస్కరించుట కాతని కవకాశము కలుగలేదనియు నందుచే నాతని శిష్యులలో నొకరు దానిని సంస్కరించి ఆయా భాగములను ఎజుతచ్చన్ పేరనే రచించిరనియు విమర్శకాభిప్రాయము. కాని ఎజుతచ్చన్ ఆధ్యాత్మ రామాయణ మునకు వచ్చిన వ్యాప్తిలో కొంతయైన నాతని భాగవతమునకు రాలేదు. ఆంధ్ర భాగవత విమర్శకులలో బహుభాషావిశారదులును, ప్రసిద్ధ విమర్శకులును నగు "సరస్వతీపుత్ర" పుట్టపర్తి నారాయణాచార్యుల వారొక్కరు మాత్రమే ఎజు తచ్చన్ దశమస్కంధరచనను గూర్చి తెలిపిరి. పోతన రచనను ఎజుతచ్చన్ రచనను పరిశీలించి రెండుపట్టుల నెట్లు ఎజుతచ్చన్ భాగవతరచనలో కొన్ని మెరు గులు చూపినదియు వివరించియున్నారు. "ఎజుతచ్చన్ వ్రాసిన భాగవతమునకు వర్ణనానైపుణ్యమునను కథానువాదవిధానమునను పోతనతో పోటీలేదు" అని వారి యభిప్రాయమును దెలిపియున్నారు.

మరాఠీ :

మహారాష్ట్ర భాషయందు మహాభక్తుడగు ఏకనాథుడు భాగవత క్రీ.శ. 1580 ప్రాంతమున రచించెను. ఇతనిది పద్యకృతి. ఇది మహా దేశమున ప్రసిద్ధినందినది. పండరిపురమున విఠోబా మందిరమున దీని కొన్ని భాగములను సంకీర్తనలుగా పాడుదురట. కాని యిది సంస్కృత భాగవ నకు పూర్ణానువాదము గాదు. "ఏకనాథుడు తన భాగవతము నందు ప్రవా ముగ పెంచి వ్రాసినది కృష్ణోద్ధవ సంవాదమునే. తక్కిన కథాభాగమునంత చాల టూకీగా వెళ్ళగొట్టినాడు" అని విమర్శకాభిప్రాయము. మహారాష్ట్ర వతమున భాగవతధర్మము "ఆనందవన భువనము" అని నిర్వచింపబడినది.

గుజరాతీ :

ఈ భాషలో భాగవత సంపూర్ణానువాదము వెలువడనే లేదు. భలణ (1434-1514) అను నాతడును, ప్రేమానందుడు (1636-1784) ను సంస్క భాగవతమున దశమస్కంధము మాత్రమే గుజరాతీ భాషలోని కనువదించి సకరుడు (1500-1575), విష్ణుదాసు (1564-1682) అనువాదు భాగవత నందలి యుపాఖ్యానములను గుజరాతీలోని కనువదించిరి. రత్నేశ్వరుడు (165 1720) అను కవి భాగవతము ననువదించెను గాని యది చాల సంగ్రహరచ

ఒరియా :

ఒరియా భాషలో జగన్నాథదాసు అనునతడు సంస్కృత భాగవతవ పంద్రెండుస్కంధములను అనువదించియున్నాడు. ఇది యోఢ్రదేశమున ప్రచు ప్రచారము గలది. జగన్నాథదాసు భక్తుడు, కవి, సంస్కృత భాషావేత్త అతడు పోతన్నకన్న కొంచెము వెనుకవాడు. జగన్నాథదాసు రచన సమగ్రవే యైనను నది భక్తిరసవిస్తరణ యందు తెలుగుభాగవతముతో సరిరాదు. మరియ నందు వంగవైష్ణవ సంప్రదాయములు కానవచ్చుచున్నవి.

బెంగాలీ :

మాలాధరదాసు అను విద్వాంసుడు భాగవతమును బెంగాలీ భాషలోనికి పదునారవ శతాబ్దిలో ననువదించియున్నాడు. కాని చైతన్య మతమునకు జన్మ స్థానమైన యా దేశమున నీ యనువాదమునకు ప్రాముఖ్యము లేదు.

**అస్సామీ :**

శంకరదేవుడను మహాకవి భాగవతమును అస్సామీ భాషలో పద్యకృతిగా రచించెను. ఈతని జీవితకాలము (1449-1568) 119 సంవత్సరములు. ఈతడు గాక మరి తొమ్మండుగురు భాగవతములోని వివిధ స్కంధములను అస్సామీలోని కనువదించిరి.

**పంజాబీ :**

ఈ భాషయందు 1600-1800 ప్రాంతముల మధ్య భాగవతము అనువదింపబడినదని తెలియుచున్నది. దీని ప్రశంసయే గాని వివరములా వాఙ్మయ చరిత్రలయందు లేకుండుటచే నా భాషయందు భాగవతమునకు ప్రసిద్ధిలేదని గ్రహింపవచ్చును.

**హిందీ :**

ఈ భాషయందు భాగవతమునకు సముచితస్థానము గలదు. హిందీ సాహిత్యమున రామభక్తి సాహిత్యము, కృష్ణభక్తి సాహిత్యము అని రెండు విభాగములు గలవు. మొదటిదానికి ప్రధాన గ్రంథము లోకోత్తరమగు తులసీదాస మహాశయుని ''రామచరిత మానసము''. రెండవదానికి ప్రధానమైనది సూరదాస రచితమైన ''సూర్‌సాగర్'' అను కృతి.

సూర్ సాగర్ లక్షాపాతికవేల పదములు గల మహాగ్రంథము. కాని యిప్పుడందు లభించు పదముల సంఖ్య పదివేలకు మించి యుండదు. సంస్కృత భాగవతము వలె నిందును ద్వాదశస్కంధములు గలవు. కావున నిది యీ భాగవతమునకు ననువాదమని కొందరు భ్రమపడవచ్చును. కాని యిది సరికాదు. సూర్‌సాగర్‌లోని విషయ విభాగమిట్లున్నది- ప్రథమస్కంధమున ఇష్టదేవతాస్తుతి, ద్వితీయస్కంధము నుండి అష్టమ స్కంధము వరకు విష్ణువుయొక్క అవతారములు ఇతర పౌరాణికగాథలు, నవమస్కంధమున శ్రీరామావతారకథ, దశమ స్కంధమున శ్రీకృష్ణుని బాల్యలీలలు మధురానగర గమనము తరువాత సంఘటనలు.

సూర్‌సాగర్ నందు పై విధముగా విషయ విభాగమున్నను అందు దశమ స్కంధమునకే ప్రాధాన్యము. సూరదాసు వల్లభ సంప్రదాయమునకు

చెందినవాడు. ఆ సంప్రదాయమున ముఖ్యాంశమగు శ్రీకృష్ణ లీలా గానము చేయుటయే యాతని లక్ష్యము. ఈ లక్ష్యసిద్ధికై సూరదాసు తనకు కావలసిన ఘట్టములను (ముఖ్యముగా శ్రీకృష్ణ కథాసందర్భమున) విస్తరించి రచియించి తక్కిన వానిని సంక్షేపముగ చెప్పియున్నాడు. కాబట్టి మూల భాగవతము నందలి భావముల నాతడు యథాతథముగా పాఠక లోకమున కందింపవలసిన యావశ్యకత లేదు. అది యాతని యాశయమును కాదు. ఇక దశమ స్కంధమున శ్రీకృష్ణుని బాల్యలీలలను వర్ణించుట యందేమి, యశోదానందుల వాత్సల్యమును చిత్రించుటయందేమి సూరదాసునకు సాటిగా నిల్వదగిన కవి లేడని కంఠోక్తిగ చెప్పవచ్చును. ఇక సూర్‌సాగర్ నందలి భ్రమర గీతలకు పోతన భాగవతము నందలి భ్రమరగీతలకు పోలికయే లేదు. తెలుగు భాగవతము లోని గోపికలవలె సూరదాసు గోపికలు ఉద్ధవుని మాటలకు తృప్తిపడక ఆతనిని వ్యంగ్యోక్తులతో నెత్తిపొడుచుచు తమ విరహవేదనా తీవ్రతను ప్రకటింతురు. ఉద్ధవుడు ప్రతిపాదించిన నిర్గుణ భక్తివాదమును ఖండించి సగుణభక్తిని అందును కృష్ణభక్తిని సమర్థింతురు. దీనినిబట్టి సూర్‌సాగర్ భాగవత కథతో సంబంధించినదే యయ్యు నది వేరొక మార్గమున నడచినదనుట స్పష్టము. పోతన సూరదాసుల దృక్పథములు వేరు.

పోతన మూలానుగుణముగ వ్యాఖ్యానముల ననుసరించి క్రమ బద్ధముగ భాగవతమును రచించినాడు. కావున నందు కథలన్నింటికి సమాన ప్రాధాన్యము కలదు. కాని సూరదాసు లక్ష్యము వల్లభాచార్య సంప్రదాయము ననుసరించి దశమస్కంధమున గల శ్రీకృష్ణ లీలా వైభవమును పెంపొందించుటయే. కావున నందు దశమస్కంధమునకే ప్రాధాన్యము గలిగి తక్కినవానికి లేకపోయినది.

భక్తిభావన యందు నిరువురి పద్ధతులు వేరు. సూరదాసునిది మధుర భక్తి-పుష్టిమార్గము. పోతనది రామకృష్ణ భేదము గాని శివకేశవ భేదము గాని లేని యద్వైత భక్తి. ఇక రచనా విధానమును పరిశీలించిన సూరదాసునిది పద కవిత్వము. పోతనది పద్య కవిత్వము. భావనా పద్ధతులయందు తులసీదాసునకు పోతనకు సామ్యము మెండు. ఇరువురి భక్తి పద్ధతులు సమానము. ఇష్ట దైవము సమానము. కాని వస్తు సామ్యము లేదు. ఒకరిది రామాయణము - వేరొకరిది భాగవతము.

క్రీ.శ. 18 వ శతాబ్దిని సదాసుఖపాల్ అను నతడు భాగవతము నామూలాగ్రముగ హిందీలో గద్యానువాదము గావించెను. అతని సమకాలికుడు లల్లూజీలాల్ దశమస్కంధ మొక్కటియే గద్యముగా రచించెను. కృష్ణలీలలను గ్రహించి వ్రాసిన కృతులు హిందీలో చాల గలవు.

భక్తి సిద్ధాంతమునకు మూలమగు భాగవతమును వ్యాసమహర్షి రచనను తుంచ తప్పక యనుసరించి వ్యాఖ్యాతృ భావము నవగతము చేసికొని భాగవతార్థమును భక్తి తత్త్వమును దేశభాషలో సమగ్రముగను సంపూర్ణముగను భారతీయుల కందజేసిన పరమ గౌరవము బమ్మెర పోతనది, తెలుగువారిది, కేవలము భాగవతాంధ్రీకరణము మూలముననే గాక భాగవత ప్రతిపాదితమైన శ్రీకృష్ణ భక్తిని భారత వర్షమున చిరస్థాయిగ నొనర్చిన కీర్తి పోతనదే.

శ్రీకృష్ణ భక్తి ప్రధానమైన మతము వంగదేశమున నుత్తర హిందూస్థానమున పోతన భాగవత రచనకు తరువాతనే ప్రారంభమైనది. అవి రెండు సంప్రదాయములు. రెండును మధురభక్తి సంబంధులే. ఒకటి వంగదేశమున చైతన్యుడు ప్రవర్తిల్లజేసిన రాధావల్లభ మతము, రెండవది వల్లభాచార్యులు ప్రచారమునకు తెచ్చిన శుద్ధాద్వైతము లేక పుష్టి మార్గమతము. ఈ మతప్రవక్తలిర్వురకు శృంగార రసాధినేత యగు శ్రీకృష్ణ పరమాత్మయే యారాధ్యుడు. భాగవతమున లేకున్నను రాధా తత్త్వమును, రాధాదేవిని బ్రహ్మకైవర్త పురాణాదులందుండి సంగ్రహించి యీ మతప్రవక్తలిర్వురును నీ సంప్రదాయములు నెలకొల్పిరి. కాని శ్రీకృష్ణ చరిత్ర, శ్రీకృష్ణుని లీలా విలాసములు సమగ్రముగా గల గ్రంథ మొక్క భాగవతమునందు దశమ స్కంధమే కావున నది వారి కత్యంత ప్రామాణిక గ్రంథమైనది.

సంస్కృతమూలమున 90 అధ్యాయములలో 1600 గ్రంథపరిమితి గల దశమస్కంధమును తెనుగున పోతన పూర్వోత్తరభాగములతో 3100 గద్యపద్యములతో రచించెను. అనగా తెలుగుభాగవతమున దశమస్కంధము మూడవపాలన్నమాట. పై యిర్వురిలో చైతన్యుడు 1485 నుండి 1533 వరకును, వల్లభాచార్యులు 1479నుండి 1531 వరకును జీవించియుండుటచేత వారిర్వును పోతనకు తరువాతి వారు. వారిలో చైతన్యుడు వంగదేశీయుడైనను ఆంధ్రదేశమున పర్య

టించినవాడు. (మంగళగిరి క్షేత్రమున పానకాల నృసింహస్వామి యాలయమున చైతన్యస్వామి పాదము లిప్పటికి గలవు.) అతడు పోతన భాగవతము నెరిగిన వాడు. ఇక వల్లభాచార్యులు తెలుగు బ్రాహ్మణుడే. వల్లభాచార్యులు పుష్టిమార్గ మును స్థాపించిన వెనుక తెలుగువారు గుజరాత్ రాజస్థాన్ ప్రాంతములలో "తెలాంగులు" అనుపేర నెలకొన్నారు. వారు పోతన భాగవతమే నేటికిని చదువు దురట. ఉత్తరహిందూస్థానమున వల్లభమతము గోకుల బృందావనము స్థానముగా నభివృద్ధి చెందిన పిమ్మట హిందీసాహిత్య మంతయు శ్రీకృష్ణభక్తి సాహిత్య మైనది. కావున భారతీయ సాహిత్యమునకు శ్రీకృష్ణభక్తిని, మధురభక్తి సాహిత్య మును ప్రసాదించినది పోతనయే. ఇది భారతీయ సాహిత్యచరిత్రలో బహుధా ప్రశంసింపదగిన విషయము. ఆంధ్రకవుల యుత్కృష్టతకొక మహోజ్జ్వల మగు నుదాహరణము. దీనినిబట్టి యాయా భాషలలో భాగవతానువాదమునకు పోతన వంటి సమర్థుడగు మహాకవి జన్మింపలేదని చెప్పవలసి యున్నది.

*(పోతన, 1962)*



హరికి నందగోకుల విహారికిఁ జక్రసమీరదైత్యసం
హరికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబినీ మనో
హరికి దుష్టసంపదహారికి ఘోషకుటీపయోఘృతా
హరికి బాలకగ్రహ మహాసుర దుర్వనితా ప్రహారికిన్.

న్యాయికి భూసురేంద్రమృతనందనదాయికి రుక్మిణీమన
స్థాయికి భూతసమ్మదవిధాయికి సాధుజనానురాగ సం
ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండ ని
ర్మాయికి గోపికా నివహ మందిరయాయికి శేషశాయికిన్.

నమఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్యాసియై యొంటిఁబో
వ మహాభీతి "నాహా కుమార !" యనుచున్ వ్యాసుండు సీరంగ వృ
క్షములుందన్మయతం బ్రతిధ్వనులు సక్కంజేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

# పోతన శయ్యాసౌభాగ్యము

—శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి

పోతనభాగవతమున కింతటి ప్రజాదరము అందలి భక్తి ప్రభావమువలననే గాదు, మంద్రగంభీరగమనము గల యాతని శైలివలనను వచ్చినది. అది సహజ ధారా విలసితము. ఓజః ప్రసాద గుణోజ్జ్వలము. బిగువైన యాపదబంధమున సంస్కృతములు, తెలుగులు చెరిసగముగా గ్రుచ్చిన మల్లెలు జాజులై పరిమళించు చుండును. నన్నయ ధారాశుద్ధి, తిక్కన రసస్ఫూర్తితబంధము, ఎఱ్ఱన సూక్తి వైచిత్రి, సోముని సాహితీ విదగ్ధత, శ్రీనాథుని క్రొత్త యెత్తుగడలు- అన్నియు నొక మూసలో గరగినచో పోతనశైలి పాంచభౌతిక శరీరమగును. దానికి పోతన యాత్మవర్చస్సు జీవనాడియై యా ప్రసన్నమూర్తి సత్వగంభీరముగా ప్రబంధము నిండ పదవిన్యాసము చేయుచుండును. దీని కేకాండముగా భాగవత మంతయు నుదాహరణమైనప్పు "ఇది పోతనశైలి" యని యే పద్యము నెత్తి చూపగలము? అందులో కొన్ని సొగసులు మాత్రము తొంగిచూడగలము.

గంగాప్రవాహము వంటి పోతన పద్యధారలో నంత్యానుప్రాసాదులు తీవెపొదవున విచ్చిన తామరపువ్వులై మొగములు విచ్చుకొని మొదట గనపడును. అందలి ఘల్లులారవములు భారతీపద మంజీర శింజితములై భావధ్వనులకు సుతి వేయుచుండును. అది ఈయన శైలి కొక ప్రత్యేకాలంకారము. చూడుడు-

క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్య పాణికిన్.

పద్యమంతయు వాణికి జోహారులు పెట్టుచున్నది. ఈ యనుప్రాసలొకప్పుడు నడుమనే తునిగి 'జలధరదేహా నాజాను చతుర్బాహా సరసీరుహాక్షు విశాలవక్షు' అనియు, 'ఉతిసుతనిరాకరిష్ణున్ శ్రితవద నాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్' అనియు, 'అలి

మఱచె నిజగణాళి మఱచె' అనియు వింతనడకలు నడచును. ప్రాసల కూర్పు నందే పోతన యెన్నో విన్నాణములు చూపును. లభ్యంబైన- అజ్ఞుల్ గొందఱు- శుభ్రశ్యామిని- అక్షీణోగ్ర- ఇవి దుష్కరప్రాసలు. ఆరాటము- పోరాటము, ఉన్నారము- విన్నారము, అదచితివో- కుడిచితివో- ఇవి ద్విప్రాస త్రిప్రాసాదులు.

తడవాడిరి బలకృష్ణులు
తడవాడిరి వారిఁ జూచి రంభాదుల్
తడవాడి రరులు భయమునఁ
దడవాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్.

ఈ ప్రాస యన్నింటికంటె నర్థచమత్కారముతో వాడినది.

మా మా వలువలు ముట్టకు
మామా! కొనిపోకు పోకు; మన్నింపు తగన్;
మా మానమేల కొనియెదు...

లేమా! దనుజుల గెలువఁగ
లేమా; నీవేల కడఁగి లేచితి; విటురా;
లే; మాను; మానవేనిన్
లే; మా విల్లందికొనుము...

ఈ ప్రాసలు అక్షరములను, స్వరములను ఇటునటు ఊపి లాగి ఊది నాట్యము చేయును. ఈ యమకములు, ఛేకములు స్వరలఘువులతో నెట్లు కునిసి నడచు చున్నవో చూడుడు-

"అడిగెదనని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నడుగఁడని నడ యుడుగున్."

"హరిహరి! సిరియురమున గల
హరి హరిహయు కొలఁకు దనుజు నడుగం జనియెన్."

పోతన పద్యము వెత్తికొనుట యందే యొక క్రొత్త కనబడును.

"రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు."

"వనజాక్షి! నే గన్న వైజయంతికనైన
గదిసి వ్రేలుదు గదా కంఠమందు."

ఇత్యాదిగా సీసములు, ఇతఁడే దానవచక్రవర్తి- స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు- తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో- విప్రాయ ప్రకటవ్రతాయ భవతే- ఇత్యాదిగా వృత్తములు గుత్తమైన యెత్తుగడలతో చిత్రించుచుండును. ఒకప్పుడు 'ఘుమఘుమారావ ఘోరజీమూతపటల సంఛన్నాభ్ర భాగ మగుచు' అని సంస్కృతబంధమును, 'గొల్లవారి బ్రదుకు గొఱతనవచ్చునే గొల్లరీతి బాలకుప్పఁ ద్రచ్చి' యని తెలుగుతీయమును జూపించును. ఇంకొకప్పుడు 'అకూపార వేలాతటకుటజకుసుమగుచ్ఛ పిచ్ఛిల స్వచ్ఛమకరంద సుగంధి గంధవహంబులన్ గ్రొంజెమటనీటి పెనువఱదగము లొదళ్ల నిగుర' నని సంస్కృతసమాసముపై తెలుగు నుడికారము మాకందశాఖపై పూవు గుత్తివలె విరియజేయును. 'ఏమి నోముఫలమొ యింతప్రొద్దొక వార్త' 'నెల మసలన్ జీర చిక్కెనెలఁతకు' ఇత్యాది పలుకుబళ్లు, 'ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు' 'చల్లడము క్రింద దూరని మల్లురు' ఇత్యాది జాతీయములు, 'చుంచుదువ్వ' 'చెక్కిలి ముద్దుగొను' 'సిల్లాడు' 'పిఁసుట్టు' ఇత్యాది నుడికారములు జాజితోట పూచినట్లు భాగవతము నిండ పరిమళించును.

శాబ్దికమైన యీ బాహ్యసౌందర్యము కంటె నార్థికమైన భావోపస్కారము భాగవతమున మిన్నగా గోచరించును తన భావమును సాకారముగా చిత్రింప దలచినపుడు పోతన చక్కని కల్పన చేయును. వామనుడు విశ్వరూపుడై పెరుగునపుడు 'రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై' క్రమముగా నొక్కొక్క యవయవమున కొక్కొక్క సొమ్మై కడకు పాదపీఠమైనదట! గోపికలు శ్రీకృష్ణుని పాద ముద్రలబట్టి యాతని జాడ లరయునప్పుడు 'కొమ్మ్రకుఁ బువ్వులఁ గోసినాఁ డిక్కడ' ఒక యెలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ' నని యా యా గుర్తులను బట్టి చేసి ! పరిశీలన మంతయు రెండు సీసపద్యము

లతో వర్ణింపబడినది. ఎంత సమర్థుడైన రహస్యపరిశోధకోద్యోగి కూడ నింత నిపుణముగా పసిపట్టజాలడు.

ఇట్లే గజేంద్ర రక్షణమునకై 'సిరికిన్ జెప్పక' కడకు 'శ్రీకుచోపరిచేలాంచలమైన వీడక' హరి పరువెత్తునపుడు 'తన వెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతము' ఇట్లు వరుసగా వాహనాయుధ పరివారములు బారులు దీరి వచ్చు నప్పటి యా దృశ్యమును, సత్యభామ నరకునితో యుద్ధము చేయు నా ఘట్టమును పోతన అద్భుత భావనాకల్పనలతో కన్నులగట్టినట్లు చిత్రించినాడు. గజేంద్రుని సరోవిహారము, సముద్రమథనము, నృసింహావతారము, బాల్యక్రీడలు, రాసక్రీడలు మున్నగువాని వర్ణనములు అనల్పకవితాశిల్పసందీప్తము లైనవి. ఆయా సన్నివేశములలో పోతన కూర్చు నలంకారములు మిక్కిలి హృద్యములు. 'మెఱగు మొగిలపిఱిఁది మెఱుఁగుఁదీవయుఁ బోలె జలదవర్ణు వెనుకఁ జనియె'-ఇది యుపమ. వామనుడు త్రివిక్రము డైనప్పుడు 'ఒక పాదము క్రిందనున్న భూమి పద్మమున కంటిన పంకమా' యన్నట్లు 'మరియొక పాదము పైనున్న యాకసము తమ్మిపై తుమ్మెదా' యన్నట్లున్నవట! ఇది యుత్ప్రేక్ష. సత్యభామ నరకునితో యుద్ధము చేయునపుడు 'సరోజాక్షుండు మేఘంబుగాఁ దా విద్యుల్లత భంగి'యై ఆ యుద్ధరంగమును ప్రావృట్కాలముగా జేసినదట! ఇది రూపకము. ఇట్లే శ్లేషలు, అర్థాంతరన్యాసములు, స్వభావోక్తులు మున్నగు నలంకారము లన్నియు పోతన కవితాభారతీ దివ్యాభరణములై యొప్పుచున్నవి.

పోతన స్ఫురింపజేయు భావార్థధ్వని విశేషము లిట్లుండును. బలిచక్రవర్తి వామనుని 'వడుగా! ఎవ్వరివాఁడ వెవ్వఁడవు? సంవాసస్థలంబెయ్యది' యని యడుగగా, 'ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు నొకచోటనక యెందు నుండనేర్తు ఒరులుగారు నాకు నొరులకు నేనౌదు, నొంటివాఁడ చుట్ట మొకఁడు లేఁడు; సిరియుఁ దొల్లిగలదు; చెప్పెదనాటెంకి; సుజనులందుఁ దలచు చొచ్చియుండు' అనెనట. ఇచట నితడు విష్ణుడని యెట్లు తోపించుచున్నాడో కనుడు! యశోద బాలకృష్ణుని గట్టివైచుచు 'ఎక్కడ నైనను దిరిగెద, వొక్కయెడన్ గుణము కలిగి యుండవు, నియమం బెక్కడిది నీకు, మఱచినఁ జిక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా!' అని దండించుచున్నది. ఇందులో అర్థాంతరస్ఫురణ లెన్నియున్నవో! 'తోయము లివి యని తొలఁగక చొచ్చెదు, తలఁచెదు గట్టైన

దరలనెత్త'. ఈ సీసము నిండుగ నున్న చిన్నతనపు దుడుకు చేష్టలలో దశావతార స్ఫురణలు మిక్కిలి హృదయంగమములు. ఇవన్నియు నా మహాకవి తీర్చిన కావ్యజీవితములు.

ఇట్లే సందర్భ పాత్రౌచిత్యము, శృంగారాది రసపోషణము, భగవద్భక్తి ప్రభావ వర్ణనము, ధర్మనీతి ప్రబోధము మున్నగు కావ్యగుణములు కావ్య ప్రయోజన పరమార్థములు భాగవతము నిండుగ శారదజ్యోత్స్నవలె వెల్లివిరిసినవి. ఆంధ్రమహాభాగవతము పోతన మహాకవియై మహాభక్తుడై ప్రజాహితమునకై సురభాష నుండి తెలుగునేలకు దించుకొని వచ్చిన పారిజాతము.

*(తెలుగు విజ్ఞాన సర్వస్వము-4, 1961)*

*

శారద నీరదేందు ఘనసారపటీర మరాళ మల్లికా
హారతుషారఫేన రజతాచలకాశ ఫణీశకుంద మం
దారసుధాపయోధిసిత తామర సామరవాహినీ శు
భాకారత నొప్పు నిన్నెపుడు గల్గు భారతీ !

త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ, బ్రాభాత నీ
రజ బంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెదు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్.

ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యక సంఘంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టిహరినేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

# బమ్మెర పోతన్నగారు

— శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

"బమ్మెర పోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్" అని షష్ఠ్యంతభారంభంలో సింగయకవీంద్రుడు మ్రొక్కిన మ్రొక్కుపద్యం చాలా రసవంతమైన ధోరణిలో ఉండటంచేత అందులో నాల్గో చరణాన్నే నేనిక్కడ వుదాహరించి పోతరాజుకు నమస్కరిస్తున్నాను. పోతరాజు గారి జీవితసారాంశా న్నంతటినీ సింగయ యీ పద్యంలో యిమిడ్చి వున్నాడు. అందుచేత తక్కిన భాగాన్ని కూడా ఉదాహరించిన పిమ్మటే కథా భాగంలోకి వస్తాను—

"ఎమ్మెలు సెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ములు గాఁగ వాక్యములు సూకలుసేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్."

ఈ పద్యం వ్రాసిన సింగయ కవీంద్రుడు మన పోతరాజుగారికి కొంచె మించుమించుగా సమకాలీనుడే అయివుంటాడు.

పోతరాజుగారంటే కవులలో అందరికీ అపారమైన గౌరవం. ఆ గౌరవం అంతా యింతా అని చెప్పడానికి అలవికాదు. భాగవతప్రతిపాద్యుడైన శ్రీకృష్ణ భగవానుణ్ణి ప్రేమించే వారికంటే కూడా పోతరాజుగారిని ప్రేమించేవారే లోకంలో విస్తారంగా వుంటారు. ఈయన విషయంలో నిన్న మొన్న కొందరు కొన్ని పత్రికలలో ఏదో వ్రాస్తూ "బాలరసాల సాల" అనే పద్యం పోతరాజుగారిది కానేకాదనీ అది మరొకరిదై వుంటుందనీ వ్రాశారు. మరొకరు ఆ పద్యం పోత రాజుగారిదే అని సిద్ధాంతీకరిస్తూ కూడా అది యీయన రచించిన భోగినీ దండ కానికి సంబంధించినదనీ, యీ సందర్భానికి ఆ పద్యం లోనేవున్న "అప్పుడుపుఁ గూడు" అనే మాట సాధకమౌతుందనీ కొంత వ్రాసివున్నారు. ఆ వ్రాతలు

నాకు బొత్తిగా రుచించలేదు. పద్యం ముమ్మాటికీ పోతరాజుగారిదే అనీ పద్యంలో ఉన్న తాత్పర్యం జనరల్‌గా రాజుల కందరికీ సంబంధించేదే అనీ సహృదయులు విశ్వసిస్తారని నా ఊహ. అందుకు—

''ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములు గొన్ని పుచ్చికొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపోటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్''

అనే భాగవత పీఠికలో ఉన్న పద్యం పూర్తిగా తోడ్పడుతుందని మనవి చేస్తున్నాను. ఈ మధ్య పత్రికలలో వ్రాసిన వ్యతిరేకవాదులు ఈ పద్యం వుందని లేశమున్నూ గుర్తించినట్లే నాకు తోచలేదు. ఆ కాలంలో చాలామంది రాజులు వున్నా, పోతన్నగారి హృదయంలో ఉన్నవారు వేంకటగిరివారే. ఆ సంస్థానం వారికి ''కర్ణాటక దేశాధీశ్వరులు'' అనే బిరుదనామం వున్నట్లు వారి వంశచరిత్ర వల్ల తేలుతుంది. బహుశః గోపీనాథం వేంకటకవి తన రామాయణపీఠికలో ఈ బిరుదాన్ని వాడివున్నాడనీ, దాన్నిబట్టే మేము ఆ సంస్థానానికి వెళ్ళినప్పుడు చెప్పిన పద్యాలలో ''కర్ణాటధారుణీంద్ర! శ్రీరాజగోపాలకృష్ణ యాచభూపబహదర్ మహారాజ!'' అని వాడివుంటామనీ జ్ఞాపకం. ఇక్కడ దీన్నెందుకు వ్రాశానంటే, పోతరాజుగారు ''కాటుక కంటినీరు చనుగట్టు పయింబడ నేల యేడ్చెదో హాటక గర్భురాణి! నిను'' అని సరస్వతిని ఓదార్చే పద్యంలో వాడిన ''అఁకటికోసము తాళలేక కర్ణాటకిరాటకీచకుల కమ్మ నిజమ్ముగ నమ్మ భారతీ!'' అని కర్ణాట రాజులనే అర్థమిచ్చే ''కర్ణాటకిరాటకీచకులు'' అనే పదం ''బాలరసాలసాల'' అనే పద్యం సర్వజ్ఞ సింగభూపాలునికి సంబంధించేదే అని తెల్పుతుందని తెల్పడానికే. పోతరాజుగారికి రాజులను స్తుతించి తద్ద్వారా కుటుంబపోషణ చేసుకోవడంతో బొత్తిగా ఇష్టంలేదన్నది సర్వజనులున్నూ విశ్వసించే అంశం. ఆ యీ సందర్భం వామనచరిత్రలోని—

వ్యాప్తిం జెందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచున్

దృప్తిం జెందని మనుజుండు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే?''

మొదలైన కొన్ని పద్యాలవల్ల స్పష్టంగా గోచరిస్తుంది.

పోతరాజుగారు కవులలో అగ్రస్థానం వహించడమే కాకుండా భక్తులలో కూడా అగ్రస్థానాన్ని వహిస్తారు. అయితే యీ మహాకవిని నన్నయాదులతో పాటు ప్రయోగ విషయంలో కవిలోకం అనాదిగా గౌరవించినట్లు కనపడదంలేదు. ధారాశుద్ధి, సరుష్టత, మాధుర్యము వగైరా గుణాలను బట్టి చూస్తే యీ మహాకవి సర్వదా నన్నయ్యకు మించుతాడు గాని తగ్గడు. ఆయన గురుశుశ్రూషా పూర్వకంగా శాస్త్రాభ్యాసం చేసి ''ఆంధ్రభాషావాగనుశాసన'' బిరుదాన్ని సంపాదించి తన కవిత్వంలో ఆ పాండిత్యానుభవాన్ని యథాయోగ్యంగా ప్రదర్శించాడు. మన పోతన్నగారో? ''సహజ పాండిత్య'' బిరుదాంచితుడు. కేవల వరప్రసాది. అందే యే కొంచెమో కావ్యపరిచయం మాత్రం సంస్కృతాంధ్రాలలో గురుముఖతః బాల్యంలో కలిగించుకోకుండా యింతటివాడు కాజాలాడు గాని వ్యాకరణాది శాస్త్రాలు బట్టీ పెట్టి వల్లించి తద్వారా పాండిత్యం సంపాదించినవాడు మాత్రం కాడేమో!

''స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర వితానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్ ''

ఇలాటి సంస్కృతధారతో ఎన్నో పద్యాలు భాగవతంలో ఉంటాయి కదా! ఇందుకు సామగ్రి యీయనకి ఎక్కడ నుండి వచ్చిందని సందేహం కలగడంలో ఆశ్చర్యం లేదు. దానికి హేతువు సంస్కృత భాగవతాన్ని అసకృదావృత్తిగా యీయన అదేపనిగా చదివి వుంటాడన్నదే. సర్వసాధారణంగా అందరికీ తెలిసే సమాధానం యింకోటి. ''ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః'' అనేదే. పూర్వజన్మ సంస్కారమంటూ ఒప్పుకపోతిమా యెన్ని సంస్కృత భాగవత రామాయణాలు, యెన్ని భారతాలు యెన్నిమాట్లు కంఠోపాఠంగా వల్లించినా ఆ మాదిరి ధార పట్టుపడదు. ఈ మాటకు అనుభవజ్ఞులైన ఆస్తికులందరూ ఒప్పుకుంటారు.

నాస్తికుల విషయంలో మనం గాదు గదా బ్రహ్మ కూడా సమాధానపరచలేడు— "బ్రహ్మాపి నరం న రంజయతి." చదివితేనేమి? దానంతట అదే పస్తేనే యేమి? పోతన్న సంస్కృతధారలో తిక్కన్న, యెఱ్ఱన్నగార్లకు మించుతాడు. నన్నయ్యతో సరిగా తులతూగుతాడు. నన్నయ్యకు అప్రయత్నంగా వచ్చిపడే శబ్దాలంకారం యితనికి అంతగా పడదని నేననుకుంటాను. ఈయన పట్టే అంత్యానియమం కొంచెం ప్రయత్నించి పట్టేదే అని చెప్పక తప్పదు.

> "గొడుగో? జన్నిదమో? కమండలువొ? నాకున్ ముంజియో? దండమో?
> వడుగే నెక్కడ? భూములెక్కడ? కరుల్ వామాక్షు లశ్వమ్ము లె
> క్కడ? నిత్యోచిత కర్మమెక్కడ? మదాకాంక్షా మితంబైన మూ
> డడుగుల్ మేరయె త్రోయ కిచ్చుటది బ్రహ్మాండమ్ము నాపాలికిన్."

ఈ మాదిరిగా విడివిడి పదాలలో యతిప్రాసలకు - ఒగి, వెస, తగ, యుఱ, ఓలి మొదలైన పదాల సహాయాన్ని అపేక్షించకుండా రచన సాగించవలసివస్తే యే భారతకవులున్నూ పోతన్నగారికి "దాసోఽహం" అనవలసి వస్తుందేమో! అని నేననుకుంటాను. అన్నిటికీ ముఖ్యం రసం కదా! ఆ రసం యితడు పద్యం యెత్తుకొనేటప్పటికల్లా వచ్చి, పువ్వులకు పరిమళం అలుముకున్నట్టుగా అలుముకుంటుంది. తెలుగుభాష పుట్టిన తరువాత యింత రసబంధురంగా కవిత్వం చెప్పే వ్యక్తులు చాలా మృగ్యంగానే పుట్టివుంటారనీ, అందులో ఇతడు "కనిష్ఠకాధిష్ఠితు" డనీ పలువురు విశ్వసిస్తారు. కవిత్వమా? నిర్దుష్టమాయె, రసమా? కుత్తుకబంటాయె, యిట్టి కవిత్వాన్ని యేదేనా ప్రయోగ విషయంలో లక్ష్యంగా చూపిస్తే అదేం కర్మమో? "ఓహో? భాగోతమా?" అంటూ యీసడించడం అలవాటైపోయింది.

మన పోతరాజుగారి స్థితి కూడా అలాగే వచ్చింది. పోనీ, యితర కవిత్వాలు కూడా భాగవతంలో చేరివుండడంచేత యీ కళంకం వచ్చిందనుకుందామా? ఆ కవిత్వ భాగాలేవో యేర్పాటుగానే వున్నాయి. ఆ భాగాలలోనుంచి యేదేనా ప్రయోగం చూపితే పోనీ అలా యీసడించినా కొంత సహించవచ్చు. భాగవత ప్రయోగ మనేటప్పటికల్లా యిక చెప్పేదేమిటి? "సహేంద్ర తక్షకాయ స్వాహా". అయ్యో! అయ్యో! ఇది యెంత అన్యాయం! అన్యాయమనాలో? దీన్ని మూర్ఖతనాలో? ఇంక యేమనాలో? నాకు లేశమూ బోధపడడమే లేదు.

"లోకము మూయను మూకుడున్నదే ?" పాపం! అక్కడికీ కూచిమంచి తిమ్మ కవి సార్వభౌముడు సాహసించి తన యావచ్ఛక్తినీ ధారపోసి "లక్షణం బెందుఁ దప్పునా ? దక్షహరణ!" అని వాళ్ల వాళ్ల అపోహలను తొలగించడానికి కొంత యత్నించి "సర్వలక్షణ సారసంగ్రహ" మనే తన లక్షణగ్రంథంలో భాగవతా న్నుంచి లక్ష్యా లెత్తిచూపి భారతాది మహాకవులతోపాటు గౌరవించాడు. అయితే మాత్రం సామాన్య కవిలోకానికి విశ్వాసం కలిగిందా ? ఎలా కలుగుతుంది ? "గతానుగతికో లోకో న లోకః పారమార్థికః."

అశ్వినీదేవతలు వైద్యులు గనక వీరికి యజ్ఞంలో హవిర్భాగం పుచ్చుకొనే అధికారం లేదని యెప్పుడో ఒక తీర్మానం దేవలోకంవారు ప్యాసు చేశారు. ఆ తీర్మానాన్ని చ్యవనమహాముని కాబోలును - తన శాయశక్తులా పాటుబడి రద్దు పరిచి తన మామగారి యజ్ఞంలో హవిర్భాగం దొరికేటట్టు చేశాడు. ఆ చ్యవన స్థానాన్ని తిమ్మకవి గారైతే ఆక్రమించి చాలా ప్రయత్నించారు గాని యీ పని జరిగి సుమారు నూరు సంవత్సరాల కంటే కొంత యెక్కువ కాలమే అయినా యిప్పటి కింకా లక్ష్య విషయంలో పోతరాజు గారంటే కవిలోకానికి ప్రామాణ్య బుద్ధి కలిగినట్టే లేదు. బాగా ఆలోచిస్తే యీ మహాపాతకానికల్లా ముఖ్యకారకుడు కాకునూరి కవి. "సహజ పాండిత్యుని సంస్మరించి" అంటూ భారతాది మహాకవు లతో పాటు గౌరవించి కూడా భాగవతాన్నుంచి యే విషయానికీ ఒక్క లక్ష్యం కూడా చూపించక పోవడం చేత లోకానికి మరింత అలుసైపోయింది. అప్పకవి సామాన్యమైన శతకాలనుంచీ, చాటు ధారల నుంచీ, ఒకటేమిటి ? నానా చెత్తనీ అంగీకరించి, భారతకవులనూ తదితరులనూ కూడా అతిక్రమిస్తే అతిక్రమిస్తా దేమో అమాంతంగా అని, చెప్పుకోదగ్గ పోతన్నగారి భాగవతాన్నుంచి అఖరికి వర్గయతి కనేనా ఒక లక్ష్యం చూపించక పోవడమనేది మహాపరాధంగా తిమ్మకవి గారికి తోచింది. ఆయన కొక్కరికే కాదు, పరిశీలన గల ప్రతి కవికీ యీ సంశయం కలుగుతుంది.

పోతరాజు గారేమి, ఆ కాలపు మహాకవులు యితరులేమి శ్రవణ సుఖం యెరిగి కవిత్వం చెప్పడం చేతనే వారి కవిత్వాలు ఆకాశం మీద నక్షత్రాలలాగా శాశ్వతంగా వెలుగుతున్నాయి. "లోకుల రసనల, యాకులుగా నుండునట్టి యవివో కవితల్." లోకాన్ని అనుసరించడం యేలాటిదో చూపుతాను-

"వీ రెవ్వరు ? శ్రీకృష్ణులు
గారా ! యెన్నడును వెన్నగానరఁట కదా !
చోరత్వం బించుకయును
నేరరఁట ! ధరిత్రి నిట్టి నియతులు కలరే ?"

ఈ పద్యం రచించిన పోతరాజు గారికి ఉన్న లోకజ్ఞత్వం యెట్టిదో శుష్క-తార్కికవాదులకు బోధించదు.

"కల్హారైః పరికల్ప్య తేవ లలితా మాలా కవే ర్భావతీ
శుష్కాణాం పరిపీడనం నసహతే శాస్త్రేషు ఖిన్నాత్మనామ్."

"బహువచనం యెందుకు? కృష్ణుడు ఒక్కడే కదా? అదిన్నీ కాక గౌరవార్థకమంటే? కొడుకును తల్లి గౌరవించడం యెందుకు?" అంటూ తమలో తామే తుమ్మి "దీర్ఘాయుష్య" మనుకొనే మాదిరిని పూర్వోత్తర పక్షాలు చేసుకొనేవారికి లోకంలోనే పుట్టి లోకంలోనే సంచరిస్తున్నప్పటికీ లోకజ్ఞత్వం కలుగనేలేదనుకోక తప్పదు. లోకజ్ఞత్వం అంత తేలికగా అలవడేదే అయితే నన్నయగారు "లోకజ్ఞ" అంటూ ప్రత్యేకించి ఒక విశేషణాన్ని తనకు వేసుకొని వుండరు. ఒక మహాకవి "అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ" అని బ్రహ్మను ప్రార్థించాడు. రసజ్ఞత్వం యెంత వుండాలో అంతావున్న పోతరాజుగారి కవిత్వాన్ని విమర్శించవలసివస్తే అస్మదాదుల లోకజ్ఞత్వం చాలదు. అయినా యిహ పర సాధకం గదా అని ప్రాయోపవేశావస్థలో దీనికి పూనుకున్న నన్ను రసజ్ఞలోకం క్షమించాలి. పై పద్యానికి మార్గదర్శకుడు నన్నయ్యభట్టే. "వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె" అనే పద్యాన్ని యెరగని వారుండరు. ఆయన యెత్తిన దొక రసంలో; పోతన్నగా రెత్తినది మరొక రసంలో. ఇంతే భేదం. ఇప్పటికి యీ మాదిరి పద్యాలు నాకు గనపడ్డవి యీ రెండు మాత్రమే. "తత్తథాస్తామ్."

పోతన్నగారిని అప్పకవి ఉదాహరించక పోవడానికి ఆయన కవిత్వంలో ఇతడు కనిపెట్టిన దోషాలేమిటో కొంత పరిశీలించి చూద్దాం. అందులో ఒకటి అఖండయతి అనుకుందామా? దీన్ని భారత కవిత్వం అంగీకరించినట్లు "చెప్ప వయ్య పుణ్యసతీ ప్రభావంబు నాకు" లోనైన ప్రయోగాలవల్ల స్పష్టపడుతుంది. కాని ఆ ప్రయోగాలన్నీ యిటీవల యే చరణానికి ఆ చరణమే వుండేటట్లు

ముద్రించిన చిన్నసైజు పుస్తకాలలో అన్యథా దిద్దివేశారు. నేను చూచిన ప్రయోగం యిప్పటి ప్రతులలో "చెప్పవలయుఁ బుణ్యసతీ ప్రభావంబు" అని వుంటుంది. మాదిరికి ఒకటి చూపాను. వెనకటి పుస్తకాలకీ యిప్పటి పుస్తకాలకీ చాలా స్థలాలు మారిపోయినాయి. సంస్కృతంలో వుండే భావాన్ని అనుసరించి తిక్కన్నగారు "నమ్మమి మృత్యువు" అనే పద్యంలో "నమ్మినమ్మక" అని ప్రయోగిస్తే దాన్ని కూడా తోచినట్లు దిద్ది మూలాభిప్రాయాన్ని అన్యథాకరించ టానికి సైతం సంస్కర్తలు సంశయింపారు కారు. భారతాన్ననుసరించి నాచన సోముడు లోనైనవారు తాదృశప్రయోగాలు తమ తమ గ్రంథాలలో చేసుకొని వున్నారు. వారి గతి అధోగతి కావలసివచ్చింది. ఆ యీ సందర్భం సుమారు ముప్పైయేళ్లనాడు "దిద్దకుఁడయ్య భారతము" అనే పద్యం ద్వారా యేదో వ్యాసంలో నేను మొరపెట్టుకొన్నట్లే జ్ఞాపకం.

పోతన్నగారి కంటె గర్భదరిద్రుడు (లోకదృష్ట్యానే సుమండీ! ఆయన దృష్ట్యా అయితే ఆయన మహాభాగ్యవంతుడే). మరొకడు లేడు గదా! అట్టి గర్భ దరిద్రుని కవిత్వంలో యెక్కడ యెత్తుకున్నా రసం (బంగారం అని కూడా అను కోండి) కుప్పతెప్పలుగా దొరుకుతుందే! నీళ్ళలో గేదెను పెట్టి బేరాలెందుకు? ఏదో ఉదాహరించి మాట్లాడుదాం-

"చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు."

బంగారం వంటి యీ పద్యంలో కూడా వికట విమర్శకులకు శంకలు ఉండకపోవు సుమండీ. హరికీర్తి నుడివేటప్పుడు నోరు నొచ్చే యెడల వాడు భక్తుడేలా అవుతాడంటూ శంకిస్తే శంకించవచ్చును. కాని ఆ పదం అక్కడ ఉంటేనే అందం. ఆ అందం మహానుభావుడు పోతన్నగారికే తెలుసును. (నహ్యేష్మాదృశ శుష్క హృదయానాం). దానికింతే సమాధానం. ఏదో నోటికి వచ్చిందని ఎదుట వున్నవాడు పెళ్లికొడుకు అన్నట్టుదాహరించాను గాని యీ పద్యం ఆయన కవిత్వంలో పేరు ప్రఖ్యాతి గాంచిందనే తాత్పర్యంతో ఉదాహ రించిందనుకోవద్దు. "ఎక్కడఁ జూచినం గళల యిక్కలు" అంటూ శృంగార

రస సందర్భంలో ధూర్జటి కవి కాబోలును ఒక పద్యం వ్రాసి ఉన్నాడు. అదే విధంగా మన పోతరాజుగారి కవిత్వం ప్రతి పద్య రసాస్పదం. అందుచేత వెదకి ఉదాహరింప నక్కరలేదు. అయినప్పటికి ప్రతి కవిత్వంలోనూ "తత్రాపిచ చతుర్థోఽంక స్తత్ర శ్లోక చతుష్టయా"లు ఉంటూనే ఉంటాయి. కనుక వామన చరిత్రలో ఉన్న-

"కారే రాజులు? రాజ్యముల్ కలుగవే? గర్వోన్నతిన్ బొందరే?
వారేరీ? సిరి మూటఁ గట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబి ప్రముఖులున్ ప్రేమన్ యశఃకాములై
యీరే కోర్కెలు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!"

(ఇంకా యెన్నో పద్యాలున్నాయి. వ్యంగ్య మర్యాదచేత ఆ కవి జీవిత రహస్యాలు కూడా తెలిపే వున్నాయి. విస్తర భీతిచే ఉదాహరించలేదు. చూచుకోండి భాగవతంలో.)

పోతరాజుగారి అంత్య నియమం మరికొందరు అనుసరించి కృతార్థులు కాగలిగినా ఆయన రచనకన్న చాలా వ్యర్థపదాలతో నిండి ఉండవలసి వస్తుందనీ, ఆయన దానిలో కూడా వ్యర్థపదాలు పడవలసి పడినప్పటికీ అంతగా ఆ రచన నీరస మనిపించుకోదనేది వక్తవ్యాంశం. ఒక పద్యం ఉదాహరిస్తాను-

"కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపిత భూమి చక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్, బహువిధ బ్రహ్మాండ భాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ, బాలితాఖిల సుధాంధశ్చక్రమున్, జక్రమున్."

ఈ పద్యం యెంతో సంస్కృత పదజాలంతో నిండివున్నా రఘువంశం కూడా చదువుకోని కేవలం తెలుగువాడికి కూడా సులువుగా తాత్పర్యాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా తెలుసుకోదగ్గది యీ పద్యంలో శ్రీ విష్ణుమూర్తి వారు మొసలిని చంపే నిమిత్తం చక్రాన్ని ప్రయోగించారన్నదే కదా! "చక్రః కీదృశః" అంటూ ఉత్థితాకాంక్షావశంచేత గాని ఉత్థాపితా కాంక్షావశం చేత గాని బయలుదేరే శంకలకు సమాధానం రాకపోతే చెడేదేమిటి? ఈ అంత్య నియమాలు ఉన్న పద్యాలలో యెక్కడైనా పోతరాజుగారు దొరుకుతారేమో అని నేను అనేక విధాల నాకున్న అనుభవంతో పరిశీలించాను. కాని యేదోవిధంగా సమర్థించే ప్రయోగమే కాని మరొకటి ఆయన చేయనేలేదు. ఆయనది సహజ పాండిత్యమే అగునా? లేక గురుశుశ్రూషా పూర్వకమైన పాండిత్యమే అయివుండునా?

అనిపిస్తుంది నాకు. అది పూర్వజన్మ వాసన అనుకోవలసిందే కాని యావద్విషయమున్నూ గురు ముఖతః అభ్యసించవలసివస్తే యెంతకాలమైనా చాలతుందా?

ఊరికినే అన్నారా "కోవేత్తి కవితాతత్త్వమ్" అని అభియుక్తులు! ఏదో వ్రాసుకుపోతున్నానే గాని యీ మహానుభావుని ధారను గూర్చి చర్చించినట్టే లేదు. భారత భాగవత రామాయణాలంటూ లోకంలో అందరూ వాడుతుంటారు. శాస్త్రప్రకారం భారతానికి పూర్వనిపాత వస్తే రానివ్వండిగాని ఆ చిక్కు లేకపోతే భాగవత శబ్దానికే పూర్వనిపాత వస్తుందంటాను నేను. గజేంద్ర మోక్షమో, భీష్మస్తవమో, గోపికా గీతలో - యేవో నిత్యమూ తెల్లవారగట్ల పారాయణ చేయని ఆంధ్రులు లేనేలేరని (అక్షరాస్యులలో) నా చిన్ననాడెరుగుదును. క్రమంగా క్రమంగా భక్తి నానాటికీ తగ్గి కృశిస్తూ ఉన్న యీ రోజులలో కూడా యీ పారాయణ పూర్తిగా తగ్గలేదు. ఈ భాగవతానికి తప్ప యీ మహాభాగ్యం మరి యింక యే మహాకవి కవిత్వానికీ లేదు. భక్తి అని వచ్చేటప్పటికి పోతన్నగారికి నడిచినట్లుగా యే కవికిన్నీ కవిత్వం నడవదు. నడవనే నడవదు. దానికి పోతన్నకు పోతన్నే సాటి. "రామరావణయోర్యుద్ధం రామరావణ యోరివ" అనన్వయాలంకారః. శైలికంటూ యీయన కవిత్వం ఉదాహరించవలసి వస్తే యావత్తు భాగవతమున్నూ ఉదాహరించవలసి వస్తుందేమో!

పోతరాజుగారి వంటి కవులు లోగడ బయలుదేరలేదు. నేడు లేరు. ముందేమో చెప్పలేము. ఆయన పద్యాలెన్నో లోకోక్తుల కింద వాడుకుంటారు - 1. ఊరకరారు మహాత్ములు 2. నాటి కొక్కదైవము లేదే 3. చాలు పదివేలు వచ్చె. లోకంలో ఉన్నవే పోతరాజుగారు స్వీకరించారేమో! కానివ్వండి. దీనికి కూడా వివాదమెందుకు? నాకు అలా తోచలేదు. "భాగవతము తెలిసి పలుకంగ శక్యమే శూలికైనఁ దమ్మిచూలికైన?"

"పట్టి నేర్చికొనెనా? పుట్టక నేర్చెనో?
చిట్టి బుద్ధులిట్టి పొట్టివడుగు
పొట్టనున్న వెల్లి బూమెలు నని నవ్వి
యెలమి ధరణి దాన మిచ్చెనపుడు"

అన్న పద్యార్థానికి మొదటి ఉదాహరణం పోతన గారనీ, రెండవ ఉదాహరణం వామనమూర్తి అని నిర్వచిస్తే కాదనేవా రెక్కడైనా ఉంటారా? ఈ పద్యంలో అంతర్లీనమైన పోతనగారి కవితా ప్రాప్తిరీతి ఉందని నా ఆశయం.

(కథలు-గాథలు, తృతీయభాగము)

# పోతనామాత్యుని కవితాశిల్పం

డాక్టర్ దాశరథి

'భక్త్యా భాగవతం జ్ఞేయం
న వ్యుత్పత్త్యా న టీకయా'.

భాగవతాన్ని అర్థం చేసుకోవాలంటే భక్తి కావాలి. పాండిత్యము, టీకా తాత్పర్యములు భాగవతాత్మను అర్థం చేసుకోడానికి చాలవు. అటువంటి మహా భాగవత పురాణాన్ని తెలుగుచేసి ఆబాలగోపాలాన్ని, పండిత పామరులను అల రించిన పోతన కవితాశిల్పం అనల్పమైనది.

శిలలను చెక్కి రూపకల్పన చేయువాడు శిల్పి. కాని శబ్దములతో సజీవ రూపములను కన్నులముందు నిలుపువాడు కవితాశిల్పి. పోతన్న అట్టివాడు.

'విద్యావతాం భాగవతే పరీక్షా
విపత్తికాలే గృహిణీ పరీక్షా
రణాంగణే శస్త్రభృతాం పరీక్షా
ధనంజయే హాటక సంపరీక్షా.'

విద్వాంసులకు భాగవతం పరీక్ష; కష్టకాలంలో స్త్రీలకు పరీక్ష; యుద్ధ రంగంలో వీరునికి పరీక్ష; అగ్నిలో బంగారానికి పరీక్ష అన్నారు పెద్దలు. అటు వంటి భాగవతాన్ని పోతన్న గారు తెలుగు చేయడం తెలుగువారి అదృష్టం.

పోతన్నగారి కవితాశిల్పం భాగవతంలో పరాకాష్ఠ పొందినా ఆయన ప్రత్యేకత భోగినీ దండకంలోనూ కనిపిస్తుంది. భాగవత రచనకు బీజప్రాయ మైన ఆ దండకంలోని కొన్ని పంక్తులు మీకు జ్ఞాపకం చేస్తాను. పోతన్న గారి కవితాశిల్పం ఎట్లా మొగ్గ తొడిగిందీ వాచవిగా ఈ దండకంలో మనకు గోచ రిస్తుంది- "నీ పటుత్వంబు వాచాటుత్వంబు బాలేందుశోభాలికా! బాలికా! బాలిక ల్సేయు యత్నంబులే నీ ప్రయత్నంబు? లంభోజనాళాంతరాళ స్ఫురత్తంతు

యోగంబులన్ జిక్కునే గంధనాగంబు? కంపించునే మక్షికాపక్షవిక్షేపవాతాహతిం గాంచ నాగంబు?" ఇది సంస్కృత రీతి. ఇక తెలుగు తీరు- "ఈ రీతి నేనాతిచే వింజీ వేమంట నీ వంటి దీ వెంటలం దంటయై గెంటి పోజూచునే తమ్మికంటీ! నిమ్మంగంటి నీ వెంట కాహా! కనుంగొంటి నీ గొంతు చైదంబు దైవంబు క్రీగంటి కేవెంత కంద్రైతినో జంట నింటింటికిన్ వెంట వెంటంబడన్."

పోతన్న గారి కవితలో స్పష్టంగా గోచరించే కొన్ని లక్షణాలను ఈ విధంగా విభజించవచ్చు - 1. అనుప్రాస నియమము, 2. ధారాశుద్ధి, 3 చిత్రణ. 4. రసావేశము, వీనిలో మొదటి రెండు బాహ్య రూపమునకు సంబంధించినవి. తరువాతవి రెండు కవితాత్మకు సంబంధించినవి.

**అనుప్రాస నియమము :**

భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్త భీషణములు హృ
త్తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోపచిత భాషణముల్.

సంస్కృతంలో అనుష్టుప్ ఛందంలో వ్రాసి మెప్పించటం ఎంత కష్టమో తెలుగులో కందపద్య రచన అంత కష్టం. కందాన్ని అందంగా తీర్చిన కొద్ది మంది మహాకవులలో పోతన ఒకడు. చూడండి-

కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందు రన్ని దిశలను
కలడు కలం డనెడివాడు కలడో లేడో !

విరుపులతో మెరుపులు సంతరించి కందంలో అందం చిందించే మరొక పద్యం - కృష్ణుడు సత్యభామతో అంటున్నాడు-

లేమా ! దనుజుల గెలువగ
లేమా ! నీ వేల గడగి లేచితి విటురా

లే ! మాను మానవేనిన్
లే ! మా విల్లందుకొనుము లీలం గేలన్.

యుద్ధ సన్నివేశంలోని పద్యమే అయినా ఇందులో రోష భీషణతలు లేవు. కారణం కృష్ణుడు సత్యభామతో చేసిన సరస సల్లాపమే. ఇందులో కృష్ణుని మాటలే ఉన్నాయి గాని సత్యభామ సమాధానం లేదు. అయినా సత్యభామ హావ భావవిలాసాలు ఇందులో ధ్వనింపబడ్డాయి. పై పంక్తుల్లోని ''లే'' అనే అక్షరం లేతదనాన్ని, ''మా'' అనే అక్షరం మాధుర్యాన్ని ప్రసరిస్తున్నాయి.

వృత్త్యాంలో అనుప్రాసను సహర్థంగా ప్రయోగించిన సందర్భాలు భాగవ తంలో కోకొల్లలు. రుక్మిణీ కల్యాణ ఘట్టంలో కృష్ణుడు పాంచజన్యాన్ని పూరిం చిన తీరును శార్దూలవిక్రీడితంలో పోతన్న అనన్య సామాన్యంగా చెప్పినారు.

పూరించెన్ హరి పాంచజన్యము కృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీ కృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదార సిత ప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

శంఖానికి పూరించబడటం సార్థకత. కనుక 'పూరించెన్' అనే క్రియా పదంతో పద్యాన్ని ప్రారంభించి ''భుంభుం'' అనే శంఖనాదాన్ని ప్రతిబింబించే భకారయుక్త శబ్ద పంచకాన్ని (పాంచజన్యం కనుక) ప్రయోగించి వృత్త్యాన్ని వీరరస తరంగితం చేశారు. పాంచజన్య శంఖ ధ్వన్యనుకరణాన్ని సౌజన్య చైతన్య దైన్య సైన్య శబ్దాల ద్వారా సాధించారు.

మరిమరి చదవాలనిపించే రీతిలో ద్వి త్రి చతుష్ప్రాసంతో వ్రాయటం పోతన్నగారికి వెన్నతో పెట్టిన విద్య.

శర్మద, యమదండక్షత
వర్మద. నతి కరనముక్తి వనితాచేతో
మర్మద, నంబునివారిత
దుర్మద, నర్మద తరించె త్రోవన్ వటుడున్.

శ్రీపంబులు, ఖండిత సం
తాపంబులు, కల్మషాంధతమస మహోద్య
ద్దీపంబులు, పాషండ దు
రాపంబులు, విష్ణువందనాలాపంబుల్.

పావనములు, దురితలతా
లావనములు, దివ్యమంగళ ప్రాభవ సం
జీవనములు, లక్ష్మి సం
భావనములు, వాసుదేవ పద సేవనముల్.

ఇట్టి పద్యాలెన్నో ఉదాహరింప వచ్చును.

ధారాశుద్ధి :

లోకంలో పోతనగారి పద్యాలు పండిత పామర జనుల రసనాగ్రాలపైన నివాస మేర్పరచుకొనటమే కాక కంఠస్థమై పోవటానికి గంగా ప్రవాహ సదృశమైన ధారాశుద్ధి కారణం. ఇది రెండు రకాలు - 1. ముత్యాల మూటలవంటి మాటలతో మనస్సుకు హత్తుకునేటట్లు రచించటం, 2. సమాసబంధురంగా పద్యాన్ని చకచకా పరుగెత్తించటం. మొదటి పద్ధతికి ఉదాహరణ-

ఓయమ్మ! నీ కుమారుడు
మా యిండ్లను పాలు పెరుగు మననీడమ్మా!
పోయెద మెక్కడి కైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ!

రెండవ పద్ధతికి తార్కాణము-

త్రిజగన్మోహననీలకాంతితను వుద్దీపింప ప్రాభాత నీ
రజ బంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రాజ సంయుక్తముఖారవింద మతిసేవ్యంబై ప్రకాశింప మా
విజయుం జేరెడు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్.

చిత్రణ :

కోపంతో తన పైకి లంఘించే శ్రీకృష్ణ పరమాత్మను భీష్ముడు చూచినాడు. భీష్ముడు చూచింది పోతన్న చూచి మనకు చూపించాడు. తాను చూడటానికి శక్తి కావాలి. ఇతరులకు ఆ దివ్యమంగళ విగ్రహాన్ని బొమ్మ కట్టి చూపటానికి మహాశక్తి కావాలి. ఆ రూపచిత్రణశక్తి పోతనలో తరచు ద్యోతకమవుతూ ఉంటుంది.

కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ
ఉరికిన నోర్వక ఉదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి గదల
చక్రంబు చేపట్టి చనుదెంచు రయమున
పైనున్న పచ్చని పటము జాఱ
''నమ్మితి నా లావు నగుబాటు సేయక
మన్నింపు'' మని క్రీడి మరల దిగువ

కరికి లంఘించు సింహంబు కరణి మెరసి
''నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు,
విడువు మర్జున!'' యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

ఈ సీసపద్యాన్ని భీష్ముని నోట పలికించారు పోతన్నగారు. ఇందులో కృష్ణుడు కోపంతో విజృంభించటం అద్భుతంగా బొమ్మ కట్టించారు పోతన్నగారు. ''నన్ను నగుబాటు చేయకు మన్నించు'' అంటున్న అర్జునుడి దీనవదనం ఉంది. ''నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు విడువు మర్జున!'' అని విడిపించుకొని బయట పడుతున్న కృష్ణుని విచిత్రరూపం ఎట్లాగూ ఉంది. భీష్ముని బాణాల వర్షంలో నుంచి తెరలి వస్తున్నాడు కృష్ణుడు. బాణవృష్టి కురిపిస్తూనే ఉన్నాడు భీష్ముడు. ఆ బాణవృష్టిలో నుంచి తెరలివచ్చే దేవుడే తనకు దిక్కు అంటున్నాడు. చిత్రకారుడు గీచే బొమ్మలో సంపూర్ణ రూపంలో కృష్ణుడు, వారిస్తున్న అర్జునుడి అర్ధరూపం, దూరాన భీష్ముడి చిన్న రూపం కన్పిస్తుంటాయి.

ఇటువంటి రూపచిత్రణ మరొకటి నరకాసురుని పైకి దూకుతున్న సత్యభామ—

వేణిం జొల్లెము పెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వఁగా
పాణిం బయ్యెద జక్కఁగా దురిమి శుంభద్వీర సంరంభయై
మేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్.

నడుం బిగించి పోరాటానికి నిలబడే నవయువతి సాక్షాత్కరిస్తుంది ఈ పద్యంలో.

అట్లాగే గజేంద్రుని రక్షించటానికి వెళుతున్న శ్రీ మహావిష్ణువు. చలనం లేని బొమ్మలు కాక కార్యమగ్నమైన చిత్రాలను శబ్దాల ద్వారా చూపటం పోతన్న గారికి బాగా వచ్చును.

సిరికిం జెప్పఁడు; శంఖచక్రయుగముం జేదోయి సంధింప; డే
పరివారంబునుఁ జీర; డభ్రగపతిన్ బన్నింప; డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తడు; వివాదప్రోద్ధత శ్రీ కుచో
పరిచేలాంచలమైన వీడఁడు; గజప్రాణావనోత్సాహియై.

ఆ తొందర, ఆ పరుగు గజేంద్రుని ప్రాణాలను కాపాడటానికి. ఇటువంటి రూపచిత్రాలు భాగవతంలో చాలా చోట్ల కనిపిస్తాయి.

ఒక భావ చిత్రణ. ప్రహ్లాదుని సత్ప్రవర్తనను చిత్రించే సీస పద్యం చూడండి.

తనయందు నఖిలభూతములందు నొక భంగి
సమహితత్వంబున జరుగువాడు
పెద్దల బొడగన్న భృత్యుని కైవడి
చేరి నమస్కృతుల్ సేయువాడు

కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన చేసి మరలువాడు
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను
దీనుల గావ జింతించువాడు
సములయెడ సోదరస్థితి జరుపువాడు
దైవతములంచు గురువుల దలచువాడు
లీలలందును బొంకులు లేనివాడు
లలితమర్యాదుడైన ప్రహ్లాదు డధిప!

ప్రహ్లాదుని పేరుతో భారతీయ యువకుడు ఉండవలసిన తీరును పోతన గారు చెప్పారు. సమహితత్వము, సోదరస్థితి, లలిత మర్యాద-ఈ సద్గుణాలు ప్రతి భారతీయునిలో ఉండి అతడు ప్రహ్లాదునివలె భాసించాలని పోతన్నగారి కోరిక. నృసింహస్వామి హిరణ్యకశిపుని వధించిన తరువాత బాలప్రహ్లాదుడు పెరిగి పెద్దవాడై వివాహితుడై రాజ్యపాలన చేసి తనలో పోతన్నగారు చూచిన వన్నీ ఆచరించి చూపించాడు. భవిష్యద్దృష్టి గల పోతన మహాకవి గదా!

ప్రహ్లాదుడు తోటివారికి తన భావాలను నూరిపోసే పద్ధతి ఈనాడు ఒకానొక రాజకీయ సిద్ధాంతాన్ని సాటి విద్యార్థులకు ప్రబోధించే విద్యార్థి నాయకుడి ధోరణికి దగ్గరగా ఉంటుంది. "బాలకులార! రండు! మన ప్రాయము బాలురు కొందరుర్విలో గూలుట కంటిరే" అని మృత్యువును చూపి తన సిద్ధాంతాన్ని ఒప్పిస్తున్నాడు ప్రహ్లాదుడు. "గురువు క్రూరు దనర్థచయంబు నందు దుశ్శీలత నర్థకల్పనము జేసెడి; గ్రాహ్యము గాదు శాస్త్రమున్; మేలెరిగించెదన్ వినిన మీకు నిరంతర భద్రమయ్యెడిన్." రాజు ఇష్టం ప్రకారం చదువు చెబుతున్నాడు గురువు. అతని చెప్పే ప్రకారం శాస్త్రం గ్రాహ్యం కాదు. మేలు నేను ఎరిగిస్తాను-అన్నాడు ప్రహ్లాదుడు.

మా చిన్నతనంలో స్కూళ్లలో మహాఘనత వహించిన నిజాం ప్రభువును స్తుతిస్తూ ప్రార్థనలు చేయవలసి వచ్చేది, రోజూ బడి మొదలయ్యే సమయంలో. మేము అది పాడని 'వందే మాతరం' పాడే వాళ్లం. అట్లా చేసిన విద్యార్థులను చింత బరికెలతో కొట్టి బడిలోనుంచి గెంటించే వారు. అట్లాగే ప్రహ్లాదుని కాలం

లోనూ హిరణ్యకశిపుని గుణగణ వర్ణనం, సార్వభౌమత్వం, జగన్నాథత్వం ప్రార్థనలలో ఉండేవి కావులు. హిరణ్యకశిపు డంటాడు- "జగన్నాథుండ! నా కంటె నీ భూతశ్రేణికి రాజు లేడొకడు." తననే జగన్నాథుడుగా భావించాడు అహంకారి అయిన హిరణ్యకశిపుడు.

దీన శుభము లేదు; దివ్య కీర్తియు లేదు
జగతి పుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరలనేల మనకు? పుట్టని చావని
త్రోవ వెదకి కొనుట దొడ్డబుద్ధి.

అంటూ తన సహాధ్యాయులైన బాలురకు అర్థమయ్యే తీరులో జనన మరణాలకు అతీతమైన, పునరావృత్తి రహితమైన పరబ్రహ్మప్రాప్తి పథాన్ని వెతకటం దొడ్డబుద్ధి అని ప్రబోధించాడు ప్రహ్లాదుడు. "ప్రహ్లాదుండు రహస్యంబున నయ్యైవేళల రాక్షస కుమారులకు నపవర్గ మార్గంబు నెరిగించిన వారును గురు శిక్షితంబులైన చదువులు సాలించి" అతనినే అనుసరించారు. తండ్రి దుర్మార్గుడైనప్పుడు సన్మార్గగతుడైన తనయుడు అతని నెదిరించవలసిందే. కనుకనే నరసింహుడనే శస్త్ర చికిత్సకుడు హిరణ్యకశిపుడనే దుష్టాంగాన్ని ఖండించి (తననఖ శస్త్రాలతో) విశ్వశరీరానికి ఆరోగ్యాన్ని అందించాడు.

రసావేశము :

భాగవతం భాగవతోత్తముల గాథ. ప్రహ్లాద, నారదాంబరీషాది భక్తుల చరిత్ర. ఈ పురాణంలో భగవంతుని కన్న భక్తుడే ఉన్నత స్థానం పొందాడు. ఆ వైకుంఠపురంలో ఉన్న హరిని ఇలకు రప్పించి "నా వంటి బాధితులు ఎందరో ఉన్నారయ్యా! రావయ్యా!" అన్నట్లు గజేంద్రుడు వ్యవహరించాడు. అంబరీషుడు దుర్వాసుని దుర్వార గర్వభంగానికి సుదర్శనాన్నే దర్శింపజేశాడు. ప్రహ్లాదుడు దుష్టశిక్షణకు నారసింహ రూపంలో స్తంభంలో శ్రీ మహావిష్ణువును అవతరింపజేశాడు. గొప్పవారితో మంచి పనులు చేయించేవాడు మరీ గొప్పవాడు. భగవంతుడికీ భక్తుడికీ అదే తేడా.

"సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక"

మహావేదాంతులు చెప్పిన జటిల భావాలను మహాకవి మనోహరంగా చెప్పి శ్రోతను ఒప్పిస్తాడు. పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదునిలోని ఆవేశాన్ని రసావేశంతో రంగరించి రచించాడు పోతన్న.

"కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రి గాక"

ఒక కాయం నిజమైన కాయం కాదు. అది నిష్ప్రయోజనమైనది. రెండవ కాయం (కంజాక్షునకు అయిన కాయం) సార్థకమైనది. అట్లాగే-

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"

అనే పద్యంలో రెండుసార్లు కరములు అన్నాడు కవి. జిహ్వను కూడ రెండు సార్లు వాడాడు. ఈ ఆమ్రేడితంలో గొప్ప అర్థం ఉంది. నిజమైన నాల్క యేదో చెబుతున్నాడు రసావేశంలో కవి.

"అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్" మొదలైన పద్యాలన్నీ రసావేశభాసితాలు. ప్రహ్లాదునిచేత పోతన్నగారు తొమ్మిది రకాల భక్తిని హిరణ్యకశిపునికి చెప్పించారు. భాగవతంలో భక్తి అంగిరసం. శృంగార వీర కరుణాదులు అంగరసాలు. వివిధ రసాలను సమపాళ్లలో రంగరించి అందించగల దిట్ట పోతన్న. సత్యభామను శృంగార వీర రసాధి దేవతగా చిత్రించిన ఘట్టంలో రసావేశం అనుభవైక వేద్యం. రాకేందు బింబమై- రవి బింబమై- కందర్పకేతువై- ఘనధూమకేతువై, భావజు పరిధియై ప్రళయార్క పరిధియై, అమృత ప్రవాహమై- అనలసందోహమై, హర్షదాయియై - మహారోషదాయియై వారికి అరిది (శ్రీకృష్ణునికీ నరకునికీ) కనిపిస్తున్న సత్యావర్ణనంలో భిన్నరసాలకు ఏకత్వం కల్పించాడు పోతన కవీంద్రుడు.

శృంగార హాస్యాల కలగలుపును చిత్రగించండి-

ఈ హేమంతము రాకకు
శ్రీహరి యొక్కింత వదకి చింతింపంగా
"నోహో వెరవకు" మని తా
మాహరికిని శ్రీ కుచంబు లభయం బిచ్చెన్.

భక్తి శృంగారాల మేళవింపును పరికించండి-

ప్రియురాలి వలని వార్తలు
ప్రియ జనులకు నెల్లప్రొద్దు ప్రియమగు భంగిన్
ప్రియుడగు హరి చరితంబుల్
ప్రియభక్తుల కెల్ల యెడల ప్రియములు గావే.

విప్రలంభ శృంగారాన్ని పోతన్న పోషించినట్లు అన్యులు పోషించ లేరేమో అనిపిస్తుంది. విరహార్తలైన గోపికలు చెట్లను చేమలను కృష్ణుని జాడ చెప్పమని అడగటం "కామార్తా హి ప్రకృతి కృపణాః చేతనా చేతనేషు" అన్న కాళిదాసు శ్లోకాన్ని జ్ఞాపకం చేస్తుంది.

"మల్లికలార! మీ పొదల మాటున లేడుగదమ్మ చెప్పరే!" "పున్నాగ! కానవే పున్నాగవందితు, తిలకంబ! కానవే తిలక నిటలు!" "మానినీ మన్మథు మాధవు గానరే సలలితోదారవత్సమ్ములార!" "అదె నందనందను డంతర్హితుం డయ్యె పాటలీతరులార! పట్టరమ్మ!" అని తన్మయత్వంతో గోపసుందరులు బృందావనంలోని తరులతాదులను అడుగుతూ కొన్ని కాలిగుర్తులను చూశారు. అవి కృష్ణుని పాదాలే! సందేహం లేదు-

కొమ్మకు పువ్వులు కోసినా డిక్కడ
మొనసి పాదాగ్రంబు మోపినాడు,
సతి నెత్తుకొని వేడ్క జరిగినా డిక్కడ
తృణముతో లేదిదె తెరవ జాడ,
ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినా డిక్కడ
కూర్చున్న చొప్పిదె కొమరు మిగులు,
ఇంతికి కెమ్మోవి ఇచ్చినా డిక్కడ
వెలది నిక్కిన గతి విశదమయ్యె,

సుదతి తోడ నీరు చొచ్చినా డిక్కడ
జొచ్చి తా వెడలిన చోటు లమరె,
తరుణి కాముకేళి దనిపినా డిక్కడ
ననగి పెనగియున్న యందమొప్పె.

అని కాలిగుర్తులను బట్టి శ్రీకృష్ణుని శృంగారక్రీడ చేష్టలను జ్ఞాపకం చేసుకొంటున్నారు గోపికలు.

ఒక యెలనాగ చే యూదినా డిక్కడ
సరస నున్నవి నాల్గు చరణములును
ఒక నీలవేణితో నాడిగినా డిక్కడ
మగజాడలో నిదె మగువజాడ
ఒక లేమ మ్రొక్కిన నొడిసినా డిక్కడ
రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
ఒక యింతి కెదురుగా నొలసినా డిక్కడ
అన్యోన్య ముఖములై అంఘ్రులొప్పె
నొకతె వెంట దగుల నుండక యేగినా
డడుగు మీద తరుణి యడుగు లమరె,
అబల లిరుకెలంకు లందు రా తిరిగినా
డారు పదము లున్న వమ్మ! యిచట.

సరసన నాల్గు చరణములు, మగజాడలో మగువజాడ, రమణి మ్రొక్కిన చొప్పు, అన్యోన్య ముఖములైన అంఘ్రులు, అడుగుమీద అడుగు, ఆరు పదములు అసదృశ శృంగార చేష్టలను స్ఫురింపజేస్తున్నాయి. శ్రీకృష్ణ పద చిహ్నాలను శృంగార రసంతో తడిపిన పోతన్న అంతలోనే—

"ఈ చరణంబులే ఇందునిభానన!
సనకాది మునియోగ సరణి నొప్పు,
నీ పాదతలములే యెలనాగ! శ్రుతివధూ
సీమంత వీధుల చెన్నుమిగులు,

నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన !
పాలేటి రాచూలి పట్టుకొమ్మ,
లీ సుందరాంగ్రములే యిందీవరేక్షణ !
ముక్తికాంతా మనో మోహనంబు.
లీ యడుగుల రజమె యింతి ! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళి దిశల దాల్తు'' రంటూ భక్తి రసావేశంలోకి వెళ్లి పోతారు.

వీర రసం అనేక విధాలు- దాన ధర్మ దయా పాండిత్యాదులు. పోతన్న గారు చిత్రించిన బలిచక్రవర్తి దానవీర మూర్తిగా సాక్షాత్కరిస్తాడు.

ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై అంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై కపోలతటిపై పాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీదై నా కరంబుంట మే
ల్గాదే! రాజ్యము గీజ్యమున్ సతతమే ! కాయంబు నాపాయమే !

''రాజ్యము గీజ్యము'' అనిపించారు బలిచక్రవర్తితో పోతన్నగారు. ఏదీ శాశ్వతం కాదు.

''ఈ అజాండమ్ము నందు నశించు నన్ని;
గాలిలో దీప మట్లుండె గాదె రవియు''

అని నేను అనువదించాను గాలిబ్ పంక్తులను. కోట్ల సంవత్సరాల నుంచీ ఉంటున్న సూర్యుడు కూడా ఒకనాటికి చల్లారిపోక తప్పదు. ఇక రాజ్యాలు గీజ్యాలు ఎంతకాలం ఉంటాయి?

పోతన్నగారు ఉదాత్తంగా పోషించిన శాంత రసాన్నీ, అందులో ఆయన ప్రదర్శించిన రసావేశాన్నీ ఉదాహరించి నా వ్యాసాన్ని ముగిస్తాను.

అశ్వత్థామ నిర్దయుడై ఉప పాండవులను వధించిన ఘట్టమిది. పారి పోతున్న అశ్వత్థామను పట్టి బంధించి కృష్ణుని ఆజ్ఞ మేరకు అతన్ని చంపకుండా ద్రౌపది వద్దకు తీసుకువస్తాడు అర్జునుడు.

''సురరాజసుతుడు సూపెను
దురవధిసుతశోకయుతకు ద్రుపదుని సుతకున్

పరిచలితాంగ శ్రేణిం
బరుషమహాపాశబద్ధపాణిన్ ద్రౌణిన్.

ఇట్లర్జునుండు తెచ్చి చూపిన బాలవధజనిత లజ్జాపరాఙ్ముఖుండైన గురుని కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె''.

అయిదుగురు కొడుకులు నిద్రిస్తుండగా చంపిన వానికి ద్రౌపది మ్రొక్కింది. మ్రొక్కి ఇట్లా పలికింది-

''పరగన్ మా మగవార లందరును మున్ బాణప్రయోగోపసం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి; పుత్రాకృతి నున్న ద్రోణుడవు; నీ చిత్తంబునన్ లేశమున్
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపగా బాడియే!''

''పుత్రాకృతిలో ఉన్న ద్రోణుడవు'' అన్నది ద్రౌపది. ''శిశు మారణము అసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!'' అని కూడా అన్నది. అశ్వత్థామ చంపిన ఉప పాండవులు ఎటువంటివారు —

''ఉద్రేకంబున రారు, శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు; కిం
చిద్ద్రోహంబును నీకు జేయరు; బలోత్సేకంబుతో జీకటిన్
భద్రాకారుల బిన్నపాపల రణప్రౌఢక్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా! నీచేతు లెట్లాడెనో!''

ఆ తల్లి తన శోకాన్ని తనలోనే దాచుకొని నమస్కరించి ''తండ్రీ'' అని సంబోధించి ఈ మాట అన్నది. శాంతరసాధి దేవత ద్రౌపది. పోతన్నగారు ద్రౌపది ద్వారా తమలోని శాంతరసావేశాన్ని ప్రదర్శించారు. ''నేను నా కొడుకుల కోసం ఏడుస్తున్నట్లుగా అశ్వత్థామ కోసం అతని తల్లి శోకిస్తూ ఉంటుంది. గురుసుతుని చంపకండి, వదలి వేయండి''అని ద్రౌపది భర్తలను కోరుకుంటుంది.

రసావేశపరుడైన పోతనామాత్యుడు ఆంధ్ర భాషను, ఆంధ్ర దేశాన్ని రసప్లావితం చేశాడు, తన ఆంధ్ర మహాభాగవత మహా పురాణ రచనతో.

''భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవి గనుడు రసికభావవిదులు''

* * *

# పోతరాజుగారి లోకజ్ఞత

శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి

ప్రహ్లాదుని చరితమును వ్యాసులవారు ఉపనిషత్సిద్ధాంతమును వెల్లడించుటకు సాధనముగా దీసికొని భక్తిజ్ఞాన వైరాగ్యములకు తార్కాణ చేసెను. పోతరాజుగారు ప్రహ్లాదుని వ్యాసుని మాటలతోనే కాక స్వతంత్రించి సైతము కొంత వర్ణించి యొక మహాసాత్త్విక వ్యక్తియొక్క ప్రతికృతిని చిత్రించి చూపెను.

ఇది మన వాఙ్మయ మందెల్లెడల గల యంశమే. ఏ గ్రంథకర్త సత్త్వగుణమున కగ్రస్థాన మిచ్చియుండలేదు? ఏ కవి సాత్త్వికులైన మహాపురుషులకే పర్యవసానమున జయమును సమర్థించి యుండలేదు? ఏ పుస్తకమున సాత్త్వికుల నిష్ఠా విశేషమును జూపుటకే రాజస తామసుల చరితము లప్రధానముగ ప్రతినాయకవృత్తములలో చేర్చియో, ప్రాసంగిక కథలుగ కూర్చియో చూపబడలేదు ?

పోతరాజు గారు ప్రహ్లాదుని మహిమ కొరపిడి రాయిగ దీసికొనబడినదైనను హిరణ్యకశిపు పాత్రము యొక్క స్వభావ విశేషముల నచ్చొత్తి చూపుచు రాజస తామసప్రకృతుల స్వరూపకథనమునకు చాల ప్రాధాన్యము నిచ్చి కవి కుండవలసిన లోకజ్ఞతను వెల్లడించియున్నాడు. రాజసులలో మొదటి స్థానము నధిష్ఠించియుండెడి హిరణ్యకశిపుని వంటి బలశాలికి, సమర్థునకు, లౌకికునకు పరమవిరక్తుడైన కొడుకు దాపురమైనప్పు డాతని చేత మే తీరున నుండునో, ఎట్టి విచార మాతని కుద్భవించునో, అతడు ఏమి యాలోచించునో, ఏమి సంభాషించునో, ఏమి చేయునో అన్నియు పూసగ్రుచ్చినట్లు పోతన చెప్పబూనినాడు. చూడుడు—

లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింపఁ డత్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడు వి

ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్క దినంబునన్ బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై.
.. (7-129)

తాను సమర్థుడై స్వార్థపరుడై కార్యశూరుడై కావలసినంత ఆస్తి సంపాదించినాడు. ఇంతవాడు లే డనిపించుకొనినాడు. ఒకరికి లొంగక ప్రవర్తించినాడు. కొడుకు కూడ తనంతవాడు కావలెనని ఆశ. ఉపన్యాస వేదికలపై కెక్కినపు డేదియు శాశ్వతము కాదని యుపన్యాసము లిచ్చుచునే యున్నాడు. కాని తన కొడుకు హరినామస్మరణము చేసికొనుచు ప్రయోజకు డనిపించుకొనన ప్పుడు, బైరాగి వేషమున నున్నపుడు, బలపరాక్రమాదులు గలిగి నిగ్రహానుగ్రహసమర్థుడై లోకమును గడగడలాడింపనపుడు అతని సత్యత్వము సాధుత్వము మొదలైనవి తండ్రి కాత్మలో రుచించునా ? కొన్ని వేలు సంపాదించుకొని వృత్తి సన్న్యాసము చేసియున్న పెద్ద మనుష్యులకు (మనీషులకు) మాత్రము తమ కొడుకు బి. ఎల్. పరీక్షలో నుత్తీర్ణుడై వెంటనే పాపభీతిచే న్యాయవాది పదము నంగీకరింపకున్న సాధారణముగ సమ్మతమగునా ?

ప్రహ్లాదుని సత్యత్వము జ్ఞానము వలన గలిగినది కాని దౌర్బల్యముచే గలిగినది కాదు. కాని తండ్రి కది యిష్టము కాదు కావున దుర్బలతచే గలిగిన దని నెపము వెట్టి గర్హించుచున్నాడు. జ్ఞానముచే ప్రపంచము ననిత్యముగ దెలిసికొని 'విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు' అని తాను స్వయముగ దెలిసికొనియు నద్దానిని గర్హింపకున్న తాను బహిరంగ సభలలో ధర్మపన్నాలు ఏకరువు వేయుటకు వీలుండదు కదా!

అంధప్రక్రియ నున్నవాఁడు; పలుకం దస్మత్ప్రతాపక్రియా
గంధం బించుకలేదు; మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం బాటించి యీ బాలకున్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుంగాఁ జేసి రక్షింపరే ! (7-132)

తన ప్రతాపము దావానలమై సకల భువనముల మాడ్చివేసినది. సమర్థుడైన తన దౌర్జన్యముచేత దేవేంద్రు నంతవాడు తన మ్రోల నౌదల నెత్తలేకున్నాడు. తన్ను మించిన వాడు తన కొడుకు కావలెనని యువ్విళ్లూరుచున్నాడు.

'సర్వత్ర జయ మన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛే త్పరాజయమ్!' కొడుకు దాటి వేరైనది. ఆ సాధుమార్గము తాను చదివిన వేద శాస్త్రాదులలో నెల్లచోట్ల కైవారము సేయ బడునదియైనను, తాను పరులకు ధర్మోపన్యాసములు చెప్పునపుడు మాటిమాటికి నోట వచ్చుచుండునదియైనను ఆత్మకు నచ్చినది కాదు.

అంతఃకరణము లన్నియు నొక్కరీతి నుండవు. సాత్వికాంతఃకరణమునకు సాధు మార్గము రుచించును. రాజసబుద్ధికి సమానస్కంధులలో గొప్ప కావలసి నది. 'సమానానా ముత్తమశ్లోకోఽస్తు' అని శ్రుతి రాజసవాంఛ ననువదించు చున్నది. తామసులకు నిద్ర, సోమరితనము మున్నగునవి నచ్చియుండును. కాని పుస్తకములు చదివినవారు పుస్తకముల మాటల కలవాటుపడి అందరును బహి రంగ ప్రసంగములలో వాసికొరకు ధర్మ్యమైన సాధుమార్గమునే శ్లాఘించు చుందురు. అంతఃకరణములోని మాలిన్యము కార్యకాలమున వెల్లడియగును. హిరణ్యకశిపుడు తా ననుకొనుచున్న ప్రహ్లాదుని జాడ్యము రాజనీతిగ్రంథములు చదువుటచే పోవునని యెంచెను. అవును, ఆ గ్రంథములలో శత్రుమిత్రతత్వములు, నిగ్రహానుగ్రహములు పురుషార్థముగ చెప్పబడును. ఆ సంస్కారము మనమున కంటుకొని బాలుని శీలము మారుట రాక్షసరాజుద్దేశించినది.

పాఠశాల చదువు నారదమహర్షి యనుగ్రహించిన పరవిద్యాపరిపాకమున కృతార్థుడై యుండిన ప్రహ్లాదుని మార్పగలిగినది కాదు. అంతకంతకు నారదోప దేశము తలకెక్కిపోయినది. శ్రుతిమించి రాగాన బడినది. విష్ణుచింతలో సుతుడు మునిగి తేలుచుండుట తండ్రికి ప్రత్యక్షమైనది. ఆశ్చర్యము గల్గినది. వాత్స ల్యము విడజాలకున్నాడు.

నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా నా తండ్రి! యీ బుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో; యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు గృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్. (7. 145)

నుచున్నాడు. 'నా తండ్రి' అను పదము శోకరుధిరముతో కలసి ఘూర్ణిల్లు త్సల్య ప్రవాహమును వెల్లివిరియించుచున్నది. వాత్సల్య ప్రతిబంధము చే

కొడుకు నసలేక పరుల మీదికి పోవుచున్నాడు. ఇక్కడ నసాధుసగు తండ్రి సాధువగు కొడుకుతో నేకీభవింప ప్రేరణసేయు పుత్రస్నేహము నాగికొనలేక అయ్యెవిష్టునకు తనకు తన చుట్టుగల శత్రుమండలమే కారణమేమో! అని యనుమానపడుట సహజముగ నున్నది. అత్యంత విశ్వాసార్హులైన కులగురువుల మీద గూడ సంశయము గల్గినది. ఆహా! దారేషణా పుత్రేషణా ధనేషణలెంతకు లేవు? చివరకు వాత్సల్య వివశుడై బతిమాలుకొనుచున్నాడు— దానవశ్రేణికి వైకుంఠుడు కృతాపరాధుడని.

దేహాభిమానము గలవారికి జాతిపై నభిమానముండును. ప్రహ్లాదుడు దేహత్రయాతీతుడై యున్నాడు. ఆతనికి దానవజాతికి విరోధి యనినంత మాత్రమున విష్ణువుపై భక్తి పోలేదు.

సురలం దోలుటయో సురాధిపతులన్ ద్రుక్కించుటో సిద్ధులం
బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో యక్షకి
న్నర గంధర్వ విహంగనాగ పతులన్ నాశంబు నొందించుటో
హరి యంచున్ గిరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా! (7.146)

ఇట్టి దౌర్జన్యము నెట్లుపదేశించెనా యని మన కచ్చెరువు గల్గుచున్నది. కాని యీ ప్రకృతియే లోకమున విశేషముగ ప్రచారము కలది. జాతీయ కళాశాలలు మున్నగువానిని స్థాపించి పెక్కురు విద్యార్థులకు అన్నపానము లొసగియు పండిత సత్కారము లొనర్చుచుండియు పూర్వవిద్యల నెల్ల పునఃప్రతిష్ఠ చేయవలయునని భగీరథ ప్రయత్నము లొనర్చు దేశోద్ధరణబద్ధకంకణులగు సంపన్నులు తమ సుతుల నింగ్లీషు కాలేజీల నుండి యేల తీసికొనిరారు? చాల కాలము న్యాయవాద వృత్తిలో మెలగి కొంచెముగనో గొప్పగనో అనృతోక్తి సంబంధము లేక యా వృత్తి నడవదని త్రికరణశుద్ధిగా నెరింగిన ముదుసలి న్యాయవాదులు బి.ఏ. ప్యాసై వచ్చిన తమ పుత్రులను లా కాలేజీల కేల పంపుచున్నారు?

ఎల్లరకును పాపభీతి కన్న పదుగురిలో గొప్పగ తామును, తమ వాండ్రును కాలక్షేపము చేయవలెనను కోరిక మెండు. ఈ పామరత్వము జ్ఞానబలము వలనగాని రూపుమాయదు. అది రాజసప్రకృతి కలభ్యము. కాని

యెంతటి రాజసుడైనను బహిరంగముగ నిట్టిమాటలను నోటరానీయడు. వాసి పోవునని భయము. హృద్గుహలోపల నిగూఢముగా యిట్టి యాశయము లుండి యేకాంత ప్రసంగములలో వెలువడుచుండును. వీనిని పోతన కనిపెట్టినాడు. 'రవి కాననిచో కవి కానకుండునే' యనుట యిదియే. ఇదియే కవిదృష్టి. ఈ రీతిగా హిరణ్యకశిపు నింకను బలు కల్పనలతో ప్రదర్శించినవాడు పోతరాజు గారు; వ్యాసులవారు కాదు. కావున సహజ పాండిత్య విలాసమైన యిట్టి లోకజ్ఞత పలుచోట్ల పోతన కవితలో కన్పట్టుచున్నది.

*(భారతి, నవంబర్ 1929)*

* * *

రాజఁట ధర్మజుండు ! సురరాజసుతుండట ధన్వి ! క్షాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట ! సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రియఁట ! యుగ్రగదాధరుఁడైన భీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునఁట ! యాపద గల్గు టిదేమి చోద్యమో !

యాదవులందుఁ బాండవులయందు నధీశ్వర ! నాకు మోహ వి
చ్ఛేదము సేయుమయ్య ! ఘనసింధువుఁజేరెడి గంగభంగి నీ
పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియు నట్లుగఁ జేయఁగదయ్య ! యీశ్వరా !

శ్రీకృష్ణా ! యదుభూషణా ! నరసఖా ! శృంగార రత్నాకరా !
లోకద్రోహి నరేంద్రవంశదహనా ! లోకేశ్వరా ! దేవతా
నీకబ్రాహ్మణ గోగణార్తిహరణా ! నిర్వాణసంధాయకా !
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ !

# బమ్మెరవారి భక్తిసామ్రాజ్య వైభవం

— డాక్టర్ జంధ్యాల జయకృష్ణ బాపూజీ

రాజు కాని రాజు బమ్మెర పోతరాజు. సువిశాలమైన సురుచిరమైన భక్తి సామ్రాజ్యానికి ఆయన మకుటంలేని మహారాజు. ప్రతి మానవునికి పరమావధి మోక్షాన్ని అందుకోవటం. పునరావృత్తి రహితమైన మోక్షాన్ని పొందటానికి పెద్దలు నాల్గు మార్గాలు తెలిపారు. అవి కర్మ జ్ఞానయోగ భక్తిమార్గాలు. వీనిలో అందరికి అందుబాటైనదీ, ఆచరణ యోగ్యమైనదీ, సులభసాధ్యమైనదీ భక్తి మార్గం, ఇది తొమ్మిది విధాలుగా ఉంటుంది— భగవంతుని గూర్చిన శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం అని.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.

అని శ్రీమద్భాగవతం చెప్పిన శ్లోకం పోతన్నగారి భాగవతంలో—

తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!

అన్న ఐదేండ్ల బాలప్రహ్లాదుని పద్యంగా రూపం సంతరించుకున్నది. ఈ నవవిధ భక్తులకు ప్రతీకలుగా నిలిచి తరించిన మహనీయులను గూర్చి వెల్లడించే సుప్రసిద్ధమైన శ్లోకం చిత్తగించండి.

శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షి దభవ ద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదః స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుః పూజనే
అక్రూర స్త్వభివందనే కపిపతి ర్దాస్యే చ సఖ్యేఽర్జునః
సర్వస్వాత్మసమర్పణే బలి రభూత్ కృష్ణాప్తి రేవంవిధా.

(శ్రీమహావిష్ణువు యొక్క శ్రవణము నందు పరీక్షిత్తు, కీర్తనమందు శుకుడు, స్మరణమందు ప్రహ్లాదుడు, పాదసేవయందు లక్ష్మీదేవి, అర్చన మందు పృథుచక్రవర్తి, అభివందనమందు అక్రూరుడు, దాస్యమునందు హనుమంతుడు, సఖ్యమందు అర్జునుడు, ఆత్మనివేదనమందు బలియు కృతార్థులైనారు. కృష్ణభక్తి ఈ విధమైనట్టిది.)

ప్రస్తుత వ్యాసంలో పోతనామాత్యుని భాగవతంలో ఈ నవవిధభక్తుల స్వరూపనిరూపణాన్ని సంగ్రహంగా సమీక్షిద్దాం.

**శ్రవణం :**

భగవంతుని నామ గుణ చరిత్రాదులను శ్రద్ధతో ఆలకించటమే శ్రవణ భక్తి. హరి గుణోపచిత భాషణాలు వాణికి భూషణాలనీ, అఘపేషణాలనీ, మృత్యుచిత్త భీషణాలనీ, హృత్తోషణాలనీ, కల్యాణ విశేషణాలనీ శౌనకాది మహామునులు సూతునితో చెప్పి మాట మాటలోనూ మాధుర్యాన్ని చిందే కృష్ణుని కథను వినాలనే కోరికను తెలుపుతారు (1.46, 48).

శ్రవణభక్తికి ఉదాహరింపదగినవాడు పరీక్షిన్మహారాజు. వేటకోసం అరణ్యానికి వెళ్ళి అలసిసొలసి శమీకమహాముని ఆశ్రమానికి వెళ్ళి దగ్గుత్తికతో మంచినీటిని అడగటం, ఆయన ధ్యాన సమాధిలో ఉండటంవల్ల బదులుపలుకక పోవటం, పరీక్షిత్తు ఆగ్రహంతో మృతసర్పాన్ని ఆ ముని మెడలో వేసి వెళ్లటం, ముని కుమారుడైన శృంగి వచ్చి తండ్రి మెడలోని సర్పాన్ని చూచి పట్టరాని ఆవేదనతో ఆవేశంతో ఆ మాతుకానికి పూనుకొన్న వ్యక్తి ఏడు దినాలలో తక్షక విషాగ్ని కీలలకు గురియై మరణిస్తాడని శపించటం, శమీక మహాముని పంపిన శిష్యుని ద్వారా ఈ వార్తవిన్న పరీక్షిత్తు విరక్తుడై వ్యాససుతుడైన శ్రీ శుకుని వలన మోక్షకారకమైన భాగవతాన్ని ఏడుదినాలలో ఆలకించి శృంగి శాపానుసారం దేహాన్ని త్యజించి కైవల్యాన్ని అందుకోవటం జరుగుతుంది. భాగవత మహాగ్రంథంలోని పంద్రెండు స్కంధాలలోనూ పరీక్షిత్తు విష్ణుభక్తుల కథలనూ, విష్ణువు దివ్యావతార విశేషాలనూ వింటూ కన్పిస్తాడు. దశమస్కంధం వివరలో శ్రీ కృష్ణ చరిత్రను వినిపిస్తూ శ్రీ శుకుడు పరీక్షిత్తుతో పలికిన—

మనుజేంద్రోత్తమ! యేను నీకు త్రిజగన్మాంగల్యమై యొప్పఁ జె
ప్పిన యీ కృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో
లిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్ నిర్ధూత సర్వాఘులై
యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదంబై నట్టి కైవల్యమున్.

అనే యీ పద్యం శ్రవణప్రాధాన్యాన్ని ప్రస్ఫుటం చేస్తున్నది.

**కీర్తనం :**

భగవంతుని గుణలీలాదులను వర్ణించటం కీర్తనభక్తి. కౌరవ పాండవ యుద్ధం ముగిసిన తరువాత కుంతీదేవి—

శ్రీ కృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గో గణార్తి హరణా ! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

అని శ్రీకృష్ణుణ్ణి మనసారా కీర్తిస్తుంది (1.200). యాదవుల యందు పాండవుల యందు తనకు గల మోహాన్ని తొలగించి సముద్రాన్ని చేరే గంగలాగా నీ పాద పద్మ చింతనంలో నా బుద్ధి మగ్నమై ఉండేటట్లు చేయమని ఆమె ఆకాంక్షిస్తుంది (1.199).

ఇక ఉద్దీపించిన త్రిజగన్మోహన నీలకాంతి తనువుతో, పైన రంజిల్లు తున్న ప్రాభాత నీరజ బంధుప్రభమైన చేలంతో, పవిత్రమై శోభించే నీలాలక వ్రజ సంయుక్తమైన ముఖారవిందంతో విజయుణ్ణి సమీపించే వన్నెలాణ్ణి మన కన్నులయందు కదలించిన భీష్ముడు ( 1. 218 ) కూడా కీర్తనభక్తి సంయుక్తుడే.

**స్మరణం :**

భగవంతుని విస్మరింపక నిరంతరం ధ్యానించటం స్మరణభక్తి. ఇందుకు నిదర్శనంగా భాగవతం ద్వితీయ స్కంధంలో కన్పించే ఖట్వాంగ ప్రభువును పేర్కొనవచ్చు. శుకమహర్షి పరీక్షిత్తుతో "ఆ హరినామ సంస్మరణ

మొక్క ముహూర్త మాత్రము చాలు ముక్తిద మౌ నృపా!'' అంటూ ఖట్వాంగుని వృత్తాంతం చెబుతాడు. చక్రవర్తి అయిన ఖట్వాంగుడు దేవదానవ యుద్ధంలో దేవతలకు సహాయంగా వెళ్ళి రాక్షసులను సంహరించి జయం చేకూరుస్తాడు. దేవతలు సంతోషించి వరం కోరుకోమంటారు. తన జీవిత ప్రమాణం ఇంకా ఎంత ఉన్నదో చెప్పమంటాడు ఖట్వాంగుడు. ముహూర్త మాత్రం ఉన్నదంటారు దేవతలు. వెంటనే ఖట్వాంగుడు గగన మార్గంలో తన రాజభవనానికి చేరుకొని చతురంగ బలాలను, శుద్ధాంత కాంతలను, హితులను, పండిత శ్రేష్ఠులను అందరినీ వర్జించి గాఢ వైరాగ్యంతో—

గోవింద నామకీర్తనఁ
గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు సూఱగొనియెను
గైవల్యముఁ దొల్లి రెండు గడియల లోనన్. (2.11)

భగవన్నామ స్మరణ మేవం విధమైనది. ఇదే విధంగా అజామిళుడనే బ్రాహ్మణుడు దుర్వ్యసన పరాయణుడై సర్వ విధాల భ్రష్టుడై చివరకు మృత్యు ముఖంలో ఉన్నప్పుడు అతనికి అతిభయంకరాకారులై యమదూతలు కన్పిస్తారు. వారిని చూచిన అజామిళుడు వికలేంద్రియుడు, వికంపిత ప్రాణుడు, వికృత లోచనుడు, విహ్వలాత్మకుడు అవుతాడు. అప్పుడు దూరంగా ఆడుకుంటున్న తన కుమారుణ్ణి చూచి "నారాయణా'' అని పేరుపెట్టి ముమ్మార్లు పిలుస్తాడు. తెలిసినా తెలియకపోయినా నారాయణ నామస్మరణ చేయటం వల్ల విష్ణు దూతలు వచ్చి యమదూతలనుండి అజామిళుణ్ణి విడుదల చేస్తారు. అనంతరం అజామిళుడు విష్ణు భక్తుడై యోగమార్గంలో దేహాన్ని త్యజించి మోక్షాన్ని అందుకుంటాడు.

**పాద సేవనం :**

భగవంతుని పాదాలను, భక్తుల పాదాలను, గురువుల పాదాలను, సాధువుల పాదాలను సేవించటమే పాదసేవన భక్తి. అందువల్లనే శౌనకాదులు సూతునితో ఇట్లా అంటారు—

పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీ సం
భావనములు వాసుదేవ పదసేవనముల్.

నిజమే. శ్రీకృష్ణుని పాదసేవనములు పవిత్రమైనవి, పాపలతలకు కొడవళ్ల వంటివి, నిరంతర శుభాకరమైనవి, శ్రీదేవీ గౌరవాస్పదమైనవి. ఇందుకు తార్కాణం సుదాముని చరిత్ర. మధురానగరంలో మాలాకారుడైన సుదాముడు కంసుని ధనుర్యాగం చూడడానికి వచ్చిన బలరామ కృష్ణులను ఆహ్వానించి అర్ఘ్యపాదాలు, తాంబూల కుసుమగంధాలు, సురభిళ పుష్పదామాలు అర్పించి శ్రీకృష్ణుణ్ణి ఈ విధంగా వేడుకొంటాడు-

నీ పాదకమల సేవయు,
నీ పాదార్చకుల తోడి నెయ్యమును, నితాం
తాపార భూతదయయును
దాపస మందార! నాకు దయసేయఁగదే.

అతనికి "బలాయుః కాంతి కీర్తి సంపద" లనుగ్రహిస్తాడు కృష్ణుడు.

**అర్చనం :**

తులసీ పుష్పమాలాదులతో భగవంతుని పూజించటం అర్చన భక్తి. ఇందుకు మధురానగరంలో కంసుని పరిచారిక అయిన కుబ్జను ఉదాహరింప వచ్చు. రకరకాల చక్కని చిక్కని లేపనాలు తయారు చేయటం ఆమె పని. "నీ పేరేమిటి? లేపనాలు ఎవరికోసం తీసుకుపోతున్నావు?" అని ప్రశ్నించిన కృష్ణుడితో-

చక్కనివాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్లవారికిం
జిక్కఁదనంబు లెక్కడివి? చారుశరీర! త్రివక్ర యంద్రు; నే
నిక్కము కంసుదాసిని; వినిర్మలలేపన విద్యదాన; నన్
మిక్కలి రాజు మెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే.

అంటూ ప్రేమతో తనవద్ద ఉన్న లేపనాలను అందిస్తుంది. ఆ లేపనాలను ఒంటికి అలదుకొని కృష్ణుడు ఆమె పాదాలపై తన పాదాలు మోపి చుబుకాన్ని స్పృశించ గానే వికూపగా ఉన్న కుబ్జ సురూపగా మారిపోతుంది. "చక్కనైన చిత్తజన్మ బాణము క్రియ కొమరు మిగిలిన" ఆ సుందరీ మణిని బుజ్జగించి అన్నతో కలిసి ముందుకు వెళతాడు. భగవదర్చనా ఫలితం ఇటువంటిది.

**వందనం :**

భక్తిశ్రద్ధలతో భగవంతునికి నమస్కరించటం వందన భక్తి.

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి.

ఆకాశం నుండి పడుతున్న జలం సముద్రంలో కలిసినట్లుగా ఏ దేవతకు నమస్కరించినా అది శ్రీ కృష్ణునికే చెందుతుంది. ఇందుకు అక్రూరుడు మనకు నిదర్శనంగా దర్శనమిస్తాడు. బలరామకృష్ణులను రథం మీద మథురకు తీసుకొని రావాలని వస్తాడు అక్రూరుడు. బృందావనంలో గోవిందుణ్ణి, బలరాముణ్ణి సమీపించి–

కని వారల పాదములకు
వినయంబున మ్రొక్కె భక్తివివశుం డగుచుం
దనువునఁ బులకాంకురములు
మొనయంగ నానందబాష్పములు జడి గురియన్. (10.1.1203)

భక్తితన్మయుడై రోమాంచంతో ఆనందబాష్పవర్షధారలతో బలరామ కృష్ణులకు వినయంతో కావించిన అక్రూరుడి వందనం అత్యంతం అభినంద నీయం. తరువాత వారిద్దరినీ మధురకు తీసుకువెళుతూ దారిలో యమునానది ముందు రథాన్ని నిలుపుతాడు అక్రూరుడు. "పరితుష్ట మణిగణ సముజ్జ్వలము" లైన కాళిందీ జలాలను త్రాగి బలరామకృష్ణులు తిరిగి రథంలో కూర్చుంటారు. అప్పుడు అక్రూరుడు యమునలో స్నానంచేసి నదీజలాలలో మధుర మందస్మితు లైన బలరామకృష్ణులను దర్శిస్తాడు. ఆశ్చర్యంతో మళ్లీ ఒడ్డువైపు చూస్తే అక్కడ రథారూఢులై యథావిధిగా వాళ్ళే కన్పిస్తారు. తిరిగి నదిలోకి చూడగానే

"సహస్రమస్తక విభాసితు"డైన ఆదిశేషువుపై "శ్రీవత్స కౌస్తుభ వనమాలికా విరాజిత విశాల వక్షుండును బుండరీకాక్షుండును శంఖచక్రగదా పద్మహస్తుండును సత్వగుణ ప్రశస్తుండును బ్రహ్మసూత్ర కటిసూత్ర హారకేయూర కటక కంకణకుండల కిరీటాది విభూషణుండును భక్తజన పోషణుండును సుందర కపోలఫాలనాసాధరవదన కర్ణుండును నీలనీరదవర్ణుండును గంబుకంధరుండును గరుణాగుణబంధురుండును" అయిన శ్రీమన్నారాయణుడు శ్రీదేవీ సహితుడై సాక్షాత్కరిస్తాడు. వెంటనే అక్రూరుడు "అప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తి సంభ్రమంబు లగ్గలంబులుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి" "శ్రీ మానినీ మానసచోరా! శుభాకార! వీరా! జగద్ధేతు హేతుప్రకారా!...... నిన్నెన్న నే నెవ్వఁడన్ నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతంబాపి మన్నింపవే పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః" "నాకు నీ విలసత్పాదయుగంబు చూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!" అని అనేక విధాలుగా ప్రార్థిస్తాడు. ఆతని వందనభక్తికి ఇంతకంటే తార్కాణం ఏం కావాలి ?

దాస్యం :

భగవంతుని తన ప్రభువుగా భావించి సర్వకర్మలను ఆయనకే అంకితం చేయటం దాస్యభక్తి. భాగవత నవమస్కంధంలో సప్తద్వీపవిశాల భూభారాన్ని వహించి వైష్ణవార్చనలతో కాలం గడిపే సద్గుణగరిష్ఠుడైన అంబరీష చక్రవర్తి దాస్యభక్తికి లక్ష్యప్రాయుడు. చిత్తగించండి—

చిత్తంబు మధురిపు శ్రీ పాదముల యంద;
పలుకులు హరిగుణ పఠన మంద;
కరములు విష్ణుమందిర మార్జనము నంద;
చెవులు మాధవకథాశ్రవణ మంద;
చూపులు గోవిందరూపవీక్షణ మంద;
శిరము గేశవ నమస్కృతులయంద;
పదము లీశ్వరగేహ పరిసర్పణములంద;
కామంబు చక్రి కైంకర్యమంద;

సంగ మచ్యుతజనతను సంగమంద,
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రికమలమంద,
రసన తులసీదళములంద, రతులు పుణ్య
సంగతుం డంద యా రాజచంద్రమునకు. (9. 82)

ఒకసారి ఆయన ద్వాదశీవ్రతం కావించాడు. వ్రతాంతంలో కార్తీక మాసంలో మూడు రాత్రులు ఉపవాసం చేసి సుస్నాతుడై విష్ణువు నభిషేకించి గంధాక్షతలు సమర్పించి పుష్పాలతో పూజించి పారణ చేయటానికి సిద్ధపడతాడు. ఇంతలో ఆకస్మికంగా అక్కడకు వచ్చిన దుర్వాసమునీంద్రుణ్ణి ఆదరించి అర్ఘ్య పాద్యాలిచ్చి భోజనానికి ఆహ్వానిస్తాడు అంబరీషుడు. దుర్వాసుడు స్నానార్థం కాళిందీనదికి వెళ్ళివస్తానని వెళతాడు. ఎంతసేపటికీ తిరిగిరాని మునికోసం కొంత సేపు ఎదురుచూచి ద్వాదశి గడియలోనే పారణ చేయాలి కనుక విద్వజ్జనుల అభిప్రాయాన్ని అనుసరించి నీటినే పారణం చేస్తాడు అంబరీషుడు. అనంతరం దుర్వాసుడు వచ్చి జరిగింది తెలుసుకొని ఆగ్రహోదగ్రుడై పండ్లు పటపటకొరికి హుంకరించి తన జడను పెరికి కృత్యను సృష్టించి అంబరీషుని మీదకు ప్రయోగిస్తాడు. ఈ విషయం అంతా విశ్వరూపుడైన విష్ణువు గమనించి సుదర్శన చక్రాన్ని పంపిస్తాడు. అది కృత్యను దహించి దుర్వాసుడి వెంటపడుతుంది. భయభ్రాంతుడై దుర్వాసుడు బ్రహ్మదేవుణ్ణి, పరమశివుణ్ణి శరణుకోరి విఫలుడై విష్ణువుదగ్గరకే వచ్చి కాపాడమని వేడుకుంటాడు. అప్పుడు విష్ణువు పలికిన పలుకులు భక్తునికి భగవంతుడు ఏ విధంగా లోబడి ఉంటాడో, వారిరువురికి గల బంధం ఎటువంటిదో తెల్పుతాయి—

వలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం
గిలి కొనిపోవుచుందురు, రతిల్పిష భక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభి కైవడిన్
వలలకుఁ జిక్క భక్తజనవత్సలతం జనుచుందుఁ దాపసా!

నాకు మేలు గోర నా భక్తులకు కాని
భక్తజనుల కేన పరమగతియు
భక్తు లెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులు కోడెభంగి.

సాధుల హృదయము నాయది,
సాధుల హృదయంబు నేను; జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా! (9. 118, 119; 128)

చిట్టచివరకు అంబరీషుడే చక్రాన్ని ప్రార్థించి దాని బారినుండి దుర్వాసుణ్ణి రక్షిస్తాడు. భగవంతుడి కంటె ఒక్కొక్కసారి భక్తుడే శక్తిమంతు డనటానికి ఈ వృత్తాంతం చాలు.

సఖ్యం :

భగవంతుణ్ణి స్నేహితుడుగా భావించి ఆయనలోని గుణాలను అలవరచుకోవటమే సఖ్యభక్తి. ఈ భక్తి అర్జునుడిలో అధికంగా కన్పిస్తుంది. శ్రీకృష్ణుని నిర్యాణవార్తను ధర్మరాజుకు అర్జునుడు చెప్పిన తీరు చూడండి-

మనసారథి మన సచివుఁడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుఁడున్
మన విభుఁడు గురుఁడు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా! (1. 358)

శ్రీకృష్ణార్జునుల అనుబంధం అనిర్వచనీయం, అద్వితీయం అయినట్టిది. కృష్ణుడు అర్జునుణ్ణి చెలికాడా రమ్మని పిలిచేవాడు; మరదిగా మన్నించేవాడు; బంధుభావంతో ఆదరించేవాడు; ఔదార్యమూర్తియై బహుధనాలు బహూకరించేవాడు; మంత్రియై హితోపదేశం చేసేవాడు; గురువై కర్తవ్యాన్ని బోధించేవాడు; సారథియై చనువు చూపేవాడు; హాస్యమాడేవాడు; ఆటలు పట్టించేవాడు; ఒకే శయ్యమీద కూర్చొపెట్టుకొని కన్నతండ్రిలాగా తప్పులు దిద్దేవాడు; చేతులు పట్టుకొని తన పొత్తున ఆరగింపజేసేవాడు. ఇటువంటి కృష్ణుడిలోని ఆర్తత్రాణ పరాయణత్వం, ధర్మపాలనం, దుష్టశిక్షణం మొదలైన గుణాలను అర్జునుడు కూడా అలవరచుకొన్నాడు.

ఇక కుచేలుడు కూడా సఖ్యభక్తికి ప్రతీక అయినవాడే. కుచేలుడు కృష్ణుడితో కలిసి బాల్యంలో సాందీపని వద్ద విద్యాభ్యాసం చేశాడు. అంతే. ఆ

తరవాత మళ్ళీ ఎప్పటికో గంపెడు పిల్లల్ని కని దుర్భర దారిద్ర్యానికి తాళలేక భార్య కావించిన సూచన ననుసరించి సహాయం కోసం మధురానగరానికి వచ్చి రాజప్రాసాదంలో కృష్ణుణ్ణి చూచాడు కుచేలుడు. ఇంతలో మన్మథ మన్మథుడు, ఇందీవర శ్యాముడు, వందిత సుత్రాముడు, భూరి గుణసాంద్రుడు, యదు కులాంభోధిచంద్రుడు అయిన కృష్ణుడు అక్రాంత దరిద్ర పీడితుడు, కృశీభూతాంగుడు, జీర్ణాంబరుడు, ఘనతృష్ణాతుర చిత్తుడు, ఖండోత్తరీయుడు అయిన కుచేలుణ్ణి తిలకించి సంభ్రమంతో తల్పం దిగి ప్రేమతో ఎదురువెళ్ళి కౌగిలించుకొని వెంటబెట్టుకొని వచ్చి సాదరంగా తన తల్పంమీద ఆసీనుణ్ణి చేశాడు. కాళ్లు కడిగి ఆ జలం తలపైన చల్లుకొన్నాడు; మంచిగంధం అలదాడు; వీవనతో విసరాడు; మణిదీపాలతో నివాళించాడు; సువాసనల సుమమాలికలతో అలంకరించాడు; కర్పూరతాంబూలం అందించి కుశలప్రశ్నలు వేశాడు. ఇదంతా చూచిన శుద్ధాంతకాంతలు ఆశ్చర్యంతో —

ఏమితపంబు చేసెనొకొ యీ ధరణీదివిజోత్తముండు తొల్
బామున, యోగివిస్ఫుర దుపాస్యకుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్ !

అని (10-2-985) తమలో తాము అనుకొన్నారు. కుచేలుడూ తానూ సాందీపని ఆశ్రమంలో గడపిన రోజులు, విశేషాలు ముచ్చటిస్తున్న కృష్ణుడు కుచేలుని జీర్ణవస్త్రంలో మూటగట్టి ఉన్న అటుకులను గుప్పెడు తిని అతనికి ఐశ్వర్యాన్ని అనుగ్రహించాడు.

దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్. (10-2-1010)

అన్న కృష్ణుని అపారదయకు పాత్రుడైన కుచేలుడు "పత్నీ సమేతుండై నిఖిల భోగంబుల యందు నాసక్తిం బొరయక రాగాది విరహితుండును నిర్వికారుండు నునై యఖిలక్రియలందు ననంతుని యనంత ధ్యానసుధా రసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె."

**ఆత్మ నివేదనం :**

మనోవాక్కాయకర్మలతో భగవంతుడికి శరణాగతి చేయటం ఆత్మ నివేదన భక్తి. దీనినే ప్రపత్తి, న్యాసం, ఆత్మ నిక్షేపం అని కూడా అంటారు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

అన్న భగవానుడి గీతోపదేశం కూడా ఇదే. ఆత్మ నివేదనకు గజేంద్రుడు నిదర్శనంగా నిలుస్తాడు. అనేక కరేణువులతో కూడి త్రికూట పర్వత ప్రాంతారణ్యంలో విచ్చలవిడిగా విహరిస్తున్న గజేంద్రుడు ఒక మహాకాసారంలో కాలు పెట్టాడు. కొంతసేపు విశృంఖల జలక్రీడ సలిపాడు. ఇంతలో ఆ మడుగులో మనుగడ సాగిస్తున్న మకరేంద్రుడు గజేంద్రుడి కాలు పట్టుకున్నాడు. కరి మకరుల మధ్య భీకరసంగ్రామం చెలరేగింది. ఎంతో కాలం గతించింది. స్థానబలం వల్ల మకరి విజృంభణం ఎక్కువయింది. గజేంద్రుడికి తన శక్తిపై నమ్మకం సన్నగిల్లింది. దేవుణ్ణి ప్రార్థించటం ప్రారంభించాడు. తన భారం అంతటినీ ఆ భగవంతునిపై వేసి – "తన మనంబున నగ్గజేంద్రుం డీశ్వర సన్నిధానంబు గల్పించుకొని-"

లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర ! కావవే వరద ! సంరక్షింపు భద్రాత్మకా !

ఓ కమలాక్ష ! యో వరద ! యో ప్రతిపక్షవిపక్షదూర ! కు
య్యో ! కవియోగివంద్య సుగుణోత్తమ ! యో శరణాగతామరా
నోకహ ! యో మునీశ్వర మనోహర ! యో విమలప్రభావ ! రా
వే ! కరుణింపవే ! తలఁపవే ? శరణార్థిని నన్నుఁ గావవే ! (8.90,92)

గజేంద్రుడి మొర విన్నాడు శ్రీహరి. పరుగు పరుగున విచ్చేశాడు. చక్రాన్ని ప్రయోగించి నక్రాన్ని సంహరించి గజేంద్రుణ్ణి సంరక్షించాడు. పాంచజన్యాన్ని పూరించాడు. చేత్తో గజేంద్రుడి వీపు నిమిరి మడుగునుండి బయటకు

తెచ్చి, మదజల రేఖల్ని తుడుస్తూ మెల్లగా బుజ్జగించి దుఃఖాన్ని పోగొట్టాడు. మహావిష్ణువు కరస్పర్శతో దేహబాధ నశించిన గజేంద్రుడు కరేణువులతో కలసి సంతోషంతో మోహనఘీంకారశబ్దాలతో శోభించాడు. అనంతరం విష్ణురూపాన్ని ధరించి సారూప్యమోక్షం అందుకున్నాడు గజేంద్రుడు.

ఈ నవవిధ భక్తులే కాక నెలల పిల్లవాడుగా ఉన్నప్పుడే శకటాన్ని కాలితో ఆకాశంలోకి తన్ని విరుగగొట్టి శకటాసుర సంహారం చేసిన బాలకృష్ణుణ్ణి-

"అలసితివి గదన్న ! యాఁకొంటివి గదన్న !
మంచియన్న ! యేడ్పు మాను మన్న !
చన్ను గుడువుమన్న ! సంతసపడుమన్న !"

అంటూ బుజ్జగించి పాలు కుడుపుతున్న యశోదలో వాత్సల్య భక్తి,

"ఒనరన్ వ్రేతల కించు కేనియును లేకుండంగ గోపాలకృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచుం జోద్యంబుగా మ్రోయుచుం
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్శించె, బూర్వంబునన్
వనితా! యెట్టి తపంబు సేసెనొక యీ వంశంబు వంశంబులోన్"

అంటూ మురళీకృష్ణుని మురళి భాగ్యాన్ని మెచ్చుకొనే గోపికలలో మధురభక్తి,

"డింభక ! సర్వస్థలముల
నంభోరుహనేత్రుఁ డుండుననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ
స్తంభంబునఁ జూపఁగలవె చక్రిన్ గ్రికిన్"

అంటూ ఖడ్గాన్ని జళిపిస్తూ తనకు తెలియకుండానే హరినామం రెండుసార్లు ఉచ్చరించిన హిరణ్యకశిపుడిలో వైరభక్తి భాగవతంలో మనకు ప్రత్యక్షమై అమందానందాన్ని అందిస్తాయి. మహాభక్తుడూ, మహాకవీ అయిన బమ్మెర పోతరాజుగారి భక్తి సామ్రాజ్య వైభవం చిరస్మరణీయమైనది; బృహద్రమణీయమైనది.

# బమ్మెరవారి కమ్మతెమ్మెరలు

శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు

'మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః' అని పలుకుం గమ్మదనమునకు వాసిగాంచిన వాల్మీకి కవిచంద్రుని మధుర వాగ్గుంఫములను తన సొత్తు చేసికొన్నాడు పోతనామాత్యుడు. కావుననే 'విద్యావతాం భాగవతే పరీక్షా' అని కొమ్ములు దిరిగిన కోవిదులకే పరీక్షా స్థానముగా ప్రథ వహించిన శ్రీమద్భాగవతము ఆ సిద్ధహస్తుని చేతిలో 'బాలరసాలసాల నవపల్లవ కోమలమై' ఎసలారినది. ఆబాలగోపాలమునకు ఆస్వాద్యమైనది. అనువాదయుగ మారంభమైన యే నూరేండ్లకు గాని 'భాగవత దివ్యఫల రసాస్వాదయోగము' తెలుగుజాతికి కలుగ లేదు. ఆంధ్రులకీ యమృతభాండము నందించి అజరామరకీర్తి నందిన అమల చరితుడు బమ్మెరపోతన మహోదయుడు.

శాంతరస ప్రధానమైన భాగవతము అతి ప్రసన్నమైన వాతావరణములో అవతరించినది. ఈ సన్నివేశమునకును, సంస్కృత భాగవతావతరణ సన్నివేశమునకును చక్కని పోలిక కన్పట్టుచున్నది. అచట పావనమైన సరస్వతీ నదీ తీరము. వేదములు విభాగించి భారత సంహిత చెప్పి యెన్నెన్ని విధములఁగానో ధర్మములు ప్రపంచించియు హృదయములో ఏదో ఒక కొరతతో, ఏదో ఒక తపనతో వ్యాకులపడుచు విజ్ఞాని కావున వెంటనే గ్రహించి-

"హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవత విధంబుఁ బలుకనైతి
మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి"

అనుకొనుచు నిలచిన వ్యాసమహర్షి;

ఇచట పవిత్రమైన గోదావరీ పులినతలము. వీరభద్ర విజయము, భోగినీ దండకము రచించి ఏ పిన్నకైతగాడుగానో పేరొందెనేమో గాని అది తృప్తి

నొసగక కొంతకాలము కింకర్తవ్యతామూఢుడై యుండి కాలము చెల్లిపోవుచున్నదే యని డెంద మొకవంక దందడింప కుంది కుంది యింతలో పుణ్యవశమున బోధావిర్భావము నొంది శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాలోచనా పరుడగుచున్న పోతన కవి; అచట దేవర్షి నారదుడు దివి నుండి దిగివచ్చి "నీవు నిఖిలబంధ మోచనంబు కొరకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తితోడ వర్ణింపుము" అని భాగవత రచనకు ప్రేరేపించుట; ఇచ్చట శ్రీరామచంద్రుడే ప్రత్యక్షమై "మన్నామాంకితముగా శ్రీమహాభాగవతంబుఁ దెనుగు సేయుము. నీకు భవబంధములు దెగు" నని ఆనతిచ్చుట; ఉభయత్ర భాగవత గ్రంథావతారము.

పోతన్న ప్రతిభాసంపన్నుడైన మహాకవి. కావ్యవస్తువును ఏరుకొనుటలోనే కవి ప్రతిభ తెలియవచ్చును. పిష్టపేషణముగా ఒకరు చేసిన పనినే తాను చేయుట ప్రతిభ గలవాని పని కాదు. తన కాలము వరకును తెలుగులోనికి రాని మూలగ్రంథము కొరకు వెదకినాడు. ఏ అల్పపురాణమో, కావ్యమో చేపట్టి చేతులు కడిగికొని యుండవచ్చును. ఆ విశేష ప్రతిభావంతుని దృష్టి పంద్రెండు స్కంధముల మహాగ్రంథము భాగవతము మీదనే పడినది. ఒక్క పూనికతో ఇహపరములను సాధించినాడు. పురాణించుట ఆనాటి ప్రజ్ఞావంతులకు చిన్నె. పురాణింప దొరకొన్నాడు. ప్రతిభాహీనుడు సాహసము చేసినను మాట చెల్లించుకొనలేడు. ఈతడో చెల్లించుకొన్నాడు. నన్నయ తిక్కనాది మహాకవుల శ్రేణిలో నిలువగలిగినాడు. సమానులలో ఉత్తమ శ్లోకుడగుటకు మించిన యిహమేమున్నది? అటు కావ్యకళను దివ్యకళగా దిద్ది సర్వేశ్వరారాధనములో పూజాసామాగ్రి చేసి ముక్తి నందుకొన్నాడు.

మూలగ్రంథము నందలి అంశములను పెంచుటలో, త్రుంచుటలో, మార్చుటలో, తీర్చుటలో ఆతని ప్రతిభ వేయిరూపుల వెలుగొందినది. రస పోషణము, పాత్రోన్మీలనము, ఔచిత్య పాలనము వంటివి కవికి కేవలము వ్యుత్పత్త్యభ్యాసముల వలన లభించునవి కావు. అవ్వియెల్ల ప్రతిభోద్యోగమే.

సంచి మొదలులేని సెట్టి బేహారము వంటిది చదువు కండలేని కూర్పరి తనము. బహుగ్రంథావలోకనము, వైదుష్యము వలసినంతగా పోతనార్యునకు

కలవు. విద్వాంసులకే పరీక్షా స్థానముగా ప్రథ వహించిన భాగవతమును మూల కారుని హృదయము అందివచ్చునట్లు తెలిగింపగల్గిన ఈతనిది నిండైన పాండిత్య మని వేరుగా చెప్పనక్కఱలేదు. కొన్ని కొన్ని ఘట్టములలో శ్రీధరీయ చంద్రికాది వ్యాఖ్యాతల భావములను కూడ క్రోడీకరించి చూపగలిగినాడనగా అది అంతం తన పొనగు పనియా ? అందందు నిక్షేపించిన యజ్ఞగంతాది పదరత్నాలు, ప్రౌఢప్రయోగాలు, సమస్త వాక్యాలు, ఛందోలంకార శిల్పాలు, ధ్వని విన్యాసాలు- ఆతని వివిధ శాస్త్ర పరిజ్ఞానమునకు తార్కాణము. నైమిశారణ్య వర్ణనము మొదలైన కొన్ని తావులలో మూలములో లేని శ్లేషసౌభాగ్యాలు కాదంబరీ సుధారసాస్వాద సిద్ధుడు కానివాడు కూర్పగలవియేనా! ఉతడు తెలుగులోను అట్టి గట్టిదిట్టయే యనుటకు భాగవతము నందలి నూర్లకొలంది అచ్చతెలుగు పద్దె ములే సాక్ష్యమిచ్చును. సంస్కృతాంధ్రములు రెండింటను కవ్వడి యైనవాడు కావుననే-

కొందఱకు తెలుఁగు గుణమగు;
కొందఱకును సంస్కృతంబు గుణమగు, రెండున్
కొందఱకు గుణములగు; నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్

అని చెప్పి, చెప్పినట్లు చేసి మెప్పుగొన్నాడు.

పోతన కవితాభ్యాసము దొడ్డది. పద్యవిద్యలో ఆరితేరిన కొద్దిమంది కవు లలో ఈతడొకడు. ఈతని ధారాశుద్ధి అనల్పము– “పురాణింపం దొరఁకొంటి మీఁదెట్టేవెంటఁ జరింతుఁ దత్సరణి నా కీవమ్మ!” అని బ్రాహ్మీదేవిని ప్రార్థిం చిన యీ వశ్యవాక్కు కావ్య రచనా శిల్పములోని పట్టులు గుట్టులు తెలిసికొని ప్రయోగ రంగములో ప్రదర్శించి, మేల్ భళీ! అనిపించుకొన్నాడనిన అది అతని యసకృదభ్యాసశిక్షాఫలమే.

అనుగుణమైన శైలిని పొందుపరచి పోతన రసపోషణము చేయుటలోను మేటి యని వాసి గాంచినాడు. మోహిన్యవతార వర్ణనమునను, గోపీకృష్ణుల లీలల లోను శృంగార రసమును చక్కగా పోషించెను. ఒక్కొక్కచో శృంగారమును భక్తికి అంగముగా తీర్చి దానికి పావనత్వమును సంపాదించును. ఒకచో శృంగార వీరములకు సంసృష్టి ప్రదర్శించెను. శ్రీకృష్ణ నరకాసురుల యుద్ధఘట్టములో

ఇది కన్పట్టును. కంసవధము, శ్రీనృసింహావతారాదుల ప్రస్తావనములలో వీర రౌద్రాద్భుతరసములు పోషించబడిన రీతి అసాధారణము. రుక్మిని శ్రీకృష్ణుడు పరాభవించిన పట్టున హాస్యము, బీభత్సము తొణికిసలాడినవి. పుణ్యాశ్రమాదుల వర్ణన శాంతమును వెలయించును. భక్తిని రసముగా అంగీకరించినచో ఆ భక్తి రసమే ఇందు ఆమూలాగ్రము విస్తరిల్లి రాజ్యమేలుచున్న దనవచ్చును. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము— అను నవవిధభక్తియు ఆయా కథాసూత్రములతో నిబద్ధమై నవ్య నవ్య రూపములతో ఇందు భాసిల్లినది.

'ఏకస్స్వాదు న భుంజీత' అన్నట్లు లభించిన భాగవత సుధారసమును సోదరుల కెల్లరికిని పంచిపెట్టినాడు పోతన కవివదాన్యుడు. గజేంద్రమోక్షము, వామనావతారము, ప్రహ్లాద చరిత్రము, రుక్మిణీ కల్యాణము మొదలైన మధుర మధుర ఘట్టాలు ఆంధ్రుల జిహ్వాగ్రాలను అలంకరించినవి. ఇప్పటికిని ఆంధ్ర జన సందోహములో పావన భాగవత కథా శ్రవణాసక్తి మిక్కిలిగానే గోచరించు చున్నది. లోక కల్యాణాకాంక్షతో—

నిగమ కల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృత ద్రవసంయుతం
పిబత భాగవతం రసమాలయం
ముహు రహో! రసికా భువి భావుకాః!

అను వేదవ్యాసమహర్షి దివ్యవాణితో శ్రుతి కలిపి—

వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు.

అని ఆదరముతో ఆహ్వానించుచున్నాడు మహాకవి పోతనార్యుడు. "జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః."

(సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-6, 1969)

* * *

# పోతన - తిక్కన

—ఆచార్య పింగళి లక్ష్మీకాంతము

శ్రీనాథుని సమకాలికులలో ప్రథముడును ఆంధ్రకవి ప్రవక్తలలో ద్వితీయుడును అయిన పోతనామాత్యుని భాగవతము ఏల ఉత్పన్నమై బహుళ ప్రచారమునకు పాల్పడినదో చెప్పలేము. ఈ భక్తియోగి చైతన్యస్వామి కంటె నలుబది యేబది సంవత్సరములు పూర్వుడు. ఆ భక్తశిఖామణి వంగదేశమున రాధాప్రణయాత్మకమైన కృష్ణతత్వమును ప్రబోధింపక పూర్వమే ఈ భక్తశిఖామణి ఆంధ్రదేశమున నవరసమూర్తి యగు శ్రీకృష్ణతత్వమును గానముచేసి ఆంధ్రుల మనోలోకమున నొక పరివర్తనము గలిగించెను.

తెనుగున గల పురాణేతిహాసములలో భాగవతమువలె సర్వజన సమ్మతమైన గ్రంథమింకొకటి లేదు. శిల్పమున భారతము దీనికంటె మిన్నయైనను దీనివలె సార్వజనీనమైన అనురంజకత్వమును పొందలేకపోయెను. ఇందుకు రెండు మూడు కారణములు కలవు.

భారతమునందలి పరమార్థము (సంసారతరణోపాయముగా అది నిర్దేశించిన నిష్కామ కర్మయోగము) జ్ఞాన ధనులైన పరిపూర్ణులకు తప్ప అందరకును అవలంబనీయము కాదు. అది ఎంత యుత్తమ మార్గమైనను లోకము దానిననుగమింపజాలదు. ఇక భాగవతమో, సర్వజంతు తారకమగు సులభ భక్తియోగమును స్ఫుటముగా ఆదేశించెను. సంసారఖిన్నమైన లోకము, ఎట్టి జ్ఞానముతోను సంబంధము లేకుండ, పూలు పరచినట్లు మెత్తనైన యీ మార్గమున నడచి దరిజేరవలయునని ఆశించుటలో వింతలేదు. సాధారణలోకము యొక్క మనఃస్థితికిని సంస్కారమునకును అనురూపమును ప్రియమును అయిన ఈ యాలంబనము ప్రసాదించిన గ్రంథరాజమగుట చేతనే లోకము భాగవతమునెడ భక్తిబద్ధమైనది. ఆపద్వేళల గజేంద్రమోక్షమును సంజీవనీ మంత్రముగా జపించునట్టియు, గోపికాగీతలను భగవద్గీతలవలె పారాయణము చేయుచున్నట్టియు ఆంధ్రులు నేటికిని అనేకులు కలరు.

భారతమునందలి శిల్పచాతురి సర్వకళావేత్తృత గల ప్రౌఢరసికులకే గాని యితరులకు గోచరము కాదు. తిక్కన సోమయాజి భారతవిరాణ్మూర్తి నిర్మాణములో ఏ పద్యమున కెంత ప్రాధాన్యముండునో అంతమాత్రమే యిచ్చి అన్నిటి కలయికచే సిద్ధిపొందిన మూర్తి సౌష్ఠవము నెడ దృష్టి నిల్పెనుగాని, ఎచ్చటను పద్యముల సొగసు కోసమే పద్యములు వ్రాయలేదు. అందుచేతనే సందర్భము నుండి విడదీసి విడిగా అలవోకగా పాడుకొని సంతోషింపదగిన పద్యములు భారతమున మచ్చునకైనను ఉండవు. ఇక పోతన కృతములైన భాగవత పద్యములు మధురాతి మధురములై, భజనకీర్తనల వలె, పెండ్లి పాటలవలె, ఏల పదములవలె ఎల్లరును ఎల్లవేళల పాడుకొనుటకు అనువై సర్వత్ర గాలివలె వ్యాపించినవి. వానిలోని శ్రుతిలయలు ఉచ్చారణ మాత్రముననే మనస్సును తొగొనును. ఉత్తమ మధుర కవిత్వమునకు ఒక లక్షణమైన గీతి భాగవత పద్యములందు నిండారియుండుటచే వానికి ఇంత ప్రచారము వచ్చినది. కవి యనుభవించిన దారిద్ర్యము, ఆ కాళరాత్రి నెదుర్కొని పోరిన ఆయన ధీరత్వము ఆశ్చర్యజనకములై లోకమునకు ఆయన యెడ నిరతిశయ పూజ్య భావమును కలిగించినవి. ఇవిగాక ఇంకేవేని కారణము లుండవచ్చును.

స్వభావముచేత పోతన భావకవి. అందును భక్తి శృంగార భావముల వర్ణించు పట్టున అతి మాత్రమునకు పాల్పడు భావలోలుడు. ఆ ఘట్టములలో ప్రత్యక్షరమునను ఆయన యాత్మభావమే ప్రతిఫలించుచుండును. తెలుగులో నిట్టివాడు పాల్కురికి సోమనాథు డొక్కడే. పురాణ కర్తలలో ఇంత శృంగార ప్రియుడైన కవి యింకొకడు లేడు. ఆ శృంగారము ప్రబంధ శృంగారము వంటిది గాక ఆధ్యాత్మిక కోశమును ముట్టినది యగుటచే ఆ రసమునకు ఇతర కవు లెవ్వరును సాధింపజాలని పవిత్రతను పోతన సాధించెను.

ఆంధ్ర కవులలో తిక్కన సూర్యునివంటి వాడనియు, పోతన చంద్రుని వంటి వాడనియు ఒకచోట ప్రసంగ వశమున పూజ్యులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగా రనిరి. అనగా ఆంధ్ర లోకమునకు వీరిరువురును రెండు వెలుగులు. ఇరువురును తమ తమ కాలములలో తెలుగు జాతికి తెలుగు వేదములనదగిన మహా గ్రంథముల ప్రసాదించిన ఋషి పుంగవులు, ప్రవక్తలు అని

చెప్పదగిన మహాకవులు. పోతన జీవితము తిక్కన జీవితమువలె పరిపూర్ణ మైనది కాదు. ఆయన నిస్పృహత్వము కతన ఐహిక సుఖానుభవము దూర మైనది.

తిక్కన లోక ప్రవృత్తి యందువలెనే కవిత్వము నందును వ్యక్తావ్యక్త స్వరూపుడుగా పట్టువడియు పట్టువడక సంచరించును. ప్రతి వాక్యమునందును ఆయన మూర్తి స్ఫురించుచునే యుండును, మరల కాదనిపించుచుండును. ఇక పోతనయో, సంసారమున పట్టువడకపోయినను కవిత్వమున తడవినంతనే చేతికి నందును. ఇది సాధారణముగా నాటక కవులకును భావ కవులకును గల తారతమ్యములలో నొకటి.

ఛందో నిబద్ధమగు శబ్దము కళాధర్మములైన శ్రుతి లయలను ఎంత వరకు సాధింపగలుగునో పోతనవలె దృష్టాంత పూర్వకముగా చూపిన పూర్వ కవి ఇంకొకడు లేడు. ఆయన శబ్దాలంకార ప్రియత్వము దీనికి మరికొంత వన్నె పెట్టినది. సముచిత ప్రయుక్తమైన చోట ఆయన యనుప్రాసాలంకారము భాగవత కవితా గానమునకు మృదంగ వ్యాపారము నిర్వహించుచున్నట్లుండును. కవి స్వేచ్ఛగా కావించుకొను భక్తి గానము, ఆ గానమునకు ననురూపమైన మధుర పేశల శబ్దము, ఆ శబ్దముల కూర్పునకు మకుటాయమానమైన అంత్య ప్రాసము కారణములుగా భాగవత పఠనము తాళము, మద్దెల సహకారులుగా ప్రవర్తిలు గానసభ కాక మరేమగును !!

(గౌతమ వ్యాసములు, *1952*)

* * *

కుప్పించి యెగసిన కుండలమ్ములకాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న జగముల వ్రేగున జగతి గదల
చక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ బైనున్న పచ్చనిపటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు మన్నింపుమని క్రీడి మరలఁ దిగువ
కరికిలంఘించు సింహంబు కరణి మెఱసి నేఁడు భీష్మని జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున ! యనుచు మద్విశిఖవృష్టిఁ దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

# పోతన – శ్రీనాథుడు

శ్రీ వానమామలై వరదాచార్యులు

"విశ్వశ్రేయః కావ్యమ్" అని ఆదికవి నన్నయ భట్టారకుని శ్రీసూక్తి. ఏనాడును లోక కళ్యాణమే కవితాధ్యేయ మౌనని పై సూక్తివలన మనకు దెలియు వచ్చుచున్నది.

కవి ఋషి కావున విశ్వశ్రేయము నభిలషించును. అతడు ఏ స్వార్థశక్తులకును లొంగిపోవువాడు కాదు. ఆత డాశనే జయించిన ధీరోదాత్తమానసము గల మహా మనీషి. ప్రపంచములో స్వార్థ మతిగా బలిసి బలవంతుడు బలహీనుని వంచనాశక్తి ధర్మశక్తిని పీడించి విక్రమించుచున్న సమయమున కవి కలము శూరుని శస్త్రమువలె విజృంభించి ధర్మపక్ష జయమునకు తగు యత్న మొనరించు టకునై రుద్రవీణలపై వీరగీతము లాలపించును. అతడే నిజమైన కవి. పద్యము లల్ల నేర్చినంతనే కవి గాజాలడు. ప్రతిభావంతముగా, కాంతాసమ్మితముగా, రమణీయార్థ ప్రతిపాదక శబ్దసంచయముతో నన్యాపదేశముగా నుపదేశమొనర్చు నాతడే మహాకవి. అతడు ప్రజాహృదయముల మేల్కొలుపు వైతాళికుడు. మహాకవు లందర ట్టివారే.

కవిత్రయము వారు భారతమును వ్రాసి కౌరవ పాండవుల మనస్తత్వమును చిత్రించి దైవీప్రవృత్తిలో రాక్షసప్రవృత్తికి నేనాడు నపజయము తప్పదని చాటినారు. భాస్కరాదులును రామాయణమును వ్రాసి యదే యుపదేశము నొనర్చినారు. ఆ పిమ్మట శ్రీనాథ పోతన లుదయించి యాంధ్రవాఙ్మయమును సుహృత్సమ్మితమగు పురాణమార్గము నుండి కాంతా సమ్మితమగు నుపదేశమొసంగు కావ్యమార్గమున నడిపించినా రనవచ్చును. పోతన భాగవత పురాణమును రచించినను నందు ప్రబంధ ఫక్కియే యందచందముల దిద్దితీర్చికొనిన దనవలెను. ప్రహ్లాద చరిత్రము, గజేంద్ర మోక్షణము, రుక్మిణీ కళ్యాణము, శ్రీకృష్ణ చరిత్రము, వామన చరిత్రము, కుచేలోపాఖ్యానము మున్నగునవి యే

కథ కా కథ స్వతంత్ర కావ్యము లనునట్లు మెరుగులు దిద్దికొని విరాజిల్లినవి. రసౌచిత్యాలంకారశోభలతో రాణించినవి.

ఈ యిరువురిలో శ్రీనాథుడు భోగి, పోతన యోగిగా గనబడుదురు. ఒక రాంధ్ర కోస్తా జిల్లాలలో, మరియొకరు తెలంగాణములో జన్మించినారు. శ్రీనాథుడు రాజుల నాశ్రయించి సమస్త రాజభోగముల ననుభవించినాడు. పోతన రాజులకు తన గ్రంథ మంకితమీయ నిరాకరించి ఐహికాముష్మిక ప్రదాతయగు శ్రీరామ చంద్రుని కర్పించుటలో దారిద్ర్యమును, కష్టములను సైతము సరకు గొనలేదు. ఈ యిరువురు తూర్పు పడమరలవంటి విభిన్నమార్గములతో నడచియు సాహిత్య ప్రపంచమున సమానమగు కీర్తి సంపదల నార్జించినారు.

శ్రీనాథుడు పండిత ప్రపంచమున కెక్కువ యిష్టుడై పండితా ఖండలుడని పేరు వడసినాడు. పోతన భక్తశిఖామణిగా వాసికెక్కి పండిత పామర ప్రపంచముచే తలదాల్పబడినాడు. శ్రీనాథుని కవితలో ప్రౌఢిమ, గాంభీర్యము మెండుగా నుండును. పోతన పద్యరచనలో ప్రసన్నత, మాధుర్యము, శబ్దసౌందర్యము అతిశయముగా నగపడును. శ్రీనాథుని రచనలలో శృంగారము ప్రధానముగా నుండును. పోతన కృతులలో భక్తి ప్రధానమైన రసము. శ్రీనాథుని స్వభావములో నాడంబరము, అహంభావము విశేషముగా నున్న, పోతనలో నాత్మాభిమానము, నిరాడంబరత సాక్షాత్కరించుచుండును. శ్రీనాథుడు పాకనాటి నియోగి ననియు, భరద్వాజ గోత్రుడననియు, ఆపస్తంబ సూత్రుడననియు, భీమాంబా మారయామాత్యుల పుత్రుడననియు, కాల్పట్టణమునకు జెందిన కమలనాభామాత్య పౌత్రుడననియు వెల్లడపరచికొనినాడు. పోతన కౌండిన్య గోత్రము వాడననియు, కేసన లక్కాంబలకు పుత్రుడననియు, తిప్పన కనుజన్ముడననియు, ఏకశిలా నగరము నివాసముగా గలిగి యున్నట్లు చెప్పికొనినాడు. శ్రీనాథుడు 14 వ శతాబ్ది యుత్తరార్థమున బుట్టి 15 వ శతాబ్ది పూర్వార్థమున నుండి సుమారు 75 సంవత్సరములు జీవించినట్లు తెలియుచున్నది. పోతన 15 వ శతాబ్ది పూర్వార్థము చివర నుదయించి యుత్తరార్థమున జీవించియున్నట్లు తెలియవచ్చును. పోతన భోగినీ దండక కృతిని రావు సింగమహీపాలునకు నంకిత మొసంగుటయు, శ్రీనాథుడును తాను శారదను ప్రార్థించుచు "ఎటుల మెప్పించెదో నన్ను నింక మీద, రావు సింగమహీపాలు నిండుకొలువున" అని సర్వజ్ఞ సింగభూపాలుని

యాస్థానమునకే వచ్చినట్లు చెప్పికొనుటచే పోతన శ్రీనాథు లించుమించు నిరువు రేకకాలము వారేనని చెప్పినచో తప్పేమి లేదు. కాని వయస్సున పోతన కంటె శ్రీనాథుడు చాల పెద్దవాడని చెప్పగా నొప్పును. వీరిరు వురకును బాంధవ్యము నుతువు గాథలు ప్రజాముఖముల రూఢియై వెలయుట దక్క నిరువురు బంధువు లనుటకు చారిత్రకాధారము లేవియు దొరుకుటలేదు.

శ్రీనాథుడు తానాంధ్ర సాహిత్య క్షేత్రమున విశృంఖల విహారమొనర్చి యెదురెవ్వరులేని యెక్కటి వీరుడై తన యుగము నొకదానిని స్థాపించుకొనినాడు. ఇతడనేక గ్రంథములను సంస్కృతము నుండి తెనుగు నొనర్చి కావ్యరూపముల దిద్దితీర్చినాడు. అందు హర్షనిర్మిత నైషధ కావ్యము గణుతి కెక్కినది. ఈ కావ్యానువాదమున నితడు మూలమును మించి యొక్కొక్కచో దన ప్రతిభను ప్రకాశింపజేసికొనినాడు. ఇది యొక్కటే కాక యింకను హరవిలాసము, భీమేశ్వరపురాణము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యము, క్రీడాభిరామము, పల్నాటివీరచరిత్రము మున్నగు గ్రంథముల నెన్నింటినో రచించెను.

ఇక పోతన కవీంద్రుని నివాసము తేనె మాగాణమగు తెలంగాణములోని ఏకశిలానగర సమీపమున గల బమ్మెర గ్రామములో నని చారిత్రకులు తేల్చి చెప్పినారు. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు, శ్రీ దూపాటి వేంకట రమణా చార్యులు గారు ముక్తకంఠముతో దీనిని ధ్రువ పరచినారు. కాని శ్రీ వావిలికొలను సుబ్బారావు గారు మాత్రము ఇతడొంటిమిట్టవాడేయని గట్టిగా వాదించుచు వచ్చినారు. ఇది చరిత్ర పరీక్షకు నిలువలేక పోయినది.

పోతన వంశమువారు శివభక్తులనుట కనేక సాక్ష్యము లున్నవి. తిప్పన 'ఈశ్వరసేవాకాము'డని, కేసన 'మనియె శైవశాస్త్రమతము గనియె'నని, లక్కాంబ 'సదాశివ పాదయుగార్చనానుకంపానయవాగ్భవానికిని బమ్మెర కేసన లక్కసానికిన్' అని చెప్పికొనినాడు. అయ్యెను తిక్కన హరిహరనాథు నద్వైతమూర్తిగా నుపాసించినటులే పోతనయు రామునిలో శివకేశవుల సమైక్య రూపమును గాంచి యుపాసించినాడు. మాధవ మంత్రమునకు 'రా' జీవము, శివ మంత్రమునకు 'మ' జీవమై రెండక్షరముల కలయిక గనిన "రామ" శబ్ద మితని యద్వైతభావనకు సరిపోయినది.

పోతన భోగినీ దండకము వ్రాసియు, గోపికల శృంగారభంగుల వర్ణించియు భక్తకవిగా పూజింపబడినాడు. ఇతని రచనలలో శృంగారమునకు తక్కువేమియు లేదు. 'కాటుక కంటి నీరు చనుగట్టు పయింబడ నేల నేడ్చెదో కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ!' యని అంబ శబ్దముతో పై నుడివిన పద్యములోని శృంగారమును పవిత్ర పరచినాడు. 'ఓహో! వెరువకుమని తామాహరికిని శ్రీ కుచంబు లభయం' బిచ్చినవట. చలికి వెరచికొనిన శ్రీపతిని గూర్చియు నిట్లాడుటకు వెనుదీయలేదు. ఇట్లెన్నేని జూపించవచ్చును. భక్తి శృంగారరసము లీతని సొమ్ములు. ఇతని కవితలో శబ్దసౌందర్యము పోషించుటకై యర్థగౌరవమును చెరచుకొను బాహ్యాడంబరము గానరాక పోవుటనది పండిత జనమాననీయమై వెలసినది. శబ్దార్థములు సుందరములై పార్వతీ పరమేశ్వరులవలె నల్లుకొని పాఠకుని పరవశింపజేయును. భాగవతములోని రీతి వైదర్భి విధానమునకు జెందినది. అది శ్రోతల హృదయము నానందవార్ధి ముంచివేయును. తన పురాకృత శుభాధిక్యంబు వలన తనకీ భాగవతానువాదము లభించెనని చెప్పినాడు. నిర్గర్వియై 'శ్రీకైవల్య పదంబు గోరి' భాగవతరచన కుపక్రమించెను.

భక్తిపరములైన పోతన పద్యములు రత్నములు. అవి రాని యాంధ్రుడే లేడనవచ్చును. 'లావొక్కింతయు లేదు' 'మందార మకరంద' 'ఎవ్వనిచే జనించు' మొదలైన పద్యములు కంఠస్థము లైనవారు పెక్కురున్నారు. ఇంతటి భక్తకవి హిందీలో తులసీదాసు తక్క నింకెవరును కనబడరేమో! ఎంత భక్తుడో యితడంత యాత్మాభిమానము గల కవి యగుట తన భాగవతము నధికారమధుపాన మత్తబధిరాంధులగు రాజుల కీయక రామచంద్రున కర్పించినాడు. ఇట్టి పోతన తెలుగుల పుణ్యపేటి కాదా! అతని గన్న ఆంధ్రమాత ధన్య. సమ్మాన్య. శ్రీనాథు డెంతయు పండితుడై మహాకవియై సుఖదుఃఖములను ద్వంద్వముల వలలో జిక్కుకొనినాడు. కాని పోతన ద్వంద్వాతీతుడై జనన మరణరహితమైన కైవల్యపదంబు గాంచినవాడనిన సత్యదూరము గాదు. ఆంధ్ర భాగవత కవిత వంటి కవిత, పోతన వంటి ఆత్మాభిమానము గల కవి 'న భూతో న భవిష్యతి' యని చెప్పవలసినదే.

(తెలుగువాణి, 1975)

* *

# పోతన కవితోన్మీలనము

—శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

భారతీయ సాహిత్యమున దేదీప్యమానములైన విశ్వవిఖ్యాతములైన మహా గ్రంథములలో భారత భాగవత రామాయణములను మించినవి మరి లేవు. ఇవి వేదముల తరువాత చెప్పదగిన రసామ్నాయములు.

సర్వకాలములందు సర్వదేశములకు ధర్మదీప్తిని ప్రసాదించు కృతిరత్న జ్యోతులివి. అనంతమైన కాలమునకు అక్షరానుసంధానము చేయుచున్న సంధ్యాత్రయ మెట్టిదో ఈ గ్రంథత్రయమట్టిది.

ఋషివర ప్రణీతమైన ఈ కృతిత్రయ పరమార్థము తాత్పర్యతః ఒక్కటే అయినను ప్రక్రియాభేదము కలదు. భారతము మహేతిహాసము, భాగవతము మహాపురాణము, రామాయణము మహాకావ్యము.

పురాణము అర్థప్రవణమై మిత్రునివలె ఉపదేశము చేయును. కర్తవ్యమును బోధించును. కాంతాసమ్మితమైన కావ్యము వ్యంగ్య మర్యాదలో ఉపదేశించును.

కవికుల ప్రపంచమంతయు వ్యాసవాల్మీకి ముఖని స్సృతమైన శబ్దబ్రహ్మము యొక్క వివర్తము.

"వాల్మీకి బాదరాయణ
మునియుగముఖ నిస్సృతస్య శబ్దస్య
బ్రహ్మాత్మనో వివర్తః
స్ఫురతి మహాన్ కవిజనప్రపంచః."

శ్రీమద్భాగవతము అష్టాదశపురాణములలో నొకటి. ద్వాదశస్కంధాత్మకము. సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతి (కర్మవాసన), మన్వంతరము, ఈశానుకథలు, నిరోధము, ముక్తి, ఆశ్రయము- ఈ పది మహా పురాణ లక్షణములు. ఆశ్రయ తత్త్వజ్ఞానార్థమే సర్గాది నవ లక్షణముల

ప్రతిపాదనము భాగవతమున చేయబడినది. "దశమస్య ఆశ్రయస్య విశుద్ధ్యర్థం తత్త్వజ్ఞానార్థం నవానాం లక్షణం స్వరూపకథనం ఏకస్యైవ ప్రాధాన్యాన్నాయం దోషః" అని శ్రీధరీయము.

ఆభాసశ్చ నిరోధశ్చ యతశ్చా ధ్యవసీయతే
స ఆశ్రయః పరంబ్రహ్మ పరమాత్మేతి శబ్ద్యతే.

అవిద్యచే అధ్యస్తమైన యన్యథారూపము (కర్తృత్వాదికము) తొలగి స్వస్వరూపముతో ఉనికి ముక్తి. తదాశ్రయము పరబ్రహ్మము; పరమాత్మ; శ్రీకృష్ణభగవదవతారము.

ఏవంవిధ తత్త్వనిరూపకము భగవద్భక్తి ప్రబోధకమునైన శ్రీమద్భాగవతము 'పారమహంస్యము' గా 'సాత్వత సంహిత' గా 'హయగ్రీవ బ్రహ్మ విద్య' గా యోగిజన భక్త సంతాన సంతారకమైన మహాపురాణము. భాగవతము నిగమ కల్పతరు ఫలముగా అభివర్ణితము. పద్మపురాణము భాగవతమును బహుధా కీర్తించినది-

"వేదోపనిషదాం సారా జ్జాతా భాగవతీ కథా
అత్యుత్తమా తతో భాతి పృథగ్భూతా ఫలోన్నతిః."

వేదముల ఉపనిషత్తుల యొక్క సారమే భాగవత కథ. దానికంటె వేరై ఉత్తమఫలాకృతి దాల్చి విరాజిల్లుచున్నది. వేదము కల్పవృక్షము. ఆ చెట్టున ఒక పండు పండినది. ఆ ఫలము వృక్షముకంటె పృథగ్భూతమై అత్యుత్తమమై ఆస్వాదయోగ్యముగా నుండుట సహజము. ఫలవృక్షములతో ఆమూలపల్లవము రసము వ్యాపించియుండును. కాని యా రసము ఆస్వాదోచితము కాదు. ఆ రసమే ఫలరూపము దాల్చినపుడు సర్వమనోహరము, సమాస్వాదయోగ్యము నగుట సంభవించును. భాగవతమట్టి రసవత్ఫలము.

"వేద కల్పవృక్ష విగళితమై శుక
ముఖ సుధా ద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫలరసా స్వాదన
పదవి గనుడు రసికభావ విదులు."

అన్నారు పోతన్నగారు. బ్రహ్మ సమ్మితమైన శ్రీమద్భాగవతము భక్తిజ్ఞాన విరాగముల స్థాపనకై ప్రవృత్తమైనది. వేదవేదాంగ సుస్నాతుడైన వ్యాసభగవానుడు గీతాగర్భితమైన భారతమును రచించి కూడ చిత్తశాంతి లేకయున్న సమయమున నారదుడు చతుశ్శ్లోక సమన్వితమైన భాగవతమును ఆయన కుపదేశించెను. తదుపదిష్టుడైన వ్యాసమహర్షి లోకానుగ్రహార్థము మహాభాగవత నిర్మాణము కావించెను. "జన్మాద్యస్య యతః" అను బ్రహ్మసూత్రముతో మహాభాగవత శ్లోక మారంభమగుట యందలి విశేషముగా శ్రీధరులు వక్కాణించియున్నారు.

భాగవతమున కేవలము ఈశ్వరారాధన లక్షణమైన ధర్మమే నిరూపితమగుచున్నది. ఫలాభిసంధి లక్షణమైన కైతవ మచ్చట లేదు. అమత్సరులైన సత్పురుషులకు భూతానుకంప గలవారికి వేద్యమైన వాస్తవము. అది శివప్రదము, ఆధ్యాత్మికము, ఆధిభౌతికము ఆధిదైవికమునైన తాపత్రయమును ఉన్మూలించు వస్తువు. అది భాగవత బ్రహ్మవస్తువు. వస్తువు యొక్క అంశము జీవుడు. వస్తువు శక్తి మాయ. వస్తుకార్యము జగత్తు. "తత్ సర్వం వస్త్వేవ." నిర్గుణ బ్రహ్మోపాసనకు అచ్యుత భావము రుచి చూపించుట భాగవత లక్ష్యము. భాగవత భక్తి బహుజన్మల సుకృతము వలనగాని లభింపదు. భాగవత శ్రవణేచ్ఛ గల మానసము పరమేశ్వరుని నివాసము.

తెలుగుదేశములో బమ్మెర పోతనగారి ఆంధ్ర మహా భాగవత మవతరించిన తరువాత మూలము నందలి యుపాఖ్యానములకు సార్వజనీనమైన వ్యాప్తి చేకూరినదనుట అధికోక్తి కాదు. శ్రీకృష్ణపరబ్రహ్మ చరిత్రము నానావిధములైన ఆఖ్యానోపాఖ్యానములతో ఉపబృంహితము. పరీక్షిత్తు ఏడు దినములలో తనకు ముక్తి రావలయునని ప్రతీక్షించుచున్న ఉత్తమ శ్రోత. అవధూతవరేణ్యుడగు శుకయోగీంద్రుడు భాగవత వక్త. శ్రోతృ వక్తల వైశిష్ట్యము సకల లోక శ్లాఘనీయము. శ్రోతకు వక్త వినిపించిన ఉపాఖ్యానము లన్నియు జ్ఞాన వైరాగ్య బోధకములు; భక్తి ప్రఖ్యాపకములు. శుకయోగి పరీక్షిత్తునకు మున్మొదట చెప్పినది ఖట్వాంగోపాఖ్యానము. గంగాతీరమున ప్రాయోపవిష్టుడై ఉన్నాడు పరీక్షిత్తు. శృంగి శాపము కారణముగా ఏడు దినములలో తనకు శరీరత్యాగము తప్పదని తెలియును. అట్టి సమయములో పూర్వపుణ్య వశమున తనంత తానుగా శుకుడు భాగవత వక్తగా పరీక్షిత్తునకు ప్రత్యక్షమైనాడు. "ఏడు రోజుల దాకా

ఎందుకు? రెండు గడియలలో మోక్షమును సంపాదించిన ఖట్వాంగుడున్నాడు" అని ఉదాహరించి పరీక్షిత్తునకు గోవింద నామకీర్తనమున చిత్తమును సమారూఢము చేసినాడు శుకయోగి.

ఖట్వాంగోపాఖ్యానము అమృత బిందువువలె శ్రోత యొక్క అంతరంగమునకు కైవల్యానంద ప్రవేశికయైనది. భాగవతము పండ్రెండవ స్కంధము చివర మార్కండేయ గాథ కలదు. ఈ విధంగా ఖట్వాంగ మార్కండేయోపాఖ్యానములను ఆద్యంతము లందుంచుకొని బహూపాఖ్యానములను భాగవతము సూత్రపరచు చున్నది. ధ్రువోపాఖ్యానము, పృథు చరిత్రము, పురంజనోపాఖ్యానము, అజామిళోపాఖ్యానము, ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షము, వామన చరిత్ర, కుచేలోపాఖ్యానము, రుక్మిణీ కల్యాణము - ఏ ఘట్టము గైకొన్నను ఏ యుపాఖ్యానము భావించినను పోతన మహాకవి కవితోన్మీలనము సహృదయ చేతోవీథికి మేలుకొలుపు చేయును.

పోతన పూర్వజన్మ సహస్ర సంచితమైన తపఃఫలానుభవము కలవాడు. సహజ పాండిత్యుడు. పోతన గురుకుల క్లిష్టుడు కాదని కొందరు లాక్షణికులు చేసిన యాక్షేపమును చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు పరిహరించుచు వ్రాసిన వ్యాసము జ్ఞప్తికి దెచ్చుకోదగినది.

గురుశుశ్రూష కవితాప్రాప్తికి ప్రధాన కారణమైనను పూర్వజన్మ పరిపాక వశలబ్ధమైన కవిత అక్కడక్కడ గన్పట్టును. పోతన అట్టివాడు. దేవతా వరప్రసాద లబ్ధమైన కవిత్వము సహజము. కాళిదాసాదు లట్టివారు. "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అన్న కాళిదాసోక్తి పోతనయెడ సంగచ్ఛమాన మగుచున్నది. చదవకుండ విద్వాంసులైన వారిని గూర్చియే పాణిని 'తదధీతే తద్వేద' అను నధికార సూత్రము చెప్పెను. ఆయా శాస్త్రములు చదివిన వారితో పాటు చదవకయే తెలిసికొన్న వారి యెడల కూడ ఆ సూత్రము ప్రవర్తించుచున్నది.

పోతన పుట్టుకతో భాగవత నైష్ఠికుడు. శ్రీకైవల్య కాంక్షతో మహానందాంగనాడింభకుని చింతించిన భక్తాగ్రణి. నన్నయ తిక్కనాదులు తెలుగు చేయక విడిచిన భాగవతమును తన పురాకృత శుభాధిక్యముగా భావించి ఆంధ్రీకరించుటకు

సంకల్పించినవాడు. ప్రాచీన కవుల యెడల పోతనకు గల గౌరవము నిర్వ్యాజమైనది. వాల్మీకి, వ్యాసుడు, బాణుడు, కాళిదాసు, భారవి, మాఘుడు- పోతనకు వినుతిపాత్రులు. పోతన దృష్టిలో నన్నయ ఆంధ్రకవితా గౌరవజన మనోహారి; తిక్కన హరిహర చరణారవిందవందనాభిలాషి. ప్రాక్తన కవుల యెడల భక్తి ప్రకటనము చేయుటే కాక పోతన వర్తమాన కవులకును ప్రియము పలికిన నిర్మత్సరుడు. అంతకంటె జెప్పదగిన మహాలక్షణము భావికవులను బహూకరించుట. ఆంధ్ర కవులలో కాలత్రయ జ్ఞానస్ఫూర్తిగల మహాత్ముడు పోతన.

ఆయన భాగవత కావ్యోపక్రమణము విలక్షణము, అనితర సాధారణమైనది. రాకా నిశాకాలము. చంద్రోపరాగము. గంగా స్నానము గావించి ఇసుక తిన్నెపై గూర్చున్నాడు. మహేశ్వరధ్యానములో నున్నాడు. లోచనములు కించి దున్మీలితములు.

"మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి
నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగి
బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహితభానుని భంగి
ఘనకిరీటము దలఁ గలుగువాఁడు

పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు
వెడఁదయురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె."

ఆయనకు గోచరించిన రాజశేఖరుడు రామభద్రుడు. "మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము, నీకు భవబంధంబులు దెగు" నని యానతిచ్చి తిరోహితుడైనాడు. తన కుతూహలము శ్రీమన్నారాయణ కథా ప్రపంచ రచనకు. తానప్పుడు చేసినది మహేశ్వరధ్యానము. తనకు గోచ

రించినవాడు రామభద్రుడు. ఆ నారాయణు డెవ్వడు ? ఆ మహేశ్వరు డెవ్వడు? ఆయా వ్యవహారము పరతత్త్వమునందే. అద్వైత వాసనావాసితములైన పోతన మహాకవి నయనాబ్జములలో సరస్వతీ సమున్మీలనము !

యదున్మీలన శక్త్యైవ విశ్వ మున్మీలతి క్షణాత్
స్వాత్మాయతన విశ్రాంతాం తాం వందే ప్రతిభాం శివామ్.

గంగాతీరమున సంకల్పోదయము. ఏకశిలానగరమున ఆంధ్ర మహాభాగవతావతరణము. యావదాంధ్రమున ఆబాల గోపాలము దానికి వ్యాప్తి.

ప్రబ్బిన భక్తిని హరిపై
గబ్బంబులు చెప్పి కవులు కైవల్యశ్రీ
కబ్బుదురట! హరి పోషణ
మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురో తుదిన్.

నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార! నాకు దయసేయగదే !

మన సారధి మన సచివుడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుఁడున్
మన విభుఁడు గురుఁడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా !

ఈ కందముల మందార మకరంద మాధుర్యము అనిర్వచనీయము. పోతనగారి పద్యమునకు కథా సందర్భము చెప్పనక్కరలేదు. ఏ పద్యము నెత్తుకొన్నను అది యెక్కడిదో యిట్టే పట్టివేయవచ్చును. భాషలో పరిశ్రమ చేసినవాడు సరే- సాధారణ పాఠకుడు, లిపిజ్ఞానము లేనివాడు, బాలుడు, స్త్రీ- భాగవత పద్యములను చదువుట మన తెలుగునాట క్రొత్తకాదు.

వ్యాప్తిం జెందక వగవక
ప్రాప్తంబగు లేశమేని పదివేలనుచున్
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నైన జక్కంబడునే !

అని పోతన్న వామన చరిత్రలో చెప్పినాడు. ఆయన ఉన్నదానితో తృప్తిపడి వ్యాప్తి కొరకు దొర్లాడక ఈశ్వరాధీనబుద్ధితో బ్రతికినవాడు. ఆశాపాశమును త్రెంచుకొన్నవాడు. అయిన నేమి ? సర్వాశావాసితమైన స్వచ్ఛయశస్సు గడించుకొన్న దాయన తెలుగు భాగవతము. పోతనగారి పద్యములకు గల బహుముఖ వ్యాప్తి మఱి యే కవి పద్యములకున్నది ?

తెలుగువారికే కాదు, పాశ్చాత్యులకు కూడ పోతన కవిత పారాయణ పరిపాటికి వచ్చిన నిదర్శనములు గలవు. బ్రౌనుదొర మన రాష్ట్రమున ఉద్యోగ ధర్మము నిర్వహించుచు తెనుగు వాఙ్మయమునకు అఖండమైన అమరమైన సపర్య చేసిన మహామహుడు. ఆయన మండలాధికారిగా ఉన్న సందర్భములో ఒక పేద ధనార్థియై బ్రౌను దొరగారి పేర-

లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర ! కావవే వరద ! సంరక్షింపు భద్రాత్మకా !

అను పద్యము దరఖాస్తు చేసెను. బ్రౌనుదొర పోతన పద్యములు వచ్చినవాడు కదా! ఈ దిగువ పద్యమును దానికి బదులుగా వ్రాసి పంపెనట.

ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబు లోపలన్
మానుము, సంభవంబు గల మానవకోట్లకు జావు నిక్కమౌ
గాన హరిందలంపు మిఁక గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! చెందెదవు మాధవలోకనివాస సౌఖ్యమున్.

ఆయా కథా సందర్భములలోని పద్యములు పోతనగారివి తెలుగు నాటనే కాక యితరత్ర నోటనోట విహారము చేయుచున్నవనగా ఆ మహాకవి వర్ధో

మాధుర్యము, భావదీప్తి యెంతటివో! పోతన కవివరుని ''పంచశత జయంతి'' తలపెట్టుట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారి సారస్వత ప్రీతికి చెరగని గుర్తు.

గోపాల శిశు మౌళి కుటిల కుంతలపాళి
 వక్రోక్తిలీల రాబట్టినాడు
వ్రజబాలు సుషిరరావమున నవిచ్చిన్న
 వాఙ్మహస్సులు గిలుబాడినాడు
వెన్నుని తల నెమ్మిపింఛమ్ములో వర్ణ
 విన్యాసరుచి కొల్లబెట్టినాడు
నవనీత దస్యు వెన్నడి సమాసపు వెన్న
 పూసలు కొసరి కాజేసినాడు
లేదుపో! తన కెక్కడి పేదతనము
భాగవత రూప జాతరూపమ్ము ధనము
నతడు రాసులు వోసె సర్వాంధ్రజాతి
కారగింపుగ రసమయంబైన యాస్తి.



—(०)—

మందారమకరంద మాధుర్యమునఁదేలు మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీవీచికలఁదూఁగు రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవ ఖాదియై చొక్కు కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక మరుగునే సాంద్రనీహారములకు
అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు వినుతగుణశీల! మాటలు వేయునేల!

# నేను బమ్మెర వారి బాలకృష్ణుడను

— డాక్టర్ ధారా రామనాథశాస్త్రి

ఏ మనిషి జీవితంలో నైనా బాల్యం చాలా ముఖ్యమైన ఘట్టం. కల్లా కపటం తెలియని వయస్సు. అచ్చ పాలపొంగులాగా స్వచ్ఛమైన మనస్సు. ఇరుగు పొరుగు వాళ్ళతో మాట్లాడినా పోట్లాడినా దోచినా దొంగిలించినా అదొక అందం, ఆనందం.

చూడండి- మీ యింట్లో పాలు మా యింట్లో పాలు అని అడ్డుగోడలు మనం కట్టుకున్నామే కాని అసలు పాలకి ఆ తేడా తెలియదు. తన దూడకు మాత్రమే యీ పాలు దక్కాలి, ఇంకెవ్వరికీ చెందకూడదు అనుకొనే ఆవు ఎక్కడన్నా ఉందా? మనిషే నీచుడై ఆవుపాలని లేగదూడకు సైతం పూర్తిగా దక్కనీక దొంగలాగా హరిస్తాడు. అమ్ముకుంటాడు. మేదలు కదతాడు. కదకి ఆ లేగ పాలుచాలక కన్నుమూస్తే దాని తోలును దూదితో నింపి ఆవుకి లేగదూడ బ్రతికే ఉన్నదనే భ్రాంతి కల్పించి పాలు గుంజుతూనే ఉంటాడు. ఆవుకిమాత్రం తన పాలు అన్న అహంకారంకాని, అవి తన లేగకే చెందాలన్న మమకారం కాని లేవు. అందుచేతనే ఆవు దేవుడు.

ప్రవహించే ఏళ్లకీ, దప్పి తీర్చే నీళ్ళకీ, కొండ కొమ్మున కరళ్ళయిన వెన్నెలకీ, చల్లగాలికీ, నింగి మబ్బుకీ, నేలతల్లికీ ఎవ్వరికీ లేని స్వార్థం ఈ మనిషి అనే పశువులో కరుడు కట్టింది. ఈ మనిషే పిల్లవాడిగా ఉన్నప్పుడు వెన్నెలకు మల్లెనే, పాలనురుగుకు మల్లెనే స్వచ్ఛంగా ఉంటాడు. ఎదిగే కొద్దీ గిడసబారి అన్నీ తనవే అనీ, అంతా తనదే అనీ స్వార్థానికి దిగుతాడు. మనసు మొదరక ముందు మంచి సంగతులపై బుద్ధికుదిరిన వీడే దేవుడు- లేదా వీడే జీవుడు.

అందుకనే ఎల్లకాలానికీ పిల్లవాడిలాగా మసలటమంటే ఏమిటో చెబుదామనీ, నీవూ నేనూ అంటే మనం కలిసి మందగా ఆందంగా బ్రతకటమంటే ఏమిటో నిరూపిద్దామనీ దివినుండి భువికి దిగివచ్చాను. ఆలనాడు వ్యాసులవారూ, అయిదువందల ఏళ్ళక్రిందట బమ్మెరవారూ, ఆనందమూర్తులైన వ్రజవాసులూ నన్ను కని విని పెంచి లాలించి మురుస్తుంటారు; తరిస్తుంటారు.

అసలు నా స్వరూపం సర్వాంతర్యామి అయిన విష్ణుత్వం. అప్పుడప్పుడు పరిమితత్వానికి చిహ్నంగా కిరణమయములైన ద్వారాలలో బద్ధుడనై దర్శనమిస్తుంటాను. ఇట్లా కనిపించే నా వైభవాన్ని కీర్తించటానికి మహర్షులు నేను చెరసాలలో పుట్టినట్లు వర్ణించారు. మహర్షులు మహానుభావులు. నా తత్త్వాన్ని లోకసంగ్రహబుద్ధితో దర్శించి అపౌరుషేయములైన ఋక్కులుగా రూపొందిన వాక్కులుగా కటాక్షిస్తారు. నిజమే, వారికి ఒకానొక అవిష్టమైన చేతనస్థితిలో నేనే ఒక రమణీయ స్ఫురణగా భాసిస్తాను. దానిని జాగ్రత్తగా పసిగట్టి విని కని శబ్దార్థసౌందర్యం కలిగిన ఒక మహాసృష్టిగా రూపొందిస్తారు. ఇందులో వారి సొంతం ఏమీలేదు. ఉన్నది ఉన్నట్లుగా, కన్నది కన్నట్లుగా, విన్నది విన్నట్లుగా చెప్పిన ఇటువంటి వాళ్ళని ద్రష్టలనీ, స్రష్టలనీ సంభావించి లోకం ఋణం తీర్చుకుంటుంది. నిజానికి వాళ్ళనే కవులనాలి. "నన్ను" చెప్పే ఈ కవులున్నారే-వీళ్ళు ఎల్లకాలానికీ, ఎల్లలోకాలకీ ఋషుల వంటి కవులవుతారు. నా చెరసాల పుట్టుకను విష్ణుసూక్తంలో దర్శించినవారు అటువంటివారే. ఇతర ఋషులు నన్ను ఎల్లప్పుడూ మీకు మీ భాషలో చెప్పటానికే యత్నం చేశారు. చేస్తున్నారు. చేస్తారు.

ఇంత అందమైన నా కథని సంకేతంగా వేదసంప్రదాయంగా పెద్దలెందరో అపౌరుషేయ మార్గంలో ప్రవచించారు. వ్యాసులవారు సంప్రదాయ రహస్యాలన్నింటినీ కథలుగా మార్చి కవిత్వాన్ని చేర్చి మానవకోటికి శాశ్వతంగా చర్వణ యోగ్యం చేశారు. అందుచేతనే ఆయన అటు వేదవ్యాసులు, ఇటు కవివ్యాసులు.

తెలుగు భాషకి చెందినంతవరకు పోతనగారు కవిత్వాన్ని ఒక ప్రస్థానంగా దర్శించి తాము తరించి తెలుగువారిని తరింపజేయటానికి యత్నించిన మహనీయుడు. అందుచేతనే కావ్యకాంతల విషయంలో ప్రహ్లాదత్వం (కన్నుదోయికి

నన్యకాంత లడ్డంబైన మాతృభావము చేసి మరలువాడు) నెరపే తెలుగువాళ్లు సైతం ఆయనకి ఓ పూజాపీఠం పెట్టి గౌరవిస్తున్నారని తెలిసి సంతోషం కలిగింది. ఐమ్మెర వారి సాహిత్యాన్ని బళ్ళకెత్తించి ఊరేగిస్తారా! పోతనగారి శిలా విగ్రహాలు వాడవాడలా నెలకొల్పుతారా! ఉత్సవాలపేరుతో లక్షలాది ప్రజల పైకం "ఉఫ్" అని ఊదేస్తారా! నాది ఒక్కటే కోరిక. ఎక్కువమంది ఆయన కవిత్వాన్ని కళ్ళకద్దుకుని చదివి తరించాలని. అటువంటివారి సంఖ్య తగ్గుతున్న దేమో నని భయం. తగ్గరాదని అభయం.

అసలు నేను వచ్చేసరికే నందవ్రజం ఆనందవ్రజమైంది. ఆబాల గోపాలం నాకు చేయవలసిన సేవలు, జరుపవలసిన విధివిధానాలు జరిపించారు. "మన యశోద చిన్నమగవాని గనెనట చూచి వత్తమమ్మ సుదతులార!" అంటూ కొందరు, "పాపనికి నూనె దలయంటి పసుపుపూసి బోరుకాడించి పరిరక్ష పో" మ్మంటూ కొందరు, జోలపాటలు పాడుతూ కొందరు. ప్రపంచ సాహిత్యంలోనే సాటిలేని నా బాల్యలీలసౌందర్యహేలగా వ్రజాన్ని పులకింపజేస్తూ ప్రారంభమైనా ఇది శాశ్వత సందేశంగా విశ్వానికి ఉద్దేశించాను. నా ఉద్దేశంలో సందేశమన్నది కేవల ప్రబోధంలాగా కాక ఒకవైపున మాధుర్యలీలా విలాసాలను ప్రసరిస్తూనే అంతర్లీనంగా ఒక ధర్మాన్నీ తత్త్వాన్నీ ప్రతీయమానం చేయాలి. ఈ విషయంలో నాలాంటి బాల్యతత్త్వం మరొకటి లేదు. ఒక సువిశాల కాలపరిధిలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మసంస్థాపనం అనే ధ్యేయంతో ప్రవర్తిల్లిన నా జీవితకథ దివ్యమానుషభావాల సమ్మేళనం.

ముందు ముందు దుష్టశిక్షణను ఎన్ని మార్గాల నడిపించటానికి వీలున్నదో అన్నిటినీ బాల్యంలోనే అమలు పరిచాను. అసలు సృష్టిలోని అసద్వస్తువులను సద్వస్తువులచేత దమించచేయటమనేది ఈ కార్యక్రమ రహస్యం. పూతన మొదలు కంసుని వరకు నడచిన ఈ సంహార కాండలో ఒకదానిని మరొకటి పోలలేదు. పూతనని చంపటానికి ముందు ఎంత అభినయం చేశానో చూశారా?

మేల్కొన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి
క్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాదరంబునఁ జాచి
యొదిగిలి యాఁకొన్న యోజ నూఁది

బిగి చన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి
        గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొక రెండు గ్రుక్కల నువిద ప్రాణంబులు
        సైతము మేనిలో సత్వమెల్లఁ
ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ
జిమ్మఁదిరుగుచు నిలువక శిరము వ్రాల
నితరబాలుర క్రియవాఁడ వీవు గావు
చన్ను విడువుము విడువుము చాలు ననుచు-

ఇట్లా జరిగిన ప్రతిరక్షస్సంహారమూ వారికి ముక్తికారకం. కనుకనే పోతనగారు నా బాల్యక్రీడకు ప్రాతిపదికగా—

"ఉరు సంస్కారపయోనిధి
తరణంబులు, పాపపుంజదళనంబులు, శ్రీ
కరణంబులు, ముక్తిసమా
చరణంబులు బాలకృష్ణ సంస్మరణంబుల్" అన్నారు.

అప్పుడప్పుడు కథలోని కొన్ని ముఖ్యపాత్రలకి కొన్ని మానసిక సంచలనాలు కలిగించి పరతత్త్వ స్పర్శ ప్రసాదించటం నా బాల్యలీలలో ఒక భాగం. ఆయా వ్యక్తులు ఆ స్పర్శని అందుకొని అందులోని ఆనందాన్ని పొందారు. కాని ఆ ఆనందస్థితిలోనే వాళ్లు ఎల్లకాలమూ ఉండిపోతే నా కథ ఎప్పుడు కంచిని చేరేట్లు? అందుచేత అట్లా పరతత్త్వ దర్శనం కలిగించినట్లే కలిగించి ఇట్లా భౌతిక కక్ష్యలోకి లాగేవాణ్ణి. మహానంద గేహిని అయిన యశోదకు నా విశ్వరూపదర్శనాన్ని కలిగించాను. అందులో చరాచర భూత కోటిని తిలకించి ఆ తల్లి అబ్బురపడింది. ఒకసారి నన్ను పట్టుకోవాలని ప్రయత్నించి విసిగి వేసారి నాగురించిన దివ్యమానుషభావాల ద్వంద్వస్థితిని ఇట్లా తలపోసింది—

బాలుఁ డీతండని భావింతు నందునా
        యే పెద్దలును నేర రీ క్రమంబు
వెలి పెఱుంగుటకునై వెఱపింతు నందునా
        కలిగి లే కొక్కఁడు గాని లేఁడు

వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా
　　తనుఁ దానయై బుద్ధిఁ దప్పకుండు
నొంటెఱుంగక యింట నుండెడి నందునా
　　చొచ్చిచూదని చొకచోటు లేదు
తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి
యోజ లేదు భీతి యొకటి యెఱుఁగఁ
డెలమి నూరకుండఁ డెక్కసక్కెము లాడుఁ
బట్టి శాస్తి సేయు భంగి యెట్లు ?

ఈ ఘట్టంలో వ్యాసులవారు మా అమ్మ మనస్సును ఇంత లోలోతులు తొలిచారు కాదు.

అన్నగారితో, తక్కిన గోపార్భకులతో కలిసి రకరకాల అలంకారాలు చేసికొని విహరించటం నాకు ముచ్చట. నాలాగే పిల్లలు ఎల్లప్పుడూ సర్వాలంకృతమూర్తులై సంతోషంతో గెంతుతూ ఉండాలని నా ఉద్దేశం. సర్వాలంకృతమైన నా మూర్తిని పరిస్తూ వ్యాసులవారు వేసిన ఒక బొమ్మకి పూర్వాపరాలు సంబంధించి శివుడికీ నాకూ అభేదం ఆరోపించారు పోతన్నగారు-

తనువున నంటిన ధరణీ పరాగంబు
　　పూసిన నెఱిభూతి పూఁత గాఁగ
ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు
　　తొగల సంగడికాని తునుక గాఁగఁ
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు
　　కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు
　　కమనీయమగు మెడకప్పు గాఁగ
హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలలీలఁ బ్రౌఢ బాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు.

యమునాతీరంలో మేమంతా చల్దులు మెక్కటం వ్యాసులవారికీ బమ్మెర వారికీ ఎంతో ముద్దు. ప్రకృతితో సామరస్యం నెరపి అందులో భాగంగా మారి పోయి ఆ అనుభూతిని అందరితో పంచుకోవటం మనిషి నేర్చుకోవాలి. ఎవడి తల్లి వాడికి కట్టియిచ్చిన చల్దిమూట వాడొక్కడే భుజిస్తే అది జనారణ్యం లాంటి ఇప్పటి సమాజంలో మీ అందరి ప్రవర్తనలాగానే ఉంటుంది. మే మేం చేశాం? అందరం తెచ్చింది కలిపి, అన్ని రుచులూ కలబోసి నేలమీద ఆకుల్లో పూల పొత్తుల్లో గరికమేటల్లో ఏటిఒడ్డున చెట్ల నీడన పశుపక్ష్యాదుల ప్రక్కన హాయిగా భోజనాలు చేశాం. వ్యాసులు, పోతన కూడా ఇక్కడ నన్ను యాగభోక్తగా వర్ణించి తరించారు. నాది నేను తింటే తిండి. అందరం కలిసి తింటే యజ్ఞం.

ఒకసారి ఆ యింద్రుడికీ, ఆ బ్రహ్మకీ నన్ను పరీక్షించాలని బుద్ధిపుట్టింది. రజోవిలసనం వల్ల బ్రహ్మ, ఐంద్రీశక్తివల్ల ఇంద్రుడు గోవత్సాపహరణ గోవర్ధ నోద్ధరణ ఘట్టాలలో నా సర్వాంతర్యామిత్వాన్ని గమనించగలిగారు. అట్లా నా దివ్యత్వాన్ని తాము స్వయంగా పరీక్షించి లోకానికి చాటటం వారికిష్టం.

పోతనగారి తెలుగు పద్యాలు చదవటం మొదలుపెట్టి నేను తెలుగు బాల కృష్ణుడుగా మారిపోయాను. ఎప్పుడైనా వ్యాసులవారు కనిపించి "ఏం నాయనా! బాగున్నావా?" అన్నప్పుడు నేను పోతనగారి పద్యాలు చదివి వినిపిస్తుంటే ఆయన వెండిగడ్డం వెలిగిస్తున్న ముఖవర్చస్సుతో వెన్నెలబావుల్లాంటి కళ్ళతో నవ్వుతూ "నా బాలకృష్ణా! నువ్వు అచ్చం తెలుగు పిల్లాడివి అయిపోయావురా" అని నన్ను ముద్దు చేస్తారు.

అసలు మా నారదులవారు నా కథల్ని గాథల్ని వ్యాప్తి చేయటానికి కంకణం కట్టుకున్న మహనీయులు. భక్తియోగ ప్రవక్తలు. వారు భక్తికి సర్వో త్తమాదర్శం క్రింద గోపికల్ని చెప్పి "యథా వ్రజగోపికానాం" అంటారు. అందుచేత నా కథ ఎక్కడ చెప్పినా ఎప్పుడు చెప్పినా వీరి ప్రసక్తి లేకుండా పూర్తికాదు. రామావతారంలో "పుంసాం మోహనుడ" నైన నా పరిష్వంగ సుఖాన్ని కోరారు వీరు. ఆ జన్మలో నేను ఏకపత్నీవ్రతుణ్ణి కనుక బహుపత్నీ రూపజీవాత్మకతునిగా ప్రభవించనున్న మరుజన్మలో అటువంటి అవకాశం కలి గిస్తానని వాగ్దానం చేశాను. తదనుగుణంగా నా అప్రాకృత మాధుర్య స్పర్శ పొందిన గోపికలు నా మాధుర్య దర్శనానికి ప్రతీకలై నిలిచారు. మొదట నా

వేణుగానం చేత ఆకృష్టలై క్రమంగా రాసమండల నృత్యంలో భాగస్వామినులై మరొక మెట్టెక్కి కాత్యాయనీ వ్రతదీక్షితలై నన్నే భర్తగా పొందాలని సర్వాత్మనా వాంఛించారు. లౌకికంగా ఏ కొలది మర్యాదవంటి తెర అంబరాల రూపంగా నాకూ వారికీ నడుమ అడ్డంగా నిలిచినా దాన్ని తొలగించి నాకు తెలియని మర్మాలు వారికేమీలేవనీ నన్ను సర్వాత్మనా శరణుపొందటం వినా ఎవరికీ ఏమీ ధ్యేయం లేదనీ ప్రవచించాను. కాలాంతరంలో అర్జునునితో "సర్వ ధర్మాన్ పరిత్యజ్య'' అనటానికి అవసరమైన బీజం ఇక్కడే నాటుకున్నాను. నదులూ నారీమణులూ ప్రకృతి స్వరూపాలు. వీరు వీరికి స్వస్వరూప కేంద్రాలుగా ఉన్న స్థానాలలో లీనంకావటం ఒక అనాచ్ఛాదితమైన సహజసమ్మేళనం. అక్కడ నదులు సాగరాలతోను, గ్రహతారకా గోళాలు సూర్యునితోను, ఆకాశం వాయువుతోను, వాయువు అగ్నితోను- ఇట్లా జరిగే ఏ సంగమానికైనా సరే దిక్కులే అంబరాలుగా ఉంటాయి. ఈ సంగమాన్ని ప్రలయం అని కూడా అంటాం. అంటే ప్రకృష్టమైన లయం అన్నమాట. ఇక్కడకూడా వీరు నన్ను పొందటంలో దిక్కులే అంబరాలుగా కలిగి ఉంటారు. దిగంబరత్వానికి సంబంధించిన ఈ మార్మిక సిద్ధాంతాన్ని కథలాగా అభినయించటంలో నాకూ గోపికలకూ రామావతారంలో ఉన్న అడ్డుకూడా తొలగిపోయింది. వారు నన్ను కోరింది పరిష్వంగ సుఖం. వారికి నేను ఇవ్వదలచింది ముక్తికాంతా పరిష్వంగసుఖం. బాల్యం వదలుతున్న వయస్సులో మళ్ళీవస్తానని చెప్పి శాశ్వతంగా వ్రజాన్ని వదలి వెళ్ళి పోయాను. ఏళ్ళూ పూళ్ళూ గడిచాయి. గోపికలకు నా భౌతిక దర్శనం దుర్లభం అయింది. ఆలనాటి నా బాల్యస్వరూపాన్నే ధ్యానం చేసి చేసి తలపండి తమ వెనుకటి జన్మ ఋషిత్వాలకు కాలపురుషుడు గీస్తున్న తెల్లనిబొమ్మలలాగా తయారవుతున్నారు గోపికలు. నేనూ పెద్దవాణ్ణయ్యాను. కురుక్షేత్ర సంగ్రామం కూడా నిర్వహించిన తరువాత ఒకసారి గ్రహణస్నాన సందర్భంలో దర్శన మిచ్చాను. రవ్వంతసేపు ఏకాంతానికి తీసికొని వెళ్ళి ''చిన్నప్పటిలాగే ఆడి పాడుదామా?'' అని అడిగాను. ఇప్పుడు వారు ఋషులై పోయారు.

ఘోర సంసార సాగరో త్తారణంబు
ధీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందు నీ చరణాంబుజాత
యుగళమును మా మనంబులఁ దగులనీవె.

అన్నారు. అట్లా వారు కోరాలనే నేనూ కోరాను. ఆ దివ్యపదవినే వారికి ఇచ్చాను. భౌతికంగా చిన్నప్పుడెప్పుడో ముగిసిన మా యీ కథ గోపికల ఆధ్యాత్మిక ప్రస్థాన గాథ. ఈ కథను పోతనగారు వ్యాసులవలెనే ఇట్లా వ్యాఖ్యానించారు-

గోపజనము లందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు
సర్వ మయుఁడు లీల సలిపెఁగాక.

ఇట్లా లీలా బాలునిగా కాస్సేపు. రక్షస్సంహర్తగా కాస్సేపు, సర్వాంతర్యామిగా కాస్సేపు, గోపీలోలునిగా కాస్సేపు, ఆడుకున్న ఆ బాల్యం ఆ వ్రజం అక్కడి మనుషులు వాళ్ల మనసులు ఆ యమున పచ్చికబీళ్లు ఇవన్నీ తలచుకుంటే ఎప్పుడూ బాలకృష్ణునిలాగా ఉండిపోతే బాగుంటుందనిపిస్తుంది. అట్లాగే ఉన్నాను కూడా. అనంతర కాలంలో చుట్టరికాల వల్ల దగ్గరైనవాళ్లను కూడా అవసరం వచ్చినప్పుడు చంపితే ఏ పూతననో, శకటాసురుణ్ణో చంపినంత నిర్లిప్తంగా ఉండేది. అందుచేత నేనెప్పుడూబాల కృష్ణుణ్ణే. మధుర వదలి ద్వారక చేరినప్పుడు వ్రజం వదలి బృందావనానికి వలస పోయినదాని కంటె గొప్పగా ఏమీ లేదు. అష్ట మహిషుల సరసాలు, షోడశ సహస్రాంగనా విహారాలు నా మనస్సులో ఎప్పుడూ చెక్కు చెదరని జీవాత్మ రతిగా, ప్రకృతి పురుష హేలగా ఉంటుంది. కురుక్షేత్రంలో రక్తం ఓడిగలు కట్టినప్పుడూ, యాదవకులంలో ముసలం పుట్టినప్పుడూ నాకు పెద్ద విశేషంగా తోచలేదు. చిన్నప్పుడు అగ్ని త్రాగి గోపకుల్ని కాచినట్లు, కాళియఫణి ఫణాగ్రం మీద నాట్యం చేసినట్లు అనిపించేది. అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ కూడా నా ముఖం మీద చిరునవ్వు చెదరలేదు. నేను యుగ యుగాలుగా మ్రోగించే వేణువు మంద్ర మంద్ర నాదం మలగిపోలేదు. నేను ఎల్లప్పుడూ బాలకృష్ణుడనే. ఇప్పుడు ఈ భాషలో బమ్మెర వారి బాలకృష్ణుడను.

—(౦)—

# పోతన కవిత్వ పటుత్వము

శ్రీ తాపి ధర్మారావు

"ముక్కుతిమ్మనార్య ముద్దుపలు"కన్నట్లే పోతన్నది సహజ పాండిత్య మనీ ఆతను రామభక్తి పరాయణుడనీ సహృదయులు తమ అభిప్రాయాన్ని 'గుళికారూపం' గా ప్రకటించారు. దానితో ఇటీవలి పాఠక లోకానికి బమ్మెర పోతరాజూ, యెర్ల రామదాసూ ఒక్క తరగతి రచయితలుగా కనబడ నారం భించారు.

సహజ పాండిత్యం కాబట్టి పోతన్న ఆంధ్ర శబ్దచింతామణిగాని కనీసం చిన్నయసూరి పాఠైనా నేర్చుకొని ఉండడు. కాబట్టి అతని కవిత్వంలో వ్యాకరణ దోషాలూ, తప్పుడు సంధులూ కనబడతాయి. రఅల పరిజ్ఞానం అసలే లేదు. అందుచేతనే అప్పకవిలాంటి లాక్షణికులు పోతరాజును ప్రామాణిక కవిగా అంగీకరించలేదు.

మరే మెరుగు లేకపోయినా రచనలో శబ్దాడంబరమైనా ఉంచాలని పోతన్న అంత్యానుప్రాస కోసం ప్రాకులాడి నిఘంటువులన్నీ గాలించాడని కొంద రనుకున్నారు.

ఇక పోతన రామభక్తుడన్నారు సహృదయులు. కాబట్టి అతని కవిత్వం భక్తిప్రేరితమూ; భక్తిపూరితమూ. భక్తిఆవేశంవల్ల ఒళ్లు మరచి ఏదో అన్నాడు ఏదో వ్రాశాడు; ఆ భక్తి సంబంధమైన గొడవ మినహాయిస్తే ఇంక పోతనలో కవిత్వమేమి కనబడుతుంది? అన్నారు మరికొందరు విద్యార్థులూ విమర్శక ప్రముఖులూను.

అయ్యో! పోతనామాత్యా! నీవు 'దుర్గ మాయమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్' అని అర్థించినదంతా వ్యర్థమేనా? 'కాటుక కంటి నీరు చనుకట్టు పయింబడ' నేడుస్తున్నట్లు కనిపించిన సరస్వతి దృశ్య మంతా నిఘంటువుల నిషాయేనా? 'ఇమ్మనుజేశ్వరాధముల' కివ్వనని చెప్పుతూ

'సత్కవుల్ హాలికులైననేమి ? గహనాంతరసీమల కందమూల కౌద్దాలికులైన నేమి?' అని సత్కవిగా సగర్వంగా చెప్పినదంతా వట్టి బాకా ఊదుడేనా?

అభిప్రాయ గుళికలవల్ల కలిగిన అనర్థమిది. ఆనాటి సహృదయులు ఆ కవులలోని గుణాలన్నీ చూచినవారే. అందులో మరీ స్ఫుటంగా ఉన్న ఏ గుణాన్నో ఒకదాన్ని గుళికా రూపంలో ప్రకటిస్తారు. తక్కిన కవితా విశేషాలు లేవని వారెప్పుడూ అనలేదు. అయినా ఆ గుళికా ప్రభావం విపరీతంగా పరిణమించింది.

వారు పేర్కొన్న గుణమొక్కటే ఆ కవిలో ఉన్నట్టూ, తక్కిన గుణాలు ఏవిగూడా లేనట్టూ ఇటీవలి పాఠకలోకం అర్థం చేసుకుంది. రసపోషణగాని, కవితా శిల్పంగాని, భావ నిరూపణంగాని, విషయచిత్రణం గాని ఆ కవిలో ఉంటాయని అనుకోరు. చూద్దామని శ్రద్ధగూడ తీసుకోరు.

పోతన్న అంత తేలికగా త్రోసివేయదగినవాడు కాడు. ఎందరో మహానుభావుల కన్న మిన్న. అమర్త్యకాంత అయిన ఆంధ్ర కవితా పితామహుని వరూధిని మర్త్యకాంతగా పుట్టకపోయానే అని విచారిస్తుంది. చూడండి—

ఎంత తపంబు చేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతు దవజ్ఞ చేసినను కాయము వాయుదు; రే నమర్త్యనై
చింతల వంతలం జిదికి సిగ్గరితిన్; మృతి లేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపిక యయ్యె నక్కటా!

ఈ విధంగా వరూధిని గణితంలో ఒక లెక్కచేసినట్టు, లాయర్ వాదించినట్టు చింతిస్తుంది. ఇక పోతనగారి గోపిక అలా కాదు. యమునా నదీ తీరంలో ఒక వెదురుమొక్కగా పుట్టకపోయానే అని విచారిస్తుంది.

నా మోసంబున కెద్దిమేర వినవే నా పూర్వజన్మంబులన్
లేమా నోములు నోచనో నకట కాళిందీతటిన్ వేణువై
భూమిన్ పుట్టెదనంచు గోరదగదే బోధిల్లి; యట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే!

ఇది స్త్రీభావ సహజంగా, రసముట్టిపడేటట్టుగా ఉన్నది.

వామనావతార ఘట్టంలో పోతన చూపిన 'కవిత్వపటుత్వము' అసాధారణం. ఆ ఘట్టాన్ని అంత సమర్థతతో చిత్రించగల కవులు ఒకరిద్దరు మించి ఉండరు. బలిచక్రవర్తి దానాన్ని గ్రహించి వామనుడు త్రివిక్రముడై బ్రహ్మాండం నిండిపోతాడు. వటు డింతింతై మరింతై పెరిగి పోతూండటం పోతన్న హృదయానికి ప్రత్యక్షంగా కనిపిస్తూంది. ఆ విధంగానే పాఠకునికి గూడా కనబడాలి గదా! ఆ బ్రహ్మాండత్వం పాఠకునికి ప్రస్ఫుటం కావాలి గదా! అలా జరిగినప్పుడే గదా ఆ రసం పలికినట్టవుతుంది!

ఇంతింతై వటుడింతయై మఱియు దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

అని వర్ణించాడు. ఆకాశవీధి, మేఘమండలం, కాంతిరాశి, చంద్రుడు, ధ్రువుడు, మహర్వాటి, సత్యపదం అని ఆ రూపాన్ని పెంచాడు. కాని మహాద్భుతాకారమెంత పెద్దదో కంటికి కట్టినట్టయిందా? తృప్తి లేదు. కాబట్టే—

రవిబింబం బుపమింప బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

అని వర్ణించి కృతార్థుడయ్యాడు. ఆ మహాద్భుతరూపాన్ని ప్రత్యక్షంగా చూపించి పాఠకులను చరితార్థులను చేశాడు పోతన్న.

నడిమింటి నున్న సూర్యబింబాన్ని చూడమన్నాడు. అది యెంత యెత్తున ఉందో, ఎంత పైకిపోతే దాన్ని తాకగలమో ఊహారూపంగా ప్రతి పాఠకుడికీ తెలుసును. దృష్టిని ఆ బింబం మీదనే ఉంచి పోతన్న వామనుడిని పెంచాడు. వామనుడి కది గొడుగులా గుందన్నాడు. ఇంకా పెంచాడు. ఇప్పుడా బింబం తలలో పెట్టుకున్న రత్నంలా గుందన్నాడు. ఇంకా పెంచాడు. చెవి పోగులా గుంది. ఇంకా— కంఠాభరణంలాగ; ఇంకా— భుజకీర్తిలాగ; ఇంకా— కాలి అందెలాగ; ఇంకా పెంచాడు— ఆ బింబం పాదపీఠంలా గుందన్నాడు. ఎంత పెద్ద

ఆకారాన్ని ఎంత స్ఫుటంగా చిత్రించాడో చూడండి. పోతన్న శిల్పనైపుణ్యం ఏమనగలం? మన మహాకవు లెందరీ మహాకార్య మింత అందంగా నిర్వర్తించ గలరు? అనకూడదు గాని భగవద్గీతలోని విశ్వరూప సందర్శన ఘట్టంలో నైనా ఇంతటి స్ఫుటత్వం ఉందేమో చూడండి-

ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం త వేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.

ప్రహ్లాదచరిత్రలో నృసింహావతార వర్ణన ఎందరు కవు లారీతిని వర్ణించి సాధకులకు సాక్షాత్కారం కలిగించగలరో యోచించినట్లయితే పోతన కవిత్వ పటుత్వం నిస్సందేహంగా తేటపడుతుంది.

గజేంద్రమోక్ష ఘట్టంలో పోతన చూపిన మహాకవి లక్షణాలు అమోఘములు. గజేంద్రుడి ప్రార్థనలో జ్ఞాన భక్తి వైరాగ్య ప్రపత్తులను ఏ విధంగా సోపానాలుగా ఉపయోగించాడో చూడవలసినదే. విష్ణుమూర్తి భక్తవాత్సల్యం ప్రకటించటానికి పోతన వేసుకున్న పథకం కేవల భక్తి ప్రేరకమే కాదు, అత్యుత్తమ కవితా భరితం కూడా నిరాటంకంగా లక్ష్మీదేవితో కాలం గడుపుదామని నిశ్చయించుకున్న విష్ణుమూర్తితో మనలను ఆ వైకుంఠపురంలో, నగరిలో, ఆ మూల సౌధం దాపల, మందారవనంలో, సెలయేటి ప్రక్క నున్న కలువతిన్నె దగ్గరకు పోతన్న తీసుకెళ్లాడు. అక్కడ మంచి రసవంతమైన పట్టులో గజేంద్రుడి మొర వినిపించాడు. క్షణంలో రమా వినోదితనం ఎగిరిపోయింది. ఆపన్న ప్రసన్నత మూర్తీభవించింది. ఆ పైట చెంగు పట్టుకునే విష్ణువు సంరంభంతో బయలుదేరాడు. ఆ సంరంభం ఒక మహా ప్రవాహంలాగా కవి హృదయంలో పరుగెడుతూ వుంది ఆ ప్రవాహ వేగంలోకి మనల నీడ్చాడు పోతన మూడు పద్యాలలో. సిరికి చెప్పకుండా, శంఖ చక్రాలు తీసుకోకుండా విష్ణువు వెళ్తున్నాడు. చేతిలో పైట చెంగు చేతిలోనే ఉంది. లక్ష్మి పాపం ఏమో తెలియక శాటీముక్త కుచంబుతో తాటంకా చలనంబుతో వెంటపడ్డది. కలువతిన్నె నుంచి తిరుగు ప్రయాణం ఆరంభమయింది. ఆ మందారవనంలో మరెవ్వరూ లేరు కాబట్టి తన

వెంటన్ సిరి మాత్రమే. తరువాత ఆ మూల సౌధంలో కొస్తారు. అక్కడున్న అవరోధ వ్రాతం వెంట పడుతుంది. చావడిలో పక్షీంద్రుడు మొదలైనవారు-నగరి వెలుపలికి వచ్చేసరికి వైకుంఠంలోని ఆబాల గోపాలం వెంటబడ్డారు. వారిలోనే మనమూ ఉన్నట్టు పోతనకవి చేశాడు. చూడండా క్రమం-

తన వెంటన్ సిరి; లచ్చి వెంట నవరోధ వ్రాతము; దాని వె
న్కను పక్షీంద్రుడు; వాని పొంతను ధనుః కౌమోదకీ శంఖచ
క్రనికాయంబును; నారదుండు; ధ్వజినీకాంతుండు రా వచ్చి రో
య్యన వైకుంఠ పురంబునం గలుగువా రాబాల గోపాలమున్.

పద్యారంభంలో 'వెంట' 'వెన్క' 'పొంత' అన్న మాటల నుపయోగించిన పోతన్న పోనుపోను సంరంభాతిశయం వల్ల వాటి నుపయోగించటం మానుకున్నాడు. తానూహించిన సంరంభభావాన్ని పాఠకుల హృదయాల్లో ఇంత చక్కగా ప్రతిఫలించినట్టు చేసిన పోతనలో కవితావిశేషం లేదా ?

ఇంతేకాదు. అతిసున్నితమైన మానసికావస్థలను చిత్రించటంలో కూడా పోతన్న ఏ కవికీ తీసిపోడు. పాత్ర హృదయం తనదిగా చేసుకొని దానికి సరిపోయినట్టు భావాలను ప్రకటించగలగటం పోతన్న కలపడినట్టు ఎందరికో అలవడలేదు.

రుక్మిణి తన బ్రాహ్మణుడిని కృష్ణుడి దగ్గరకు పంపించింది. ఇంకా రాలేదు. ఇక్కడ వివాహ ప్రయత్నాలు సాగిపోతున్నాయి. కూర్చుని అనుకుంటూంది-

ఘనుడా భూసుర డేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగా దలచెనో విచ్చేయునో యీశ్వరుం
డనుకూలింప దలంచునో తలపడో ఆర్యామహాదేవియున్
నను రక్షింప నెరుంగునో యెరుగదో నా భాగ్య మెట్లున్నదో!

ఈ పద్యంలో పోతన రుక్మిణీ హృదయంలో ప్రవేశించాడు. అనిన మాటలు కొన్ని; అనకుండా ఉన్న ఊహలు కొన్ని. అతిమనోహరమైన పద్యం. 'భూసురు డేగెనో' అన్నదేగాని 'లేదో' అనలేదు. ఆ ఘనుడి విషయంలో వెళ్ళకపోవటమన్న ఊహ కూడా రుక్మిణి సహించలేదు. మార్గాయాసం వల్ల కొంచెమాలస్యమై యుంటుందని సమర్థించుకొని, "వెళ్లే ఉంటాడు. కృష్ణునితో చెప్పేఉంటాడు.'

అనుకొన్నది. విని కృష్ణుడిది తప్పుగా భావించి ఉంటాడా ? అని ప్రశ్నించుకుంది. అతనలాగ తలచేవాడు కాడే అనుకొని 'విచ్చేయునో' అనే అన్నదిగాని 'విచ్చే యడో' అనలేదు. ఆ ఊహే తనకు దుర్భరం. 'లేదు' అన్న పదం తన నోట పలకదు. తానూ, భూసురుడూ, కృష్ణుడూ అయిపోయారు. ఇక మిగిలినది దేవతలు. వారిలో తన ఇష్టదైవతం ఆర్యామహాదేవి. నలుగురితో పాటు తనకూ ఈశ్వరుడు దేవుడే. ఆర్యాదేవంతటి దగ్గరి దైవం కాడు. కొంచెం దూరం. వీళ్లను గురించి సందేహముంది. 'ఈశ్వరుడు అనుకూలించటానికి తలస్తాడో తలపడో' అన్నది- అంత పరిచయం లేదు కాబట్టి. ఆర్యామహాదేవి విషయంలో తలుస్తుందో లేదో అన్న సందేహం రుక్మిణికి లేదు; తప్పకుండా తలుస్తుంది. తనకు నమ్మకమే. కాని ఆమెకు తన్ను రక్షించే ఉపాయం తెలుసునో తెలియదో! ఉన్న సందేహమంతా అదే. ఉపాయం తెలిస్తే తప్పక రక్షిస్తుందన్న మాటే. ఇంత వ్యత్యాసముంది కాబట్టే పోతన్న ఈ రెండు సందేహాలను ఈ విధంగా ప్రకటించాడు. విషయ విశ్వాసాన్నింత చక్కగా ప్రదర్శించగల సమర్థులు మన కవుల్లో ఎందరున్నారు?

ఇన్ని విషయాల నింత రసవంతంగా చిత్రించ గలిగినవాడు కాబట్టే పోతన్న ఆంధ్ర జనసామాన్యానికి అభిమాన కవి కాగలిగాడు. భారత రామాయణాలలోని ఒక్క పద్యమైనా నోటికి రానివారు చాల మంది భాగవతంలోని పద్యాలను పఠించగలరు. ఇటువంటి పోతనలో కవిత్వ విశిష్టత లేదనీ, ఇతను వ్యాకరణం రాని సహజ పండితుడనీ, అంత్యప్రాస కోసం నిఘంటువులకు ప్రాకులాడే వాడనీ భావించటం కూడనిపని. ఇంకా సందేహముంటే ఏదైన ఒక్క ఘట్టం సంస్కృత భాగవతంతో సరిపోల్చి చూస్తే పోతన కవిత్వపటుత్వం కరతలామలకం కాకతప్పదు.

రాజాజీగారు కంబరామాయణాన్ని ఇంగ్లీషులో ప్రచురిస్తున్నట్లే మనలో ఓపికున్న సమర్థు లెవరైనా తెలుగు భాగవతంలోని ఒకటి రెండు ఘట్టాలను ఇంగ్లీషులో ప్రచురించటం మంచిది. అట్లైతే సంస్కృత భాగవతంతో పరిచయమున్న ఇతర రాష్ట్రాలవారు కూడా మన ఆంధ్రకవి పోతన్నలోని కవిత్వ పటుత్వం గ్రహించి గౌరవిస్తారు.

*(పరిశోధన, 1954)*

—:o:—

# పోతన-శృంగార రసపోషణము

— శ్రీ దేవులపల్లి రామానుజరావు

వాస్తవము విచారించినచో సుకుమారమైన శృంగార చిత్రణమునందు పోతనతో సమానుడైన తెలుగుకవి మరొక్కరు లేరని తోచును. ఏ కొంచెము అవకాశము కలిగినప్పటికిని శృంగార రస పోషణమునకు పోతన గంటము ముందుకు దుముకుచుండును. గాఢమైన భక్తిచే ఆవేశము పొందిన సందర్భములలో కూడ పోతన హృదయము శృంగార భావములతో ఉప్పొంగిపోయిన ఉదాహరణల నెన్నియైన చూపించవచ్చును. ఒక్కమాటలో చెప్పవలె నన్నచో పోతన శృంగార మాధుర్యము, వైవిధ్యము ఆంధ్ర భాషలోని మరొక గ్రంథమునందు కనిపించదు. విలాస విభ్రమములను, శృంగార క్రీడా విశేషములను, అపూర్వ మధుర సన్నివేశములను, హృదయమునుండి ఉత్కటముగ దూసికొనివచ్చు ప్రేమ భావములను చిత్రించుటలో పోతన్నతో మరొకరికి పోలికయే లేదు.

పోతన చిత్రించిన శృంగారము విలక్షణమైనది. మధుర భావోపేతమైనది. అపూర్వమైన శృంగార ఘట్టములను, విలాసభావములను ప్రదర్శించుటయందు పోతన గంటమునకు గల నేర్పు అద్వితీయమైనది. శృంగార రసచిత్రణకు పోతన కలిగించుకొను అవకాశములు కూడ ఇతర కవీశ్వరులకు తెలియని పరమ రహస్యములు. ఈ దృష్టితో భాగవతములోని ఇష్టదేవతాది ప్రార్థనమునే పరిశీలించినప్పుడు మొట్ట మొదటి పద్యములే మనము చూపించగల చక్కని మచ్చుతునకలు.

పోతనామాత్యుని సరస్వతీదేవి చంచరీకచయ సుందరవేణి. సైకతశ్రోణి. తోయజాత భవచిత్తవశీకరణైకవాణి. వామనమూర్తికి మూడడుగుల నేల ధార పోయునప్పుడు, ఆ దానమును గ్రహించు భగవంతుని హస్తమును 'ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై అంసోత్తరీయంబుపై పాదాబ్జంబులపై కపోలతటిపై పాలిండ్లపై నూత్న మర్యాదం జెందు' కరమని బలిచక్రవర్తి భావించుటలో బమ్మెర పోతన

శృంగార హృదయము తొంగిచూచుచున్నది. లావొక్కింతయు లేక ధైర్యము విలోలమైన గజేంద్రుని రక్షణకు పరుగులెత్తుచున్న పరమేశ్వరుడు వైకుంఠపురము నందలి సౌధములోని రమావినోదియట. వివాద ప్రోద్ధత శ్రీ కుచోపరి చేలాంచలముతోనే ఆయన వెంట వెళ్లు శ్రీదేవి సౌందర్యమును గమనింపుడు! ఆమె తాటంకములు చలించుచున్నవట. ధమ్మిల్లబంధము భుజము మీద నటించుచున్నదట. అదృశ్యముగా నున్న చంచత్కాంచితో శాటీముక్త కుచముతో ఆ తరుణమున ఆ యమ్మ కోటీందుప్రభతో వెలిగినదట. ఇటువంటి మనోహర దృశ్యములను చిత్రించిన వారు ఆంధ్రకవులలో నెంతమంది గలరు?

ఆంధ్రుల అభిమాన నాయికయైన సత్యభామను సహజపాండిత్యుడు చిత్రించిన తీరు అద్వితీయమైనది. తెలుగు సారస్వతములో ఇంత చక్కని చిత్తరువు ఇంకొకటి కనిపించదు. సత్యభామ బహు సుకుమారి. బొమ్మ పెండ్లిండ్లకు పోనాల్లనను బాల. మగవారి గనిన మరుగుజేరెడు ఇంతి. పసిడియుయ్యేల లెక్క భయమందు భీరువు. సఖుల కోలాహలస్వనములోర్వని కన్య. వీణ చక్కగబట్టు వెరవెరుంగని కొమ్మ. మ్రాకున తీగె గూర్పగలేని లేమ. సరవి ముత్యము గ్రువ్వజాలని అబల. చిలుకకు పద్యము చెప్పనేరని తన్వి. అయిన ప్పటికిని హృదయేశ్వరుని సమక్షమున వీరనారీమణియై రాక్షసేశ్వరుని మీద విజృంభించినది. అప్పటి ఆమె సొగసును పోతనయే వర్ణింపవలెను. మరొక కవీశ్వరున కది శక్తికి మించినపని. ఆమె సౌవర్ణకంకణ ఝణఝణనినదములు శింజినీరవములతో చెలిమి చేయుచున్నవి. తాటంకమణిగణ ధగధగదీప్తులు గండమండలరుచిని కప్పివేయుచున్నవి. ధవళతరాపాంగ ధళధళరోచులు బాణజాల ప్రభాపటలి నడపుచున్నవి. శరపాత ఘుమఘుమశబ్దము పరిపంథిసైనిక కలకల స్వనము నడచుచున్నది. వీరము, శృంగారము, భయము, రౌద్రము, విస్మయము కలిసి ఆకారము దాల్చిన భామినివలె సత్య మనకు ప్రత్యక్షమగుచున్నది. ఒక వైపున వీరము, ఇంకొకవైపున శృంగారము ఆమెయందు మూర్తీభవించినవి. ఆమె పరుని జూచినప్పుడు ఒక పద్ధతి. వరునిజూచినప్పుడు మరొక పద్ధతి. ఏక కాలమున 'నొంప మరియు నలరింప' ఆమె సమర్థురాలు. ప్రాణేశ్వరుని జూచినప్పుడు సొంపు; నరకాసురుని జూచినప్పుడు కెంపు ఏకక్షణమున ఆమె కన్నులలో కనిపించుచున్నవి. ఆమె మోము హరికి రాకేందుబింబము; అరికి రవిబింబము.

ఆమె చేలాంచలము హరికి కందర్పకేతువు; అరికి ఘనధూమకేతువు. ఆమె సందర్శనము హరికి అమృతప్రవాహము; అరికి అనలసందోహము.

కేవల రూపకల్పనయందే కాదు; భావచిత్రణ మందును పోతన అసామాన్యుడు. ఆయన చిత్రించినన్ని శృంగారభంగిమలు, క్రీడలు, విలాసభావములు ఇంకొకరు చిత్రించలేదని చెప్పినచో సత్యమునకు తలవంపులు కలుగజాలవు. కుబ్జాకృష్ణుల క్రీడావిశేషము, ఉషానిరుద్ధుల ప్రణయము, రుక్మిణీకృష్ణుల కేళీవిలాసము మొదలైన ఘట్టములు పోతన్న చిత్రించిన శృంగార వైవిధ్యమునకు చక్కని తార్కాణములు. రుక్మిణీదేవితో శ్రీకృష్ణుని విరసోక్తులు, ఆ విరసోక్తులతో నొప్పిజెందిన ఆమె హృదయము, ఆ హృదయములోని భావములు ప్రత్యక్షమగు విధానము పోతన చిత్రించిన అపురూప శృంగార ఘట్టములలో నొకటి. ఇటువంటి సన్నివేశములు ఇంత రమణీయముగా చిత్రించిన తెలుగు కవీశ్వరుడు ఇంకొకరు కనిపింపరు. సూరన అయిదు తీరుల శృంగారమును చిత్రించినాడట. కాని పోతన అరువది రీతుల శృంగారమును చిత్రించినాడు.

శ్రీకృష్ణుని గోకుల విహారము, గోపికా వస్త్రాపహరణము, రాసక్రీడలు, ఆ సందర్భములలో మధురమూర్తులైన ఆ గోపికల చిత్తవృత్తులు, సరస సల్లాపములు, అలుకలు, అన్యాపదేశములు, అనునయములు, ప్రణయ కోపములు ఆంధ్ర శృంగార వాఙ్మయమున అద్వితీయ ఘట్టములు. ఈ భాగములోని ఒక్కొక్క పద్యము ఒక్కొక్క రత్నము. ఇవి సామాన్యమైన రత్నములు కావు అన్నియును జాతిరత్నములు. సానల దీరిన రత్నములు. నల్లనివాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు పైజల్లెడువాడు, మౌళి పరిసర్పిత పింఛమువాడైన శ్రీకృష్ణుని గోపికలు ఒకానొక శరద్రాత్రిని చేయు అన్వేషణ ఆ సందర్భమున విరహతప్తలైన గోపికల హృదయాలనుంచి ఉబికికొనివచ్చిన ప్రేమభావాలు బహురమ్యముగా చిత్రించినాడు బమ్మెరపోతన. గోపీకృష్ణుల క్రీడా విశేషాలను కనులకు గట్టినట్లు అతి సుకుమారముగా మనయెదుట ఆయన ప్రదర్శించినాడు. గోపాలకృష్ణుని జాడలు తెలిసికొనుటలో గోపికలు చూపించు నేర్పులు ఎంతయో మనోహరమైనవి. ఒకచోట అయన మోపిన పాదాగ్రము కనపడుచున్నది. అందువలన అక్కడ కొమ్మకు పువ్వులు గోసినట్లు భావన. వెంటనే అడుగుజాడ మాయమైనది. బహుశః సతినెత్తికొని వెళ్లిన చిహ్నమేమో అది. ఇంకొకచోట కూర్చున్న గుర్తులు కనబడుచున్నవి. ప్రేయసికి ధమ్మిల్లము

పెట్టినాడేమో అక్కడ. మరొకచోట యెవరో యొక వెండి నిక్కిన చొప్పు గోచరించుచున్నది. ఆ ధూర్తగోపాలుడు ఆమెకు కెమ్మోవి యిచ్చిన చోటిది యని స్పష్టముగా అనుమానము కలుగుచున్నది. కొంతదూరము వెళ్లిన తరువాత వేరొకచోట నాలుగు చరణాలు ప్రక్క ప్రక్కన కనిపించినవి. అందుచేత అది గోపాల కృష్ణుడు ఎవరో యొక యెలనాగ చేయూదిన స్థలమని స్ఫురించుచున్నది. మరొకచోట మగజాడ లోపల మగువజాడ కనిపించినది. తప్పక యీ చోట ఆ శృంగార పురుషుడు ఎవరో యొక నీలవేణిచే నొదిగి యుండవచ్చును. ఇంకొకచోట రమణి మ్రొక్కిన చొప్పు కనబడినది. వేరొకచోట అన్యోన్య ముఖములైన అంఘ్రులు ప్రణయ కలాపమును ప్రదర్శించినవి. ఈ విధముగా నీ ఘట్టము అత్యంత రమణీయముగా, బహుసుకుమారముగా, అతి మనోహరముగా వర్ణితమైనది.

తెలుగు భాషలోని శృంగార గ్రంథములను అవలోకించినప్పుడు, శృంగార కవుల రచనలను పరిశీలించినప్పుడు పోతన చిత్రించిన శృంగారము ముందు నిలువదగిన రచనలు ఎన్ని గలవు? అను ప్రశ్న సహజముగా కలుగుచున్నది. శృంగార కవిత్వమునకు ప్రసిద్ధి గాంచిన వారి రచనలు భాగవత శృంగారము ముందు దివాకరుని యెదుట నున్న దివిటీవలె గోచరించును. వాస్తవముగా తెలుగు కవులలో శృంగార రస చిత్రణమునందు పోతన సర్వ విధముల అగ్ర గణ్యుడు. పోతనను శృంగార కవి యనుటలో తప్పేమి కలదు? శృంగార మనినచో ముడిగట్టుకొనవలసిన అవసరమేమి? భక్తి రసమును ఎంత బాగుగా పోషించినాడో శృంగార రసమును అంత సమర్థతతోనే పోతన చిత్రించినాడని చెప్పుటకు భాగవతమున ఎన్నియైనను చూపింపవచ్చును. ఆంధ్ర శృంగార కవులలో పోతనది అగ్ర తాంబూలము. తెలుగు భక్తి కవులలో పోతన మున్నెన్న దగినవాడు.

పోతనను కవిత్వము వలచి వరించినది. దానితోపాటు పాండిత్యము గూడ ఆయనకు సహజముగా అలవడినది. ఆంధ్ర కవులలో "సహజ పాండిత్యు"డను ప్రత్యేకత పోతన కొక్కనికే కలదు. భాష ఆయన చేతిలోని క్రీడాకందుకము.

(సారస్వత నవనీతము)

—:o:—

# పోతన వ్యాజస్తుతి-వ్యంగ్య వైభవము

—ఆచార్య దివాకర్ల వేంకటావధాని

ఒకప్పుడు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు పోతన భాగవతము వ్రాసియుండకపోయినచో మరి ఎవరు వ్రాసియుండెడివారని తమ గురువులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిని అడిగినారట. అప్పుడు శాస్త్రిగారు కాసుల పురుషోత్తమకవి వ్రాసియుండెడివాడని ప్రత్యుత్తరమిచ్చిరట. ఈ యభిప్రాయము పాక్షికమైనను ఇందుకొంత సత్యము లేకపోలేదు. శ్రీకాకుళము నందలి ఆంధ్రవిష్ణుదేవాలయము శిథిలమై పోవుచుండ దానిని బాగుచేయింపవలెనని పురుషోత్తమ కవి జమీందారుగారికి మనవిచేయగా వారింయక ఉపేక్ష వహించిరట. అంత పురుషోత్తమ కవి చేయునదిలేక దేవాలయమున కెదుట నిలబడి సీస పద్య మయమైన ఆంధ్రనాయక శతకము రచించెనట. ఈ శతకము ఆంధ్రశతక వాఙ్మయమున కలంకారప్రాయమైనది. ఇందలి పద్యములన్నియు వ్యాజస్తుతి పూర్వకములై యుండును.

"వ్యాజస్తుతి ర్ముఖే నిందా స్తుతిర్వా రూఢి రన్యథా" అని వ్యాజస్తుత్య లంకారమునకు కావ్యప్రకాశమున నీయబడిన నిర్వచనము. దీనినే కావ్యాలంకార సంగ్రహము "సతతంబు నిందచేతను స్తుతియున్ స్తుతిచేత నింద చొప్పడ వ్యాజస్తుతియై చెలువగు"నని నిర్వచించి యున్నది. నిందా వ్యాజముచే స్తుతిని గాని, స్తోత్రవ్యాజముచే నిందనుగాని చేయుటకు వ్యాజస్తుతి యని పేరు. పురుషోత్తమకవి పై ఆంధ్ర నాయకశతకమున పైకి నింద ద్యోతితమగునట్లున్నను లోపల స్తుతి స్ఫురించునట్లు పద్యములను రచించియుండెను. ఇట్లు రచించుట సులభసాధ్యమైన పని కాదు. దాని కెంతయో పాండిత్యమును, వ్యంగ్యరచనా పాటవమును, పదార్థధ్వని పరిజ్ఞానమును అవసరమైయుండును ఇట్టుపాలంభన పూర్వకముగ శతకమునంతను పూర్తిచేసి యతడు చివర తన యవివేకమును మన్నింపుమని భగవంతుని ప్రార్థించియున్నాడు. నిజముగా నతనికి భగవంతుని

యెడ నఖండమగు భక్తియే కాని నిరసన భావము లేదు. ఆ శతకమునందలి పద్యములు విని జమీందారు గారు దేవాలయ జీర్ణోద్ధరణము కావించియుండిరట. ఆ పద్యముల యపార ప్రభావము తెల్పుట కింతకంటె వేరుగ నేమియు చెప్ప నక్కరలేదు.

పోతన మహా భక్తుడు. ''నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువవలె''నని యతని యాశయము. శ్రీమద్భాగవతము నాతడు శ్రీరాముని యాజ్ఞచే రచించి యతనికే అంకితము చేసెను. భాగవతారంభ పద్యమున నాతడు ''మహా నందాంగనాడింభకు''డైన కృష్ణుని స్తుతించెను. షష్ఠ్యంతముల యందు కూడ నాతడు ''హారికి నందగోకులవిహారికి''నని యా గోపాలకృష్ణునే వర్ణించియుండెను. అతనికి దశరథరాముడన్నను, గోపికా రాముడన్నను భేదమే లేదు. భాగవతమున విష్ణువునకును తదవతారములకును సంబంధించిన కథ లెన్నియో యున్నవి. శిశుపాలుడు, రుక్మియున్నగు వారు మదాంధులై కృష్ణుని భగవత్త్వమున నమ్మిక లేక యతనిని ప్రాకృత మానవునిగ భావించి ఆ యా సందర్భములయందు నిందించుచుందురు. ఆ నిందా వాక్యములతో కూడిన పద్యములను గూడ పోతనయే వ్రాయవలయును. మహాభక్తుడైన యతడు భగవంతుని నిందించు పద్యములు వ్రాయ నిచ్చగింపకుండుట సహజము. కాని కథా సందర్భమును బట్టి నిందాస్ఫోరకములైన ఆ పద్యముల నాతడు వ్రాయక తప్పదు. అప్పుడతడు వ్యాజస్తుతి నాశ్రయించి దుష్టులైన యా పాత్రలు భగవంతుని నిందించుచున్నట్లును, తాను మాత్ర మాంతరముగ స్తుతించుచున్నట్లును పద్యములు వ్రాయుచుండును. అట్టి సందర్భములం దిది అనవద్యమైన పద్ధతి. పురుషోత్తమకవి కూడ నేతాదృశ పద్యరచన యందు నేర్పు కలవాడని సూచించుటకై వేంకటశాస్త్రి గారు భాగవతమును పోతన వ్రాయనిచో నతడు వ్రాసియుండునని చెప్పియున్నారు. అంతేకాని అతడు పోతనతో సమానుడైన మహాకవి యని పోతనకును, అతనికిని సహపంక్తి కలిగించుటకు కాదు.

భాగవత చతుర్థస్కంధమున దక్షాధ్వరధ్వంసవృత్తాంతమున్నది. మున్ను బ్రహ్మలు చేయు సత్త్రము చూచుటకై సరసిజగర్భయోగిజనమునిసుపర్వ ప్రజాపతులెందరో వచ్చియుండిరి. దక్షుడు కూడ వచ్చెను. అతని చూచి బ్రహ్మయు శివుడును తప్ప మిగిలిన వారందరును లేచి నిలబడిరి. దక్షుడు

బ్రహ్మకు నమస్కరించి సభ్యులు తన కిచ్చిన పూజలుగైకొని యర్హాసనాసీనుడై తన్నుగని సభ్యులందరును లేవ శివుడు లేవకుండుటకు కనలి-

అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన
హీనుఁడు మర్యాదలేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుడు దిగం
బరుఁడు భూతప్రేత పరివృతుండు
తామసప్రమథభూతములకు నాథుఁడు
భూతిలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు మన్మథనాథుఁడును దుష్ట
హృదయుండు నుగ్రపరేతభూని

కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి
యైన యితనికి శివనాముఁడను ప్రవాద
మెటులు గలిగె నశివుఁడగు నితని నెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినట్లు. (4.43)

నా తనయను విధిప్రేరితుడనై యితని కిచ్చితి'' నని పలికి చేత జలములు గ్రహించి ''మఖసమయమున నితడు దేవతలతో కూడ హవిర్భాగము పొందకుండుగాక'' యని శివుని శపించెను. పై సీసపద్యము నందలి 'లుప్తక్రియా కలాపుడు' 'మానహీనుడు' 'మర్యాద లేనివాడు' మున్నగు పదములు నిందాగర్భితముల వలె కనిపించినను సూక్ష్మముగా పరిశీలింప శివుని మహత్త్వమునే ప్రకటించుచున్నవి. ఈ సందర్భమున పోతనయే ''దక్షుండు పల్కిన గర్హిత వాక్యంబులు వినిందితంబులుగ నుండినను అర్థాంతరంబున వాస్తవంబులగుచు భగవంతుండగు రుద్రునందు ననిందితంబులై స్తుతిరూపంబున నొప్పె''(4.47) నని వ్రాసియుండెను. అందు వ్యాజస్తుతి కలదు. పరమేశ్వరుడు అక్రియుడు, అమేయుడు, అపరిమితుడు అను నర్థాంతరము లందిమిడియున్నవి. పోతన బాల్యమున శివభక్తుడే. తరువాత శివకేశవాభేదమును గుర్తించి విష్ణుభక్తుడు కూడనై శ్రీమద్భాగవతమును రచించెను. 'చేతులారంగ శివుని పూజింపడేని' మున్నగు వాక్యము లిందుకు తార్కాణము.

అష్టమస్కంధమున యజ్ఞవాటిక కరుదెంచిన వామనుని పాదములు కడిగి బలి పాదశౌచవారి పరమభద్రమని శిరమున ధరించి-

"వడుగా! ఎవ్వరివాఁడ వెవ్వఁడవు; సంవాసస్థలం బెయ్యది
య్యేడకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్"

అని స్తుతించి "నీకేమి కావలయునో తెలుపు" మని యడిగెను అప్పుడు వామనుడు-

ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
నొకచోటనక నిండియుండ నేర్తు
నెవ్వనివాఁడ నంచేమని పలుకుదు
నా యంతవాఁడనై నడవనేర్తు
నీ నడవడియని ఎట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు
నొరులు గారు నాకు నొరులకు నేనౌదు
నొంటివాఁడఁ జుట్టు మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి కలదు చెప్పెద నా టెంకి
సుజను లందుఁ దఱచుఁ జొచ్చి యుందు. (8.552)

అని జవాబిచ్చెను. స్థూలముగ జూడ నీ పద్యము వామను డన్నిచోట్ల తిరుగుచుండెననియు, నతని కెవ్వరును లేరనియు, నత డొంటరివాడనియు, బంధువులెవ్వరును లేరనియు, పూర్వము సిరియుండెననియు, తానెప్పుడును సుజనుల యందు చొచ్చియుండు ననియు తెలుపుచున్నది. నిజమున కిది పరబ్రహ్మ వర్ణన. అతడొకచోటనక యన్నిచోట్ల నిండియుండును. అతడెవ్వరికిని చెందిన వాడు కాడు. అతని యంతవా డతడే. అతడు సత్వరజస్తమో గుణముల యందును, స్వర్గమర్త్య పాతాళముల యందును సంచరించుచుండును. ఆతడు అన్ని నేర్పులకును పట్టుగొమ్మ. ఒరుల కతడు సాయ మొనరించును గాని ఇతరు లాతనికి తోడ్పడ నవసరము లేదు. సృష్టికి పూర్వమాతడు ఒక్కడే

యుండెను. ఆతనికి బంధువు లెవ్వరును లేరు. పూర్వము విష్ణువుగా నున్నప్పుడు లక్ష్మి యతని తోడనే యుండెను. అత డెప్పుడును సుజనుల మనస్సునందు నివసించుచుండును.

వామనుడు బలి వదాన్యతను మెచ్చుకొని—

ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము, సొమ్ము మేర యొల్లఁ
గోర్కె దీర బ్రహ్మ కూకటి ముట్టెద
దానకుతుకసాంద్ర! దానవేంద్ర! (8.566)

అని యడిగెను. ఇందలి "ఒంటివాడ, మూడడుగుల మేరయిమ్ము; సొమ్ములు నే నొల్లను; బ్రహ్మకూకటి ముట్టెదను" అను పదములు పరమార్థగర్భితము లై యున్నవి. "పదత్రయము మాత్రమే యడిగితివి. దాత పెంపు సొంపు దలఁప వలదె" యని బలి పలుక, వామనుడు "మదాకాంక్షామితంబైన మూడడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటయె బ్రహ్మాండంబు నా పాలికిన్" అని పలికెను. ఈ వాక్యములో "నీవు మూడడుగు లిచ్చినచో బ్రహ్మాండమునంతను ఆక్రమించెద" నను ధ్వని యున్నది.

శుక్రుడు వామనుని యథార్థ తత్వ మెరింగించి మూడడుగులు దాన మీయవలదని బోధింప, బలి—

ఎన్నడుం బరువేడఁ బోఁడఁట, యే కలంకఁట కన్నవా
రన్నదమ్ములు నైన లేరఁట, యన్ని విద్యల మూలగో
ష్ఠిన్నెఱింగిన ప్రౌఢగుజ్జఁట, చేతులొగ్గి వసింప నీ
చిన్నిపాపనిఁ ద్రోసిపుచ్చఁగఁ జిత్తమొల్లదు సత్తమా! (8.595)

అని అడిగినది యిచ్చుటయందు తన దృఢ సంకల్పమును తెలిపెను. ఈ పద్యం స్థూలదృష్టికి వామనుని దీనత్వమును, పాండిత్యమును, బాల్యమును తెల్పునట్లు కన్పడుచున్నది. కాని యాంతరముగ వామనుడు పరబ్రహ్మ మనియు, నతని కితరులను వేడవలసిన యవసరము లేద'యు, నొంటరి వాడనియు, ఇతరులు గాని అన్నదమ్ములుగాని లేని వాడనియు, అజుడనియు, సర్వవిద్యామయు డనియు తెలుపుచున్నది. బలి వామనుని పాదములు కడిగి తత్పావనజలము శిరమున జల్లుకొని—

''విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య విదే త్రిపాదధరణీం దాస్యామి యంచున్
... బ్రహ్మప్రీతంబని ధారవోసె''

అను పద్యమున వామనుని విష్ణు స్వరూపత్వమును, బ్రహ్మకల్పత్వమును స్తుతింప బడినవి. మామూలుగా దానమిచ్చునపుడు దాత పలుకు పలుకులవలె దోచినను పై మాటలలో ప్రతిగ్రహీత పరబ్రహ్మమూర్తి యను నంతరార్థ మిమిడి ఉన్నది. వామనుడు భూదాన మహాత్మ్యమును తెల్పుచు—

ఇదియేమి వేడితని నీ
మది వగవక ధారవోయుమా సత్యము పెం
పొదవఁగ గోరిన యర్థం
బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. (8-614)

అని పలికెను. ఆ పలుకులు విని బలి హర్ష నిర్భర చేతస్కుడై -

''పుట్టి నేర్చుకొనెనొ; పుట్టక నేర్చెనో;
చిట్టిబుద్ధు లిట్టి పొట్టివడుగు;
పొట్టనున్న వెల్ల బూమెలు'' నని నవ్వి
ఎలమి ధరణి దాన మిచ్చెనపుడు. (8-616)

ఈ మాటలలో పుట్టకముందే యాతడు ప్రౌఢ వాక్యములు నేర్చెననియు, నతని పొట్ట యందెల్ల బూమెలు కలవనియు స్ఫురించుచున్నది.

కృష్ణుడు రుక్మిణిని రథముపై నిడికొని పోవుచుండ శిశుపాల జరాసంధాదు లాతని నెదిరించిరి. కృష్ణుడు వారి నందర నోడించి రుక్మిణితో వెడలిపోవు చుండ రుక్మిణి సోదరుడైన రుక్మి ఏకాక్షౌహిణి బలముతో కృష్ణుని వెంట నంటెను. అతడు కృష్ణుని నిలునిలుమని తిరస్కరించి వింట నారి సంధించి యిట్లు పలికెను -

''మా సరివాఁడవా మా పాప గొనిపోవ
నేపాటి గలవాఁడ వేదివంశ

మెందు జన్మించితి వెక్కడఁ బెరిగితి
వెయ్యది నడవడి నెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు మర్యాద లెఱుఁగవు
మాయ గైకొని కాని మలయరావు
నిజరూపమున శత్రునివహంబుపై బోవు
వసుధేశుఁడవు గావు వావి లేదు
కొమ్మనిమ్ము నీవు గుణరహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖాసమాన శితశిలీముఖముల
గర్వమెల్లఁ గొందు కలహమందు.'' (10. 1762)

ఇందును వ్యాజస్తుతి యున్నది. రుక్మి కృష్ణుని నిందించుచునే ఈ వాక్యములు పలికెను. "నీవు మాతో సమానుడవైన వాడవు కావు మా పాప నెట్లు గొనిపోయెదవు! నీకేమి గౌరవము కలదు? నీ వంశమేది? ఎచ్చట పుట్టితివి? ఎచ్చట పెరిగితివి? నీ నడవడి ఎట్టిదో ఎవ్వడెరుగును? మానహీనుడవు. మర్యాద లెరుగవు. మాయతోగాని శత్రువులపై పెనగుటకురావు. యథార్థమైన రూపముతో శత్రువుల నెదిరింపజాలవు. ధరణీశుడవు కావు. నీకు వావి వరసలు లేవు. గుణ హీనుడవు.'' అని అతని భావము. పోతన కృష్ణుని పరబ్రహ్మత్వ మెరిగినవాడు కావున నిందా మహత్త్వమును కూడ వర్ణించుటకు తగిన పదములనే వాడి యుండెను. "నిజమునకు రుక్మికిని కృష్ణునకును ఎట్టి సాదృశ్యమును లేదు. వారికి మశకమునకు హస్తికి నున్నంత భేదమున్నది. పరబ్రహ్మ అమేయుడు. అతని వంశవర్తనము లెవ్వరును ఎరుంగరు. అతడు మాయతో సర్వప్రపంచమును నిర్వహించును. అతడు యథార్థమైన రూపముతో శత్రువుల నెదిరింపడు. జాతిచే క్షత్రియుడు కాడు. త్రిగుణాతీతుడు'' అను నర్థమును పోతన పై పద్యమున నాంతరముగ నిమిడించెను.

గోపికలు కృష్ణుని దుడుకుచేతలు యశోద కెరిగించిరి. యశోద వారి నెట్లో యూరడించి పంపెను. ఒకనాడు బలభద్ర ప్రముఖులైన గోపకుమారులు కృష్ణుడు మన్ను తినెనని యశోదకు తెల్పిరి. యశోద బాలుని కేలు పట్టుకొని మన్నెందుకు భక్షించితివని యడిగెను. అప్పుడు కృష్ణుడు "అమ్మా ! మన్ను

దినంగ నేశిశువునో యాకొంటినో వెఱ్ఱినో నమ్మం జూడకు వీరి మాటలు'' అని పలికి తన నోరు తెరచి చూపెను. నిజమునకు కృష్ణుడు శిశువును కాదు, క్షుధార్తుడును కాదు, వెఱ్ఱివాడును కాదు. అతడు పరబ్రహ్మ స్వరూపుడు. అందుచేతనే ఆతని నోట యశోదకు బ్రహ్మాండ మంతయు కన్పించెను. అప్పుడు యశోద ఆశ్చర్యపడి—

''బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసియుండు
బాలుభంగి నశఁడు భాసిల్లు గాని స
ర్వాత్ముఁ డాదివిష్ణుఁడగుట నిజము'' (10-342)

అని భావించెను.

ఒకనాడు యశోద పెరుగు త్రచ్చుచుండ కృష్ణుడామె కడ కరిగి పాలిమ్మని యడుగుచు కవ్వము పట్టుకొనెను. ఆమె కూకటి దువ్వుచు నతనికి పాలిచ్చి ఒక పీఠముపై కూర్చుండబెట్టి పొంగెడు పాలు దించుటకై యరిగెను. అంత కృష్ణుడు పెరుగుతో కూడిన కుండను రాతితో బ్రద్దలు కొట్టి అందలి వెన్న తినెను. యశోద తిరిగి వచ్చి వికలములైన దధికుంభ శకలములు చూచి కృష్ణుడు వెన్న తినెనని ఎరిగి ఆతని నచ్చట కానక వెదకుటకై యరిగెను. అతడు వేరొక యింటిలో రోలు దిరుగవేసి యెక్కి యుట్టిమీద నున్న వెన్న నొక కోతిపాలు చేయుచుండుట గాంచెను. అంత నామె సెలగోల చేత బట్టుకొని-

''కానిమ్మ్కానిమ్మురా...
తనయా! ఎవ్వరియందు జిక్కవడ నే దండంబునుం గాన నే
వినివారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతి యుం జెందము
న్ననియో నీ విటు నన్ను గైకొనవు నే దారీతి సిద్ధించునే''

అని యదలించెను. పిమ్మట తనలో-

''బాలుఁ డితండని భావింతు నందునా
నే పెద్దలును నే రరీ క్రమము సు

వెఱపెఱుంగుటకునై వెఱపింతు నందునా
        కలిగి లే కొక్కఁడు గాని లేఁడు
వెఱవుతో నా బుద్ధి వినిపింతు నందునా
        తేనుఁదానయై బుద్ధి దప్పకుండు
నొం డెఱుంగక యింట నుండెడి నందునా
        చొచ్చి చూడని దొకచోటు లేదు'' (10.368)

అని వితర్కించి యతని తాడించుటకై సమీపించెను. అతడు రోలు దిగి పరువెత్తెను. యశోద కూడ వారించుచు నాతని వెంట పరువెత్తెను. అప్పుడు పోతన ''ఘనయోగీంద్ర మనంబులుం వెనుకొనంగా లేని లీలారతున్'' అని కృష్ణుని వర్ణించెను యశోద కృష్ణుని పట్టుకొని యతని కొట్టుటకు చేతులాడక కట్టదలచి—

''పట్టిన బట్టువడని నినుఁ
బట్టెదమని చెలముకొనినఁ బట్టుట బెట్టే
పట్టువడవం(డు పట్టీ !
పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే !

ఎక్కడ నైనను దిరిగెద
వొక్కయెడన్ గుణము గలిగి యుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ
జిక్కనఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా !

తోయంబు లివి యని తొలఁగవు చొచ్చెదు
        తలఁచెదు గట్టినఁ దరల నెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
        దున్నత స్తంభంబు లూఁపఁబోయె
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు
        రాచఁవేటలఁ జాల నవ్వఁ దెచ్చె
దలయవు నీళ్లకు నడ్డంబు గట్టెదు
        ముసలివై హరివృత్తి మొనయఁజూచె

దంబరంబు మొబకు నడుగవు తిరిగెద
వింకఁ గల్కితనము లేల పుత్ర !
నిన్నువంప వ్రాల్ప నే నేర ననియొ నీ
విట్లు క్రిందు మీఁదు నెఱుఁగకునికి. (10.373,374,375) అని పెక్కు ఖంగుల నాతని నదల్చెను. ఈ పద్యము లన్నిటియందు నంతర్గర్భితముగ కృష్ణుని పరబ్రహ్మత్వము నిరూపింపబడెను. ''తోయంబు లివియని తొలఁగవు చొచ్చెదు'' అను సీసమున దశావతార వర్ణన మున్నది. పోతన కృష్ణావతారము నకు పిమ్మటి యవతారములను కూడ నిందు సూచించెను. ఆ రెండు పాదముల కును బాలుని పరముగనే అర్థము చెప్పకొనవలెను.

కంసుడు ధనుర్యాగమిషమున కృష్ణబలరాములను మధురానగరికి రప్పించి వారిని సంహరింపవలెనను నుద్దేశముతో వారిని గొనివచ్చుటకై అక్రూరుని బంపెను. బలరామకృష్ణులు కంసుని వధింప నెంచుచున్నవారగుటచే అక్రూర చోదితమైన రథమెక్కి మధురాభిముఖముగా జనుచుండిరి. దారిలో వారికి యమున కనిపించెను. వారచ్చటనాగి జలములు త్రావి తిరిగివచ్చి రథముపై కూర్చుండిరి. అక్రూరుడు వారికి మ్రొక్కి వారి యనుమతితో యమునానదికడ కరుదెంచి వేద మంత్రములు జపించుచు ఆ నదిలో స్నానము కావించెను. ఆతనికి యమునానదీ జలములందు రామకృష్ణులు కనిపించిరి. అతడాశ్చర్యపడి రథము వంకకు చూడ వారచ్చట కూడ నుండిరి. అది తన మనోవిభ్రాంతి యేమోయని మరల యమునా నదీజలములను నిశితముగా పరికింప నందు శేషుని, తద్భోగపర్యంక మధ్యమున శ్రీదేవితో నొప్పి బ్రహ్మరుద్రాది స్తూయమానుడైన పరమపురుషుని గాంచి కర ములు మొగిడ్చి స్తోత్రము గావించెను. విష్ణువట్లు అక్రూరునికి తన సహజరూపము చూపి తిరోహితుడయ్యెను. అక్రూరుడాశ్చర్యచకితుడై నీరు వెడలి వచ్చి రథారో హణ మొనరించెను. అప్పుడు కృష్ణుడాతని జూచి-

''జలములు చేరువ నున్నవి
తలపోయఁగ నీవు పోయి తడవయ్యె నదీ
జలముల నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే !'' (10.1235) అని యడి గెను అక్రూరుడేమిచెప్పటకును తోపక—

"నీలోన లేని చోద్యము
లే లోకములందుఁ జెప్ప రీశ్వర ! నీటన్
నేలన్ నింగిని నున్నవె
నీలోఁ జోద్యంబులెల్ల నెగడు మహాత్మా !" (10.1287) అని సమాధాన మిచ్చెను. ఈ సమాధానము నందలి యర్థము ధ్వనిమంతమై కృష్ణుడే పర బ్రహ్మమను భావమును వ్యక్తము చేయుచున్నది. ఇందు వ్యాజసుతి లేదుగాని వ్యంగ్యార్థమున్నది.

ఈ విధముగ పోతన సందర్భమువచ్చిన చోట్ల నెల్ల వ్యాజస్తుతి పూర్వక ముగనో, వ్యంగ్యపూర్వకముగనో కృష్ణుని పరబ్రహ్మత్వమును ప్రకటించు చుండును. అతడు మహాభక్తుడగుటచే కృష్ణుని గోపాలకునిగా కాక పరబ్రహ్మము గనే పరికించును. తన లోపలనున్న యాభావములే యాతడన్యాపదేశముగ పెక్కుచోట్ల వెల్లడి చేయుచుండును. ఇట్లు వ్యంగ్యగర్భితముగ వ్రాయుట సులభ మైన పని కాదు. స్థూలముగ చూచినప్పుడేదో సామాన్యార్థమే గోచరించును. సూక్ష్మముగ పరిశీలింప నందలి తాత్వికార్థము స్ఫురించి పఠితలకు పారవశ్యము కలిగించును. నిత్యమును హరిభక్తిపరాయణుడై తాత్త్వికలోకమున సంచరించువా డగుట చేతనే పోతన యిట్టి యద్భుతమైన రచన చేయజాలెను.



కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వాజిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి
దేవదేవుని జింతించు దినము దినము చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడు గురుఁడు గురుఁడు తండ్రి! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి.

# పోతనామాత్యుని స్త్రీ పాత్రలు

—శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

పోతనామాత్యునకు వివిధ చిత్తవృత్తులు గల నాయకులను సృష్టించుట కంటెను నాయికలను సృష్టించుటలో నెక్కువ యపేక్ష యున్నట్లున్నది. ఆతడు వర్ణించిన శకుంతల, శర్మిష్ఠ, దేవకి, దేవయాని, రోహిణి, యశోద-వీరందరును చిత్తవృత్తులలో కేవలము విభిన్నలైన వ్యక్తులు.

**ఊర్వశి :**

ఊర్వశికి మిత్రావరుణుని శాపము గలిగెను. అందుచే నామెకు మానవ జన్మమేర్పడినది. కాని యంతకుముందే యూర్వశికి పురూరవునిపై నొక ప్రేమ కద్దు. కారణమేమనగా, ఆతని శౌర్య సౌందర్య గాంభీర్యాది గుణములను ఆమె యింద్రుని సభలో నారదునిచే విన్నదట. ఊర్వశి భూలోకమునకు వచ్చి పురూరవుని ముందట నిలబడినది. వాడిట్లున్నాడు-

సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరాననచంద్రమండల శోభితున్ సుకుమారు నా
పురుషవర్యు పురూరవుఁ గని పూవుటంపరజోదుచేఁ
దొరఁగు క్రొవ్విరితూఁపులం మది దూలి పోవఁగ భ్రాంతయై. (9.388)

ఊర్వశి భ్రాంతయైనను ఆమె తన హృదయము నెరిగింపలేదు. ఊరక నిలచి యున్నదట. ఇది స్త్రీధర్మమే. పురూరవుడును ఊర్వశిని చూచెను. వాడు "దీని కరగ్రహణంబు లేనిచో జీవనమేటి''కంచు మరునిముసముననే నిర్ణయించుకొన్నాడట. ఎట్టకేలకు వాడే ప్రేమోదంతము నారంభించెను. పురూరవు డన్నమాటలివి -

ఎక్కడనుండి రాక! మనకిద్దరకుం దగు; నీకు దక్కితిన్
మ్రుక్కడి వచ్చెనే యలరుముల్కులవాఁ డడిదంబు ద్రిప్పుచే

దిక్కు నెఱుంగనీదు నను దేహముఁ దేహము గేలు గేం నీ
చెక్కునఁజెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విపన్నుఁ గావవే! (9.392)

ఊర్వశి మహాప్రౌఢ. వాడీ మాటలన్నంతనే వీడు లఘుహృదయుడని యామె యర్థము సేసికొన్నది. ఈ భావము నామె బైటపెట్టినది కాదు. ఇంతలో గంధర్వులు వచ్చి పురూరవుని ప్రేమ విఘాతమును జేసినారు. ఆమె వాని కన్నుమరగి పోయినది. నాటినుండి పురూరవుడు వెఱ్ఱివాడై యూర్వశిని వెదకుచు తిరుగుచున్నాడు. ఒకసారి సరస్వతీ నదీతీరమున నామె వాని కంటబడెను. వీనిని వదలి పోయినది మొదలు ఊర్వశికి వీని గాలియే లేదు. యోగవియోగములకు మనసివ్వరాదనునది యామె నేర్చుకొన్న కామశాస్త్రవేదాంతము. పురూరవు డామె కడకేగి దీనముగ యాచించినాడు. అపుడూర్వశి తన మనస్సులో వీనిని గురించి యున్న నిజమైన భావమును బైట పెట్టినది. అది యిది-

మగువలకు నింత లోంగెదు
మగవాఁడవె నీవు ! పశువు మాడ్కిన్ వగవన్
దగవె ? మానుషపశువును
మృగములు గని రోయుగాక మేలని తినునే. (9.415)

ఈ తలపామె కీనాడు గలిగినది కాదు. పురూరవుని జూచిన మొదటినాడే యేర్పడినది. ఈ భావము నింతవరకు దాచినది. ఆ తరువాత నామె తన కులధర్మము నీ రీతి వెల్లడించెను-

తలఁపుల్ చిచ్చులు; మాట లుజ్జ్వల సుధాధారల్; విభుండైన పూ
విలుఁతున్ మెచ్చర యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు; క్రూ
రలు తోడన్ బతినైన చంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాం డ్రెక్కడ! వారి వేడబము లా వేదాంత సూక్తంబులే !
(9.416)

ఊర్వశీ పురూరవుల ప్రేమలో పురూరవుడు ప్రేమైకవశుడు. కడుంగడు దీనుడు గూడ. ఆ దేవకాంత వానితో నెప్పుడును సేవలు జేయించుకొన్నదే గాని వానికొకనాడైనను సేవజేసినట్లు గానరాదు. ఇది యనుకూలపతిక. ప్రౌఢనాయిక.

**శకుంతల :**

దుష్యంతుడు వేటకు బోయెను. ఆశ్రమమునందు శకుంతల యొక్క-తియ యున్నది. ఆశ్రమమున ప్రవేశించిన దుష్యంతున కామె కంట బడినది. దట్టపు దుఱుము, మిఱుమిఱు చూడ్కు-లు, సట్టాడు నడుము - దుష్యంతున కింకేమి కావలెను ? వెంటనే యతడు తన మనస్సును బైట పెట్టినాడు. ఆమె కును దుష్యంతుని జూచిన వెంటనే మతిపోయినది. ఇంతలో మన్మథు డొకడు నడుమ దూరెను. వాడు కుసుమాస్త్రములతో నా బాలను గొట్టినాడట ! శకుంతల తాలిమి సెడి యిట్లు బదులు పలికినది -

> అనివార్యప్రభ ! మున్ను మేనకయు విశ్వామిత్ర భూభర్తయున్
> గని, రా మేనక డించిపోయె నడవిన్, గణ్వుండు నన్నింతగా
> మనిచెన్, సర్వము నా మునీంద్రుఁ దెఱుఁగున్ మద్భాగధేయంబునన్
> నినుఁ గంటిన్ పిదపన్ గృతార్థ నగుదున్ నేఁ డీ వనాంతంబునన్.
>
> (9-617)

శకుంతల ముగ్ధ. భావగోపన మింకను ఆమెకు బాగుగ నలవాటైనది గాదు. ఊర్వశి తాను పురూరవుని ప్రేమించితి నని నోరార చెప్పనేలేదు. శకుంతల చెప్పినది. ఆ చెప్పుట ''కృతార్థనగుదున్'' అని యెంతో నాజూకుగానన్నది. సత్కు-లమున బుట్టిన కన్యక యింతకంటె మరి యేమనును ?

**దేవయాని - శర్మిష్ఠ :**

పోతనామాత్యుడు సృష్టించిన దేవయాని మహాగర్వోద్యమస్థాని. భూరి కోపానలాకలితగ్లాని కూడ. ఆమె దృష్టిలో శర్మిష్ఠ తండ్రి శుక్రాచార్యునకు దాసుడు. తన చీర కట్టుకొన్న శర్మిష్ఠను ''విహితములే కుక్కు-లకు హవిర్భాగంబుల్'' అని యామె ప్రశ్నించుచున్నది. శర్మిష్ఠ కూడ కోపమున తక్కు-వది కాదు. కాని యా కోపము క్షణమాత్రము. శర్మిష్ఠ దేవయానికి దాసియైనది. దానికి కారణము తండ్రి యాజ్ఞ. అపుడామె ''చలమింకేల పోనీలె'' మ్మని తన్ను తాను సవరించుకొన్నదట. ఆ సవరింపు తన కార్యమును సాధించుకొనుటలో దీక్షయే. 'ఎదరు వేచి' ఒకానొకనాడు యయాతిని లోగొన్నది. దేవయాని కా సంగతి తెలిసి క్రోధమూర్ఛిత యయ్యెను. యయాతి భంగపడినాడు. ఆమె

విన్నది గాదు. యయాతి యపరాధము శుక్రుని చెవులకు తాకనే తాకినది. శర్మిష్ఠ క్షత్రియకాంత కుచితమైన భావగోపనము గల యువతి. దేవయానికి తోచిన భావము దాచికొను నలవాటు లేదు.

వింధ్యావళి :

బలిచక్రవర్తి భార్యపేరు వింధ్యావళి. ఈమెకు నోరేలేదా యనిపించును. అంత దీర్ఘమైన బలిచక్రవర్తి కథలో నామె మన కగుపించునది రెండుమారులే. బలి వామనునకు మూడడుగుల మేర దానమిచ్చినాడు. ఎదుటనున్న కులాచార్యుడు వామనుని రహస్యములు విప్పిచెప్పి వానికి దానమిచ్చినచో సర్వనాశనమగునని హెచ్చరించెను. బలి వినలేదు. ఆచార్యుడు ఘోరముగ శపించెను. తన యెదుట నింత కథ జరుగుచున్నను వింధ్యావళి పల్లెత్తు మాటనలేదు. వటుని కాళ్లు గడుగుటకు నీరు మాత్రము తెచ్చినది. ఆ సన్నివేశమును పోతన్న యిట్లు వర్ణించెను—

దనుజలోకనాథు దయిత వింధ్యావళి;
రాజవదన; మదమరాళగమన;
వటుని కాళ్లు గడుగ వరహేమఘటమున
జలము దెచ్చె భర్త సన్న యెఱిఁగి. (8.604)

ఈ సందర్భమున మూలములోని 'జాలకమాలినీ' యను విశేషణమును పోతనామాత్యుడు వదలెను. వింధ్యావళి స్వభావమునకు, రాజసమునకు పొత్తు గుదురదని యేమో! 'భర్త సన్న యెఱిఁగి' యను చేర్పు పోతన్నదే. దీనితో కథకు ప్రాణము వచ్చినది. వామనమూర్తి బలిని బంధించినపుడు మాత్రము ఆమె యూరకుండలేక పోయినది.

తతమత్తద్విపయానయై కుచనిరుంధచ్చోళ సంవ్యానయై
ధృతబాష్పాంబువితానయై కరయుగాధీనాలికస్థానయై
''పతి భిక్షాం మమ దేహి కోమలమతే పద్మాపతే'' యంచు త
త్సతి వింధ్యావళి చేరవచ్చె త్రిజగద్రక్షామనున్ వామనున్. (8.658)

వచ్చి యచ్చేడియ వామనమూర్తి చరణసమీపమున ప్రణతయై నిలుచుండి యిట్లన్నదట—

నీకున్ క్రీడార్థములగు
లోకంబులు జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజవీవ లోకస్తుత్యా!

కాదనఁడు; పొమ్ము లేదీ
రాదనఁడు; జగత్త్రియైక రాజ్యము నిచ్చెన్;
నా దయితు గట్ట నేటికి?
శ్రీ దయితా చిత్తచోర! శ్రితమందారా! (8.660,661)

ఈ రెండవ పద్యము పోతన్న స్వకపోల కల్పితమే. మొదటి పద్యము ఆమె మనోనిశ్చయమును దెలుపును. సర్వమునకును భగవంతుడే కర్తయను విశ్వాస మామె ప్రతి యూహలోను గలదు. అందుకే వింధ్యావళి- శుక్రుడు, బలి- వీరి నడుమ జరిగిన రగడలో ప్రవేశింపనే లేదు. రెండవ పద్యములో వింధ్యావళిని పాపము! స్త్రీత్వ మావేశించినది. తన పతినే వామనుడు గట్టెను. ఆ పరీక్ష కామె నిలువలేకపోయినది. "అయ్యో! మాట తిరుగక నా పతి మూడు లోకములను దానమిచ్చినాడే. ఇట్టివానిని నీవు కట్టుట న్యాయమా?" యని నేరుగా వామన మూర్తి హృదయమునకే యామె ప్రశ్న వేసినది. వింధ్యావళి భగవంతుని గురించి వాడిన రెండు విశేషణములును రెండు ముత్యములు. 'శ్రీ దయితా చిత్తచోర' యనుటలో "నీకును భార్య యున్నది. భర్తకు కష్టము ప్రాప్తించి నపుడు భార్యకెంత దుఃఖముండునో యా లక్ష్మినడిగి చూడు" మనుచున్నది. "నిన్ను జేరిన భక్తులకు కల్పవృక్షము వలె కోరికలనెల్ల దయసేయువాడ వని ప్రసిద్ధి యున్నదే! నా భర్తను సర్వనాశము జేసితి వేమయ్యా!" యని యెత్తి పొడుచుచున్నది. ఆ యడుగుటయు కొంత గడుసుగ నున్నది. వింధ్యావళి మహా గంభీరమైన చిత్తవృత్తి గలది. ఆమె యెప్పుడును పలుకదు. పలికిన ప్రతి మాటయు తూచి పలుకును.

**గోపికలు :**

గోపికలు వింధ్యావళి వంటి వారు గారు. కృష్ణు డొకటి యన్న వారు పది మాట లాడుదురు. మనసులోని భావమును మాటుసేయుట వారెన్న డెరుగని

విద్య. గోపికల యసూయలు, ప్రేమలు, ఈర్ష్యలు, ప్రణయ కోపములు సర్వము మఱుక్షణమే కృష్ణునకు దెలియవలసినదే. గోపస్త్రీల విలాసములు వారి రూపురేఖలు వర్ణించునపుడు పోతన ఎంతో అందముగ శృంగార రసమును తీర్చిదిద్దెను. గోపకాంతలు యశోదకు కృష్ణుని యల్లరి చిల్లరి చేష్టలు దెలుపు ఘట్టము మూలములో మూడు శ్లోకములుగా మాత్ర మున్నది. దీనిని పోతన పెంచి సుమారు ముప్పది పద్యములు వ్రాసినాడు. గోపికా విరహవర్ణన, రాస క్రీడ, భ్రమరగీతలు- ఇట్టి వానిలో పోతనామాత్యుఁడా గోపికలు తానే యైపోయి నాడు. కాకున్నచో నంత బాగుగ నా ఘట్టములు వ్రాయుట యసాధ్యమైనపని. దశమ స్కంధములో సత్యముగ నాతడొక విరహ పరితప్తయై పతివ్రతయైన గోపికయే యైనాడు. ఆ మహాకవి తన కామక్రోధాదులను భగవంతునిపై నిక్షే పించుటకు ఫలము అతడు మాత్రమే కాదు; తెలుగుదేశమే తరించుటయైనది. కృష్ణవిరహ పరితప్తయైక గోపిక- పోతనామాత్యుడు కృష్ణునుద్దేశించి-

ఆడె నందనందనుం డంత ద్రిమ్మఱుండయ్యె
పాటలీతరులార ! పట్టరమ్మ !
హేలావతులం గృష్ణ! యేల బాసితి వని
యైరేయలతలార ! యడుగరమ్మ !
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా
చూతమంజరులార ! చూడరమ్మ !
మానినీ మదనుతో మారాక యెఱిఁగించి
మాధవీలతలార ! మనుపరమ్మ !

జాతిపతులబాయ నీతియే హరికని
జాతులార ! తిరలఁ జాటరమ్మ !
కదళులార ! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ ! (10. 1. 1016)

అని దీనముగా బలికెను. పోతనామాత్యుల విషయమున మనకు దక్కిన భాగ్యము గూడ నంతే. ఆ మహనీయుని గురించి మన మీ పద్యమును మాటిమాటికిని మననము సేసికొనవలసినదే. ఆంధ్ర సాహిత్యములో నాతడొక స్వప్నము వంటి వాడు. కవులెందరో పుట్టిరి. పుట్టుదురు. పోతనామాత్యుల వంటి తపస్వి, ఋషి, కవి పుట్టునని మాత్రము ధైర్యముగ జెప్పలేము.

*(ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు, 1957)*



కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే? పవనగుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠుఁబొగడని వక్త్రమే? ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరి పూజనములేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్య జాలరంధ్రములుగాక
చక్రిచింతలేని జన్మంబు జన్మమే తరళసలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే పాదయుగముతోడి పశువుగాక.

సంసారజీమూత సంఘమ్ము విచ్చునే చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్నులాఱునే విష్ణుసేవామృతవృష్టిలేక
సర్వంకషాఘౌఘ జలరాసులింకునే హరిమనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబులణఁగునే పద్మాక్షునుతి రవిప్రభలులేక
నిరుపమాపునరావృత్తి నిష్కళంక ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గి కోదండ చింతనాంజనములేక తామరసగర్భునకునైన దానవేంద్ర!

అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధమ్ముల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్.

# ఆంధ్ర మహాభాగవతము - రసానుభూతి

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యము

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దోచె నో
మల్లియలార ! మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే ?

ఈ పద్యం విని పరవశించే తెలుగువారికి భక్తి రసం కాదంటే లక్షణ శాస్త్రం మీద గౌరవముంటుందని నే ననుకోను. భక్తికి మారుపేరుగా పోతన భాగవతాన్ని చెప్పుకుంటారు తెలుగువారు. పండిత పరిషత్తులు మాత్రం మధుసూదన సరస్వతి రచించిన భగవద్భక్తిరసాయనం మీద సిద్ధాంతరాద్ధాంతాలు చేసికొని అనుభూతిని పాండిత్యవిభూతితో కలిపి నెన్నుదుట దిద్దుకుంటాయి. చర్చల కతీతమైన లక్ష్యలక్షణ గ్రంథం భక్తిరసాయనమైన భాగవతం.

భక్తి అనేది కావ్యభాషలో రసనామమైనా మౌలికంగా అది భగవల్లక్షణమైన చిత్తపరిపాకం. ఆకలి అవుతున్న పసిపాప అమ్మపాలకోసం అలమటించినట్లుగానే మానవుని అంతరాత్మ అఖండ చిన్మయానందం కోసం ఆరాటపడుతుంది. తియ్యనిపాలకై తల్లిపాలిండ్లకోసం తడివే పసికూనలాగానే అంతరాత్మ ఆ అనిర్వచనీయానందానుభూతి కోసం అన్వేషణ ప్రారంభిస్తుంది. ఆ అన్వేషణలోనే అంతరాత్మ ఎంతో ఎదుగుతుంది. యౌవనం పరిపాకానికి ప్రతీక యౌవనంలో ఉన్న స్త్రీ మనోహరుని మధురానురాగం కోసం ఎలా రతిభావాన్ని భజిస్తుందో, అన్వేషణలో అర్తయైన అంతరాత్మ అలా ఆ పరంజ్యోతి పరిష్వంగం కోసం పారవశ్యంతో పలవరిస్తుంది. అలా భగవద్రతితో పారవశ్యాన్ని చెందే పరిణతమైన చిత్తపరిపాకమే భక్తి. రతిచ్ఛాయ ఉండటంచేత పైకి అది శృంగారంగా కనపడుతుంది. కాని అది లోకంలో ప్రేయసీప్రియుల మధ్య కనపడే లౌకికమైన రతి కాదు; కావ్యాలలో కనపడే అలౌకికమైన రతీ కాదు; జీవాత్మ

పరమాత్మలో అద్వైతస్థితి కోసం ఆంతరమైన చైతన్యం అభిలషించే అవ్యక్తమైన ఆధ్యాత్మిక రతి. అది పరిపూర్ణం అఖండ ఆనందనిధానం. భాగవతంలోని గోపికల ప్రణయతత్త్వం అదే. పై పద్యంలో గోపిక లన్వేషించింది గోపాల కృష్ణుణ్ణైనా పరమార్థంలో పరమాత్మ తత్త్వాన్నే.

పైకి కనపడుతున్న ఈ స్త్రీ పుంస భావంలో నుండి ఒక మధురమైన ఆధ్యాత్మిక రతిభావం ప్రతీయమానం అవుతున్నది. ఆ రతి భగవత్పరంగా ప్రవహిస్తుండటం చేత భక్తిగా పరిణమిస్తున్నది. ఈ భక్తి ఇంద్రియ పరితృప్తికోసం లక్షించింది కాదు; భవబంధ విముక్తికోసం ప్రవర్తించింది. వేణుగానలోలుని కల్యాణవిగ్రహాన్ని కన్నులార గాంచిన ఆ గోపకాంతలు-పరమేశ్వరుణ్ణి దర్శించిన భాగవతోత్తముల్లాగా పరమానందాన్ని పొంది తరించారు.

హరి సురుచిర లలితాకృతిఁ
దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై
పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరుఁ గనిన ముక్తబంధుల భంగిన్.

అని పోతన్న వర్ణించాడు. ఉద్దిష్టతాత్పర్యాన్ని ఉపమానంలో ఉంచి ఉజ్జ్వలం చేశాడు. శృంగారం యవనికగా భగవద్భక్తి లాస్యం చేసిన కవితారంగం భాగవత గ్రంథం.

భాగవతాన్నంతా అలా ఉంచి ఈ భాగంలో సహృదయుడు పొందే రసానుభూతిని గురించి వివేచిస్తే మనకు కొన్ని విశేషాలు తెలుస్తాయి.

1. సహృదయుడిందులో అలౌకికార్థాల వెనుక ఆధ్యాత్మిక భావనం చేస్తున్నాడు.

2. పాత్రల్లో తాదాత్మ్యాన్ని భజించి రసానందాన్ని పొందుతున్నా ప్రాతిభాసికమైన ఆ స్థితి కంటె అతీతమైన ఆత్మానందస్థితిని అందుకోవాలని అవ్యక్తంగా ప్రయత్నిస్తున్నాడు.

3. గోపికల రతిభావం సాధారణీకరణాన్ని పొందుతున్నా భగవద్వి భావాలకు సంబంధించిన భావాలు సహృదయునికి అసాధారణాలై ఆశ్చర్యజనకాలై ఆలోచనాన్ని రేకెత్తిస్తున్నవే కాని తాదాత్మ్యాన్ని కలిగించటం లేదు. అంటే సహృదయుడు భక్త పాత్రల్లో తాదాత్మ్యాన్ని పొందగలడు. కాని భగవంతుని పాత్రలో పొందలేడు. అందువల్ల భాగవతంలోని ప్రధాన పాత్రయైన భగవంతుడు అలౌకిక విభావస్ఫూర్తితో వెలుగొందినా ఆధ్యాత్మిక విభాగంగానే అనుగమ్యమాను డౌతున్నాడు.

4. దీనికితోడు భాగవతంలో భగవత్తత్త్వం సగుణ నిర్గుణ మార్గాల ననుసరించి నిరూపితం కావటంచేత సహృదయుడు సగుణరూపంతో సహానుభూతి పొందలేకపోతున్నాడు. నిర్గుణతత్త్వాన్ని హృదయంతో సాధించలేకపోతున్నాడు. అందువల్ల భగవద్విషయంలో బుద్ధి నాశ్రయించ వలసివస్తున్నది. అలౌకికం హృదయగమ్యం, ఆధ్యాత్మికం బుద్ధిగమ్యం కావటంచేత భాగవతంలో సహృదయుడు పొందే రసానుభూతి సగం అలౌకికం; సగం ఆధ్యాత్మికం.

5. భాగవత పాత్రల్లో భగవద్రూపభావనం చేసేవి కొన్నీ, భగవత్తత్త్వభావనం చేసేవి కొన్నీ ఉన్నాయి. అందులో భగవద్రూపభావనం చేయటం భగవద్రతి. తత్త్వభావనం చేయటం తత్త్వజ్ఞానం. లాక్షణికమతా న్ననుసరించి భగవద్రతి స్థాయిగా కలిగింది భక్తి. తత్త్వజ్ఞానం స్థాయి భావంగా నిలచేది శాంతం. అయితే ఈ రెండూ అలౌకికాలైన శృంగారాదులకంటె విశిష్టములైనవనే చెప్పాలి. భక్తి శాంత రసాలు రసనామవాచ్యాలైనా రసాతీతాలని సంభావించాలి. భక్తి రసమని అంగీకరించినవారందరూ దాని కాస్థితి నంగీకరించారు. అంగీకరించనివారే భక్తిని భావమని భావించారు.

6. సహృదయుడు భగవద్రూపభావనం చేసే పాత్రలతో సహానుభూతిని పొంది భగవద్రతి స్థాయిని చర్వణం చేయటం వల్ల కలిగే రసమే భక్తి. తదానందమే భక్తిరసానుభూతి.

7. భగవత్తత్త్వభావనం చేసే భాగవత పాత్రలు జ్ఞానులై ఉంటారు. వారికా తత్త్వం ఆత్మజ్ఞాన రూపమైన మోక్షస్థితికి సాధక మౌతుంది. స్వస్వరూపానుసంధాన రూపమైన ఆత్మరతియే అప్పటి స్థాయి. అభినవగుప్తులన్నట్లు అది స్థాయితమము. దాన్ని రసమని పిలవటం ఔపచారికమే. సహృద

యుడు భాగవతంలోని భగవత్తత్త్వాన్ని స్థాయిగా గ్రహించి సగుణతత్త్వం వెనుక నున్న సచ్చిదానందాత్మక పరబ్రహ్మతత్త్వమే నిత్యమని తెలిసి అద్వైత స్థితిని సాధించి ఆత్మానందం పొందటమే రసానుభూతి.

8. దీనిని బట్టి విచారిస్తే-భాగవతపఠితయైన సహృదయుడు ప్రధానంగా ఆస్తికుడై ఉండాలి. ఆ పైన ఆధ్యాత్మికచింతనాపరుడై ఉండాలి. భాగవతంలో రమణీయార్థం కోసమే కాక, పరమార్థం కోసం కూడా వెదకాలి. ఇటువంటి చిత్త పరిపాకం ఉంటేనే భగవద్రతి ప్రకాశిస్తుంది. లేకపోతే ఆభాస ఎదురౌతుంది.

భాగవతంలోని అవతార కథా బాహుళ్యం భగవద్భక్తుల గాథాప్రపంచం ఆ గ్రంథంలోని భగవద్రతికి ప్రాచుర్యాన్ని కల్పిస్తున్నాయి. నిర్గుణపరబ్రహ్మాన్ని సగుణోపాసనం ద్వారా సాధించే సాత్త్వికభక్తియోగం భాగవత ప్రతిపాదిత పరమ తాత్పర్యం. భక్తి ఎన్ని భావాలతో మిళితమై మెలగటానికి వీలుందో, ఎన్ని విధాల ప్రవృత్తుల్లో ఎన్నెన్ని అవస్థలను పొందటానికి అవకాశముందో భాగవత కథాప్రపంచం విశ్వరూపంగా ప్రదర్శించింది. నవవిధ భక్తులు పెద్దనామాలు పెట్టుకొన్న పెనుమాళ్లు మాత్రమే. వాటిలో అవాంతరభేదాలు శత సంఖ్యల మీద విశ్లేషించవచ్చు. భాగవతం చదివిన సహృదయులు శృంగారాది వికృతిరసాలు గాని, ప్రకృతిరసంగా పరిగణింపబడిన శాంతం గాని భక్తిభావోద్దీప్తాలై ఎలా భగవద్రతిగా పరిఢవిల్లుతాయో అనుభవించి చూడవచ్చు. తత్త్వజ్ఞాన స్థాయియైన శాంతం యోగిజన గమ్యమైతే భగవద్రతి స్థాయియైన భక్తి సంస్కారవంతులైన సహృదయుల కందరికీ సాధ్యమన్నట్లుగా భాగవతం నిరూపించింది. 'భక్తిః ఏవ ఏకో రసః' అన్నమాట అనలేదు కాని 'భక్తిః ఏవ పరిపూర్ణో రసః' అని మధుసూదన సరస్వతి దర్శనాన్ననుసరించి ప్రవచింపవచ్చునని భాగవతరసానుభూతి సహృదయులకు ప్రేరణ కలిగిస్తుంది. పోతన భక్తికి ఆవేశాన్నీ, ఆలోచననూ రెండు రెక్కలుగా తీర్చిదిద్ది భక్త్యానందాన్నీ ఆత్మానందాన్నీ అందించే సవ్యసాచిత్వాన్ని సుసంపన్నం చేశాడు.

భక్తికి చిత్తపరిపాక మెంత అవసరమో భావావేశం అంత అవసరమని భాగవతరచనలో పోతన వ్యంగ్యమానం చేశాడు. రసానుభూతిని కలిగించటానికి

శ్రవ్యకావ్యంలో మౌలికంగా తేడ్పడేది. విభావవిస్ఫూర్తిని దృశ్యాయమానం చేయగల రచన. రచనలో కావ్యశరీరస్థానీయమైన శబ్దం ఉంది. చైతన్య స్ఫోరకమైన అర్థం ఉంది. గుణవ్యంజకమైన శబ్దార్థ సంయోజన ముంది. వైఖరీ విన్యాసాన్ని వెల్లార్చగల రీతి విధానముంది. శోభాతిశయత్వాన్ని కలిగించడానికి అలంకారముంది. వీటిని జీవింపచేసే ఔచిత్యం ఉంది. ప్రాణం పోయగల వ్యంగ్యం ఉంది. ఆత్మయైన రసం ఉంది. భగవద్రూపరతిని స్థాయిగా పోషింప దలచుకొన్న పోతన్నకు రూపవైభవాన్ని అందింపగల శబ్దం ధాతుపుష్టివంటిది. భౌతిక శరీరసౌందర్యం లయాన్వితమై అలంకృతమైతే మధురంగా ఉజ్జ్వలంగా భాసిస్తుంది. చైతన్య స్ఫోరకమైన అర్థం ఆవేశంతో లాస్యం చేయగలిగితే రూపం నృత్యాయమాన మౌతుంది. అందువల్లనే పోతన తన రచనను శబ్దాలంకా రాలతో నాదమయం చేస్తాడు. భావావేశంతో అర్థాన్ని వక్రవిన్యాసం చేయిస్తాడు. సగుణమైన పరబ్రహ్మం లీలావిలాసాలను పచరించే భాగవతాఖ్యానంలో శబ్దా ర్థాల సంవిధానం ఇలా ఉండటమే రసానుభూతికి దోహదం చేస్తుంది. చేపట్టిన వస్తువును రూపుకట్టించే వాక్పాకం కుదరటం సహజకవికి సహజాలంకారం.

అంతేకాదు, భక్తి కవితలో రక్తి కట్టాలంటే శ్రవణం, సంకీర్తనం, చింతనం అనే భక్తిమార్గాల కది పరిపోషకంగా ఉండాలి. కవితకు లలితశబ్ద సంయోజనంవల్లా, మధురాక్షర పునరావృత్తివల్లా, అనుప్రాసయమకాది శబ్దా లంకార సంవిధానం వల్లా శ్రవణసుభగత్వం అలవడుతుంది. ధారావాహికమైన గతివల్లా, భగవద్గుణ సంకీర్తనంవల్లా, రాగరంజితమైన శైలివల్లా, అలవోకగా అవధానం చేయగలిగే పద్యవిద్య వల్లా కవితలో సంకీర్తనకు సౌలభ్యం ఏర్పడు తుంది. భావనాగంభీరాలైన అర్థాలంకారాల వల్లా, వ్యంగ్యసౌరభాన్ని వెదజల్లే వాక్యవిన్యాసంవల్లా అరటిపండొలిచి పెట్టినట్లు అభివ్యక్తంచేసే తాత్త్విక తాత్పర్యం వల్లా కవిత్వం పఠితలలో చింతనను రేకెత్తింపజేస్తుంది. బమ్మెర పోతన కవిత్వం ఈ లక్షణాల నన్నింటినీ సలక్షణంగా సమన్వయించుకోవటం వల్ల భక్తిరసానుభూతికి శక్తిమంతమైన సాధన మౌతున్నది.

'మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు'

ఇటువంటి రచనలోని మాధుర్యం శ్రవణాన్ని ఆకట్టుకుంటుంది.

'కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ'

ఇటువంటి రచనలో సంకీర్తనం స్వాదువుగా వినిపిస్తుంది.

'ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి! వింటే'

వంటి పద్యాలు పఠితల్లో తాత్త్విక చింతనాన్ని ప్రేరేపించే హృద్యపద్యోపనిషత్తులు.

'అమ్మలఁ గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁ బె
ద్దమ్మ, సురారులమ్మ కడుపాఱడి పుచ్చినయమ్మ, దన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడ యమ్మ, దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వసంపదల్.'

వంటి పద్యాల్లో కనపడే వృత్త్యనుప్రాసం వట్టి శబ్దాడంబరం కాదు. పఠితలను నాదనామ క్రియారాగంతో మైమరపించే సమ్మోహనమంత్రం. తేట తెలుగు మాటలే కాదు, దీర్ఘ సంస్కృత సమాసాలు కూడా మందారమకరంద ప్రవాహంలా పోతన్న కవితలో తరుగని రుచుల నీనుతుంటాయి. చూడండి-

'శారదనీరదేందు ఘనసార పటీర మరాళమల్లికా
హారతుషార ఫేనరజతాచలకాశ ఫణీశకుందమం
దారసుధాపయోధి సితతామరసామరవాహినీశుభా
కారత నొప్పు నిన్ను మఱిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ!'

పోతన్న భక్తికవితయే ఆంధ్ర మహాభాగవతానికి ప్రాణం.

కవిత్వానికి ఆవేశం ముఖ్యమా? సంయమనం ముఖ్యమా? అన్న మీమాంస కొందరు చేస్తారు. శిల్ప సంప్రదాయవాదులు సంయమనం ఉత్తమగుణమంటారు. పోతన్న భక్తిప్రధాన రచనం చేస్తున్నాడు. భక్తి జ్ఞానప్రసూనంగా పరిమళిస్తే సంయమనంతో కూడిన కవిత రాణిస్తుంది. జ్ఞానవిశిష్టమైన భక్తి

రసోల్లాసస్థితిని భజించాలంటే సంయమనం కంటె ఆవేశం రసపోషకంగా రంజిస్తుంది. జ్ఞానం పోతన భాగవతంలో భక్తికి శక్తిగా నిలిచింది. భక్తి కవిసూక్తి నాశ్రయించి మధురలాస్యం చేసింది. అంగికి ఉద్దీపనంలా నిలిచే సాంగమైన రసప్రచన పోతన కవిత. పోతన కవితకు భక్తి భిత్తిక. శబ్దం ధాతురాగం. భావం రేఖాచిత్రం. భగవన్నామగుణలీలాభివర్ణనం వర్ణవిన్యాసం. ఆవేశం స్ఫూర్తి. అలంకారం అందం. భగవద్రతి జీవితం. అనుభూతి ఆత్మ. పోతన కవితను చదివే సహృదయుడు భక్తి నుండి రసానుభూతి దాకా పద్యాన్ననుసరించి ప్రస్థానం సాగిస్తాడు.

'ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాది మధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.'

ఈ పద్యం గజేంద్రుని నోట పలికించిన స్తుతి. సర్గప్రతిసర్గాత్మకమైన పురాణ లక్షణాలను పుక్కిటబట్టిన విశేషణాలను పురాణపురుషునికి వాడటం పురాణస్వభావానికనువైన ఔచిత్యం. నిర్వ్యాపారమైన నిర్గుణబ్రహ్మను క్రియాశీలియైన చైతన్యంగా చెప్పి సగుణత్వసాధనకు బోధనను సమకూర్చటం సర్వనామ ప్రయోగ విశేషం. విభక్తి క్రియాన్వయం కలిగించేది కాబట్టి భగవదాకార రతి వ్యంజకం. చివరకు శరణాగతి భక్తి ప్రపత్తికి పతాక. రూపారూపారోపం చింతనకు చింతామణి. పోతన 'పరమేశ్వరా!' అని పిలిస్తే వైకుంఠవాసుడు పలకటం శివకేశవాద్వైతసిద్ధిని భక్తికి ప్రసాదించే ఉపాయం. నిర్గుణానికి గుణసంకీర్తనం వల్ల రూపారోపం చేసే భక్తిమార్గానికీపద్యం అనవద్యమైన దుర్గం.

'సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహి యై.'

ఇది సగుణక్రియాలోలమైన భగవదాకారచిత్రణం. భక్తరక్షణ కళా పారీణుడైన భగవంతుని ఉత్సాహావేశానికి సచిత్రవ్యాఖ్యానం. భక్తుడా భగవంతునితో సహానుభూతిని చెందిదానికంటె దీనావనరక్షణోద్యోగంతో ఉన్న ప్రదుడైన భగవంతుని లీలావిలాసచర్వణం వల్ల ఆర్ద్రమైన హృదయంలో భగవదాకార రతిని ప్రతిబింబింపజేసికొని మననం చేస్తాడు. భక్తచిత్తవృత్తుల్లో సహృదయుడు మజ్జనోన్మజ్జనం జేస్తూ భగవద్రతిని స్థాయిగా పెంచుకుంటాడు.

భాగవతంలోని భాగవతుల రసభావోల్లాసం సహృదయుల అలౌకిక రసభావాలకు సహపంక్తి భోజనం. భగవద్రూపగుణనామ లీలాతత్త్వ సంకీర్తనం సహృదయులకు భగవదాకారరతిభావస్థాయి సంస్థాపకం. భగవద్రతి చర్వణం సహృదయ రసస్థితిపోషణం.భగవదాకార నిరంతర స్మరణ మనన ధ్యానాది జనిత నిజసంస్కార సంవలిత ఆత్మానంద సంవాదస్థితి భాగవతరసానందస్థితి. మహానందాంగన బ్రహ్మానందం తదానందాంగనాడింభకుడు భగవద్రతిస్థాయి రూప భక్తి రసానందకందుడైన రసబ్రహ్మం. భాగవత రసానుభూతి భగవంతుని రూపమును ద్రవీభూతచిత్తము నందు ముద్రించుకొని అలౌకికమూ, ఆధ్యాత్మికమూ అయిన అనుభవస్థితియందున్న ఆనందవ్యక్తి! 'రసో వై సః'.

వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసి యున్న
భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు !

(రసోల్లాసము, 1980)

* * *

అమ్మలఁ గన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలఁబె
ద్దమ్మ సురారులమ్మకడుపాఱడిఁ బుచ్చినయమ్మ దన్ను లో
నమ్మినవేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.

# కుచేలోపాఖ్యానము

—శ్రీ శివశంకర స్వామి

శ్రీకృష్ణుని సఖుడైన కుచేలుడు విజ్ఞాని. రాగాది విరహితస్వాంతుడు. శాంతుడు. మానధనుడు. విజితేంద్రియుడు. బ్రహ్మవేత్త. బహుసంతాన ముండుటచే దారిద్ర్యబాధ ననుభవించుచు అన్యులను నీచముగా యాచింపక తనంత లభించిన కాసును బంగారు నాణెముగా తలపోయుచు సంతృప్తి చెందుచు నెట్లో యతడు భార్యను, బిడ్డలను పోషించుచుండెను.

అతని భార్య ఆభిజాత్యము కల పతివ్రతాతిలకము. ఒకనాడు బిడ్డ లాకటిచే మలమల మాడుచు అన్నము పెట్టుమని ఆకులు, గిన్నెలు చేత బట్టుకొని వచ్చి చుట్టును జేరగా నామె మిక్కిలి దుఃఖించి భర్త కడకు పోయి "పేదరికము నివారించు నుపాయ మూహింపకున్నావు-

బాల్యసఖుడైన యప్పద్మపత్రనేత్రుఁ
గాన నేగి దారిద్ర్యాంధకార మగ్ను
లైన మము నుద్ధరింపుము హరి కృపాక
టాక్ష రవిదీప్తి పడసి మహాత్మ ! నీవు.

వరదుఁడు సాధుభక్తజన వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు తా కుశస్థలీ
పురమున యాదవ ప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు నీ
వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూన సంపదల్.

కంతోనం దను మున్నెరుంగని మహా కష్టాత్ముఁ డైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులో
దలఁపన్ తోడన మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్; సుని
శ్చల భక్తిన్ భజియించువారి కిదఁడే సంపద్విశేషోన్నతుల్ !"

అని బోధించెను. కుచేలుడు సంతోషించి కృష్ణుని జూడబోవుట యిహపర సాధకమని తలచి భార్యతో "నీవు చెప్పినట్లు చక్రపాణిని జూడబోయినపుడు రిక్తహస్తములతో జనక కానుక కొనిపోవలెను గదా! ఏమున్నది?" అనెను. ఆమె కొన్ని యటుకులు తర్ర యుత్తరీయము కొంగున గట్టగా నతడు గోవింద దర్శనోత్సాహియై బయలుదేరెను. త్రోవలో నతనికి జంకు కలిగినది.

"ద్వారకా నగరములోని కెట్లు పోవుదును ? అంతఃపురములోనికి బోవు నెడల ద్వారపాలకు లడ్డగింతురు. వారి కేమి బహుమాన మీయగలను? 'ఎక్కడి విప్రుడవు ? ఇందుల కేల వచ్చితివి?' అన్న నేమి చేయుదును ? కృష్ణుడు నన్ను ఉపేక్షింపడు. అతని చిత్తము. నా యదృష్టము" అని వితర్కించుచు కుచేలుడు నగరములోను క్రమముగా నగరిలోను ప్రవేశించెను. వివిధ హర్మ్యములను జూచుచు తుద కొక మందిరమున స్త్రీలు చామరములు వేయుచుండగా భార్యతో కూడ కృష్ణుడు హంసతూలికా తల్పముపై గానపడెను.

ఇందీవరశ్యాము వందితసుత్రాము
కరుణాలవాలు భాసురకపోలు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
కౌస్తుభాలంకారు కామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
ఖగకులాధిపయాను కౌశేయ పరిధాను
పన్నగశయను నబ్జాతనయను
మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణు కృష్ణు.

కని దాయం జనునంత కృష్ణుఁడు దరిద్రకాంక్షాతుఁ డప్పేద వి
ప్రుని నశ్రాంతదరిద్రపీడితు కృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెం దల్పమున్,

దిగి యెదురు పోయి బహువిధముల నాదరించి స్వాగతము పలికెను. రుక్మిణి చామరము వేసెను. శుద్ధాంతకాంతలు ఆశ్చర్యము చెందిరి. కృష్ణుడు కుచేలుని చేయి పట్టుకొని చిన్ననాటి గురుకులములోని సంగతులు కొన్ని జ్ఞప్తి చేసి ''నీవు ఉత్తమవంశ సంజాతను పెండ్లియాడినా వనుకొందును. నీ మనస్సు ఐహిక విషయములందు లగ్నము కానట్టు తోచుచున్నది.'' అనెను. అనంతరము లోక సంగ్రహమును గూర్చియు, గురుమహిమను గూర్చియు సంభాషించి ''ఒకనాడు గురుపత్ని నియోగమున ఇంధనార్థ మడవికి జని జడివానలో తడిసి రేయెల్ల నడచి గడిపినాము. ప్రాతఃకాలమున గురువు సాందీపని వెదకి వెదకి మనను కనుగొని యూరడించి నిజమందిరమునకు గొనిపోయిన సంగతి జ్ఞప్తియున్నదా?'' యని కొంత ప్రసంగించి ''నీవు వచ్చునపుడు నాకేమి యుపాయనము తెచ్చితివి ?

దళమైన పుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.''

అను కృష్ణునకు కుచేలుడు మోమోటమిచే అటుకు లీయనేరక తలవంచుకొని మిన్నకుండెను. కృష్ణభగవానుడు బ్రాహ్మణుని స్థితిగతులు దివ్య చిత్తమున గ్రహించి ముడివిప్పి అటుకులు గుప్పెడు తీసికొని తిని మరియొక గుప్పెడు తీసికొనబోగా రుక్మిణి భర్త చేయి పట్టుకొని వారించెను. కుచేలు డారాత్రి గోవిందుని మందిరమున వివిధ దివ్యపదార్థములు భుజించి మృదుశయ్యాతలమున నిద్రించి అరుణోదయమున లేచి కాల్య విధులు నిర్వర్తింప కృష్ణు డతనిని కొంత దవ్వు పంపెను. త్రోవలో విప్రుడిట్లు తలపోసెను: ''పురుషోత్తముని దర్శించితిని. నా జన్మము ధన్యమైనది. సోదరుని వలె నన్ను కృష్ణుడు బహువిధముల నాదరించినాడు.

శ్రీనిధి యిట్లు నన్ను బచరించి మనంబుగ విత్త మేమియు
న్నీని తెఱంగు గానబడె నెన్న దరిద్రు(డు సంపదంధు(డై
కానక తన్ను జేర(డని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయకుండునే?''

ఇట్లు తలపోయుచు నిజపురము జేరి మహాసౌధమును గాంచి ఎవరిదో యను కొనుచుండగా దివ్యవనితల వంటి తెరవలు గీతనృత్త వాద్యములతో నతనిని అంతిపురిలోనికి గొనిపోయిరి. దివ్యాంగన వలె నానందముతో కలకలలాడుచున్న నిజభార్యను గాంచి యతడు సంతసించి హరిలబ్ధ వైభవము ననుభవించుచు మనోవికారము లేక హరిధ్యాన పరాయణుడై యుండెను.

జీవేశ్వరు లేకముగా నున్నను వారిని గూర్చి శ్రుతి యిట్లు చెప్పుచున్నది—

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిష స్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యో అభిచాకశీతి.

కుచేలుడు జీవుడు. కృష్ణుడు ఈశ్వరుడు. జీవేశ్వరులకు తత్త్వతః భేదము లేదు. అయినను సంసారిత్వము వలన బ్రహ్మమునకే జీవత్వవ్యప దేశము సంభవించుచున్నది. పార్థివశరీరమున ప్రవేశించిన పిదప జీవుడు కించి జ్ఞుడ ననియు, ఐశ్వర్యహీనుడ ననియు భావించును. సంసారియగుటచే బుద్ధి తాదాత్మ్యము నొంది స్వస్వరూపమును మరచి అనైశ్వర్యమునే పొందును.

కుచేల జన్మమునకు పూర్వము జీవుడు లౌకికైశ్వర్యమదమత్తుడై ఐహిక భోగముల ననుభవించుచు నారాయణ పరాయణత్వమును విసర్జించెను. దుష్కర్మాచరణమునకు ప్రతిఫలము వివిధబాధారూపమున నుండును. కుచేలుడు జన్మతః దరిద్రుడు. కుచేల మనగా జీర్ణవస్త్రము. ఇక్కడ వస్త్రము లౌకిక భోగములకు సంకేతము. కుచేలమైనపుడు దారిద్ర్యచిహ్నమే.

"దరిద్రాయ కుటుంబితా." ధనహీనులకు సంతానము మెండు. కుచేలునకు మొత్తము ఇరువదియేడుగురు బిడ్డలు కలిగినట్లు ఒకచో గానవచ్చుచున్నది. సర్వ విధముల సమర్థత యున్నను బహుసంతానము వలన బాధలు తప్పవు. అందులో తాను భరింపలేని బిడ్డలను గనుట దరిద్రునకు తగనిపని. బిడ్డలకు గుడ్డలు తగినవి ఈజాలక పోవుట యటుండ కడుపునిండ అన్నమైనను పెట్ట జాలడు. కావుననే కుచేలుని సంతానము ఆకలిచిచ్చుచే మాడుచు పట్టెడోగిరము

పెట్టుటకే యుకుగుట సంభవించెను. ఆ వ్యథ భరింపజాలక యొకనాడు అతని భార్య దారిద్ర్యనివారణమున కుపాయ మూహింపవలసినదని కోరినది. అంత వరకు నతనికి ఈ విషయము తోచనేలేదు.

అంతలో అభిజాత్యము. తన యంత లభ్యమైనదే పుచ్చుకొనునుగాని అతడు యాచన చేయడు. ఎట్లో కుటుంబపోషణము చేయుచుండెను. అట్టివాడు ఏదో మందముగా నుండును. నిగ్రహము లేక బహుసంతానము కన్నను అతని కొక గొప్ప సుగుణమున్నది. అది నిరంతర హరిధ్యానపరాయణత్వము.

ఆప్తోపదేశము లేకుండ ఉత్తమ కార్యాచరణ ప్రారంభము కానేరదు. అతని భార్య యొకనాడిట్లు చెప్పినది-

నను బ్రహ్మన్ భగవత స్సఖా సాక్షాత్ శ్రియఃపతేః
బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ భగవాన్ సాత్వతాం పతిః.

అందలి శబ్దములు సార్థకములు. ఇదియే ఉపదేశమయ్యెను. దుష్కర్మశేష ముండుటచేతనే అప్పటికిని పెద్దమ్మవారు ఏవో సంశయములు కలిగించినది. గోవిందదర్శనోత్సాహత్వము రక్షించినది.

లీలామానుష విగ్రహుండైన కృష్ణ భగవానుని ప్రవర్తనము, సంభాషణము సంస్తవనీయములు. తాను భగవదవతారుడైనను లోక సంగ్రహార్థము శ్రీకృష్ణుడు అతిథి నెట్లు సత్కరింపవలెనో, బాల్యసఖు నెట్లు సంభావింప వలెనో లోకము కొట్టవచ్చినట్లు వలె నిరూపము చేసినాడు. కుచేలుడు అంతిపురమునకు పోయి మరునా డుదయము కృష్ణుని వద్ద సెలవు తీసికొని పోవు వరకును జరిగినదంతయు మాధురాతి మధురము. మధురానాథుడగు మాధవుడే అట్టి పని చేయగలడు. అట్టి వాక్కులు పలుకగలడు.

పరమేశ్వరానుగ్రహము వలన కుచేలుని దౌర్భాగ్యము తొలగిపోయినది. క్షణకాలములో అతని పురములో సమస్త సంపదలు సమకూడి అతనికై యెదురు చూచుచున్నవి. అయినను త్రోవలో నున్న కుచేలున కా విషయము తెలియదు. మిత్రుడు తన్ను కృతార్థుని పరిపూర్ణుని చేయలేదనియు, అట్లు చేయకుండుటకు

కారణము సంపదంధుడు భగవానుని విస్మరించుననియు తలపోయుట ఆతని యదృష్టమునకు సూచనయే.

ఆప్తోపదేశము వలన వివేకోదయమైనది. పరమేశ్వరానుగ్రహము వలన నిజస్థితి అనగా ఐశ్వర్యము లభ్యమైనది. అప్పుడు భగవానుని యెడ భావము దృఢతమమగను. ఇంటికి జని కుచేలుడు సంపద ననుభవించుచున్నను మనస్సు భగవానుని యందే లగ్నము చేసి యుండెను.

భూభారము హెచ్చి వసుంధర గోరూపధారిణియై బ్రహ్మాదులను తరచుగా ప్రార్థించినట్లు పురాణముల వలన తెలియుచున్నది. భూభారమనగా జనబాహుళ్యము. ప్రాచీన కాలము నుండియు భరత వర్షమునకే కాక ప్రపంచమునకే యిక్కట్టు తెచ్చుచున్నది. ప్రజ సంతాన నిరోధము చేసినగాని ప్రపంచము బాగుపడదు. లోకమునకు కుచేలత్వము తొలగదు.

*(ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు, 1957)*

* * *

హరికిం బట్టపుదేవి పున్నెములప్రో వర్థంపుబెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుతల్ తోనాడు పూఁబోఁడి తా
మరలందుండెడి ముద్దరాలు జగముల్ మన్నించుఇల్లాలు భా
సురతన్ లేములు వాపుతల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్ !!

పుట్టంబుట్టి శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్
నెట్టంగల్గను గాలిఁగొల్వను బురాణింపం దొరంకొంటి మీఁ
దెట్టేవెంట రచింతుఁ దత్సరణి నాకీవమ్మ ! యోయమ్మ ! మేల్
పట్టున్ మానకుమమ్మ ! నమ్మితిఁజుమీ బ్రాహ్మీ ! దయాంభోనిధీ !

# పోతన వ్యక్తిత్వము

ఆచార్య సి. నారాయణరెడ్డి

బమ్మెర పోతన అనగానే భాగవతం గుర్తొస్తుంది. భాగవతం అనగానే భక్తితో తడిసిన గాథలు అలలు అలలుగా పొంగివస్తాయి- గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్ర, వామనచరిత్ర, రుక్మిణీకల్యాణం, అంబరీషోపాఖ్యానం, అజామిళోపాఖ్యానం- ఇంచుమించుగా భాగవతంలోని ఉపాఖ్యానాలన్నీ. ఈ భక్తమణుల చరిత్రలను ఏకత్రితం చేసిన మూలసూత్రం వాసుదేవతత్త్వం. వ్యాసునంతటివాడే వేదాలను వింగడించి, అష్టాదశపురాణాలను విరచించి, బ్రహ్మసూత్రాలను ప్రవచించి, భారతాన్ని ప్రబంధీకరించి అప్పటికీ మనస్సు నిండక 'హరికీ యోగివరులకూ అభిలషితమైన భాగవతగాథ పలుకనైతినే' అని ఖిన్నుడైనాడు నారదబోధితుడై విష్ణుకథాశిరోమణియైన భాగవతాన్ని ఎన్నుకున్నాడు. ఈ రకంగా తన మదిలో కలిగిన అరకొరలను తీర్చుకున్నాడు.

వ్యాసభారతం తెలుగుసేత ఆంధ్రకావ్యలక్ష్మికి అసలైన కైసేత. ఆయమ్మను అంతకుముందు చిటిపొటి నగలతో సింగారించిన తెలుగుకవులు లేకపోలేదు. వారి వెన్నెలపదాలూ, తుమ్మెదపదాలూ, ఉయ్యాలపాటలూ, నివాళిపాటలూ, ఏలలూ, జోలలూ పుడమితల్లి కడుపున కరిగిపోయి ఉంటాయి. దేశీయుల నాల్కలలో మాటుమణిగి ఉంటాయి. లేక ఏ తాటాకులలోనో, రాగిరేకులలోనో, రాతిపలకలపైనో ముక్కప్రాయంగా పడిఉంటాయి. అయితే తెలుగు కవిత్వానికి తొలిసారిగా గ్రంథస్థితి కల్గించింది కవిత్రయమే. అంటే నేటి గ్రాంథికభాషకు పాదులువేసిన వారు నన్నయ్య- తిక్కన్న- ఎర్రన్నలే! భాషకే కాదు తెలుగులో కావ్యరచనాశైలిని తీర్చిదిద్దింది కూడా ఈ మూర్తిత్రయమే! చతుర్వేదసారమైన వ్యాసభారతం వారిచేతిలో పడి కావ్యచిక్కణత్వాన్ని సంతరించుకుంది. పద్యవిద్యకు ఆద్యుడైన వాల్మీకి రచించిన రామాయణం భాస్కరాదుల ద్వారా తెలుగుపొలంలో పదం మోపింది. ఆ విధంగా భారతీయ సంస్కృతికి మూలకందాలైన మూడు గ్రంథాలలో భారత రామాయణాలు ఆంధ్రావళి చేతికందినవి.

ఇక మిగిలింది వ్యాసభాగవతం. అప్పటికి దానిపై ఎవరిచూపూ పడనట్టుంది. చూపు పడినా చేయిసాచే చొరవ ఏ కవికీ కలుగనట్టుంది. ఆ మహాభాగవతఫలం ఒక తెలుగు చిలుక కొరకు వేచి ఉంది. ఆ చిలుక తెలంగాణా నడిబొడ్డులో ఓరుగల్లు గడ్డలో బమ్మెర కొమ్మపై అప్పటికే వీరభద్రవిజయాన్ని వినిపించింది. భోగినీదండకాన్ని ఒక రాచవలరాచవాని చెవులకు రసికవాణిగా అందించింది. ఆ శుకరాజే మన పోతరాజు. ఆ "శుకముఖాసుధాద్రవమున మొనసి యున్న" భాగవతఫల రసాస్వాదనం తెలుగు రసిక భావవిదుల మహిత భాగధేయం.

వీరభద్రవిజయం రచించేనాటికి పోతన్న పిన్నవాడు. పెక్కు సత్కృతులు వ్రాయనివాడు. తన గురువైన ఇవటూరి సోమనారాధ్యుని ప్రసాద మహిమచే ఆ కృతిని రచింపగలిగినాడు. వీరభద్రవిజయం పోతన్న చేయనున్న సేద్యానికి తొలి చాలు సర్వజ్ఞసింగభూపాలునికి కానుక వెట్టిన భోగినీదండకం మలి చాలు. ఇక చాలు. ఆ తరువాత పోతన్న మనసు మలుపు తిరిగింది. అటు వీరశైవమతం మీదా ఇటు రసికరాజానుమతం మీదా దృష్టి తొలగింది. వ్యాసునికి విష్ణుకథ విరచించని కొరత తోచినట్లే మన పోతన్నకు "శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాకుతూహలం" కుట్మలించింది. అది రాకానిశాకాలం. సోమోపరాగ సమయం, గంగాస్నానం, మహేశ్వరధ్యానం- అదీ పోతన్న స్థితి. 'కించిదున్మీలిత లోచనుడై' ఉండగా రామభద్రుని సాక్షాత్కారం. మహాభాగవతం తెలుగు సేయుమని ఆనతి. వెరగుపడిన చిత్తంతో పోతన్న అంగీకృతి. చిత్రం! పోతన్నకు కలిగిందేమో విష్ణుకథా రచనా కుతూహలం చేసిందేమో మహేశ్వరధ్యానం. కట్టెదుట నిలిచినవాడో- రామచంద్రుడు. ఆ మహానుభావుడు సూచించిన వస్తువో- గోవిందకథా కదంబమైన భాగవతగ్రంథం. అంకితం తన పేరనే అన్నాడు ఆ రామరాజు: ఔనన్నాడు మన పోతరాజు. 'శ్రీరామచంద్రుని సన్నిధానంబు కల్పించుకొని' 'హరికి నందగోకుల విహారికి' అంటూ షష్ఠ్యంతాలెత్తుకొని ఆంధ్రభాగవతాన్ని చిన్నికృష్ణునికి సమర్పించుకున్నాడు. రామన్నను శ్రోతగా నిలుపుకొని భాగవతగాథను విన్నవించుకున్నాడు. ఇది చిత్రమా? కాదు. పోతన్న పెంపొందించుకున్న సమచిత్తం. శివుడు, కేశవుడు, రాముడు, కృష్ణుడు- ఈ నాలుగు మూర్తులకు ఏకత భజించడం పోతన్న అభేదభక్తికి తులలేని తార్కాణం. ఇంతటి సమన్వయ దృక్పథం అప్పటి మత వాతావరణంలో అపూర్వం!

ఏ కథను ఎన్నుకోవాలి? ఏరుకున్న కథను ఎక్కడ ఎత్తుకోవాలి? ఆ వస్తువును ఏ దృష్టితో విస్తరిస్తున్నదీ ఎలా వివరించాలి? తన కవితా లక్ష్యాలను ఏ రకంగా సిద్ధాంతీకరించాలి? ఏ కవికైనా ఈ అవస్థ తప్పదు. కృత్యాద్యవస్థ అంటే ఇదే.

సరిగ్గా పోతన్న తిక్కన్న తెన్నునే అనుసరించినాడు. భాగవతావతారికను విరాటపర్వావతారికకు తోబుట్టువుగా తీర్చిదిద్దినాడు. తిక్కన్న లాగే తన వస్తువును తానే ఏరుకున్నాడు పోతన్న. తిక్కన్న భారత రచనా కౌతుకం కనబరిస్తే పోతన్న శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలం కనబరచినాడు. అతడు నిద్రించే సమయంలో కలలో కన్నట్లుగా హరిహరనాథుడు కనిపిస్తాడు. ఇతడు గంగాతీరంలో మహేశ్వరధ్యానం చేస్తూ కన్నులరమూసుకొని ఉండగా రామభద్రుడు దగుపిస్తాడు "కరుణారసము పొంగి తొరగెడు చాడ్పున" అన్న సీసపద్యంలో హరిహరనాథుణ్ణి రూపు కట్టించినాడు తిక్కన్న. "మెరుగు చెంగట నున్న మేఘంబు కైవడి" అన్న సీసపద్యంలో సీతానాథుణ్ణి చిత్రించినాడు పోతన్న. అతడు సర్వేశ్వరుడు. ఇతడు రాజముఖ్యుడు. అక్కడ హరిహరనాథుడు సెలవిస్తాడు - భారతరచనా ప్రయత్నం భవ్య పురుషార్థతరు పక్వఫలమని. దానిని తనకు కృతి యిమ్మని. ఇక్కడ రామభద్రుడు ఆనతిస్తాడు - మహాభాగవతం తెనుగు సేయుమని. తన పేర అంకిత మిమ్మని. ఈ ఇతివృత్తాన్ని స్వీకరించడం, నరేశ్వరుణ్ణి కాక సర్వేశ్వరుణ్ణి కృతిపతిగా నిర్ణయించడం తిక్కన్న పోతన్నలకున్న సమధర్మం. ఈ కృతులు రచించే నాటికి ఇద్దరి మనఃప్రవృత్తులు ఎల్లలు లేని భక్తిపరిత్తులు. భారత రచనం తిక్కన్న దృష్టిలో ఆరాధన విశేషం. భాగవత రచనం పోతన్న దృష్టిలో భవబంధ విమోచనం. ఇక్కడే ఉంది పోతన్న అదృష్టం. చిత్తస్థితికి తగిన ఇతివృత్తం దొరికింది. పరవశించి పాడుకున్నాడు —

పలికెడిది భాగవతమఁట;
పలికించు విభుండు రామభద్రుండఁట; నేఁ
బలికిన భవహర మగునఁట;
పలికెద వేఱొండు గాథఁ బలుకఁగ నేలా ?

నాలుగు పలుకులను ప్రాసస్థానంలో చిలికి తన పులకలు వెలార్చుకొన్నాడు. అయితే భాగవత రచన అంతంత మాత్రాన జరిగేది కాదు. ఈ సహజపాండిత్యునికి అది తెలియదా ? అదీ విన్నవించుకొన్నాడు—

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱుతు.

భాగవతం తెలుసుకోవడం, తెలిసింది తెలుపుకోవడం చిత్రమట ! నిజమే. రామాయణం అలలా సాగిపోయే మనిషి కథ. భారతం భిన్నలౌకిక ప్రవృత్తుల సంఘర్షణ వ్యథ. భాగవతం స్థూలదృష్టికి కృష్ణలీలాపేటిక, విష్ణుభక్తుల కథా వాటిక. సూక్ష్మంగా పరిశీలిస్తే అది మధ్య మధ్య ఎన్నెన్నో విప్పలేని వేదాంత గ్రంథులున్న మహాగ్రంథం. ఆ ముడులు విప్పడం హరునికి విరించికి దుష్కరమే ! మరి ఆ భాగవత రహస్యం ఆ భగవంతునికే తెలియాలె. భారం అతనిపై వేసి వ్యాస భాగవత వ్యాఖ్యాత అయిన శ్రీధరుణ్ణి ఆలంబనం చేసుకొని తెలియవచ్చినంత తేటపరచినాడు— ఈ వినయశీలుడు. ఈ తేటపరచడం ఏ తెలుగులో? నన్నయ ప్రారంభించిన తత్సమపద బహుళమైన తెలుగులోనా? లేక పాలకురికి సోమన్న ప్రఘోషించిన జాను తెనుగులోనా ? పోతన్న సాత్వికత అహంతలకూ వింతవింత పుంతలకూ అతీతమైనది.

కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ;
గొందఱికిని సంస్కృతంబు గుణమగు; రెండుం
గొందఱికి గుణములగు; నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

కొందరికి తెనుగు గుణమట. ఇందులో పరోక్షంగా పాలకురికి, ప్రత్యక్షంగా తిక్కన్న కనిపిస్తున్నారు. కొందరికి సంస్కృతం గుణమట. ఇందులో సుదూరంగా నన్నయ్య, సమీపంగా శ్రీనాథుడు వినిపిస్తున్నారు. ఈ పద్యమే పోతన్న సత్వమూర్తికి అద్దం పట్టింది. 'ఆయా సందర్భాలను బట్టి అందరినీ మెప్పిస్తాను' అన్న మాటలో వినయం ఎంత మెత్తగా ఉందో, విశ్వాసం అంత ఒత్తుగా ఉంది. భాగవతం చదివితే తెలుస్తుంది అతని సంస్కృత గుణం; అచ్చ తెనుగుతనం.

నన్నయాదులు భారతాన్ని ఆంధ్రీకరించినారు. భాస్కర రంగనాథాదులు రామాయణాన్ని అందించినారు. నాచన సోమన, మారన వంటివారు పురాణాలను అనువదించినారు. ఏ రెవ్వరూ తన పురాకృత శుభాధిక్యం వల్ల భాగవతాన్ని తెనిగించలేదు. దీనిని తెనిగించి పునర్జన్మ లేకుండా తన జన్మను సఫలం చేసుకుంటానని ఆకాంక్షించినాడు పోతన్న. "వేయి నిగమాలు చదివినా సుగమం కాని ముక్తి భాగవతనిగమం పఠిస్తే అత్యంత సుగమం" అని విశ్వసించినాడు. ఆ ముక్తివాంఛే భాగవత రచనకు మూలం. మొట్ట మొదటి పద్యమే ఆ ఆశయానికి దిద్దిన ముఖతిలకం.

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు, భక్తపాలన కళా సంరంభకున్, దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నా కంజాత భవాండకుంభకు, మహానందాంగనా డింభకున్.

ఇది నాందీశ్లోకం వంటి పద్యం. ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశాలలోని ఒక లక్షణం నిక్షేపించడం దీని లక్ష్యం. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ" అని నన్నయ అన్నాడు. "శ్రీయన గౌరినా బరగు" అని తిక్కన అన్నాడు. "శ్రీకైవల్య పదంబు"ను పోతన్న ప్రస్తావించినాడు. ఈ పద్యంలో నమస్క్రియతో పాటు వస్తునిర్దేశంకూడా ఉండడం విశేషం. భాగవత కథానాయకుడు నందనందనుడు. అత డవతారపురుషుడు. లోకరక్షణం ఆ అవతారానికి ప్రేరణం. అతడు గజేంద్రాది భక్తులను పాలించినవాడు. హిరణ్యకశిపు ప్రభృతి దానవుల ఉద్రేకాలను స్తంభింపజేసినవాడు. ఈ రెండు అంశాలు శ్రీమన్నారాయణుని శిష్ట రక్షణకూ దుష్టశిక్షణకూ మూలకందాలు. భాగవత కథాచక్రం ఈ రెండు అంశాల చుట్టే చంక్రమించింది. ఈ రకంగా పోతన్న పైపద్యంలోని పాద చతుష్కంలో భాగవతంలోని పన్నెండు స్కంధాల పరమార్థాన్ని నిర్దేశించినాడు. మరొక విశేషం. ఈ పద్యంలోని నందాంగనాడింభకుడు కేవల స్థితికారుడే కాదు సృష్టికారుడు కూడా. "కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నానా కంజాతభవాండ కుంభకు" అనే ప్రయోగంలో అది ధ్వనించింది. "దానవోద్రేక స్తంభకు" అనే మాటలో అతని లయకారత్వం స్ఫురించింది. అంటే ఈ పద్యంలో నందింపబడిన పరమాత్ముడు త్రిగుణాత్ముడు.

అవతారికలోని రచనాలక్ష్యాన్ని పరికించినా, నాందీపద్యాన్ని పరిశీలించినా పోతన్న ధ్యేయం కైవల్యమేనని బోధపడుతుంది. భవబంధరాహిత్యం, జన్మ సాఫల్యం కైవల్యం వల్లనే సాధ్యం. ఆ కైవల్యం పోతన్న వాంఛించిన పరమ పదం; పురాజన్మతపఃఫలం. ఈ కైవల్యకాంక్ష ప్రవృత్తిగా భాసించే నివృత్తి; భాగవతంలోని ప్రధాన రసమైన భక్తికి ఆదిలోనే ఎత్తిన వైజయంతిక.

ఇంచుమించుగా సమకాలీనులైన శ్రీనాథ పోతనామాత్యుల వ్యక్తిత్వాల వాసి ఇక్కడే ఉంది. శ్రీనాథుడు శృంగారిగా ఎంత వ్యాపృతుడైనా "ఈశ్వరార్చనకళాశీలుండ" ననే చెప్పుకున్నాడు. భోగినీ దండకం వంటి పరమ శృంగారకృతి రచించినా పోతన్న మహాభక్తుడుగానే పేరొందినాడు. కాశీఖండం, భీమఖండం, హరవిలాసం, శివరాత్రి మాహాత్మ్యం వంటి భక్తి ప్రబంధాలు వ్రాసినా నైషధంలోని రక్తివల్లనూ, చాటుపద్యాలలోని శృంగారప్రసక్తివల్లనూ శ్రీనాథుడు శృంగారసనాథుడుగా స్థిరపడినాడు. రుక్మిణీకల్యాణం, రాసక్రీడాది వర్ణనం వంటి ఘట్టాలలో ఎంతటి శృంగారదంతురితాలైన వర్ణనలు చేసినా పోతన్న తెలుగుల పుణ్యపేటిగానే కీర్తింపబడుతున్నాడు. ఇందుకు ఒక కారణం- కాలం గడిచినకొద్దీ వీరిచుట్టూ అల్లుకున్న కథలు. మరొక కారణం- కావ్యావతారికల్లో వీరి వ్యక్తిత్వాలు వేసుకున్న ముద్రలు. శ్రీనాథుని కృతులన్నీ నరాంకితాలు. అతని జీవితంలోని ఉజ్జ్వలఘట్టాలన్నీ రాచకొలువుకే సమర్పితాలు. పట్టెడు వరిమెతుకులు, గుక్కెడు మంచినీళ్లు పుట్టని దుర్దశలో కూడా ఆ రాజస మూర్తి అటు కృష్ణణ్ణో, ఇటు శివుణ్ణో దుయ్యబట్టినాడు. ఇరవై సంవత్సరాలు కొండవీటిలో విద్యాధికారిగా ఒక వెలుగు వెలిగి అంతటితో యశోభిలాష సన్నగిల్లక ఎక్కడో కర్ణాటరాయల కొలువులో నిక్కిపడే గౌడ డిండిమభట్టును ఉద్భట వివాదప్రౌఢితో ఓడించి, అతని కంచుఢక్కను పగులగొట్టించి రాయల సభాగారంలో స్వర్ణస్నానం చేయించుకునే దాకా తృప్తిపడని మత్కృహంకృతి అతనిది. దిక్కూ మొక్కూలేని అవసానదశలో, దివిజ కవివరుల గుండెలు దిగ్గురనేటట్టు కడఊపిరిలో గూడ కవిత అల్లగలిగిన ప్రౌఢవ్యక్తిత్వం అతనిది. మరి పోతన్న వ్యక్తిత్వం ఇందుకు భిన్నం. అతడు నరాధిపులను కొలువలేదు; సిరులకై ఉరుకులాడలేదు; అధికారాన్ని ఆశించలేదు; అహంకారాన్ని ప్రకటించలేదు.

పూర్వకవులతోపాటు వర్తమాన కవులతోపాటు భావికవులను గూడా బహూకరించిన వినయభూషణు డతడు. సమకాలీనకవులను సంభావించడమే ఒక విశేషం. పుట్టని కవులకు జేకొట్టడం పోతన్న సహనశీలానికి నిదర్శనం.

అవతారిక దృష్ట్యానే కాక భాగవత కథల్లో, ఉపాఖ్యానాల్లో పోతన్న మూలాతిరిక్తంగా పెంచిన పట్టులను బట్టీ, పెర్చిన పద్యాలను బట్టీ అతని సత్వ రమణీయమూర్తి సాక్షాత్కరిస్తుంది. గజేంద్రుని సంశయంలో, ప్రహ్లాదుని నిశ్చయంలో, గోపికల ఉద్వేగంలో, వామనుని ఉత్తేజంలో- ఇవేకాక నవవిధ భక్తింతం బహుముఖవికాసంలో భక్తిరసతరంగితమైన పోతన్న చిత్తవృత్తి పలు విధాల ప్రస్ఫుటమవుతుంది. వ్యాసభగవానుని భాగవతకోశాన్ని సైతం క్షణకాలం మరచిపోయి ఆయా భాగవతుల శ్రవణకీర్తనలకు తోనై ఆ పాత్రలన్నీ తానై పరవశించి పద్యసంఖ్యను పెంచి ప్రతిభాశిఖరాలపై భాసించిన సన్నివేశాలు ఆంధ్ర భాగవతంలో కోకొల్లలు. అందుకే అంటున్నాను- అవతారికలోనే కాక ఆంధ్ర భాగవతంలో గూడా అడుగడుగున పోతన్న సాత్త్విక చిత్తవృత్తి, భక్తిభావనా ప్రవృత్తి వేయిరేకులతో విప్పారినవని.

నవవిధ భక్తులను కథాత్మకంగా ప్రపంచించిన ప్రథమ గ్రంథం వ్యాస భాగవతం. ఆ భక్తిరస ఘట్టాలను ఇంతకు రెండింతలుగా విస్తరించి తొలిసారిగా మధురభక్తికి పచ్చలతురాయిని కూర్చిన తెలుగు కావ్యం పోతన్న భాగవతం. నవవిధభక్తుల్లో- శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, ఆత్మనివేదనం- ఇవన్నీ ఒక పాదులో పుట్టిన మొలకలే. సఖ్యం మాత్రం వీటికంటె భిన్నతత్త్వం కలది. రుక్మిణికి శ్రీకృష్ణునిపట్ల గల భక్తికీ భక్తికీ నేపథ్యం ఆత్మనివేదనం. అర్చన వందన స్మరణాదులు ఆ ఆత్మార్పణంలో నుంచి ఉదయించిన రేఖలు. కుచేలు డున్నాడు; అర్జును డున్నాడు. ఎక్కడి ప్రధానంగా సఖ్యభక్తి. అనుషంగికంగా ఆ సఖ్యం చుట్టూ స్మరణవందన పాదసేవనాదులు పరివేషించక పోలేవు. మరి మధురభక్తికి మూలమేది? జీవాత్మ పరమాత్మల వియోగం. అఖండ పరమాత్మ నుండి ఖండశః అంశతః విడివడిన జీవాత్మలు ఆ మూలాత్మను కలుసుకోవాలనే తపనయే భగవద్రతి భావనకు ప్రాతిపదిక. త్రేతాయుగంలో మునులు, ద్వాపరయుగంలో గోపికలు భగవద్విరహంలో సంతప్తలైన జీవాత్మలు. గోపికలున్నారు. వాళ్ళకు ఇళ్లూ,

వాకిళ్లూ ఉన్నాయి. కొందరికి పతులూ, సుతులూ ఉన్నారు. అయినా శారద యామినిలో యమునాతీరంలో బృందావనిలో గోపాలుని మురళీగానం ఆలకించ గానే అన్నీ మరచి పరుగులు తీస్తారు. బృంధావని చేరుకొని నందకిశోరుణ్ణి కానక రసోన్మాదంలో ఎలుగెత్తి పిలుస్తారు. ఆ మోహనమూర్తిని పదేపదే స్మరించుకొని ఇలా ఆక్రందిస్తారు-

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబు నో
మల్లియలార! మీ పొదల మాటున లేఁడు గదమ్మ! చెప్పరే.

మధ్యమధ్య ఆ మాధవుడు, ఆ గోపికామనోభవుడు తళుక్కున మెరుస్తాడు అంతలోనే అంతర్హితుడౌతాడు. అప్పుడు గోపికల వియోగ విధుర హృదయాలు ఇలా సంభ్రమిస్తాయి-

అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ
  బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని
  యైరేయలతరార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా
  చూతమంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిఁగించి
  మాధవీలతలార! మనుపరమ్మ!
జాతిసతులఁ బాయ నీతియె హరి కని
జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ!

సమస్త చరాచర జీవకోటికి అధినాథుడు మాధవుడు. ఆ మాధవుడే తమ ధవుడని భ్రమించినారు గోపికలు. ఆ భ్రమావరణమే వారి మనస్సుల మీద మోహాయవని కలను కప్పింది. ఆ ముగ్ధప్రవృత్తే మధుర భక్తికి మూలం. ఈ మధుర భక్తిని రాసక్రీడాది వర్ణనంలో హృదయంగమంగా చిత్రించినాడు పోతన్న.

లోకంలో భక్త కవులు పలువురున్నారు. వారందరు ప్రజాకవులు కాలేరు. ఒక తుకారాం, ఒక సూరదాసు, ఒక కబీరు, ఒక పోతన్న ప్రజాకవులుగా ప్రాచుర్యం పొందిన భక్తకవులు. మరి ప్రజాకవి ఎవడు ? సామాన్య ప్రజల జీవిత సమస్యలను చిత్రించేవాడు. ఇది బాగా వాడుకలో ఉన్న అభిప్రాయం. ఈ దృష్టితో చూస్తే పోతన ప్రజాకవి కాలేడు. అతడు ప్రజల దైనందిన జీవిత సమస్యలకు బొమ్మకట్టి చూపలేదు. భాగవతుల భక్తిభావ పరంపరకు శ్రుతులు కూర్చి కృతులు అల్లుకున్నాడు. ఆ భాగవతుల్లో ప్రహ్లాదుని వంటి అజన్మ జ్ఞానులు ఉన్నారు. గజేంద్రుని వంటి అర్ధజ్ఞాను లున్నారు. కుచేలుని వంటి ఆర్థిక దుర్దశాపరిపీడితు లున్నారు. ఈ భక్తుల స్థితిగతులు వేరైనా, వారి వారి సంస్కారమతులు వేరైనా అందరినీ కలిపికుట్టే మూలసూత్రం ఒకటుంది. అదే ఆర్తి. అది జీవాత్మలు పరమాత్మకు నివేదించుకునే అలౌకికమైన ఆర్తి. భక్తపరమైన ఈ ఆర్తిని సార్వకాలీన సామాన్య ప్రజల ఆర్తిగా చిత్రించడం వల్లనే భక్త కవియైన పోతన్న ప్రజాకవి యైనాడు.

"కలదు కలండనెడు వాఁడు కలఁడో లేఁడో" అంటూ ఆందోళించినవాడు కరిరాజే కానక్కరలేదు; ఏ మూగజీవికైనా ఇది చెల్లుతుంది. "ఇందుఁ గలఁ డందులేఁడని సందేహము వలదు"- ఇది ఏ ప్రహ్లాదభాషితమో కానక్కఁదలేదు. ఏ దృఢ సంకల్పునికైనా ఇది సరిపోతుంది. "ఊరకరారు మహాత్ములు"– దీన్ని ఏ గర్గమునికో ముడివెట్టనక్కర లేదు; ఇప్పటికీ ఏ మహానుభావుని రాక కైనా ఇది వర్తిస్తుంది. "ఎందరో మహానుభావులు" అన్నంత వ్యాప్తి పొందిన సూక్తి ఇది. అయితే ఈ సూక్తి సహజ గాంభీర్యాన్ని కాస్తా వదలుకొని కాలం గడిచిన కొద్దీ ఛలోక్తిగా మారడం కూడా జరిగింది. అంటే సామెతల కోవకు చేరిందన్నమాట.

ఒక కవి రచించిన పద్యపాదాలు సామెతలుగా, లోకోక్తులుగా చెలామణి కావడం కంటె ఆ కవికి అంతకు మించిన ప్రాచుర్యం ఏముంది? ఇలా లెక్కించు కుంటూపోతే పోతన్న వందలాది పద్యాల్లోంచి వేలకొద్ది పాదాలను ఉదాహరించ వలసి వస్తుంది. ప్రాచీనాంధ్ర కవులలో బహుళంగా ఉదాహరింపబడుతున్న వాళ్లల్లో ఇద్దరే ఇద్దరిని చెప్పుకోవాలి. ఒకడు పోతన్న. మరొకడు వేమన్న; వేమన్న అక్షరాలా ప్రజాకవి. అధిక్షేపం అతని ఆయుధం. సంఘ సంస్కరణం

అతని లక్ష్యం. అతని ప్రతిపద్యం ప్రజల జీవితాలకు సంబంధించిందే. ప్రజల భాషలో ప్రజల సమస్యలను చిత్రికపట్టి వేమన్న ప్రజాకవి యైనాడు. బమ్మెరకు వెళ్లి అక్కడి పొలాల నడిగితే చెబుతాయి- ఇదిగో! ఇది పోతన్న గుడి! అదిగో! అది మల్లన్న మడి! అని. పోతన్న గుడి నిజంగా గుడికాదు. పాతుకొని ఉన్న ఒక రాతిపలక. ఆ రాతి పలకను పోతన్న ప్రతిరూపంగా నేటికీ అక్కడి పల్లీయులు భావించుకుంటున్నారంటే ఇప్పటికీ పోతన్న ఎంత సజీవంగా ఉన్నాడో ఊహించుకోవచ్చు. మరి మల్లన్న మడి మాటేమిటి ? ఈ పోతన్న కొడుకైన రైతన్న దున్నిన పొలమది.

కవితాకేదారాన్ని పండించిన హాలికుడుగా అన్ని వేళలా తలచుకోవడానికి అనువైన పద్యఖండాలను అందించిన ఆదర్శ మానవుడుగా పోతన్న చిరంజీవి. భావికవులను బహూకరించిన ఆ పరమ భాగవతునికి తప్ప అంతంత మాత్రం వానికి ఉంటుందా ఇంతటి సముజ్జ్వల భావి. ఎప్పుడో పొట్టి వడుగైన వామన మూర్తి ఇంతై అంతై అంతంతై మూడు లోకాలను ఆక్రమించినట్లు- ఎక్కడో బమ్మెరవంటి చిట్టూరిలో పుట్టిన పోతన్న మూడు కాలాలను ఆకట్టుకునే అమృత కృతులను నిర్మించగలిగినాడు.

భాగవతాన్ని తెనిగించి పోతన్న తన జన్మను సఫలం చేసుకొన్నాడు: ఆ భాగవత పద్యాలను పఠించి తెలుగు ప్రజలు తమ జీవితాలనే పండించుకున్నారు.

(వికాసలహరి, 1973)

* *

వరగోవింద కథా సుధారస మహావర్షోరుధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిన్ బ్రవి
స్తరదుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తరగంభీర కఠోరకల్మషకన ద్దావానలం బాఱునే!

# సహజపాండిత్యాల వారి సరదాలు

—శ్రీ ఆరుద్ర

కొంతమంది కవులకు కొన్ని పదాలు ఎలాగ ఊతపదాలు అవుతాయో అలాగే కొన్ని ఉపమానాలు కూడా విరివిగా వాడేవి అవుతాయి. "మందార మకరంద మాధుర్యమున తేలు మధుపంబు పోవునే మదనములకు" అనే భావం పోతరాజు గారికి చాలా యిష్టం. దీనిని ఆయన పాల్కురికి సోమనాధుని రచన నుండి గ్రహించారు. చిన్నప్పుడు పాల్కురికి సోమనాధుని రచనలు బాగా చదువు కొన్న పోతరాజు గారికి ఇవి చక్కగా ఒంటపట్టాయి. యౌవనంలో వ్రాసిన భోగినీ దండకంలో ఈ భావాలను పోతరాజు గారు ఇలా చెప్పారు -

"సింగభూపాలుపై వ్రాలి నాచిత్త మున్మత్తమై సోలి కామానలాయత్తమై రాదు తేరాదు నే నా మరుండైన గౌరీవరుండైన వాణీధవుండైన దేవోత్తరుండైన నన్యున్ మదిం గోర్వగా నొల్లనే? ఉల్లసత్ఫుల్ల మందారరాజన్మరందంబునుం గ్రోలు మత్తాళి దుత్తూరమున్ గ్రోలునే? హేమ రాజీవ రాజీరజోరాజితా కాశ గంగానదీలోల కల్లోల డోలానటద్రాజ హంసంబు శైవాలగంధూపవీ భేక భేకీ ధుళీ సంకులాసారకాసారమున్ జేరునే? మండితా ఖండలానీల జీమూత నిర్యత్ప యోధారలన్ ద్రావు సారంగి కుంభాంతరాంభః ప్రపూరంబులన్ ద్రావునే? మాధవోజ్జాత చూతాంకురస్వాదులీలాలసత్కోకిలేంద్రంబు ఝుల్లీవరక్రూర భల్లాతకీ శాఖకున్ బోవునే?"

ఇవే భావాలు భాగవతంలో చాలాసార్లు దొర్లాయి. చూడండి—

హరినామాంకిత సత్కథామృతరసవ్యాలోలుఁడైనట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథా శ్రవణవాంఛాపూరంబుఁ దాఁ గ్రోలునే
వరమందార మరంద పానకుతుకస్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁతిరేమములకుఁ దద్గంధానుమోదాత్మమై. (8.224)

కాన సరోజలోచను జగత్ స్తవనీయ కథా సుధారసం
బానిన యట్టి జిహ్వ యితరానుకథాలవణోదకంబులం
బానము సేయఁ జూచునె సుపర్వమహీజ మరందపానకో
ద్భానయశాలి యైన మధుపప్రభుఁ డేగునె వేఁపచెట్లకున్. (3.448)

పూని భవత్పదాంబురుహమూలనివాసులమైన మేము మే
ధానిధి ! నీ విలోకనముఁ దక్కఁగ నన్యముఁ గోరనేర్తుమే
మానిత పారిజాతకుసుమస్ఫుట నవ్య మరందగంధ శో
భానయశాలి యైన మధుపంబు భజించునె యన్యపుష్పముల్. (4.927)

మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరకం
బరుగునే సాంద్రనీహారములకు

నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుత గుణశీల ! మాటలు వేయునేల ! (7.150)

ననుఁ బాణిగ్రహణం బొనర్చితి కదా నా భర్తవున్ నీవ; దై
వనియోగం బిదీ తప్పు దప్పురుషతాపాక్యంబు సిద్ధంబు ; సౌ
ఖ్యనివాసున్ నినుఁ జేరునాఁటడి పరుం గాంక్షింపఁగా నేర్చునే ;
వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే ! (9.580)

సిరికి నుదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర ! మా తపము సంపదఁ జేరితి మెట్టకేలకున్

మరలఁగలేము, మా మగల మాటల నొల్లము ; పద్మగంధముల్
మరగిన తేఁటు లన్యకుసుమంబుల చెంతలఁ జేరనేర్చునే! (10.1.988)

పోతరాజుగారి ప్రసిద్ధమైన పద్యాలలో "సిరికిం జెప్పఁడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁడు"(8.93) అనేదీ, "తనవెంటన్‌సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్" (8.98) అనేదీ చాలా ముఖ్యమైనవి. భక్తులను రక్షించడానికి ఎవరికీ చెప్పకుండా విష్ణువు బయలుదేరితే భార్య, పరివారం అనుసరించారని ఈ అష్టమస్కంధంలో గజేంద్రమోక్షణంలోనే కాక ముందుగా తృతీయ స్కంధంలోనూ వ్రాశారు.

సనకసనందనాదులు విష్ణువును సేవించుకొనడానికి వచ్చారు. వాళ్ళకు జయవిజయులు 'ఇప్పుడు అవకాశం దొరక'దన్నారు. అడ్డగించారు. మునులు ఘర్షణపడ్డారు. శపించారు. ఆ కలకలం లోపల నున్న హరి ఆలకించాడు. శ్రీదేవితో సరసాలాపవినోద సౌఖ్య రచనలు చేస్తున్నవాడు, వాటిని చాలించి శుద్ధాంతమందిరపు మాణిక్యగేహళులు గడచి వెళ్లాడు. అతని వెంట 'శరనిధి కన్యకామణియు సంభ్రమ మొప్పగ' తోడు వెళ్ళింది. ఆమె వెంట అచ్చరలు వెళ్ళారు. వాళ్ల తరువాత పక్షీంద్రుడు కూడ ఉన్నాడు. 'వైనతేయాంసవిన్యస్త వామహస్తకలిత కేయూరవలయ కంకణము లొప్ప' అని పోతరాజుగారు వర్ణించారు. జయవిజయులకు శాపం ఇస్తున్న సనకసనందనాదుల వద్దకు వెళ్ళిన శ్రీహరిని పోతరాజుగారు 8 గద్యపద్యాలలో (8.538-540) వర్ణించారు. ఈ దృశ్యాన్నే వారు సంక్షిప్తం చేసి 'తన వెంటన్ సిరి లచ్చి వెంట' అనే ఒకే ఒక పద్యంలో తరువాత చెప్పారు.

దశమస్కంధంలో శ్రీకృష్ణుని వెతుక్కుంటున్న గోపికల చేత పోతరాజుగారు చెప్పించిన పద్యం వినని తెలుగువాడు దేశంలో ఉండడు. చూడండి అది-

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళి పరిసర్పిత పింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోము వాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార ! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే !
(10-1-1018)

అయితే ఇటువంటి పద్యాలే పోతరాజు గారు నవమస్కంధంలోనూ వ్రాశారు. అక్కడ రాముణ్ణి వర్ణిస్తూ ఇవే మాటలు వాడారు చూడండి-

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడుఁ గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడు వాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్ ! (9.361)

వాస్తవానికి పోతరాజు గారి దృష్టిలో రాముడన్నా కృష్ణుడన్నా తేడా లేదు. రాము డాదేశించి వ్రాయమన్న పుస్తకాన్ని ప్రారంభిస్తూ శ్రీకృష్ణుని - నందాంగనా డింభకుని ప్రార్థించారు. షష్ఠ్యంతాలు కృష్ణపరంగా వ్రాశారు. మిగతా కవులంతా షష్ఠ్యంతాలు కందపద్యాలలో వ్రాస్తే పోతరాజుగారు ఉత్పలమాలలు గట్టి పూజించారు. ప్రతి పద్యంలోనూ అంత్యానుప్రాస హాయిగా వాడారు. కృష్ణ స్తుతిలో వాడిన అనుప్రాసను రామకథ చెప్పడంలో విరివిగా వాడారు. నవమ స్కంధంలో వారు 258 నుంచి 362 దాకా శ్రీరామ చరిత్ర వ్రాశారు. అంటే 105 గద్యపద్యాలు. వీటిలో అనుప్రాసలు తెగ వాడారు.. చిట్టచివర ఇలా వ్రాశారు-

మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నింతన పూర్వమహాఘని
కృంతనములు రామనామ కృతి చింతనముల్. (9-363)

ఇటువంటి పద్యమే రుక్మిణీ కల్యాణం ప్రారంభిస్తూ చెప్పారు-

భూషణములు సెవులకు, బుధ
తోషణము; లనేక జన్మదురితౌఘ విని
శ్శోషణములు, మంగళతర
ఘోషణములు, గరుడగమను గుణభాషణముల్. (10-1-1687)

పోతరాజు గారి దృష్టిలో శ్రీరామునికి, శ్రీకృష్ణునికి తేడా లేదు. కాబట్టే ఇటువంటి సంవాదరచనలు సాధ్యమైనాయి. అయితే దశమస్కంధంలోని 'నల్లని వాఁడు' అనే పద్యమే ఎక్కువ ప్రచారం అయింది.

పోతరాజు గారి భాగవతంలోని వివిధ ఘట్టాలలోని కొన్ని పద్యాలు మన జాతి జీవనంలో కలిసిపోయాయి. ఎవరైనా అపురూపంగా మన యింటికి వస్తే ''ఊరకరారు మహాత్ములు'' అంటాం. ఇది పోతరాజు గారి పద్యపాదం. దశమ స్కంధంలో బలరామ కృష్ణులకు సంస్కారం చేసి నామకరణం కావించడానికి గర్గుడు మందకు వెడతాడు. అప్పుడు నందుడు తగిన సత్కారాలు చేసి ఇలా అంటాడు-

ఊరక రారు మహాత్ములు;
వా రథముల యిండ్ల కడకు వచ్చుట లెల్లం
గారణము మంగళములకు;
నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా ! (10-1-284)

ఈ పద్యంలోని తొలిపాదం తెలుగువాళ్ళ సంభాషణలో ఒక చక్కని వాక్యంగా నిలిచిపోయింది. ఇటువంటిదే ''మాట తిరుగలేరు మానధనులు'' అనేది. ఇది అష్టమ స్కంధంలోని వామనావతార ఘట్టం లోనిది. శుక్రాచార్యునితో బలిచక్రవర్తి చెప్పినది. పూర్తి పద్యం చూడండి-

బ్రతుక వచ్చుఁ గాక బహుబంధనములైన
వచ్చుఁ గాక లేమి వచ్చుఁ గాక
జీవధనములైనఁ జెడుఁ గాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు. (8-602)

బలిచక్రవర్తి ఈ మాట అనడానికి రెచ్చగొట్టిన శుక్రాచార్యుని హితోపదేశం కూడా చాలా ప్రసిద్ధమైనదే. చూడండి-

వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణ విత్తమాన భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు
బొంకవచ్చు నఘము వొందదధిప ! (8.589)

ఇలాగే ''పృథివి నధిపులు నూతన ప్రియులు గారె'' అనేది కూడా పసిద్ధమే. ఇది భ్రమరగీతలోనిది. (10.1.1468). ఇదేభావం ''నరవరు

లోయమ్మ నూతన ప్రియులు గదే" (10.1.1221) అన్న పంక్తిలో కూడా ఉంది పోతరాజుగారి పద్యాలలో ప్రచారం పొందిన మిగతావన్నీ ఒక ఎత్తు. ఈ క్రింది కందపద్యం ఒక్కటీ ఒక ఎత్తు..

నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార ! నాకు దయసేయఁ గదే ! (10.1.1178)

ఇది కంసవధ కోసం మధురకు వెళ్లిన బలరామకృష్ణులకు మాలికుడు దండ యిచ్చిన ఘట్టంలోనిది. తమకు పూలహారం ఇచ్చిన మాలికుణ్ణి 'నీకేమి వరం కావా'లంటే అతడు పై పద్యంలోని కోరిక కోరుతాడు. ఇది పోతరాజు గారి వ్యక్తిగత ప్రార్థన కూడా కావచ్చు.

పోతరాజు గారికి చాలా ఇష్టమైన అంత్యానుప్రాస భాగవతంలోనే తన విశ్వరూప ప్రదర్శనం చేస్తుంది. ఈ అంత్యానుప్రాస భాస్కర రామాయణం నుంచి పోతరాజుగారు అలవరచుకొన్నారు. నాచన సోముడు మరికొన్ని శబ్దాలంకారాల మజాలు నేర్పాడు. ఎఱ్ఱయ్య గారు అర్థాలంకారాల రహస్యాలు బోధించారు. పాల్కురికి సోమనాథుని అమితావేశానికి పోతరాజుగారే ఏకైక వారసులు. భాషాప్రపంచంలోని శబ్దాలన్నీ వారికి కరతలామలకాలు. అనుప్రాసలు వాడేటప్పుడు గాని పర్యాయపదాలను గుప్పించేటప్పుడు గాని తడుముకోవడం లేనేలేదు.

పోతరాజుగారి భాగవతం ఆంధ్రదేశంలో ప్రచారం కావడానికి మధురమధురమైన శైలి కూడా కారణమే. "భాగవతమున కింతటి ప్రజాదరము అందలి భక్తిప్రభావము వలననే కాదు. మంద్ర గంభీరగమనము గల యాతని శైలి వలనను వచ్చినది. అది సహజధారా విలసితము. ఓజః ప్రసాదగుణోజ్జ్వలితము. బిగువైన ఆ పదబంధమున సంస్కృతములు, తెలుగులు చెరి సగముగా గుచ్చిన మల్లెలజాజులై పరిమళించును." అని గడియారం వేంకట శేషశాస్త్రి గారు చెప్పిన మాటలు (విజ్ఞాన సర్వస్వము, 8 వ సంపుటి, పుట 985) వాస్తవాన్ని వ్యాఖ్యానం చేస్తాయి.

పోతరాజు గారి ఛందస్సులు భాగవతాన్ని కూలంకషంగా చదివిన పాఠకుణ్ణి సమ్మోహింప జేస్తాయి. వారి ఆటవెలదుల నడక నేటి విరుపులకు దగ్గరలో ఉంటుంది. "భాగవతమున ప్రతి సీసపద్యము కడపటను సాధారణముగ నాటవెలదియే తగులుచుండును. ప్రత్యేకముగ వ్రాసిన యాటవెలదులు కూడ నెక్కువ. వీనిలోని సౌందర్యమును 'చాలు! చాలు!' ననునంతవరకు పోషించినవాడు వేమనయోగి! కాని తొలుత నొక వింత యొయ్యారముతో ఆంధ్రభాషలో నాటవెలది యడుగు పెట్టిన దీ పోతన్నతోనే" అని పుట్టపర్తి నారాయణాచార్యులు గారు అభిప్రాయపడ్డారు (ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు- పుట 196,197).

పోతరాజు గారి ఆటవెలదుల నడకలోని ఘలంఘలలు చెవులను భ్రమింప జేయడం వల్లనే వారు సీసాల తరువాత తేటగీతులు ఆలపించడం కన్నా ఆటవెలదులను ఆడిస్తారనే భావన కలుగుతుంది. అయితే వాస్తవానికి ఆయన భాగవతంలో వ్రాసిన 899 సీసాలలో 677 తేటగీతులు, 222 ఆటవెలదులు ఎత్తుగీతులుగా వ్రాశారు. వీరభద్రవిజయంలో 118 సీసపద్యాలున్నాయి. అందులో 101 ఆటవెలదులు, 17 తేటగీతులు మాత్రమే ఉన్నాయి. శ్రీనాథుడు తన సీసాల తరువాత ఒక్కటే ఒక్క ఆటవెలది మిగతా 824 తేటగీతులే వ్రాశాడు. ఆంధ్ర ఛందః పరిణామంలో ఇదొక ముఖ్యమట్టాన్ని సూచిస్తుంది. వీరభద్ర విజయం వ్రాసే కాలంలో బహుశా పోతరాజుగారు ఆధునికుల పద్ధతులు వినక పోవడంవల్ల ప్రాచీనుల పద్ధతి వైపు మొగ్గారు. తరువాత శ్రీనాథుడు వాడినట్టే ఎక్కువ తేటగీతులు సీసాల పిదప వాడారు.

మహాకవులు జీవితదృక్పథాలలో కూడా ఎవరికి వారే. చనిపోతున్న సమయంలో కూడా శ్రీనాథుడు 'కస్తూరి కేరాజు ప్రసుతింతు?' అని వాపోయాడు. పోతరాజుగారిది ఎప్పుడూ పైచేయే. అది నిద్రలో కూడా క్రిందపదు. పరీక్షిత్తుకు శాపమిస్తున్న శృంగి చేత-

"హోము హిరణ్యదానములఁ బుచ్చుకొనంగ; ధనంబు లేమియుం
దేము సవంచనంబులుగ; దీవన లిచ్చుచు వేసరింపఁగా రాము"

అని (1.468) అనిపించారు.

వస్తుతః పోతరాజుగారికి భోగాలంటే ఇష్టం లేదు. వారి దృష్టిలో కటిక నేల కమనీయం. పట్టుబట్టల కన్నా ముతకదుస్తులే వారికి మెత్తగా ఉంటాయి. అందుకే భాగవతంలో ఇలా ఒక పద్యం చెప్పారు-

కమనీయ భూమిభాగములు లేకున్నవే
　　పడియుండుటకు దూది పఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే
　　భోజన భాజన పుంజ మేల?
వల్కలాజిన కుశావళులు లేకున్నవే
　　కట్ట దుకూల సంఘంబు లేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే
　　ప్రాసాదసౌధాది పటల మేల?

ఫలరసాదులు గురియవే పాదపములు;
స్వాదుజలముల నుండవే సకలనదులు;
పొసఁగ భిక్షలు పెట్టరే పుణ్యసతులు;
ధనమదాంధుల కొలువేల తాపసులకు? (2.21)

ఇహలోకంలో పుత్రపౌత్రాభివృద్ధిగా పోతరాజుగారు చల్లగా జీవించినా పరంలో వారు కోరుకున్న వరం ఒక్కటే ఉంది-అది మోక్షం.

పోతరాజుగారు భాగవతం ప్రథమస్కంధంలో శ్రీకారం చుట్టి కైవల్యం కావాలనుకొన్నారు. "శ్రీకైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్" అని గ్రంథం ఆరంభించారు. దశమస్కంధంలో చిట్టచివర శుకయోగిచేత ఫలశ్రుతి చెప్పిస్తూ ఈ కృష్ణకథాసుధారసము గ్రోలినవారు "కాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్" (10-2-1387) అని ముగించారు. వారి ఆకాంక్ష తొలినుంచి చివరిదాకా కైవల్యమే. భాగవత జన్మవల్ల వారికి పునర్జన్మ లేదని భావించారు.

నిజమే! పోతరాజు గారికి పునర్జన్మ లేదు. అసలు మరణిస్తే కదా మళ్ళీ పుట్టడం అనే సమస్య వస్తుంది? తెలుగు సాహిత్యం జీవించి ఉన్నంతకాలం ఆయన బ్రతికే ఉంటారు.

*(సమగ్రాంధ్ర సాహిత్యం-5, 1965)*

# పోతనార్యుని వైశిష్ట్యము

— ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము

బమ్మెర పోతనామాత్యుడు సంస్కృతమునందలి శ్రీమద్భాగవతము నాంధ్రీకరించిన మహాకవి. తెనుగు భారత భాగవతములు ఆంధ్రదేశమందలి పల్లెపల్లెలలోను వ్యాపించినవి. గ్రామ జనులు కూడ వీనిని ఆదరముతో చదువు చుందురు. ఇవి తెలుగువారి జాతిసొత్తులు. ఆంధ్రభాగవతమును వ్రాసిన పోతనా మాత్యుడు కవిత్రయము వారి తరువాత ప్రజాదరమును అధికముగా పొందిన కవివతంసుడు.

పోతనామాత్యుడు వ్యవసాయవృత్తిచే జీవించియుండును. రాజుల నాశ్ర యించుటయు వారికి గ్రంథములు కృతి యిచ్చి ధనార్జనము చేసి భోగభాగ్య ముల ననుభవించుటయు పోతనకు గిట్టకుండెను. పోతన తన భాగవతమును రాజుల కివ్వనొల్లక శ్రీరామచంద్రునకు సమర్పించెను. భూపాలురకు గ్రంథము లంకితమిచ్చుట పాపహేతువని యీ మహాకవి యభిప్రాయము. కవిత్వ మొక పుణ్యకళ యనియు దానిని భగవంతుని యారాధనము నందు వినియోగించుట మోక్షదాయక మనియు తిక్కనామాత్యుడు వచించెను. బమ్మెర పోతరాజు కూడ ఇట్టి మహోన్నతభావమునే కలవాడు. ఈ యుదారాశయమును పోతన పలుమార్లు తన గ్రంథములో ప్రకటించెను. హరినామస్తుతి గావించు కావ్యము బంగారు కమలములతో విరాజిల్లు మానససరోవరమువంటి దనియు, హరినామ స్తుతి లేని కావ్యము విచిత్రార్థములు కలదయ్యు పాపిష్టి గొయ్యి వంటి దనియు ఈ మహాకవి యుద్బోధించెను.

హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు; శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యొప్పదు యోగ్య దుర్మదనదత్కాకోలగర్తాకృతిన్. (1.96)

భాగవతము రచించునాటికి పోతనామాత్యుని మనస్సు ఈ విధముగా నుండినను జీవితము మొదటి నుండియు ఈతడు నరస్తుతి విముఖుడు కాడని తోచును. ప్రారంభమునం దీతడు రాచకొండ ప్రభువగు సింగభూపాలుని దర్శించి ఆతని భోగకాంతపై 'భోగినీ దండక' మను చిన్న కృతిని చెప్పెను. దీనిలోని కవిత్వము, పదప్రయోగము పోతన శైలిని బాగుగ పోలియున్నది. పోతనామాత్యున కత్యంత ప్రీతిపాత్రమైన పదాంతానుప్రాసరీతియు, ప్రౌఢ సమాసకల్పనమును ఈ దండకములో కన్పించును. కట్లు పోతరాజు చిన్నతనములో నరాంకితముగ కవిత్వము చెప్పిన వాడైనను త్వరలోనే ఈతనికి రాజసేవ మీదను, నరస్తుతి మీదను వైముఖ్యము జనించెను. ఆంధ్ర కవిప్రపంచములో పోతనామాత్యుని వంటి నిర్భీకుడును, నిరాడంబరజీవియు త్యాగరాజస్వామి కాక మరియొకడు లేడనుట అతిశయోక్తి కాదు.

ఆంధ్రభాగవతము ప్రపంచవాఙ్మయములోని యుద్గ్రంథములలో స్థానము పొందుటకు దగియున్నది. దీనియందు మనము మూడు ముఖ్య లక్షణములను గమనింపవచ్చును. ఒకటి భక్తి సంపద. రెండవది వేదాంతవిస్తరణము. మూడవది రసనిర్భరమైన కవిత్వము. ఈ మూడింటియందు గూడ పోతనామాత్యుడు సాటిలేని మేధావి. భక్తియే యాతని కవిత్వమునకు ప్రాణాధారము వంటిది. ప్రహ్లాద చరిత్రము, గజేంద్ర మోక్షణము మొదలగు అనేక స్థలములందు దీనిని చూడవచ్చును. భక్తితత్పరుడౌటచే పోతనామాత్యుడు సంస్కృత భాగవతములో లేని యపూర్వభావములను కూడ ఆంధ్రభాగవతములో చేర్చి తన గ్రంథమును మూలగ్రంథము కన్న పెంచి వ్రాసినాడు. తత్త్వవిషయములను వేదాంత చర్చలను గూడ పోతన సర్వజనసులభముగా రచించెను. ఈతనిది యద్వైతదృష్టి. ఇక కవిత్వగుణమును చెప్పవలసినప్పుడు పోతరాజు కొన్ని సందర్భములలో కవిత్రయమును గూడ మించిపోయిన మహాకవి యని విమర్శకుల యభిప్రాయము. అర్థగౌరవమును, పదములు వాడుటలో పొదుపును కవిత్రయమువారి కవితాలక్షణములు. భావావేశమునందును, పాఠకుని తన వెంట లాగుకొని పోగల ఆకర్షణశక్తియందును పోతనామాత్యుడు మిన్న. తన భక్త్యావేశముచే నీతడు నాస్తికహృదయము నందు కూడ అప్పటికి భక్తి జనించునట్లు వ్రాయగలడు. ఈతనికి భక్తిరసముతోపాటు శృంగారరస వర్ణనము కూడ ప్రీతిదాయకము. దశమ స్కంధములోని శ్రీకృష్ణచరిత్రయందు పోతరాజు భక్తి

శృంగారములను విశేషముగ జూపెను. శ్రీకృష్ణుని బాల్యచరిత్రను దర్శించుటలో నీతిదెంతయో మేఁకువ ప్రదర్శించెను. బాలుర క్రీడాదికము నీ మహాకవి చక్కని పరిశీలనతో తిలకించి వ్రాసెను. ఐశ్వర్యము, ధనము మానవునకు దర్పము పెంచుననియు, దారిద్ర్యమే మేలనియు చాటి బమ్మెర పోతరాజు నిక్కముగా రైతుకవియు, పేదలకవియు, ప్రజాకవియు అయినాడు.

(ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము, *1949*)

* * *

హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమైయుండ దయోగ్య దుర్మదనదత్కాకోలగర్తాకృతిన్.

పాంచాలీ కబరీ వికర్షణ మహాపాపక్షతాయుష్కులన్
జంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ గల్పించెన్ మహాఖ్యాతిఁ జే
యించెన్ మూఁడుతురంగమేధములు దేవేంద్రప్రభావమ్మునన్.

తల్లీ ! నిన్నుఁ దలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ !
ఫుల్లాబ్జాక్షి ! సరస్వతీ ! భగవతీ ! పూర్ణేందు బింబాననా !

బాలరసాలసాలనవపల్లవకోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి ? గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి ? నిజదార సుతోదర పోషణార్థమై.

# ద్రౌపది మాతృహృదయము

— ఆచార్య యస్వీ జోగారావు

ద్రౌపదీ పుత్రశోక ఘట్టము మహాభారతమున సౌప్తిక పర్వమునను (ఏకాదశాధ్యాయము), శ్రీమద్భాగవతమున ప్రథమ స్కంధమునను (సప్తమాధ్యాయము) గలదు. ఆ పట్టున నారెండింట నామె మాతృత్వ మావిష్కరింపబడిన తీరు వేరు. అదే ప్రకృత వ్యాస విషయము.

భారతయుద్ధ మై పోయినది. ఇక పాండవులందే కురుక్షేత్రమున ఏకచ్ఛత్రాధిపత్యము. పాండవుల పట్టమహిషి ద్రౌపది పట్టిన పంతములెల్ల నెరవేరినవి. ఆమె ఉల్లాస మహాకాశిలో నోలలాడుచున్న సమయమది. కాని అప్పటికే ఆమె కొక కోశమున శోకము కొంత లేకపోలేదు. అది పితృశోకము. తన సపత్నులగు హిడింబా సుభద్రలవలె పుత్రశోకము మాత్ర మప్పటికెరుగదామె. తన పతులకు జయము నిశ్చయమై యిక నట్టి విపత్కర విషయము నూహింప నక్కరలేని పరిస్థితి యామెది. కాని హఠాత్తుగా అశ్వత్థామ సౌప్తిక పర్వమున నిర్వహించిన కఠోరదుర్వార్త యామె కర్ణపుటముల బడినది. అపుడామెకు పుత్రశోకము కన్న పుత్రఘాతియగు అశ్వత్థామపై నాగ్రహ మెక్కువగా ప్రజ్వరిల్లి పాండవులశ్వత్థామను సపరివారముగా నాశనము చేయకున్న తానే ప్రాయోపవేశము చేయుటకు ప్రతిన పట్టినది. భారత మిట్లు చెప్పుచున్నది—

తస్య పాపకృతో ద్రౌణేర్నచే దద్య త్వయారణే
హ్రియతే సానుబంధస్య యుధి విక్రమ్య జీవితమ్.
ఇహైవ ప్రాయ మాశిష్యే తన్నిబోధత పాండవాః
నచేత్ఫల మవాప్నోతి ద్రౌణిః పాపస్య కర్మణః.

(సౌప్తిక 11. 14, 15)

ఇంత ఘోరమైన ప్రతినను ఇదివరకామె తన జీవితములో పట్టియుండ లేదు. తన ప్రాణమే పణమొడ్డి పట్టిన ప్రతిన యిది. ఆమె పంతములు చెల్లింప భీముడున్నాడు. మహాభారతము ప్రకారము ఆతడే యామెచే నియోగింపబడి నాడు. కాని కృష్ణార్జునులు, ధర్మజుడు ఆతని ననుసరించినట్లును వ్యాసభగ వానుడే దిగివచ్చి అర్జునాశ్వత్థామలకు జరిగిన ఘోరయుద్ధమును పరిష్కరించి నట్లును చెప్పబడినది.

భాగవతమున ద్రౌపది తన కొడుకుల కొరకు తానేడ్చుటయేగాని యొక ప్రతిన బట్టినట్లుగాని, అశ్వత్థామను హతమార్చ వలసినదని యొకరి నాదేశించి నట్లుగాని చెప్పబడలేదు. పైగా అక్షంతవ్యుడగు హంతకు దశ్వత్థామను క్షమించి నది. అర్జునుడే అశ్వత్థామను హతమార్ప స్వయముగా ప్రతినగొని బయలుదేరును. ఆ సందర్భమున వ్యాసుడెక్కడను అవతరింపడు. అర్జునుదశ్వత్థామను బంధించి ద్రౌపది కడకు గొనివచ్చును. అపుడు కట్టెదుట కర్మజుగుప్సితుడై అవాఙ్ముఖుడై యున్న అశ్వత్థామను జూచి ద్రౌపది ఎంత చెడినను గురుపుత్రుడని కాబోలు నమస్కరించినదట. (''వామస్వభావా కృపయా ననామ చ'' అని భాగవతము. అట నా ద్రౌపదీ విశేషణమునకు భాగవత వ్యాఖ్యాతలగు శ్రీధరుడు శోభనస్వభావ యనియు, వీరరాఘవుడు అక్రోధన స్వభావ యనియు అర్థములు చెప్పిరి.) వెంటనే ఎంత హంతకుడైనను అతడట్లు బంధనముతో కొనిరాబడుట సహింపనిదై ''ముచ్యతాం ముచ్యతా మేష బ్రాహ్మణోఽనితరాం గురుః'' అనగా ''విడువుడు విడువు డితడు బ్రాహ్మణుడు. గురునికంటె వేరుకాడు'' అని యన్నదట. తదుపరి యర్జును నుపలక్షించి యిట్లన్నది—

సరహస్యో ధనుర్వేదః సవిసర్గోపసంయమః
అస్త్రగ్రామశ్చ భవతా శిక్షితో యదనుగ్రహాత్.
సఏష భగవాన్ ద్రోణః ప్రజారూపేణ వర్తతే
తస్యాత్మనోఽర్ధం పత్న్యాస్తే నాన్వగాద్వీరసూః కృపీ.

(భాగవత ప్రథమ స్కంధము 7. 44, 45)

అనగా ''ప్రయోగోపసంహార పూర్వకమగు ధనుర్వేదము సరహస్యముగా సానుగ్రహముగా నీకు నేర్పిన ద్రోణభగవాను డీ పుత్రరూపమున గన్పట్టు చున్నవాడు. అందుచేతనే వీరమాతయగు కృపి పతి ననుగమింపలేదు'' అని యర్థము. ఆ వెంటనే ధర్మరాజు నుద్దేశించి—

తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవం కులమ్
వృజినం నార్హతి ప్రాప్తుం పూజ్యం వంద్య మభీక్ష్ణశః (46)

(ధర్మజ్ఞ! మహాభాగ! మీ వలన పూజ్యము, వంద్యము నగునట్టి గురుకులమునకు చేటు కలుగరాదు.)

మా రోదీ త్తస్య జననీ గౌతమీ పతిదేవతా
యథాహం మృతవత్సార్తా రోది మ్యశ్రుముఖీ ముహుః. (47)

(నే నెట్లు మృతవత్సార్తనై అశ్రుముఖినై మాటిమాటికి నేడ్చుచుంటినో పతిదేవతయగు కృపియు నట్లేడ్వకూడదు.)

యైః కోపితం బ్రహ్మకులం రాజన్యై రజితాత్మభిః
తత్కులం ప్రదహత్యాశు సానుబంధం శుచార్పితమ్. (48)

(అజితేంద్రియులగు ఏ రాజుల వలన బ్రాహ్మణకులమునకు కోపము కలుగునో ఆ రాజకులమునే తత్క్రోధాగ్ని దహించును ) అని యన్నది అప్పటి యామె మాటల తీరు ధర్మన్యాయ దయాన్వితము, నిర్వ్యళీకము. సమభావసముల్లసితము నైనదనియు ధర్మజుడును తత్రత్యులగు ద్విజులును ఆమె నభినందించి రనియు భాగవతమున నిట్లు చెప్పబడినది—

ధర్మ్యం న్యాయ్యం సకరుణం నిర్వ్యళీకం సమం మహత్ •
రాజా ధర్మసుతో రాజ్ఞ్యాః ప్రత్యనంద ద్వచో ద్విజః. (49)

అప్పటి కింకను భీము డొక్కడే అశ్వత్థామ వధార్హుడని వాదించువాడుగా మిగిలినాడు, ఆతడు చేయి చేసికొను లోపున కృష్ణుడు కలుగజేసికొనుటచే అశ్వత్థామ రక్షింపబడెను. అదియే భాగవత ద్రౌపది కథిమతమైనది. ఆ పాత్రలో భాగవతకర్త ఎంత మహోన్నత మాతృభావము నిమిడ్చినాడు! ఎంత హృదయస్పంది యైన సన్నివేశమది!

అపుడు ద్రౌపది కురుక్షేత్ర మహారాజ్ఞి. అచ్చో న్యాయాన్యాయ విచార మొనర్చుట కామె కధికారము గలదు. శిశు హంతకునకు శిక్ష ఉరికి తక్కువ మరి లేదు. ఈ సందర్భమున ఆ మహారాజ్ఞియే ఆ నేరమున కెర యైనది. అది

గాక ఆమెకు దోషియగు నశ్వత్థామకు తమతమ తంత్రులనాటి నుండి యొక పగ పరిపాటిగ వచ్చుచుండినది. భాగవతమున ద్రౌపది కా ప్రతీకార స్మృతి యైన యున్నట్లు చెప్పబడలేదు. అందు ద్రౌపది ద్రోహి నొక మహారాజ్ఞివలె గాక మాతృత్వము మూర్తీభవించిన యొక మహా దేవతవలె చూచినది. అందును ఆ మాతృత్వము తన బిడ్డలను మాత్రమే ప్రేమింపగలిగి వారి మృతికి దుఃఖించు సామాన్య మాతృత్వముగాదు. ఏ తల్లి బిడ్డల యెడనైన సానుభూతి ప్రకటింపగల వాత్సల్యము, ఏ బిడ్డల తల్లి యెడనైన సానుభూతి ప్రకటింపగల యౌదార్యమును గల మహోదాత్త మాతృత్వము. అదియే సూనృతమైన మాతృత్వరహస్యము. మాతృత్వ మహిమ కది పరసీమ.

భారత ద్రౌపది పాత్రలో రాజసప్రవృత్తి గన్పట్టును. అందు పుత్రశోక మామె యెడ క్రోధముగా పరిణమించి ఆ క్రోధ మప్రతికారమై ప్రతీకారమునకు ప్రేరేపించినది. భాగవతమున అసలే అతిమృదులమగు నా మాతృహృదయము నకు మరింత మార్దవము చేకూర్చిన దా పుత్ర శోకము. ఆ విషయమున భారత చిత్రణము లోకసామాన్యమైన వాస్తవికతకు చాల సన్నిహితముగా నున్నదగును గాక. కాని భాగవత చిత్రణ మా మహాగ్రంథ పరమార్థమునకు దగినట్లు లోకోత్తరమై ఆదర్శ ప్రాయమై యొప్పుచున్నది.

ఇక నీ ద్రౌపదీ పుత్రశోక సందర్భమున భారత భాగవతాంధ్రీకర్త లెట్లు వ్యవహరించిరో యించుక పరిశీలించుదము. ఆ పట్టున భారతాంధ్రీకర్త తిక్కన మూల విధేయముగనే రచన సాగించినాడు. చూడుడు-

''అశ్వత్థామోద్దామరణ కరణ స్మరణంబు దన చిత్తం బుత్తలపెట్ట కోపంబు దీపింప'' ద్రౌపది ధర్మరాజుతో నిట్లనుచున్నది-

''భూరమణ ! గాఢనిద్రం
గూరిన సమయమున ముట్టికొని నా సుతులం
గ్రూరత( దెగటార్చెను బా
పారంభు(డు గురుతనూజు( డక్రమలీలన్.

అది యాఅని పెనుచిచ్చై
మదిఁ గాల్పఁ దొడంగె; దీని మాన్ప నుపాయం
బు దలంప నొండు లే ద
య్యదయుని ముట్టుకొని నాకు మడఁచుట దక్కన్.

వాయుసుతుఁ బనిచి నేఁ డటు
సేయింపక తక్కితేనిఁ జెప్పెద విను మేఁ
బ్రాయోపవేశమున నీ
కాయ ముపేక్షింతుఁ జుమ్మ కౌరవనాథా!''
(ఆంధ్ర మహాభారతము సౌప్తిక. 2.31,32,33)

'వ్యాసముని ప్రణీత పరమార్థము'నే భజించినాడు సోమయాజి. కాని భాగవత తత్త్వమును నవనాడులలోను జీర్ణించుకొన్న మహాకవి పోతన తా నప్పట్టున మూలకర్త యడుగుజాడలలోనే నడచుచు ఆ యడుగు వేయుట లోనే యొక క్రొత్త యడుగు నొక క్రొత్త యొఱపుతో వేసినాడు. ద్రౌపదిచే నశ్వత్థామ నుద్దేశించి యొక సంభాషణము చేయించినాడు. అది అమూలకమైనను మనోజ్ఞమైన మార్పు. చూడుడు-

''అర్జునుండు తెచ్చి చూపిన బాలవధ జనిత లజ్జాపరాఙ్ముఖుండైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావ యగు ద్రౌపది యిట్లనియె-

పఱఁగన్ మా మఁవార లందఱును మున్ బాణప్రయోగోప సం
హరణాద్యాయుధ విద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి; పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు; నీ చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే !

భూసురుఁడవు ! బుద్ధిదయా
భాసురుఁడవు ! శుద్ధవీరభట సందోహా
గ్రేసరుఁడవు! శిశుమారణ
మాసుర కృత్యంబు ధర్మమగునే తండ్రీ !

ఉద్రేకంబున రారు, శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు, బలోత్సేకంబుతోఁ జీఁకటిన్
భద్రాకారులఁ బిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా! నీ చేతు లెట్లాడెనో!

అక్కట! పుత్రశోక జనితాకుల భార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్న భంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో!''
(ఆంధ్ర మహాభాగవతము 1.160-168)

ఇందలి కొన్ని భావము లమూలకములు. కొన్ని మూలమున ద్రౌపది అర్జునాదులతో సంభాషించిన సందర్భమునందలివే కాని యిందొక క్రొత్తదనమును దెచ్చుకొన్నవి. ఆ సమయమున ద్రౌపది తన కడుపున చిచ్చు పెట్టిన యాద్రోహిని పలుకరింపక అతని తల్లిదండ్రులను దలచి క్షమించుటయే చాలును. అయినను తనవంటి మహారాజ్ఞి యట్టి నీచుని పలుకరింపరాదనక పూని యతని నుద్దేశించి "ధర్మమగునే తండ్రీ! నీ చేతులెట్లాడెనో! భవదీయమాత నేఁడెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో'' అని మాటలాడుట, ఆ యాడిన తీరులో తన పుత్రశోకాతురతను మాతృప్రేమను ఎదిరి పరిస్థితిని సానుభూతితో గ్రహింపగల యుదారతను మాత్రమే ప్రకటించి ద్రోహిని పల్లెత్తు పరుషమాడక గౌరవించిన భంగి యామె మాతృత్వప్రతిష్ఠకు మరింత వన్నె బెట్టుచున్నది. అనగా ద్రౌపదీ మాతృహృదయావిష్కరణ సందర్భమున సంస్కృతాంధ్ర భారతము లొక్కతీరుగను, వానిని సంస్కృత భాగవతము, దాని నాంధ్రభాగవతము నతిశయించుచు నున్నవనుట సుస్పష్టము.

(భారతి, నవంబర్ 1955)

# ఆంధ్ర మహాభాగవతము—అనువాద వైఖరి

—డాక్టర్ ప్రసాదరాయ కులపతి

ఆంధ్ర సాహిత్యములో మొదట సర్వధర్మసారమగు భారత ముదయించినది. నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగడలు దాని కర్తలు. రామకథ రంగనాథ రామాయణముగా, ఉత్తర రామాయణముగా, భాస్కర రామాయణముగా తెనుగున రూపొందినది. సుప్రసిద్ధమగు భారత రామాయణ భాగవతములలో పోతన నాటికి భాగవత మొక్కటి ఎవ్వరును స్పర్శింపక మిగిలినది. కవిత్రయమునకు తీసిపోని బహుముఖ ప్రజ్ఞగల మహాద్భుత విద్వత్కవియగు శ్రీనాథుని చూపేలో దానిపై ప్రసరింపలేదు. ఎవరి చేతను అది అనువదింపబడకుండుట తన అదృష్టముగా పోతన భావించెను.

ఒనరన్ నన్నయతిక్కనాది కవు లీ యుర్విన్ పురాణావళుల్
తెనుగున్ జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో
తెనుగున్ జేయరు మున్ను భాగవతమున్; దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్. (1-19)

పోతననాటి సంస్కృతాంధ్ర గ్రంథసందర్భమును పరిశీలించినచో రెండు విధములగు అనువాద పద్ధతులు గోచరించును. ఒకటి భారత కవు లనుసరించిన పద్ధతి. రెండు శ్రీనాథు డనుసరించిన పద్ధతి. పోతన ఈ రెండు పద్ధతులకును మధ్యేమార్గ మనుసరించెను. రెండింటి పైనను ఆయన కాదరమే. నన్నయ తిక్కనాదులవలె ఒక్కొక్కచోట కథభాగమును దీసికొని ఆయన స్వతంత్రానువాదము నొనర్చినాడు. మరియొకచో శ్రీనాథుని వలె ప్రతి శ్లోకము నొక పద్యముగా తీర్చి దిద్దినాడు. శ్లోకము కంటె పద్యమున కధికతర సౌందర్యము తెచ్చుటకై అవసరమైన మార్పులు చేసినాడు. ఇంక కొన్నిచోట్ల అర్థ వివరణము కొరకై మూల వ్యాఖ్యాతల అభిప్రాయములను గైకొని వానిని కూడ తన రచనలో చొప్పించినాడు, మరికొన్ని చోట్ల భావపరవశుడై మూలమును విడిచి స్వేచ్ఛగా విజృం

ళించి రసోద్రేకమున అనన్యకల్పనలు కావించినాడు. ఈ విధముగా భాగవతాను వాదములో ఆయన చూపించిన అఖండ ప్రజ్ఞావిశేషము కొన్ని ఘట్టములలో ఈ క్రింద పరిశీలింపబడుచున్నది.

పరమ మనోహరమగు రాసక్రీడా ఘట్టమును సంస్కృతమున పారాశర్యుడు కూడ పారవశ్యముతోనే రచించినాడేమో అనిపించును. దీని ననువదించుటలో పోతన చూపిన నేర్పు అపూర్వమును, అనితరమును. గోపికలు కృష్ణుని వెదకుచు తరులతాగుల్మములను పృచ్ఛించుచు నిట్లనిరి-

మూ. దృష్టోవః కశ్చిదశ్వత్థ ! ప్లక్ష ! న్యగ్రోధ ! నోమనః
నందసూను ర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః
కచ్చిత్ కురవ కాశోకనాగ పున్నాగచంపకాః
రామానుజో మానినీనాం గతో దర్పహరస్మితః. (10-30-5,6)

చూత ప్రియాళ పనసాపన కోవిదార
జంబీర బిల్వ వకుళామ్ర కదంబ నీపాః
యేఽన్యే పరార్థ భవికా యమునోపకూలాః
శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాం నః. (10-30-9)

దీనికి రసవంత మగు పోతన అనువాదము చూడుడు-

పున్నాగ ! కానవే పున్నాగవందితు
తిలకంబ ! కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితు
బంధూక ! కానవే బంధుమిత్రు
మన్మథ ! కానవే మన్మథాకారుని
వంశంబ ! కానవే వంశధరుని
చందన ! కానవే చందనశీతలు
కుందంబ ! కానవే కుందరదను

ఇంద్రభూజమ ! కానవే ఇంద్రవిభవు
కువల వృక్షమ ! కానవే కువలయేశు

ప్రియక పాదప! కానవే ప్రియువిహారు
ననుచు కృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు. (10.1008)

పున్నాగవందితుడు, తిలకనిటలుడు మొదలగు కృష్ణవిశేషణములను పోతన కల్పించి మూలములోని అర్థ సౌందర్యమునకు శబ్దసౌందర్యము జోడు చేసెను. జగత్ప్రసిద్ధమగు "నల్లనివాడు పద్మనయనమ్ముల వాడు" అను పద్య మీ సందర్భములోనిదే. దానికి మూలము లేదు.

**మూ.** గోప్యః కామాత్ భయాత్ కంసో
ద్వేషాచ్చైద్యాదయో నృపాః
సంబంధాత్ వృష్ణయః స్నేహాత్
యూయం భక్త్యా వయం నృప (7.1.38)

ఇది నారదుడు ధర్మరాజుతో పలికిన మాట. దీని అనువాదము సుప్రఖ్యాతమైనది.

కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రింగంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠుడైన హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా! (7. 8)

సామాన్యముగా పోతన శైలి యనిన ఇట్లు ధారాళముగా ప్రసన్నముగా నుండును. ఈ పద్ధతిలో సమయసముచితముగా రసభరితముగా పోతన చేసిన అనువాదములో ఆయా విధానములకు ప్రత్యేకముగా నుదాహరణము లీ క్రింద చూపబడుచున్నవి.

**యథామూలానువాదము :**

యథామూల మనుమాట నిజమున కెప్పుడును సార్థకము కాదు. ఛందోను గుణముగా నడువవలసిన పద్యములో పదమునకు పదమెప్పుడు నవతరింపదు. ఒక భాష నుండి మరియొక భాష కనువాదము జరుగునప్పుడు యథా మూల భావానువాదమే కాని యథామూల పదానువాద ముండదు. కాని సంస్కృతము నుండి తెనుగున కనువదించునప్పుడు సంస్కృతములోని పదములు ధారాళముగా

తెనుగులోనికి ప్రవేశించు నవకాశముండుటచే మూలములోని పదభావములు రెండును పరిశీలించుట విమర్శకుల కలవాటైనది. ఏదైనను మూలము నెట్టి మార్పులు చేర్పులు చేయక చాలవరకున్నది ఉన్నట్లుగా అనువదించుట కిం దుదాహరణములు కాంచవచ్చును. అనగా ఏ ఒకటి రెండు పదములలోనో మార్పు కనిపించినను అర్థములో మాత్ర మెట్టి మార్పు నుండదన్న మాట.

మూ. సాధయిత్వా జాత శత్రోః
స్వం రాజ్యం కితవైర్హృతం
ఘాతయిత్వా సతో రాజ్ఞః
కచస్పర్శ క్షతాయుషః.

యాజయి త్వాశ్వమేధై స్తం
త్రిభి రుత్తమ కల్పకైః
తద్యశః పావనం దిక్షు
శతమన్యో రివాతనోత్. (1.8.5,6)

అను. పాంచాలీ కబరీ వికర్షణ మహాపాపక్షతాయుష్కులన్
వంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి, గోవిందు డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకు, కల్పించెన్ మహాఖ్యాతి, చే
యించెన్ మూడు తురంగమేధములు దేవేంద్ర ప్రభావంబునన్.(1.175)

'కితవైర్హృతం' అనునది వదలబడి 'వంచద్గర్వుల' అనునది తెనుగున చేర్చబడినది. మూలములోని 'పావనం' తెనుగున 'మహా' యైనది. ఇవి అల్పమైన మార్పులు. మిగిలిన దంతయు మూలానుసరణమగు రమణీయానువాదము.

గోపికలు శ్రీకృష్ణు నీ విధముగా ప్రార్థించినారు-

మూ. ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనం
ఫణిఫణార్పితం తే పదాంబుజం
కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్. (10.31.7)

అను. గోవుల వెంట ద్రిమ్మరుచు గొల్చిన వారల పాపసంఘముల్
ద్రోవగజాలి శ్రీదనరి దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం
భావితమైన నీ చరణపద్మము చన్నుల మీద మోపి త
ద్భావజ పుష్పభల్ల భవబాధ హరింపు వరింపు మాధవా! (10. 040)

'ఫణాలతాగ్ర' ఫణాతలాగ్రయైన ఇంకను రమ్యముగా నుండును. 'హృచ్ఛయం' అనుదానికి 'భావజపుష్పభల్లభవబాధ' సార్థకమైన యనువాదము. ఈ సమాసములోని భకారము బాధాతీవ్రతను స్పష్టముగా వ్యక్తము చేయగలదు.

యథామూలప్రాయము :

పూర్తిగా యథామూలముగా ననువదించుట అన్ని సందర్భములలోను సాధ్యము కాదు. అది అవసరమని కవియును భావింపడు. యథామూలప్రాయముగా ననువదించుటయే తరచుగా కాననగును. వీనిలో మూలభావమున కొన్ని అల్పములగు మార్పులు చేయబడి యుండును. అనగా ఇది యథామూలానువాదమునకు ఒక్కడుగు దూరములో నుండును. దీనిని సన్నిహితానువాద మనినను అనవచ్చును. ఈ పద్ధతి కుదాహరణము లీక్రింద చూపబడుచున్నవి-

మూ. నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్. (1.2.4)

అను. నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసు పదములకు నమ
స్కారము సేసి వచింతు ను
దార గ్రంథంబు దళిత తనుబంధంబున్. (1.55)

సంస్కృతములో "అనుష్టుప్" వలెనే తెనుగున కందము మిక్కిలి చిన్న ఛందము. తెనుగులో మూలములోని 'జయ' మను మాట లేకున్నను పోతన కత్యంత సహజమైన అంత్యప్రాస అను నొక శబ్దాలంకారము విజృంభించుట కిది నిదర్శనము.

మూ. నయద్వచ శ్చిత్రపదం హరేర్యశో
జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్

తద్వాయసం తీర్థముశంతి మానసా
నయత్ర హంసా నిరమం త్యుశిక్షయా (1.5.10)

అను. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుంత దయోగ్య దుర్మదన దత్కాకోలగర్తాకృతిన్. (1.94)

మూలమునందలి 'ఉశిక్షయ' విడువబడినను వాయసము కంటె కాకోలము ఈ సందర్భమున శక్తిమత్తరమగు పదమగుట గమనార్హము. వాయస మనిన కాకి. కాకోలమనిన మాలకాకి. వీరభద్ర సముద్భవ ఘట్టము-

మూ. క్రుద్ధ స్సు దష్టోష్ఠపుట స్సధూర్జటి
ర్జటాం తటిద్వహ్ని సటోగ్రరోచిషం
ఉత్కృత్య రుద్ర స్సహ సోత్థితో హసన్
గంభీరనాదో విససర్జ తాం భువి. (4.5,2)

అను. ఆద్యుం డుగ్రుడు నీలకంఠు డిభదైత్యారాతి దష్టోష్ఠుడై
మాద్యద్భూరి మృగేంద్ర ఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్ని శిఖాసముచ్చయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్
సద్యః క్రోధముతోడ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్ర మధ్యంబునన్. (4.108)

మూలమునందలి 'గంభీరనాదము' తెనుగున 'మాద్యద్భూరి మృగేంద్ర ఘోష' మగుట ఒక విశేషము. యుద్ధమున నిహతుడైన సుయజ్ఞునిగూర్చి ఆ రాజు భార్యలు విలపించు ఘట్టమీ క్రిందిది-

మూ. రుదంత్య ఉచ్చై ర్దయితాంఘ్రి పంకజం
సించంత్య అస్రైః కుచకుంకుమారుణైః
విస్రస్త కేశాభరణా శ్శుచం నృణాం
సృజంత్య ఆక్రందనయా విలేపిరే. (7.2.32)

అను. ప్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తాబ్జంబులు సాచి మోదుకొనుచున్ హానాథ; యంచున్ బహు
ప్రస్తావోక్తుల తోడ నేడ్చిరి వడిన్ ప్రాణేశు పాదంబుపై
అస్తోక స్తన కుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షింపుచున్. (7.42)

బహు ప్రస్తావోక్తులతోడ నేడ్చుట సహజమును, రమణీయమునునగు అమూలకము. ''గజేంద్ర మోక్షణము''లోని శ్లోక మీ క్రిందిది-

మూ. నయస్య దేవా ఋషయః పదం విదు
ర్జంతుః పునః కోఽర్హతి గంతు మీరితుం
యథా నటస్యాకృతిభి ర్విచేష్టితో
దురత్యయానుక్రమణ స్సమావతు. (8.3.6)

అను. నర్తకుని భంగి పెక్కగు
మూర్తులతో నెవ్వడాడు మునులున్ దివిజుల్
కీర్తింపనేరరెవ్వని
వర్తన మెరు లెరుగనేర రట్టివాని నుతింతున్. (8.76)

'దురత్యయానుక్రమణః' అనుదానికి ఎవ్వని వర్తన మెరు లెరుగరనుట జాత్యమగు రమ్యానువాదము. దీనిని మొదటి పాదమున కనువాదమన్నను కాదన లేము. వర్తనపదము అన్నింటిని ఇముడ్చుకొన్నది.

**వ్యాఖ్యానావలంబనము :**

అనువాద సమయమున చాల శ్లోకముల కర్థనిర్ణయము చేయుటకు పోతన వ్యాఖ్యానముల సాహాయ్యము గైకొనెను. కొన్నియెడల వ్యాఖ్యలలోని వాక్యము లకు వాక్యములే తెనిగించిన సందర్భములు కూడ గలవు. అందును ప్రధానముగా ఆయన శ్రీధరవ్యాఖ్యనే గ్రహించినట్లు కన్పించుచున్నది. విమర్శకు లందరును ఈ విషయమున ఏకకంఠముతోనే యున్నారు. దానికి కొన్ని ఉదాహరణములు-
కుంతీదేవిస్తుతి-

మూ. గోప్యాదదే త్వయి కృతాగసి దామతావ
ద్యాతే దశాశ్రుకలిలాంజన సంభ్రమాక్షం
వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య
సా మాం విమోహయతి భీరపి యద్బిభేతి. (1.8.32)

శ్రీధరవ్యాఖ్య : త్వయి కృతాగసి దధిభాండస్ఫోటం కృతవతి.

అను. కోపముతోఁ డ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపిక త్రాటఁగట్టిన వికుంచితసాంజన బాష్పతోయధా
రా పరిపూర్ణ వక్త్రము కరంబుల రాముచు వెచ్చనూర్చుచున్
బాపడవై నటించుట కృపాపర ! నామది చోద్యమయ్యెడిన్. (1.191)

తెనుగులోని దధికుంభభేదనము వ్యాఖ్యలోని దనుట స్పష్టము.

ఈ క్రిందిశ్లోకము అర్జునుడు ధర్మరాజుతో పలికినది-

మూ. యద్దోర్షు మాప్రణిహితం గురుభీష్మకర్ణ
ద్రౌణి త్రిగర్త శల సైంధవ బాహ్లికాద్యైః
అస్త్రాణ్యమోఘ మహిమాని నిరూపితాని
నోపస్పృశు ర్నృహరిదాస మివాసురాణి. (1.15.16)

శ్రీధర వ్యాఖ్య : అసురాణి హిరణ్యకశిపు ప్రేరితాని అస్త్రాణి నృహరి
దాసం ప్రహ్లాదమివేతి.

అను. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని క్రై వడి కృపాశ్వత్థామగాంగేయ సూ
ర్యసుత ద్రోణధనుర్విము క్తబహుదివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగు మాధవుదయాదృష్టిన్ నరేంద్రోత్తమా! (1.365)

**భావచాలనము :**

మూలములో సూత్రప్రాయముగా క్లుప్తముగా నున్న అనేకాంశములను చాల సందర్భములలో పోతన చక్కగా పెంపుచేసి యున్నాడు. శ్రీధరాది వ్యాఖ్యాన సాహాయ్యముతోనే కాక కేవల స్వకీయ కల్పన సామర్థ్యముచే గూడ ఎన్నో విషయములను మూలాతిశయముగా ఆయన వర్ణించియున్నాడు. అర్థవివరణాత్మకమగు భావచాలన కుతూహలమే దీనికి కారణము. అ విధముగా మూలమును బాగుగా విస్తరించిన కొన్ని సందర్భముల కుదాహరణము లీ క్రింద నొసగబడుచున్నవి-

మూ. అంగుష్ఠమాత్ర మమలం స్ఫురత్పురటమౌళినం
అపీచ్యదర్శనం శ్యామం తటిద్వాసస మచ్యుతం
శ్రీమద్దీర్ఘచతుర్బాహుం తప్తకాంచనకుండలం
క్షతజాక్షం గదాపాణి మాత్మన స్సర్వతోదిశమ్. (1.12.8,9)

పరీక్షిజ్జనన ఘట్టములోనిది పై శ్లోకము—

అను. మేఘంబు మీది క్రొమ్మెఱుగుకైవడి మేని
పై నున్న పచ్చని పటమువాడు
గండభాగంబుల కాంచన మణిమయ
మకరకుండలకాంతి మలయువాడు
శరవహ్ని నణగించు సంరంభమున జేసి
కన్నుల నునుగెంపు గలుగువాడు
బాలార్కమండల ప్రతిమాన రత్నహా
టకవిరాజిత కిరీటంబువాడు

కంకణాంగద వనమాలికావిరాజ
మాను డసమాను డంగుష్ఠమాత్ర దేహు
డొక్కగద జేతదాల్చి నేత్రోత్సవముగ
విష్ణు డావిర్భవించె నవ్వేళ యందు. (1.283)

'శ్యామం తటిద్వాససం' అనునది మొదటి పాదమైనది. మూలములో వసనమును మాత్రమే తటిత్తుతో పోల్చగా పోతన మేనును గూడ మేఘముతో పోల్చి ఒక చక్కని పూర్ణోపమను సిద్ధము చేసెను. 'తప్తకాంచన కుండలం' అనునది 'గండభాగంబుల' అని రెండవ పాదమైనది. మూలములోని కాంచనమునకు పోతన మణులను గూడ తాపటము చేసి వాని కాంతి గండభాగముల మీద మలయించి నూతన సౌందర్యమును తెచ్చినాడు. 'క్షతజాక్షం' అను దానికి శ్రీధరులు వ్యాఖ్యానించుచు 'అహో మద్రక్తస్యాపి గర్భే అస్త్రాది పీడేతి సంరంభా దత్యారక్తనేత్రం' అనెను. దానిని గ్రహించి పోతన 'శరవహ్ని నణగించు' అను మూడవ పాదమును కూర్చినాడు. 'అత్యారక్తనేత్రం' అనుటకంటె 'నునుగెంపు' అనుటలో ఒక అంబోకతనమును, లెక్కచేసని తనమును వ్యక్తమగు

చున్నవి. 'స్ఫురత్ పురటమౌళినం' అనునది 'బాలార్కమండల' అను నాల్గవ పాదమైనది. ఇక్కడ బాలార్కమండల ప్రతిమానమైనది రత్నమో హాటకమో కాదు. వానిచే విరాజితమైన కిరీటము. మూలములోని 'స్ఫురత్' తెనుగున ఇంత సాగినది. మూలములోని 'శ్రీమద్దీర్ఘచతుర్బాహుం' వదలబడి 'కంకణాంగద వన మాలికా విరాజమాను' డగు విశేషణము వచ్చినది. ఇట్లర్థయుతముగా అధికతర సౌందర్య సంపాదకముగా తెనుగు పెంపొందినది. వీరభద్రావిర్భావ సందర్భము లోని దీ క్రింది శ్లోకము-

మూ. తతోఽతికాయ స్తనునాస్పృశన్ దివం
సహస్రబాహుర్ఘనరుక్ త్రిసూర్యదృక్
కరాళదంష్ట్రో జ్వలదగ్ని మూర్ధజః
కపాలమాలీ వివిధోద్యతాయుధః. (4.5.8)

అను. అభ్రంకష విహారదభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృష్ణనీల దీర్ఘశరీర మమర
ప్రజ్వలజ్జ్వలన దీప్తజ్వాలికాజాల
జాజ్వల్యమాన కేశములు మెఱయ
చండదిగ్వేదండ శుండాభదోర్దండ
సాహస్రధృత హేతిసంఘ మొప్ప
వీక్షణత్రయలోక వీక్షణద్యుతి లోక
వీక్షణతతి దుర్నిరీక్ష్యముగను

క్రకచ కఠినకరాళదంష్ట్రలు వెలుంగ
ఘనకపాలాస్థివనమాలికలును దనర
అఖిలలోకభయంకరు డగుచు వీర
భద్రు డుదయించె మారట రుద్రుడగుచు. (4.108)

ప్రకార పునరుక్తితో మొదటిపాదము మూలములోలేని ఒక అద్భుతత్వమును సంతరించుకొని వీరభద్రుని మూర్తిని శాబ్దికచిత్రణముగా మన కన్నులముందు నిల్పినది. 'జ్వలదగ్ని మూర్ధజః' అనునది సీసము రెండవపాదముగా కొంచెము పొడుగుసాగి మరింత ప్రజ్వలన గుణమును సంపాదించుకొన్నది. 'సహస్ర

బాహుః', 'వివిధోద్యతాయుధః' అను రెండు సమాసములును కలిసి మూడవ పాదమైనవి. ఆ బాహువులకు 'ఉగ్రోద్దండ శుండాభత్వము' అధికముగా వచ్చినది. 'ఘనరుక్ త్రిసూర్యదృక్' అనునది సీసము నాల్గవ పాదమైనది. మూలములోని 'కరాళదంష్ట్రలు' తెనుగున క్రకచ కఠినతను తెచ్చుకొన్నవి. మొత్తము మీద మూలము కంటె అఖిల లోక భయంకరత్వముతో తెనుగు పద్యము విజృంభించినది.

ప్రహ్లాదుని శీల సంపదను చిత్రించు శ్లోకమిది-

**మూ.** బ్రహ్మణ్యః శీలసంపన్నః సత్యసంధో జితేంద్రియః
ఆత్మవ త్సర్వభూతానాం ఏకః ప్రియసుహృత్తమః
దాసవ త్సన్నతార్యాంఘ్రిః పితృవద్దీన వత్సలః
భ్రాతృవత్సదృశస్స్నిగ్ధో గురుష్వీశ్వర భావనః. (7.4.32,33)

**అను.** తనయందు నఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాడు
పెద్దల బొడగన్న భృత్యుని కైవడి
జేరి నమస్కృతుల్ సేయువాడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన సేసి మరలువాడు
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను
దీనుల గావ జింతించువాడు

సఖుల యెడ సోదరస్థితి జరుపువాడు
దైవతము లంచు గురువుల దలచువాడు
లీలలందును బొంకులు లేనివాడు
లలిత మర్యాదుడైన ప్రహ్లాదు డధిప! (7.115)

'ఆత్మవత్ సర్వభూతానాం' అనునది 'తనయందు' అను పాదమైనది. 'దాసవత్ సన్నతార్యాంఘ్రి' అనునది 'పెద్దల బొడగన్న' అను పాదమైనది.

మూలములోనిది కేవల భావము. తెనుగులోనిది భావచిత్రము. తెనుగు చదవగానే ప్రహ్లాదుడు పెద్దలను కాంచుట, వెంటనే భృత్యుని వలె దగ్గరకు జేరి నమస్కరించుట కంటిముందు దృశ్యము వలె కన్పించును. 'శీల సంపన్నః, జితేంద్రియః' అను రెండును 'కన్నుదోయికి' అని భావ చిత్రముగా రూపొందినవి. 'పితృవ ద్దీనవత్సలః' అనునది 'తల్లిదండ్రుల భంగి' అని అనూదితమైనది. 'సత్యసంధః' అనునది 'లీలలందును బొంకులు లేనివాడు' అని అధికతర విశేషణముతో నొప్పినది. నవ్వులకైన అబద్ధ మాడడనుటచే ప్రహ్లాదుని శీలము మరింత పరిపుష్టమైనది. ఈ విధముగా మూల శ్లోకములకు తెనుగు పద్య మన్నివిధముల మెరుగు వెట్టినదనుటలో సందేహము లేదు.

బాలకృష్ణుడు గోపబాలురతో గూడి చల్దులారగించు ఘట్టము-

మూ. బిభ్ర ద్వేణుం జఠరపటయో శ్శృంగవేత్రేచ కక్షే
వామే పాణౌ మసృణకబళం తత్ఫలాన్యంగుళీషు
తిష్ఠన్మధ్యే స్వపరసుహృదో హాసయ న్నర్మభిస్స్వైః
స్వర్గే లోకే మిషతి బుభుజే యజ్ఞభు గ్బాలకేళిః. (10.13.11)

అను. కడుపున దిండుగా గట్టిన వలువలో
లాలిత వంశనాళంబు జొనిపి
విమలశృంగంబును వేత్రదండంబును
జారి రానీక డాచంక నిరికి
మీగడ పెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలిసేత మొనయ నునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ళ సందునను దావెలయ నిరికి

సంగడీల నడుమ జక్కన కూర్చుండి
నర్మభాషణముల నగవు నెరపి
యాగభోక్త కృష్ణు డమరులు వెరగంద
శైశవంబు మెరసి చల్ది గుడిచె. (10.496)

'జఠరపటయోః' అనునది 'ఉదర వస్త్రయో ర్మధ్యే' యని శ్రీధరులు వ్యాఖ్యానింప 'కడుపున దిండుగా గట్టిన వలువలో' అని పోతన అనువదించెను. పంచె కట్టుకొనుటలో ఎనేక విధములు కలవు. దిండుగా కట్టుట యనగా దట్టి బిగించికట్టుట. పరుగెత్తుటకు, దూకుటకు, ఆడుకొనుటకు సుకరముగా నుండును. కృష్ణుడు క్రీడాపరుడై యుండుట ఇచట సందర్భము కావున దిండుగా కట్టినట్లు పోతన వర్ణించెను. శ్లోకములోని 'వామే' అనునది కాకాక్షి న్యాయమున పాణులు రెంటికిని విశేషణ మగునని శ్రీధరులు చెప్పియుండుటచే రెంటికిని 'చంక, డాపలిచేత' అని పోతన అనువదించెను. మూలములో 'మసృణ కబళ' మని యుండ శ్రీధరులు దానిని 'మసృణం స్నిగ్ధం దధ్యోదనకబళం' అనియు, 'తత్ఫలాన్యంగులీషు' అను దానికి 'తదుచితానిబిల్వామలకాదీ ఫలాని అంగుళీసంధిషు' అనియు వ్యాఖ్యానించిరి. తెలుగుదనము కృష్ణునకును ఆపాదించి పోతన మీగడ పెరుగుతో మేళవించిన చల్దిముద్దలు, ఊరుగాయలు ప్రవేశపెట్టినాడు. అది అత్యంత సహజము. కవినాటి దేశకాల పరిస్థితులు, ఆచారములు కావ్యమున ప్రవేశించుట తరచు జరుగుచుండును. శ్రీధర వ్యాఖ్య సహాయముతో కొంత, తన భావనాశక్తితో మరి కొంత ఇట్లనేక విధముల పోతన మూలమును విస్తరించినాడు.

గోపాలకృష్ణుడు గోవులను గాయు సందర్భము-

శ్లో. మేఘ గంభీరయా వాచా నామభిర్దూరగాన్ పశూన్
క్వచి దాహ్వయతి ప్రీత్యా గోగోపాల మనోజ్ఞయా. (10.15.12)

సీ. రా పూర్ణచంద్రిక ! రా గౌతమీగంగ !
రమ్మ భగీరథరాజతనయ !
రా సుధాజలరాశి ! రా మేఘమాలిక !
రమ్మ చింతామణీ ! రమ్మ సురభి !
రా మనోహారిణి ! రా సర్వమంగళ !
రా భారతీదేవి ! రా ధరిత్రి !
రా శ్రీమహాలక్ష్మి ! రా మందమారుతి !
రమ్మ మందాకిని ! రా శుభాంగి !

అనుచు మఱియు గలుగు నాళ్ళలు గల గోవు
లడవిలోన దూరమందు మేయ
ఘనగభీర భాష గడునొప్ప జీరు నా
భీరజనులు బొగడ పెంపు నెగడ. (10.601)

'నామభిః' అని మాత్రము సూచించి వ్యాసుడు వదలగా పోతన దాని నిట్లు విస్తరించెను. అందమైన పేర్లు సృష్టించుటతో పద్యమునకు ఎక్కడలేని అందము వచ్చినది. మూల విస్తరకారునకు సామర్థ్యముండ వలసిన దిట్టి చోటులనే. అది పోతనలో పరిపూర్ణత్వము నొందిన దనుటకు ఇట్టి పద్యములే తార్కాణ ములు.

**మూలభిన్నత :**

అనువాద సమయమున మూలములోని పదములకును, భావములకును భిన్నమగు పదములను, భావములను చేర్చిన సందర్భము లక్కడక్కడ కన్పట్టు చున్నవి. అట్టి వాని కుదాహరణములు కొన్ని:-

మూ. అహో మహీయసీ జంతోః జీవితాశా యయా భవాన్
భీమాపవర్జితం పిండ మాదత్తే గృహపాలవత్. (1.13.24)

విదురుడు ధృతరాష్ట్రునితో పలికిన శ్లోకమిది-

అను. బిడ్డలకు బుద్ధి సెప్పని
గ్రుడ్డికి పిండంబు వండికొని పొం డిదె పై
బడ్డాడని భీముం డొర
గొడ్డెము లాడంగ గూడ గుడిచెద వధిపా ! (1.311)

మూలములోని 'గృహపాలవత్' (కుక్కవలె) పోతన వదలి, పై బడ్డాడు, ఒరగొడ్డెములాడు మొదలగు జాతీయములను వాడి చక్కని నుడికారము పెంపును ప్రదర్శించెను.

**స్వేచ్ఛానువాదము :**

మూ. అహో అమీషాం వయసాధికానాం
విపశ్యతాం లోకగతిం విమోహః

యత్రోద్భవ స్తత్ర గతం మనుష్యం
స్వయం స ధర్మా అపి శోచం త్యపార్థం. (7.2.37)

అను. మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్
చచ్చుచునుండ చూచెదరు చావకమానెడువారి భంగి నీ
చచ్చినవారి కేడ్చెదరు చావుకు నొల్లక డాగవచ్చునే?
ఎచ్చట బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్. (7.46)

ఈ క్రిందివి హిరణ్యకశిపుని పలుకులు-

మూ. పరోఽప్యపత్యం హితకృ ద్యథౌషధం
స్వదేహజోఽప్యామయవ త్సుతోఽహితః
ఛింద్యా త్తదంగం హి యదాత్మనో హితం
శేషం సుఖం జీవతి యద్వివర్జనాత్. (7.5.37

అను. అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీ యజ్ఞున్ కులద్రోహి దు
స్సంగున్ కేశవపక్షపాతి నధమున్ జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతి జరించెదన్ కులము నిర్దోషంబు గావించెదన్. (7.188)

**అనువాద సౌందర్యము :**

పోతన చేసిన అనువాదవైఖరులు పైన చర్చింపబడినవి. ఆయా సంద ర్భములలో మూలమునకు మెరుగుదిద్ది, హృదయంగమములై, చదివినంత మాత్ర మున ఆకర్షించు అనువాద పద్యములు పోతనలో వందలకొలది కలవు. ఆయన శైలిలో నున్న వైశిష్ట్యమే అట్టిది. సకలాంధ్ర సాహిత్యములోను ఆయన వ్రాసి నన్ని ధారణాయోగ్యపద్యములను ప్రజల మనస్సుకు హత్తుకొనునట్లు వ్రాసిన వారు మరొక్కరు లేరు. అట్టి రమణీయానువాదమునకు కొన్ని ఉదాహరణములు:

మూ. శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావనీధ్రుక్
రాజన్యవంశదహనా నపవర్గ వీర్య।
గోవింద గోద్విజ సురార్తిహరావతార
యోగీశ్వ రాఖిలగురో భగవ న్నమస్తే! (1.8.44)

అను. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ! (1.198)

సంస్కృతమున నున్న 'నమస్తే' 'నీకున్ మ్రొక్కెద' నని అనువాదము చేసి అంతటితో ఆగక 'త్రుంపవే భవలతల్' అనుటతో అధికతరమగు అర్థ స్ఫూర్తి వచ్చినది. మూలములో లేని 'నిర్వాణ సంధాయకా' అను సంబోధనము దానికి దోహదము చేసినది. సంస్కృతములో కంటె తెలుగులో సంబోధనల కొక సౌకర్యము కలదు. వృత్తమధ్యమున 'కృష్ణసఖ' మున్నగునవి వ్యాకరణరీత్యా హ్రస్వాంతము లగుటచేతను, ఛందోదృష్టితో అక్కడ హ్రస్వమే ఉండవలసి వచ్చుటచేతను, ప్లుతోచ్చారణ కవకాశము లేదు. భక్తితో నాక్రోశించునప్పుడు సంబోధనాంతమగు అచ్చు ప్లుతమగుట సహజము. అకారాంత, ఇకారాంత శబ్దములు సంస్కృతములో వలె కాక స్వేచ్ఛగా దీర్ఘము తీయు అవకాశము తెనుగుభాషలోని ఒక విశిష్ట లక్షణము. అందును అధిక దీర్ఘాక్షరములకు వీలున్న శార్దూలవృత్తమువంటి వాని నెన్నుకొనుటలో పోతన సామర్థ్యము తేటతెల్ల మగుచున్నది. 'శ్రీకృష్ణా' అని అనుటతోనే ఆ పిలుపు దిక్కులకు వ్యాపించును. దానిపై వరుసగా 'యదుభూషణా' 'నరసఖా' మొదలగునవి. ఆ పిలుపులోని ఆత్మీయతను ద్విగుణీకృతము గావించినవి. 'శృంగార రత్నాకరా' అనుటతో అది పరాకాష్ఠనందుకొన్నది. కుంతినోట అమూలకముగా శృంగారశబ్దమును పలికించుట ఔచిత్య విరోధమని కొందరు శంకింపవచ్చును. శృంగారము కామ వాసన కతీతమైనదనియు, అది అక్కడ జీవేశ్వర సంబంధ సాన్నిహిత్య సూచక మనియు భావించినచో సరిపోవును. అనన్య విషయమగు ఆ రతిని కుంతి కోరుచున్నదనుటకు దీని పై శ్లోకమే నిదర్శనము.

మూ. త్వయి మేఽనన్యవిషయా మతి ర్మధుపతేఽసకృత్
రతి ముద్వహతా దద్ధా గంగేవౌఘ ముదన్వతి. (1.8.42)

పోతన దీనికి వ్రాసిన పద్యములో (1.198) ఈ రతి శబ్దమును వదలి వేయుటచే సంస్కృతశ్లోకమునే ఇచ్చుట ఉదాహరింపవలసి వచ్చినది. ఈ రతికి

'అనవచ్ఛిన్న ప్రీతి' అనియే శ్రీధరులును అర్థము చెప్పిరి. ఈ రతి లౌకిక రతి ఎట్లు కాదో, అట్లే ఈ శృంగారమును లౌకిక శృంగారము కాదని గుర్తింప నగును. కనుక పోతన ప్రయోగించిన సంబోధనము అత్యంత సార్థకము.

శరతల్పగతుడైన భీష్ముడు తన్ను దర్శింపవచ్చిన పాండవులతో నిట్లను చున్నాడు-

మూ. యత్ర ధర్మసుతో రాజా గదాపాణి ర్వృకోదరః
కృష్ణోఽస్త్రీ గాండివశ్చాపః సుహృత్ కృష్ణ స్తతో విపత్. (1.9.15)

అను. రాజట ధర్మజుండు, సురరాజసుతుండట ధన్వి, శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లట, సారథి సర్వభద్రసం
యోజకుడైన చక్రియట, ఉగ్రగదాధరుడైన భీము డ
య్యాజికి తోడువచ్చునట ఆపద గల్గుటదేమి చోద్యమో ! (1.210)

'అట' అనునది స్థలార్థకముగా కాక ఒక విశేషార్థమున ప్రయోగించుట భారత రచన నాటికి తెనుగున మొదలైనది (మునికన్యకయట నేనట). ఆశ్చర్యార్థకమై ఈ శబ్దమొక ప్రత్యేక ప్రయోజనమును తెనుగుభాషలో సంతరించు కొన్నది. ఈ పదము సాహాయ్యముతో పోతన ఎత్తిన ఈ పద్యపు టెత్తుగడ పరమరమణీయమై మూలములో లేని సౌందర్యమును తెనుగునకు తెచ్చినది.

వృత్తరచనలో పోతన కభినివేశ మెక్కువ. అట్లని మిగిలినవానిలో తక్కువని కాదు. ఒక్కొక్కరికి ఒక్కొక్కదానియందు ప్రత్యేకమగు ఇష్ట ముండును. ప్రావీణ్యముండును. ప్రసిద్ధి యుండును. తిక్కనకు కందముననూ, శ్రీనాథునకు సీసముననూ గల ప్రఖ్యాతి అట్టిదే. పోతన 'అడిగెదనని కడువడి జను' వంటి కంద పద్యములను, 'మందారమకరంద' వంటి సీసపద్యములను అత్యద్భుతముగా వ్రాయకపోలేదు. అయినను ఆ ఛందముల కాయనను చెప్పు కొనరు. వృత్తరచనలో పోతనది పెట్టిన పేరు. ఏ భావము ఏ ఛందములో నిముడునో సమర్థుడగు కవి తానే నిర్ణయించుకొనును.

సంస్కృతములో ఏ ఛందమున్నదో ఆ భావము నా ఛందములోనే తెచ్చుట కిటీవలి ఆధునికులు కొందరు ప్రయత్నించుచున్నారు. శిఖరిణి, మందాక్రాంతవంటి వృత్తములు సంస్కృతములో సౌందర్యవంతములైనట్లు తెనుగున కానేరవు. ప్రాచీనాంధ్రకవులందులకే తెనుగుభాషకు తెనుగుపలుకుబడికి ఏ ఛందములు తగునో వానినే స్వీకరించి రచించిరి. అనుష్టుబాది చ్ఛందములలో రచింపబడిన సంస్కృత శ్లోకములను ఆ దృష్టితోనే తెనుగువారు తెనుగుజేసిరి. భాగవతములో పోతన ఇట్టి సందర్భములందు శార్దూలమత్తేభాదుల నెక్కువగా వాడుట గమనార్హము. ఆ వృత్తము లాయన చేతులలో ధీరగంభీర గమనమును నేర్చుకొని తెలుగు సారస్వతమున కాదర్శప్రాయములైనవి.

పోతన భాగవతానువాద విషయమున మనకొక సత్యజ్యోతి సాక్షాత్కరించును. అది ఏమనగా, భారత కవిత్వమువలె ఆయనది కేవల కథానువాదమును కాదు; శ్రీనాథాదుల కవిత్వము వలె భావానువాదమును కాదు. ఆయనది హృదయానువాదము. సంపూర్ణమూర్తి సందర్శనాత్మకమగు కథాశిల్పదృష్టితోపాటు ప్రతి పద్య శ్లోక సన్నిహితానువాద సమన్వితమగు ప్రతి పద శిల్పసమీక్షణమందును జాగ్రత్ దృష్టి కలిగియుండి, వీని నన్నింటిని మించిన ఒకానొక విశిష్ట సౌందర్యపరిస్ఫురణమే, అంతర్లీన భావపారవశ్యమే తన ధ్యేయముగా పెట్టుకొని పాండిత్యము కంటె పరమార్థమునకు, మూర్తి సందర్శనము కంటె స్ఫూర్తిసంస్పర్శనమునకు, మేధావిలసనము కంటె హృదయ వికాసమునకు, ఆశ్చర్యావహ ప్రజ్ఞా ప్రకటనము కంటె పారవశ్యావహ రసోదయమునకు ప్రాధాన్యమునిచ్చు రచనా పద్ధతిలో ఆయన భాగవతము ననువదించెను. అట్లని పాండిత్య మేధాశిల్పాది విశేషణముల నెవ్వరికిని తీసిపోని దారచన. కాని ప్రాముఖ్యము మాత్రము రసనిష్యందమానమగు ఆనంద బ్రహ్మస్వరూప సాక్షాత్కారమునకే. దానిని పోతన హృదయానువాద వైఖరి సాధించినది.

(ఆంధ్ర భాగవత విమర్శ)

# సత్యభామా స్వరూపము

—డాక్టర్ రాజేశ్వరి

'సత్యభామ' అను పదము శ్రవణగోచరమైనంతనే వాసెన కట్టుకట్టి చీకటింటిలో అలక పుంకరించిన యొక భామామణియో, 'సత్యభామా విధేయుడు గాక' అని భర్తను గద్దించిన యొక మదవతియో, ఏదోయొక సమయమున పొలయల్క దీర్పుటకై ప్రణమిల్లిన నాథుని 'వామపాదంబున దొలగంద్రోచిన' యొక ధూర్తనాయికయో మనకు స్ఫురించును. నిజమునకు సత్యభామ స్వరూప మది మాత్రమేకాదు. ఆ ఖండితనాయికాత్వాంశ నవరససమున్మేషమగు నామె గుణపద్మమునం దొక దళము మాత్రమే. ఆమె కరుడు గట్టిన వీరవనిత. శృంగార రసరాజ్ఞి. నేర్పరితన మామె సొమ్ము. ప్రబంధ వాఙ్మయముననే గాదు, ఆంధ్ర వాఙ్మయము నంతను తరచి చూచినను వీరత్వమున అంతటి దిట్టతనము గల స్త్రీ మూర్తి మరియొకటి కనిపించదు. సుభద్రలో మాత్ర మారేఖ కొంతకొంత భాసించును. ప్రత్యక్షముగ కదనరంగమున కత్తిని బట్టక పోయినను వీరత్వ ముట్టిపడు హృదయముతో మహాభారత యుద్ధమునకు సూత్ర ధారిణి యైనది ద్రౌపది. కాని ఆమెలోని వీరత్వము పరోక్షముగనే ప్రదర్శింప బడగా సత్యభామలో నయ్యది ప్రత్యక్షమైనది.

సత్యభామ పూర్ణరూపము వీర శృంగారముల సంగమస్థానము. ఆమె తరుణాంగుళులకు వల్లకీతంత్రుల మీటుట ఎంత కైవసమైన విద్యయో శస్త్రాస్త్ర ప్రయోగాదు లంత యలవడిన విద్యలు. సరస కర్పూర కదళికా తరుల నడుమ సాపరాధుడైన నాథుని దండించుట యందెంత సమర్థురాలో త్రిలోక పూజ్యుడగు మురళీధరుని మనసు నెరిగి వర్తించుట యం దంత నేర్పరి. కాని రానురాను కవుల దృక్పథమున ఆమె శృంగార రసదేవతగ మాత్రమే భాసించినది. దక్షిణాంధ్ర యుగము నాటికి ఆమె గర్వితగ, కుపితగ, ఖండితగ కూడ ప్రజానీకపు దృష్టిలో రూఢమైపోయినది. ఆ శృంగార రసరాజ్ఞికి ఖండిత నాయికాత్వము రమణీయతనే ఆపాదించినది. కాదనలేము-కాని అది కేవలము

కాదని నొక్కి చెప్పగలము. అద్దానిని ఎఱ్ఱన, నాచన సోమన, పోతనలు ఎత్తి చూపకపోలేదు. వారి రచనలలో సత్యభామ పూర్ణ స్వరూపము చూడతగ్గది. అందును ఆ పాత్రయందు చూపిన మెళకువలు అత్యద్భుతముగ పరాకాష్ఠకు పోయినవి.

పోతనార్యుని సత్యభామతో ఓర్పును మించిన నేర్పు, భక్తిని మించిన యుక్తి వీర శృంగారములు అందగ నేకకాలమున ప్రదర్శింపబడినవి. కాని సత్యభామ పట్ల భాగవత కృష్ణుని చర్యయే వేరు. అమె ప్రత్యక్షముగ నరకాసురునితో యుద్ధము సాగించువరకు శ్రీకృష్ణుని కామె యందున్న వీరత్వాంశ అసలే తెలియదేమో యనుపించును. ఆమె హృదయపు లోతు లెట్టివో కాని కేళీమందిరమునందు భర్తతో మాట వరుసకైనను ముచ్చటగ తన శక్తి సామర్థ్యములను చెప్పుకొని యుండలేదు.

నరకాసురునితో యుద్ధమునకై పోవుచు కృష్ణుడు తన పోకను గూర్చి యలవోకగా ప్రసంగింప సత్యభామ హృదయ ముప్పొంగును. తానుగూడ కృష్ణునితో నట కేగి తన ప్రావీణ్యమును ప్రదర్శింపవలెనని ఆమెకు చిరకాలము నుండియు కోర్కె. అద్దాని కిదే తరుణమని మురిసినది. కాని సరసురాలు భర్త కది తానై వెలిబిబడి చెప్పదు. తదింగిత మెఱిగి అతడు రమ్మని పిలువడు. పిలువనిదే ఆమె పోలేదు. అప్పటున తన నేర్పంతయు సంధించి భర్త చిత్తంబురా నతియుక్తితో "దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ ప్రావీణ్యమును చూడగోరుదు గదా ప్రాణేశ! నన్నీ వెంటన్ గొనిపొమ్ము నేడు కరుణన్" అని వినమ్రయై వేడికొనును. ఆ వేడికోలు మరుగున ధ్వనితార్థ మెంతయేని గలదు. "లోకమున - నీ మగడు వీరాధివీరుడని జనులందురు. అట్టి జగత్ప్రఖ్యాతములైన మీ శక్తి సామర్థ్యములు వారును వీరును చెప్పగా వినవలసినదే గాని అర్ధాంగినైన నాకు ప్రత్యక్షముగ చూచు యోగ్యత లేదా! చీరలిమ్మనలేదు- సొమ్ములిమ్మనలేదు. నాథుని సామర్థ్యము కన్నులార చూడ నిచ్చగింతును. అంతమాత్రపు చనువు ప్రసాదింపరాదా?" అనునది ధ్వని.

అద్దానికి కృష్ణుడు వీసమైనను వీగక వినియు విన నట్లూరకున్నాడు. సత్యభామకు గత్యంతరము దోపలేదు. మరల పైదాని కనుబంధముగ "నే జూచి

ఏతెంచి నీ దేవీసంహతికెల్ల జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్'' అన్నది. ఈ వాక్యమొక మనోహరభావ విలసితము. పదారువేల గోపికలలో, ఏడుగురు పట్టమహిషులలో, ఇంకను అచ్చటచ్చట నున్న ప్రియురాండ్రలో నే యొకరి యందైనను, నా యందు కంటె మీ కధికమైన ప్రీతి యుండవచ్చును. అది చెప్పలేక నా కడ మోమాటము చెందవచ్చును. నిజమునకు హృదయము నంటిన ప్రియురాలు మెచ్చినదే విద్యయని సంభావించుట మాన్యము. నేడు నా రాక ననుమతించినచో మీ ప్రతాపాదులు చూచి మీ హృదయము నంటిన దేవీ సంహతికెల్ల నా యంతట నేను పోయి చెప్పుకొందును. ఆ ప్రయోజనమున కైనను నా రాక ననుమతింపరాదా యని భావము. అయ్యది సత్యభామ నేర్పులో వివక్షితాన్య పరవాచ్యమై భాసించినది.

అపుడైనను కృష్ణుడు రమ్మనడు సరికదా, అసమ్మతినే వెలిబుచ్చుచు యుద్ధమున- 'వాయునిర్గత పద్మవనరేణువులు గావు, తురగ రేఖా ముఖోద్ధూత రజములు గాని, ఆకీర్ణ జలతరంగాసారములు గావు, శత్రు ధనుర్ముక్త సాయక ములు గాని; కలహంస సారసకాసారములు గావు: దనుజేంద్ర సైన్య కదంబక ములు గాని; అని ఏమియో చెప్పుచు ఆ యుద్ధమైనను సామాన్యులతో గాదు దానవులతో సుమా ! అబలవు. నీ వేడ, రణరంగమేడ? అని వలదు వలదనును. ఆ దిగజారు మాటలకు సత్యభామ ఉప్పొంగు తన ఉత్సాహమును జారనీయ లేదు. దైత్య సమూహముతోడి యుద్ధమని గదా నన్నితడు భయపెట్టున దను కొని మరికొంత నేర్పుతో 'దానవులైన నేమి, మరి దైత్య సమూహము లైననేమి, నీ మానిత దివ్యబాహువుల మాటున నుండగ నేమి శంక' యనినది. ఈ యుక్తికి ప్రత్యుక్తి లేదు. 'నీ వుండగా నాకేమి శంక' యని సత్యభామ యనునపుడు 'నే నున్నను నీకు భయమే. రావల'దని కృష్ణు డనలేడు. ఆయనే గాదు మగదని పించుకొన్న ఏ మగవాడును అట్లనడు. ఆ సందర్భ మట్టిది. ఆ సందిగ్ధావస్థలో కృష్ణుడు తడబడుచుండ సత్యభామ వెంటనే 'కరతోయజములు ముకుళించి మ్రొక్కి- అంజలి పీడకయే వినమ్రయై భర్తను చూచినది. ఆ చూపుకోని భక్తి, వినయ సంపద భర్తృహృదయము నేదియో కలచివైచినది. భార్యయైన నేమి, భక్తులైన నేమి, ఆ భక్తి వినయములకు కట్టుబడవలసినదే శృంగారమునకు చలింపకున్న అరసికత్వమే ద్యోతితమగును గాని భక్తి కరుణలకు కరుగకున్న మానవత్వము నకే కాదు- దేవత్వమునకును లోపమే. ఆ కీలక మెరిగిన పోతన కృష్ణునిచే

తరుణ మెకిగి 'సరే' యనిపించినాడు. కదనరంగ ప్రవేశమునకు ముందు పోతన చిత్రించిన సత్యభామ నేర్పట్టిది.

ఆ సందర్భమున ఎఱ్ఱాప్రెగ్గడ నాచనసోమనల పోకడలే వేరు. వారి రచనలలో యుద్ధాత్పూర్వము సత్యభామకు కృష్ణునితో వాగ్వాదమే లేదు. కృష్ణుడామె శక్తులను బాగుగ నెరిగినవాడు. అంతియెకాదు, తనకు యుద్ధమున చేదోడు వాదోడుగా నుండుటకే సత్యభామను వెంట నిడుకొని పోయెనేమో' ననిపించును.

భాగవతమున కృష్ణుడు సత్యభామతో గూడ గరుడారూఢుడై ప్రాగ్జ్యోతిష ప్రాక్ప్రాంతము చేరి యుద్ధమునకు గడంగ రణప్రావీణ్యధన్య సత్యభామలేచి కుంభద్వీరసంరంభయై పాణిం బయ్యెద చక్కగా దురిమి సంఘటిత నీవీబంధయై తన ప్రాణేశాగ్రభాగంబున నిలచినదట. భర్త లేచి నిలువబడ, భార్య బహుమాన పురస్సరముగ లేచి నిలబడుట మర్యాద. అద్దానిని పాటించుటకు కాబోలు సత్యభామ నిలచిన దనుకొనినాడు శ్రీకృష్ణుడు. కాని యంతతో నామె యూరకొని యుండలేదు. యదువంశమౌళి చేతిలోని విండిని నెమ్మదిగ స్పృశించినది. విల్లంబులను చూచినంత మాత్రమున పోయినదేమి యనునట్లు కృష్ణుడామె కందించి నాడు. ఆ విల్లందిన తోడనే ఆమెలో నూత్నశక్తి మెరసినది. ఆహవసంరంభోత్సాహినియై వరుని యండగా పరుని చూచినది. వ్యవధాన మీయలేదు. అగణ్యానంతతేజోవిశేషావిర్భూత ప్రతాపముతో వీరాలోకదుర్లోకయై దైత్యసంఘము నిర్వీర్యమగునట్లు బాణప్రయోగోప సంహరణాద్యాయుధ విద్య లన్నియును యథాక్రమముగ సంధించినది. శత్రుధనుర్ముక్తనారాచ మర్దన సమ్మానితయై ఆమె నేర్పుమీర గుణము సారింప ఆ జ్యావల్లీ ధ్వని గర్జనముగ, విల్లు ఇంద్ర శరాసనముగ, సరోజాక్షుడు మేఘముగ తాను విద్యుల్లతగ భాసించెనట. అప్పుడు వీరత్వముచే వింత చెలువము నందిన ఆమె చక్కదనము ద్విగుణీకృతమైనదట.

కృష్ణుడు ఆ ప్రావీణ్యమునకు ఆశ్చర్యచకితుడై ఎదుట వీరాగ్రణి రౌద్ర రూపమును చూచును. తక్షణమే ఆ శృంగారవనములో చక్కగా తీర్చిన చంద్ర కాంత శిలామయ వేదిక కడ నిర్భరకౌతూహలముతో ముద్దులు గురియు సాత్రాజితిని తలచుకొనును. "లజ్జావలోకమ్ముతో వలయాకార ధనుర్విముక్త విశిఖ వ్రాతాహతారాతియై హేలాగతిని'' పోరు వనితను చూచుచు పుష్పాచయ మొన

రించుచు లే గొనసియాడ, లలాటరేఖ చెమరింప నలసి తొలగిపోవు అలివేణిని తలచుకొనును. కౌస్తుభమణిహారుడు తన్ను తానె మరచి, వీణె చక్కగ బట్టు వెరవెరుగని అతివ బాణాసనము నెట్లు బట్టినదో, చిలుకకే పద్యము జెప్పుచు అలసిపోవు అలివేణి అస్త్రమంత్రము లెన్న దభ్యసించినదో, సరవి ముత్యములను గూర్పజాలని తరుణి ఏ నిపుణత సంధించినదో నిశితశరములని వితర్కించుకొనినాడు. యుద్ధరంగమున శత్రువునకు ఆమె చేలాంచలము ఘనధూమకేతువుగను, బాణవృష్టి మహారోషదాయిగను భాసింప, కృష్ణున కవి కందర్పకేతువై హర్షదాయియై యొప్పినవట. నిజాంగన ప్రావీణ్యము హృదయంగమమై యొప్ప కృష్ణుడు రసావలోకనముతో సరసముగ సత్యను జేరి "కొమ్మా! దానవనాథుని కొమ్ము ఆహవమునకు దొలగినది ఇచ్చెద దిగ్విజయము. గైకొమ్మా!" అని యక్కళావిలాసినీ హస్తగత బాణాసనము నందుకొనుచు మెచ్చితి ననునట్లు నిండు మనముతో చూచినాడు. "నే ధన్యనైతి" నన్నట్లు సత్యభామ సరసాలోకనముతోనే మ్రొక్కినది.

ఇది పోతనామాత్యుడు చిత్రించిన సత్యభామ. వినయమునకు లోపము రాని కార్యదీక్ష, శృంగారమునకు భంగము లేని వీరత్వము, వీసము వీగకుండ సముస్థాయిలో నడిపినాడు. ఇం దంగిరసము వీరమే కాని యంతకు తక్కువ కాని జాజ్జ్వల్యమానశోభతో శృంగార మంతర్వాహినియై ప్రవహించినది. కావుననే సత్యభామ పూర్ణరూపము ప్రత్యక్షీకరింపబడినది.

ఎఱ్ఱనార్యుని హరివంశములో నరకాసురుని బాణమాత్రము తన ఫాల భాగమున సోక, కృష్ణుడు మూర్ఛపోవును. సత్యభామ పరిచర్య చేయగా తేరుకొని వనితను తానె రణమునకు పురికొల్పెను. సత్యావధూటి ఆహవకేళి నరకునకు ఆసన్నమరణ వీరణము కాగా కృష్ణుడు నిజాంగన చాతుర్యమునకు మది మెచ్చి పెల్లుబుకు ప్రీతితో సమరస్వేదజలోజ్జ్వలంబైన యా యుగ్మలి ఫాల భాగము తుడిచి, 'అలసితివి వింటిని' మ్మనుచు చారులోచనను సాభిలాషగ చూచును. ఎద్దానిని రుక్మిణి సేవించి కైవస మొనర్చుకొనలేకపోయినదో, దేనికై పదారువేల గోపికామణులు మోహవిభ్రాంతలై ఆర్తిపడిరో, ఎద్దానిని జాంబవతి రతికళా మందిరములో వాంఛించి పొందలేక భ్రమసిపోయినదో ఆ మహత్తర తేజోమయానురాగకిరణము క్షణమాత్రము ఆమెపై సోకినదట. ఈ కడపటి భావవ్యక్తీకరణ

మొక్కటి చాలును శంభుదాసుని భావౌన్నత్యము నెరిగికొనుటకు. ఇప్పట్టున నాచనసోమన కీయౌదార్యము అబ్బియుండలేదు. సరికదా ఆ మహత్తరతరుణము నాతడు ఆభరణములతోనే సరిపెట్టుకొనినాడు. ఈ సందర్భమున పోతనయు ఆభరణ ప్రస్తావము కావింపకపోలేదు. కాని "మెచ్చితి నిచ్చెద గురువిజయము" అను విజయధ్వనిలో 'కోరిన యాభరణము' అను మాట వాచ్యసిద్ధ్యంగమగుట, ప్రాధాన్యము గురువిజయమునకే యబ్బినది. అది కొంతలో కొంత నయము:

సత్యభామకు సంబంధించినంత వరకు తక్కిన కథా కథనములో సోమనార్యుడు ఎఱ్ఱన కంతేవాసియైనాడు. ఎఱ్ఱన కృతిలో కృష్ణుడు మూర్ఛదేరి "సముచితోత్సాహ సాహసిక విభాసిని"యగు నా భామినిని జూచి "ఏను పరిపీడితుండనై దస్సితి నొక్కింత నీవు కయ్యంపుమోపు మోవు" మనినాడు. సోమన మూర్ఛదేరిన కృష్ణునిచే "చంద్రవదన! శార్ఙమిందె నీవు సమరంబె కోరుదు వవసరంబువచ్చె" నని యనిపించెను. ఈ నుడిలో అతఃపూర్వము సత్యభామ పవరము సేయవచ్చెద ననుటయు కృష్ణుడు ఎప్పటి కప్పుడే ఉపేక్షించుచువచ్చి నేడు సమయము వచ్చినది కావున భారము వహింపుమనుటయు జరిగినట్లు తోచును.

ఎఱ్ఱన సోమనలవలె సత్యభామ పాత్రను పోషించుట మాత్రమే కాక పోతన స్వతంత్రుడై చిత్రించినాడు. కాని ఒక గ్రంథము యొక్క ఛాయ ఎంత కాదనుకొన్నను తరువాతి దానిపై కొంత కొంత సోకకపోదు. అట్టివి ఒకటి రెండు సోమన పోతనల నడుమ కాననగును.

**సోమన :**

అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములందందంద మందారకే
సరమాలామకరంద బిందుసలిల స్యందంబు లందంబులై
తొరుగం బయ్యెదకొంగొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృత పూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

**పోతన :**

పరుఁ జూచున్ వరుఁజూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్

జరగం గన్నులం గెంపు సొంపుం బరంగం జంద్రాస్త్రసందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.

పై వానిలో అరిహరుడు పరవరులుగా మారిరి.

**పోతన :**

తంత్రీవినోదంబు తడవు సేయని వ్రేళ్ల
గొనయంబు తెగలపైం గోరుకొనుట
యద్దంబుపిడిముట్టి నలయు పాణితలంబు
లస్త్రకం బిఱియించు లావు కలిమి
చెలికత్తె నొత్తిలి చీరలేని యెలుంగు
సింహనాదంబుచేం జెదరకునికి
ప్రమద నర్తనకేళిం బరిథవింప పదం
బైదు ఠాణంబుల నలంతం బడమి

సోయగపుం జిత్రరూపంబుం జూచుచోట
వేసరు విలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపు గెలుపు
గైకొనిదె సత్యభామ సంగ్రామసీమ.

ఈ పద్యభావమునే పోతన తనివితీర చక్కని రెండు సీసములలో గుప్తము గావించుకొనినాడు.

బొమ్మ పెండ్లిండ్లకుం బోవ నొల్లని బాల
రణరంగమున కెట్లు రాందలంచె !
మగవారిం గనినం దా మఱుగుం జేరెడి యింతి
పగవారి గెల్వనే పగిదిం జూచెం !
బసింది యుయ్యేలలెక్క భయమందు భీరువు
ఖగపతి స్కంధ మే కడింది నెక్కె !
సఖుల కోలాహల స్వనము లోర్వని కన్య
పటహభాంకృతుల కెట్లుంగి నోర్చె !

నీల కంఠములకు నృత్యంబుఁ గరపుచు
నలసి తలఁగిపోవు నలరుఁ బోఁడి.
యే విధమున నుండె నెలమి నాలీఢాది
మానములను రిపుల మాన మడఁప!

వీణెఁ జక్కఁగఁ బట్ట వెరవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు పట్టనేర్చె!
మ్రాఁకునఁ దీఁగెఁ గూర్పంగ నేరని తేమ
గుణము నే క్రియ ధనుఃకోటి గూర్చె!
సరవి ముత్యముఁ గ్రుచ్చఁజాలని యబల యే
నిపుణత సంధించె నిశితశరముఁ!
జిలుకకుఁ బద్యంబు చెప్పనేరని తన్వి
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించె!

పలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ
చారుసత్యభామ సత్యభామ.

సోమన పద్యములో సత్యభామ కఠోరములకెట్లోర్చెనో యను భావమును పోతన పద్యములలో నెట్లు నేర్చెనో యను భావమును ద్యోతితములు. ఇక మిగిలిన భాగమున ఎవరి తీరు వారిదే. ఒకరి వాట మింకొకరికి రాలేదు. అందుకు పాత్రపోషణ చిత్రణాదుల పట్ల నాయా కవులకు గల భిన్నదృక్పథములే కారణములు. ఆ దృక్పథముల కాధారము వారి యాత్మీయత.

ఎఱ్ఱనార్యుని కవిత్వము సత్యనిష్ఠము ఆది సంయమన మెరిగిన సహృదయ హృదయాహ్లాదకారి యగును కాని బాహిరమగు నింద్రియోద్రేకమును కలుగజేయదు. సోమనలో రజోగుణస్పర్శ యధికము. పాండిత్య ప్రకర్షతోపాటు కౌతుకమును కడదాక ప్రదర్శించినాడు. ఎఱ్ఱన-

విల్లుం గేతువుఁ ద్రుంచి రథ్యముల నుర్విం గూల్చి సూతున్ వెసం
ద్రెళ్ళంజేయఁగ హీనసార్థతమెయిన్ దీనత్వ మల్లొందియున్
భల్లంబుల్ నిగిడింప రాక్షసుఁడు చాపంబొండు గైకొన్న న
వ్విల్లున్ నుగ్గుగఁ జేసె నా క్షణమ దేవీరత్న ముగ్రోద్ధతిన్.

అని సత్యభామ నరకాసురునితో చేయు యుద్ధమును సామాన్యముగ వర్ణింప సోమన "అరిఁజూచున్ హరిఁజూచు" అని చమత్కారావహముగా వర్ణించినాడు.

ఎఱ్ఱన సంయమనము గల కవిసత్తముడు. సోమన లౌక్యము నెరిగిన నాగరికుడు. కావుననే ఎఱ్ఱన కృష్ణుడు తన దేవితో నైక్యమునంద సోమన కృష్ణుడు కాన్కను మాత్రమే ఈయఁగల్గినాడు. రాచమర్యాదలు, ద్యూతక్రీడలు, నర్మగర్భోక్తులు, యుద్ధవర్ణనలు సోమన రచనలో చెక్కిన చెణుకులు. జాన పదుల యుదంతమన్నను ఎఱ్ఱనకు వెట్టి యభిమానము. గోకులబృందావన వర్ణనములలో ఎఱ్ఱనకు గల పల్లీజన జీవిత వేదిత్వము తేటపడును. ఎఱ్ఱన హృదయము సోమన వలె షోడశసహస్రమహిషీ పరివృతుడగు వన్నెల కృష్ణుని వైపు గాక నవనీత చోరుడగు నందగోపాలునివైపే మ్రొగ్గినది.

ఇక పోతనామాత్యుడు కృష్ణలీలలో తేలియాడి తన జీవితమే కృష్ణార్పితము గావించుకొనినాడు. సాధారణముగ హలమును బట్టిన చేయి కలమును బట్టుటరుదు. పోతన చేయి హలమునకు విశ్రాంతి నిచ్చుచు కలమును బట్టినది. ఇంకొక మాట- రాజసభాంగణములలో, వారకామినీ సంగతములైన కవివరేణ్యుల గంటములలో, శిష్టకవుల కనుపాపలలో నాట్యమాడు వాణి రాచనగరు పొలిమేరల కావల తరివోని పంటకేదారముల నడుమ ఇచ్చుకొనుటయేగాని తెచ్చుకొనుట యెరుగని పోతన మ్రోల కన్నీరిడినది. అది హాలికులకే కాదు; యావద్భారతీయులకును గర్వకారణమే.

పోతన సత్యభామ పాత్రకడ విలక్షణ మార్గము నవలంబించినాడు. అది సత్యభామ యదృష్టమే కానోపు. మొత్తముపై పోతనార్యుని తత్త్వమునకు చేపట్టిన గ్రంథమునకు నేకవాక్యత కుదిరి ఆంధ్ర ప్రజానీకమునకు అవిచ్ఛిన్నమగు కృష్ణ కథామృతధార కురిసినది.

(భారతి, మే 1958)



# పోతనార్యుని కథాకథన శిల్పము

—డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి

ఈ శీర్షిక యందు మూడు కథలు పరిశీలింపబడుచున్నవి. అవి పరీక్షిత్తు శాపము, గజేంద్ర మోక్షణము, ప్రహ్లాద చరిత్రము.

**పరీక్షిత్తు శాపము :**

పరీక్షిత్తు వేటాడి దగగొని శమీకముని యాశ్రమమునకు బోయి సమాధి గతుడైన యా మునిని జలమర్థించెను. ముని మాఱుమాటాడకునికి మృతోరగమును నంసమున వైచి వెడలిపోయెను. అది మునిబాలకులు చూచి శృంగితో జెప్పిరి. శృంగి కోపించి తక్షకవిషాగ్నిచే రాజేడవనాడు చచ్చునని శాపమిడెను. తరువాత తండ్రి దగ్గఱ నేడ్వగా శమీకుడు సమాధి చాలించి కుమారుని వలన విషయమెఱిగి రాజునకు శాపవృత్తాంతము కబురువెట్టినాడు.

ఈ కథలో ప్రధానాంశము శృంగి శాపమిడుట. బాలురు చెప్పినంతనే శృంగి కోపించి కౌశికీనదికి పోయి శాపము పెట్టినాడు. రాజు తండ్రిపై నురగమును వైచినాడని విన్నంతనే మఱియొకడైనచో నేమి చేయును? త్వరగా తండ్రి కడకు వచ్చి చూచును గదా! శృంగి యట్లు చేయక నదికి పోయినాడు. అతని కోపస్వభావ మట్టిది.. అతని స్వభావ మతని పేరే సూచించుచున్నది. మూల గ్రంథమునం దీపేరు లేదు. వ్యాఖ్యానమునం దున్నది. ఈతని స్వభావమునకు తో డతడు బాలుడగుట, తేజస్వి యగుట– కావుననే యీ వృత్తాంత మిట్లు నడచుటకు కీలకము శృంగి స్వభావము. పోతనగారితని కొక్క యుపమానము వేసి కథనంతయు దీపింపజేసినాడు.

మూలమున 'తస్య పుత్రోఽతి తేజస్వీ విహరన్బాలకోఽర్భకైః' యని గలదు. కథను దీపింపజేయుట కిది చాలును. రాజు వచ్చినప్పు డచ్చట శృంగి లేడనుటకు 'విహరన్నర్భకైః'. యన్నది చాలును. శాప మిడుటకు 'అతి తేజస్వి'.

యన్నది చాలును. ఈ రెండు విశేషణములకు 'బాలకః' యను విశేష్యము సమానము. మూలము శాపము ఋషికుమారుని తేజస్వితాప్రయుక్తమని నిర్ధరించినది. అందువలననే-

> 'కృష్ణే గతే భగవతి శాస్తర్యుత్పథగామినాం
> తద్భిన్నసేతూ నద్యాహం శాస్మి పశ్యత మే బలమ్'

(దుర్మార్గులకు శాసకుడైన శ్రీకృష్ణుడు పరమపదమునకు చనగా వీ రాగడము చేయుచున్నారు. ఇపుడు వీరిని నేను శిక్షింతును. నా బలము చూడుడు.) అని యాతడనును. శ్రీకృష్ణుడు లేని లోటును దాను పూరించునట. ఇది వాని లక్షణము. పోతనగారు శృంగియం దీలక్షణములను దీసివేసినాడు. అత డెంత తేజస్వియైనను ఋషిబాలకుడు. స్వభావముచే సాధులక్షణములు గలవాడు. తన్ను బరమేశ్వరునితో సమానముగా చేసికొనుట పోతనగారికి నచ్చలేదు. సరి గదా మచ్చగా కన్పించినది. ఈ శాపకారము నిర్వహించుటకు వానియం దింత యహంకారము పెట్టనక్కఱలేదు: వాని బాలస్వభావమునకుతోడు వాని పేరును వ్యాఖ్యానించిన జాలుననుకొన్నాడు శాప మిచ్చుటకు దగిన శక్తి వానికున్నదని వేఱుగా జెప్పనక్కఱలేదు. అతడు శమీకుని పుత్రుడగుటయే చాలును. అందుచేత పోతనగారు మూలమునందలి యతి తేజస్వితను జెప్పక పూర్వోక్త శ్లోకమునందలి వాని నామధేయములను వ్యాకరించుటకొక్క యుత్ప్రేక్ష వాడినాడు- 'అని పలికిన సమానవయోరూపమునికుమారలీలాసంగి యైన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరియించునట్లు విజృంభించి'- యన్నాడు. పూర్వోక్త శ్లోకమునకు 'బాలకులార! ధరిత్రీపాలకు శపియింతుననుచు బలువిడిని విలోలాలకుఁడగు ముని కుంజరబాలకు డరిగెం ద్రిలోకపాలకు లదరన్' అని వ్రాసినాడు. 'విలోలాలకు' డనుటచే వాని కోపతీవ్రత, 'త్రిలోకపాలకు లదరన్' అనుటచే వాని తేజస్వితా ధ్వనించుచున్నవి. ఇట్లు వాని స్వభావమును దీర్చి దీని నాధారముగా చేసి యీ కథాకథనములో సొగసులు తెచ్చినాడు. రాజు వచ్చి దాహమడిగిన సందర్భమున మూలమున నిట్లున్నది- 'విశుష్యత్తాలు రుదకం తథాభూత మయాచత'. ఇచ్చట నొక చిన్న ప్రశ్న. శృంగిరోదనము విని శమీక ముని సమాధి చాలించెను గదా! పరీక్షిత్తు మాట లతని కెందుకు విన్పింపలేదు? దీనికి సమాధానము మూలమున వాచ్యముగా లేదు. పోతనగారు 'ఎండి తడిలేక

కుత్తుక యెలుగు డింద మందభాషల నిట్లను మనుజవిభుడు' అని తెలుగుచేసి నాడు. ఇది పోతనగారు సందర్భమునకు జేసిన వ్యాఖ్యానము. 'విజస్యత్త్రాలు' అన్న మూలమునందలి విశేషణములలోని గంభీరభావమిదియే. రాజు మందముగా మాట్లాడినాడు గావున సమాధి భంగముకా లేదు. శృంగి 'యెలుగెత్తి యేడ్చుట' వలన సమాధి భంగమైనది.

శృంగి యట్టి శాపమును బెట్టనేల? యని మఱియొక ప్రశ్న. మూలమున 'ఇతో లంఘిత మర్యాదం తక్షక స్సప్తమేఽహని' ఇత్యాదిగా శాపప్రకారము చెప్పబడినది. అట్టి శాప మిచ్చుటకు రాజుయొక్క మర్యాదా లంఘనము హేతువు. కాని శృంగి శాపమిడినది. మర్యాదా లంఘనదోషమునకైనచో శాప ప్రకార మట్లుండనేల? పోతనగారు మర్యాదాలంఘనమును హేతువును జేయక లంఘనప్రకారమును హేతువును జేసినారు. 'ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాఱుమాటాడకయున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మదక్రీడఁ జరించు రాజు' అని ప్రకారము వివరించినారు.

పోతనగారు చేసిన మఱియొక మార్పు శమీకుడు సమాధి చాలించిన తరువాత 'పుత్రం పప్రచ్ఛ వత్స కస్మాద్ధి రోదిషి? కేనవాతే విప్రకృత మిత్యుక్తస్స న్యవేదయత్'. నాయనా! ఎందులకేడ్తువు? నిన్నెవరేమి చేసిరని ప్రశ్నించె నని మూలమునందున్నది. ఇది చాల సహజమైన ప్రశ్న. పిల్లవా డేడ్చుచు రాగా నేతండ్రి యైన నడుగుప్రశ్న యంతియే. కాని పోతనగారు దీనిని మార్చి-

ఏ కీడు నాచరింపము
లోకులకున్ మనము సర్వలోకసములమున్
శోకింపనేల పుత్రక ?
కాకోదర మేలవచ్చె కంఠంబునకున్ ?

మూలమునందలి ప్రశ్నకిది తల్క్రిందు. పుత్రుని రోదనమునకు కారణ మెవరో యేమో చేసియుందురనుకొనుట శమీకుని ప్రశ్న వెనుకనున్న మనస్థితి. తెనుగు సేతయందు నెవరు నేమి చేసి యుండకూడదు. మనకెవరు నపకారులు లేరన్నది ప్రశ్న మూలమైన మనస్థితి. శమీకుడు సమాధ్యవస్థ నుండి లేచినాడు. 'సమే బ్రహ్మణి ఆధీయతే మనః ఇతి సమాధిః' ఈ సమభావము నుండి పుట్టు

ప్రశ్న రూపమెట్లుండును ? సామాన్య గృహస్థుల ప్రశ్నవలె నుండునా ? ఇట్టి మనస్థ్సితి యీ సమలక్షణము శమీకుని మహర్షి లక్షణము ముందు కథ నడుపును. ఈ ప్రశ్నలోనే కుమారుని తప్పిద మెఱుగక యెఱిగిన లక్షణము వానిని మందలించు లక్షణము ధ్వనించుచు శమీకమహర్షి యొక్క సాధుస్వభావమును ద్వంద్వ సహిష్ణుతా గుణమును ధ్వనించుచున్నది. 'సాధూనామర్థం వాగను వర్తతే' ఆ జరిగినదాని కనుగుణమైన ప్రశ్న. 'వాచ మర్థోనుధావతి' కి నిచ్చట ప్రసక్తిలేదు. ఒక జరుగరాని కీడు లోకమునకు జరుగబోవుచుండగా నాసంగతి నెఱుగకయే హృదయము పరితాపపడుట సాధులక్షణము. ఉత్తమ ప్రకృతి లక్షణము. పరమేశ్వరాస్తిత్వ స్థాపకమైన లక్షణము. ఉత్తరకథ యందలి శమీకుని యుదార ప్రవర్తనమున కిది చూళిక పట్టుట. ఈ పద్యమిట్లు వ్రాయుట పోతనగారి కథన శిల్పమందలి యనర్ఘ రత్నము. ఆయన మహానుభావత్వమునకు నిదర్శనము.

కథకు పోతనగారు చేసిన మఱియొక రమణీయాలంకారము బాలురు వచ్చి శృంగికి రాజాపరాధము చెప్పుట. మూలమున 'అర్భకైః రాజ్ఞాఘం ప్రాపితం తాతం శ్రుత్వా' యని యున్నది. పోతనగారు-

నరగంధ గజస్యందన
తురగంబుల నేలు రాజు తోయాతురుఁడై
పరగున్ నీ జనకుని మెడ
కురగముఁ దగిలించిపోయె నోదక తండ్రీ !

యని చెప్పిరని వ్రాసినారు. రాజనగా బాలుర దృష్టి యెట్లుండునో యీ పద్య మందు మనకు తెలియగలదు. ఈ పద్య మిట్లు వ్రాయుట పోతనగారి మానవ స్వభావ పరిజ్ఞాతృత్వమునకు నిదర్శనము.

ఇంతకు నిట్టి యపరాధియైన రాజెవ్వరో బాలురకు గాని, శృంగికి గాని తెలియదు. మఱి శమీకుడు పరీక్షిత్తునకు కబురంపనేల ? మూలమునందు దీనికి సమాధానమును నాలోచనమీద కుదుర్చుకొనవలెను. పోతనగారు 'శపించు టయును వినిపించిన నమ్మౌని తన దివ్య జ్ఞానంబున నమ్మానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుండని యెఱింగి' యని వ్రాసినారు. ఈ సమాధానము మూలమున

ననుమేయము. ఒక మహాగ్రంథమును దెనుగుసేయుట యనఁగా నందలి సర్వ విషయములను జక్కఁగా భావించి శంకాస్థానముల నన్నింటిని నుత్తరించుచు వ్రాయుటగాని తోచినట్లు వ్రాయుట కాదు. పోతనగారు చక్కఁగా భావించి యుపపత్తిమంతముగా కథ వ్రాయుననుట కింతకంటె నిదర్శనమేమి వలయును?

గజేంద్ర మోక్షణము :

అష్టమ స్కంధమున వర్ణితమైన దీశాను చరిత్రము. అవతారముల నను వర్తించు భగవద్భక్తుల సత్కథల నీశాను చరితములందురు. ఈ గజేంద్ర మోక్షణము తురీయమన్వంతరము నందలిది.

ఇంద్రద్యుమ్న మహారాజు మలయాచలమునం దాశ్రమము నిర్మించుకొని హరి పూజనము సేయుచు నచ్చటికి నభ్యాగతుడై వచ్చిన యగస్త్య మహర్షికి ప్రత్యుత్థానాదికము సేయకునికి నవమానితుడైన ఋషి ఆతనికి కౌంజరయోని బుట్టుమని శాపమిచ్చెను.

హూహూ నామ గంధర్వుడు దేవలుడు స్నానార్థమై యరుగుదేర సరసిలో జలక్రీడాసక్తుడై యుండి యాతని పాదములు మకరివలె పట్టుకొని యతనిచే గ్రాహము కమ్మని శాపము నొందెను. అతడు గ్రాహమై త్రికూటాచల మందలి సరస్సున నుండి తృషార్తితుడై వచ్చిన గజరాజును పట్టుకొనెను. కరి మకరము లొక సహస్రవర్షములు పోరు సాగినది. కరిరాజునకు బలము తగ్గి జన్మాంత రీయకమైన పుణ్య విశేషమున స్మృతి లబ్ధమై పరమేశ్వర స్తుతి సేయ హరి గరుడవాహనారూఢుడై వచ్చి సగ్రాహముగా గజేంద్రుని సరస్సునుండి పైకి లాగి యుభయులకు శాపమోక్షణ మిచ్చి రక్షించెను.

ఈ కథను పోతనగారు 184 పద్యములలో బాగుగా పెంచి వ్రాసినారు. ఆయనకు మిక్కిలి ప్రియమైన కథలలో నిది యొకటి. తెలుగుదేశమున విశేష ప్రచారము నందున్న భాగవత కథలలో దీని కగ్రస్థానము. దీనికి కారణమేమి? పోతనగారి 'జీవవేదన' ఈ కథ యందు తక్కిన కథల యందు కంటె నెక్కు డుగా ప్రతిబింబించుటయే. పోతనగా రన్ని కథలను వ్రాసిన తీరు వేఱు. దీనిని వ్రాసిన తీరు వేఱు. పోతనగారి కీ కథయందింత యాప్యాయత యుండుటకు,

తెనుగుదేశము నందిది విశేష ప్రచారము నందుటకు నీ కథ సామాన్య సాంసారికుడైన జీవుని పరిస్థితికి చేరువగా నుండి వారికి తెలిసిగాని, తెలియకగాని వారి జీవ సంపుటియందున్న మోక్షేచ్ఛ నుత్కటముగా ప్రతిపాదించుటయే కారణము. అవిద్యాపాశములందు చిక్కుకొని సంసార గర్తమందు పుక్కిలిబందిగా మునిగి యుక్కిరిబిక్కిరగుచు దరిజేరుటకై జీవుడు సేయు యాత్రోశమునకు గజేంద్రుని పాటు ప్రతీక. గజేంద్రుని మొఱ సర్వ జీవకోటి నిరంతరము సేయుచున్న మొఱ. గజేంద్రుడు జీవకోటికి ప్రతినిధి. పోతనగారు గజేంద్రుని కథ యందు చూచిన పరమార్థమిది. ఇచ్చటనుండి యీ కథా రచనము నాయన తీర్చినాడు. ఈ పరమార్థమును కథా మధ్యమున నిక్షేపించుటచేత పోతనగారి నిర్మాణచతురత తెలియదగును. ఈ కథ యందలి 184 పద్యములలో సరిగా 67వ పద్యమున నీ పరమార్థమును పోతనగారు నిక్షేపించినాడు.

ఊహ కలంగి జీవనపు టోలమునందఱి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధపదమున్ విడిపించుకొనంగలేక సం
దేహము పొందు దేహక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్రశల్యమై.

ఈ యుపమాలంకారము కేవల మీ పద్యమునకే పరిమితము కాదు. ఈ సాదృశ్యము కథయం దంతర్వాహిని యని చెప్పుట కిట నీ యుపమను ప్రకటించినాడు పోతనగారు. ఇది మహా ప్రతిభావంతమైన కథారచనాశిల్పము. ఈ సాదృశ్యమును బట్టి జీవలక్షణము వివృతమగును.

ప్రవృత్తిమయముగా నడచు జీవుని జీవలక్షణమును బయలు చూపించుటకు గజేంద్రుని విహారము వర్ణించిన తరువాత పోతనగారు కాసారమును గుఱించి యొక పద్యమును వ్రాసెను. ఈ పద్యము లోపలికి దిగనంతవరకు మకరము పట్టనంతవరకు సంసార సుఖలక్షణ మెట్లుండునో ధ్వనించును-

తోయజగంధమ్ము దోగిన చల్లని
మెల్లని గాడ్పుల మేను లమరఁ
గమలనాళాహార విమల వాక్కలహంస
రవములు సెవుల పండువులు సేయ

పుల్లదిందీవరాంభోరుహామోదంబు
    ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతా సారంబు
    వదనగహ్వరముల వాడు దీర్ప
త్రిజగదభినవ సౌభాగ్య దీప్తమైన
విభవ మీక్షణములకును విందుసేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములను
మఱచి మత్తేభయూథంబు మడుగు సొచ్చె.

మదపుటేనుగులకు కాసారాకర్షణము పంచేంద్రియ ప్రీతికరము. ప్రవృత్తి మార్గపతితులకు సంసారము పంచేంద్రియ ప్రీతిమాత్ర జనకము. వాని కాజ్ఞానము, వీరి కీ జ్ఞానము లేదు. అవి కాసారమందు నింద్రియాకృష్టములై పడినవి. వీరు నట్లే సంసారమందు పడిరి.

తరువాత మకరము గజేంద్రుని బట్టుకొన్నది. ఈ సందర్భమున గూడ పోతనగా రుపమనే వాడినాడు. 'భానుఁగబళించి పట్టు స్వర్భానుపగిది నొక్క మకరేంద్రుం డిభరాజు నొడిసిపట్టె' నట. ఇచ్చట నీ యుపమాన మేమి చేయుచున్నది? ఈ యుపమానము వేదాంత శాస్త్రము నందలిది. "రాహుగ్రస్త దివాకరేందుసదృశో మాయాసమాచ్ఛాదనాత్ - సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్" అని శంకరభగవత్పాదులు. ఈ యుపమానము మాయాసమాక్రాంత జీవలక్షణమును జెప్పునట్టిది. ఈ మకర మవిద్యకు ప్రతియనుటకు మఱియొకచోట- "ఇట్లు విస్మితచక్ర చక్రంబయి నిర్వక్రవిక్రమంబున నచ్ఛహృదయజ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునం బోలె నంతకంతకు నుత్సాహకలహ సన్నాహ బహువిధ జలవగాహంబయిన గ్రాహంబు మహాసాహసంబున" నని మరల నుపమానమునే పోతనగారు స్వీకరించినాడు.

ఈ రెండుపమానముల నిట్లుపయోగించి యంతట నూరకొన్నచో పోతనగారు సామాన్యకవియే యగును. కాని యాయన యట్లూరకుండువాడు గాదు. ఈ రెంటికి గజేంద్రుని మోక్షణమైన తరువాత నుపసంహార మెట్లు చెప్పినాడో చిత్తగింపుడు—

తమముం బాసిన రోహిణీవిభు క్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తునిగతిన్ గ్రాహంబు పెట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీకరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుఁడై.

మరల నవియే యారెండే యుపమలు. ఇట్టుపమలు వాడి సాదృశ్య ముఖమున జీవుని యార్తి స్వరూపమును, బంధమోక్షణములను విచిత్రముగా ధ్వనింప జేయుచు నీ కథను రమణీయ శిల్పాభిరామముగా పోతనగారు రచించినాడు.

ఇది రెండు మొక్కల కంటు కట్టుట వంటిది. నేలమీది మొక్కకు చెట్టు కొమ్మ యంటు కట్టితిమి. ఆ నేలమీది మొక్క యేపుగా నున్నంత వరకు నీ యంటు కట్టిన కొమ్మయాకులు మొక్కయాకులలో నణగి మణగి యచ్చట నొకటి యిచ్చటనొకటి కన్పించునట్లంతర్గతమైన జీవుని వేదన యుపమాన బలము వలన పైకి తేలి యుటనట వ్యక్తమగుచున్నది. కొమ్మ యంటుకొన్న తరువాత మొక్కతల త్రుంచి వేయుదుము. అపుడంటు బాగుగా పైకి వచ్చును. అట్లే కథ యంతయు చదివిన తరువాత గజేంద్రుని బాధ యతని మొఱయు నతనివి యగుట మాని జీవుని వేదన యందు లయించును.

లావొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యె; ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను; మూర్ఛవచ్చెఁ; దనువున్ డస్సెన్; శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగుం దీనునిన్;
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో! కవియోగవంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విపులప్రభావ! రా
వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్ను గావవే!

ఈ యాక్రోశము గజేంద్రునిదా? పోతన గారిదా? మనదా? కథ చదువు నప్పుడు గజేంద్రునిది. పోతనగారి పద్యమనుకొన్నప్పుడు పోతనగారిది. మనన కాలమందు మనది. న్యాయమున కిది యెవరిదియు కాదు. సాధారణీకృతి పొందిన

యచ్ఛమైన జీవుని వేదన యిది. గజేంద్రుడు వట్టి యాలంబనము. గజేంద్రుడు విభావము. అతని నాలంబించి భావనా మహిమవలన పోతనగా రనుభవించి వ్యంజకతామహిమ వలన సహృదయులకు ప్రతీతి గోచరము చేసినట్టిది. ఇది యచ్ఛమైన జీవుని వేదన.

తరువాతి పద్యము లన్నియు 'నల వైకుంఠపురంబులో నగరిలో' మొదలైనవి పూర్వోక్త సాదృశ్య బలముచే నాక్షిప్తమైన భక్త్యావేశము చేత గజేంద్రుని రక్షణమును స్వరక్షణ లక్షణలక్షితముగా భావించుటచేత వ్రాయబడినవి. అనగా నీ జీవుని మొఱ యంత తీవ్రమైనదిగా నుండవలెను. 'కుయ్యో కవియోగివంద్య' లోని కూయి యంత దూరము 'అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దాపల నా పూలతోటలో కొలని యొద్దున చంద్రకాంతపుటరుగు మీది రమావినోదికి' విన్పింపవలెను. విన్పించిన నతడు రమావినోది కాడింక – మఱి యాపన్న ప్రసన్నుండగునట. అది యాయన బిరుదు. అసలదియే పేరు క్రింద విశేష్యముగా వాడినాడు పోతనగారు. ఆయన కూయి నాలించెనా– నిలువలేదు. సంరంభించి యొక్క యుఱుకున వచ్చును. సిరికిం జెప్పుట లేదు! ఈ మహా సంరంభము నీ భక్తపాలన పరాయణత్వమును స్వవిషయకముగా భావింప కున్నచో నిట్లు వ్రాయుట యుండునా? ఈ కథ వ్రాయుటలో పోతనగారి యాను భూతికి కూడ నిందుచేత సాక్షాత్ప్రవేశము గల్గినది.

**ప్రహ్లాద చరిత్రము :**

ప్రహ్లాద చరిత్రము నందున్న కీలకము సంఘర్షణ. భాగవత లక్షణము నకు నాసురలక్షణమునకు గల నిత్య సంఘర్షణ నుండి కథ పుట్టుచున్నది. కాబట్టి కథాకథన శిల్పమంతయు నీ సంఘర్షణ నుద్దీప్తము చేయుటలో నుండును.

మూలకారు డీ ప్రహ్లాద చరిత్రమును వ్రాసినది యూతి లక్షణమును వ్యాకరించుటకు. ఊతి యనగా కర్మవాసన. ఇది శుభాశుభరూపమున రెండు విధములు. శుభ కర్మవాసన మహదనుగ్రహము వలన నేర్పడును. మహదాగ్రహమువలన నశుభవాసన యేర్పడును. ప్రహ్లాదుడు శుభకర్మవాసన కాశ్రయము. హిరణ్యకశిపు దశుభకర్మవాసన కాశ్రయము. హిరణ్యకశిడు వైకుంఠవాసుడై యు, హరిపార్శ్వచరుడైనను విప్రశాపవశమున రాక్షసుడై జన్మించెను.

ప్రహ్లాదు డసురగర్భస్థుడైనను నారదానుగ్రహము వలన పరమ భాగవతుడై జన్మించెను. ఈ యిద్దర నేకత్రావస్థితి వలన పితాపుత్ర సంబంధము వలన నీ రెండు భావములకు సంఘర్షణ మేర్పడ్డది. కథలో నున్న చమత్కారాంశమిది. ఇది కథకు పునాది. ఇచ్చట నుండి కథా లక్షణ మంతయు వివృతము గావలయును.

హిరణ్యకశిపున కనంతమైన తత్త్వజ్ఞాన మున్నది. కాని వాని రాక్షస స్వభావము, వాని విష్ణుద్వేష మంతకంటె నిబ్బడి ముబ్బడిగా నున్నవి. వాని యంత పరమవివేకి మఱియొకడు లేడు. వాని యంతటి మూర్ఖుడును లేడు. ఇవి రెండును పరస్పర విరుద్ధగుణములు. విరుద్ధగుణముల నేకత్రావస్థితి హిరణ్యకశిపుడు. వాని యంతఃకరణమందలి ముడి యిది. సర్వజీవుల యంతఃకరణము నందిట్టి ముడి యున్నది. ఇదియే జీవ లక్షణము. వాని వివేకము వాని కుపయోగింపకుండుట. హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుని మృతిచే చింతించుచున్న తల్లికిని వధువునకును చేసిన తత్త్వోపన్యాసము శ్రీమతాచార్యులు వ్యాఖ్యానించినట్టి ఘట్టము. వానికి సృష్టిరహస్య మంతయు తెలియును. మాయా స్వరూపమంతయు తెలియును. తత్త్వవిషయమున వానికి తెలియని యంశము లేదు. కాని యీ విజ్ఞానమున కిదే; వాని రాక్షసలక్షణమున కదే.

తల్లి కింత తత్త్వబోధ యొనర్చుటకు ముందతడేమి చేసెనో చూచితిరా! అంత్య కవ్యవహిత పూర్వక్షణమునందే రాక్షసులకు గోభూసురవర్ణాశ్రమధర్మములను, వేదములను నాశనము చేసి రండని ముదలయిచ్చినాడు. ఇచ్చి వచ్చి చేసినది తత్త్వబోధ. తరువాత పరమదారుణమైన తపస్సుచేసి కోరరాని వరము లన్నియు బ్రహ్మచే వడసినాడు. అనగానేమి? వాని విజ్ఞానము, వాని వివేక మొరులకు జెప్పుటకే గాని వాని కుపయోగింపలేదన్నమాటయే గదా! దీనికి కారణమేమి? వాని యందున్న యశుభవాసన; దాని తీవ్రత యట్టిది. దాని స్వరూపము విష్ణుద్వేషము. తీవ్రమైన పరమేశ్వర ద్వేషము. ఈ ద్వేషమే వానికి ముక్తిహేతువైనది. ద్వేషముఖమున వాని సాధన సాగినది.

మఱి ప్రహ్లాదుడు దైత్యగర్భమున బడినను శుభవాసన వలన నతని సాధన భక్తిమార్గమున సాగినది. భక్తులలో నతడు ప్రథమ గణ్యుడైనాడు.

భక్తపాలనమునకై వచ్చిన యవతారము శ్రీ నృసింహావతారము. భక్తపాలనము నకై ప్రత్యేకముగా భగవంతు డవతరించిన దీ యొక్క సందర్భముననే. తక్కిన యవతారములందు భక్తపాలన మానుషంగికము. కాబట్టి యీ యవతారలక్షణము సాత్వతమతమును వ్యాకరించునట్టిది. సాత్వతమతమే భాగవత ధర్మము. ప్రహ్లాద చరిత్రమిట్లు భాగవతధర్మమైన సాత్వత మతమునకు పట్టుగొమ్మ. ఏ భావము చేతనైనను బరమేశ్వరుని పొందవచ్చుననుట కీ కథ నిదర్శకము. హిరణ్యకశిపుని ద్వేషము, ప్రహ్లాదుని భక్తి పరస్పర సంఘర్షణము చెంది శ్రీ నృసింహమూర్తి యావిర్భావమునందు పర్యవసించినవి. ఈ సంఘర్షణము నృసింహమూర్తి యావిర్భూతికి కారణమైన దన్నమాట. కాబట్టి కథలో సంవిధానకము నృసింహ మూర్తి యావిర్భావము. ఈ సంవిధానక నిర్మాణమును మూలకారు దద్భుతరీతిలో నిర్వహించినాడు. పూర్వోక్తమైన కథాపరమార్థ మంతయు మిక్కిలి నిగూఢ ముగా కథయందు మేళవించి పరమగంభీరముగా జెప్పినాడు. పోతనగారి సంఘర్షణమును లెస్సగా భావించి దాని తీవ్రత్వమును నిరూపించుటలో నద్భుత మైన ప్రతిభను ప్రదర్శించినాడు.

ఈ సంఘర్షణా తీవ్రతను నిరూపించుటకే పోతనగారు ప్రహ్లాదముఖమున పలికించిన ప్రసిద్ధపద్యములన్నియు నుపయోగించినవి. ఆ పద్యములు విడిగా చూచిన దివ్యానుభూతిమయములై హృదయమును భక్త్యుత్ఫుల్లమును జేయును. సందర్భమును బట్టి యా పద్యములు హిరణ్యకశిపునియందు నెట్లు ద్వేషానలము నుద్రేకింపజేసినవో విచారించిన కథావిషయకముగా వాని రమణీయత తెలియును. హిరణ్యకశిపుడనును-

నా తోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండు నా కంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁడొకఁడు సంపూర్ణప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిన్ బల్మారు నారాయణుం
డేతద్విశ్వములోనలేఁడు మఱివాఁడెందుండురా దుర్మతీ!

ఎక్కడఁ గలఁడే క్రియనే
చక్కటి వర్తించు నెట్టిజాడను వచ్చున్
జక్కడతు నిన్ను విష్ణునిఁ
బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్.

ఇవి రెండు పద్యములు. ఈ పద్యములందు హిరణ్యకశిపుని తీవ్రద్వేషము, వాని దురహంకారము మాత్రమే గాదు, వాని మూర్ఖత్వము గూడ చక్కగా వ్యక్తమగుచున్నది. వాని మాటలందలి పరస్పర వైరుధ్యము. వాని మూర్ఖత్వమునకు ప్రతీక. తాను పూర్వము పలుమాఱు వెదకెనట! నారాయణుం డెత ద్విశ్వములోన లేడట! మఱి వెదకుట యెందులకనగా నతడు తన భ్రాతను జంపినందువలనట! ఆ నారాయణుడు లేనివాడయినచో తన భ్రాతనెట్లు చంపెను? ఆ చంపినవానికి నునికి లేదనుట యెట్లు? తా నున్న శత్రువు కొఱకు వెదకినట్లా? లేనివానికై వెదకెనా? ఆ లేనివాడు భ్రాతను జంపుటయేమి? మఱల నట్టివానిని దాను జంపుటను టేమి? కాబట్టి వాని పరమమూర్ఖత్వము, వాని ద్వేషము కరుడు గట్టినతనమిది. సరిగా నీ రెండు పద్యములకు రెండు పద్యములలో ప్రహ్లాదుడు సమాధానము చెప్పును. హిరణ్యకశిపుని వైరము భగవంతుని యస్తిత్వమును నిరసించునంతవఱకు వచ్చినది. ప్రహ్లాదుడు వానికి సరిగా వ్యతిరేకము. పోతన గారి రెండు పద్యములలో ప్రహ్లాదుని నోట నీ వ్యతిరేకతను నిరూపించి సంఘర్షణను బరాంకోటి నందించినాడు. ప్రహ్లాదు డనును—

కలఁడంభోధిఁ గలండు గాలిఁ గలఁడాకాశంబునం గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్
గలఁ డోంకారమున న్త్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు తండ్రి! వెదకంగానేల యీయా యెడన్.

ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!

రెండు పద్యములలో నసురభావము నవివేకము వలన లేడు, లేడని— రెండు పద్యములలో పరమమైన భగవద్భావము వివేకము వలన నంతట గలడని తరువాత 'అని యిట్లు పలుకుచున్న' నని చిన్న వచనముతో నీ సంఘర్షణము ననువదించి క్రింది పద్యములోనికి నాకర్షించి వ్యాఖ్యానించుచున్నాడు పోతనగారు—

హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప, స
త్వరుఁడై యెందును లేఁడు లేఁడని సుతుం దైత్యుండు తర్జింప, శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండ ప్రభావంబునన్.

పద్యమునందలి మొదటి రెండు చరణములు దైవాసుర భావములు సమానకోటిలో ప్రతిపాదితములైనవి. మఱియు నిచటి చమత్కారమేమనగా పూర్వోక్తపద్యములందలి క్రమము వీడి యిట ప్రతీపముగా నీ భావములు లనఁ ప్రతిపాదించుట. ఇట్లు ప్రతీపముగా ప్రతిపాదించుటచేత నీ భావములు పునఃపునఃప్రతిపాదితములై పునఃపునఃఖండితములై వీని పరస్పర సంఘృష్టి వ్యంగ్యమగుచున్నది.

ఇట్టి సంఘృష్టి నుండి శ్రీ నరసింహమూర్తి యావిర్భవించినాడు. శ్రీ నరసింహాకృతి యిట్టి సంఘృష్టినుండి యావిర్భూతమగుటచేత నది స్వభక్తపాలనము, తద్విపక్ష విదారణమునందు సమర్థమైనది. ఇందుచేత నీ కథకు ప్రాణమీ సంఘర్షణ. ఈ సంఘర్షణా నిరూపణమింత యద్భుతముగా నిర్వహించుట పోతనగారి కథాకథన శిల్పమునకు నికషోపలము. మూలమునందీ పద్యములకు మూలమేమియు లేదు. ఇది పోతనగారు కథకు చేసిన వ్యాఖ్యానము.

(శ్రీమదాంధ్ర మహాభాగవతానుశీలనము)

* * *

అమరారాతి కరాక్షరోజ్ఝిత పవిత్రాంభఃకణశ్రేణికిన్
గమలాధీశ్వరుడొడ్డె ఖండిత దివౌకస్స్వామి జిహ్మాస్త్రమున్
గమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతా కచోపాస్తమున్
విమల శ్రీకుచ శాత చూచుకతటీ విన్యస్తమున్ హస్తమున్.

# భాగవతము—సామాజిక భక్తి

—డాక్టర్ తెలికేపల్లి లక్ష్మీనారాయణ శాస్త్రి

మానవుడు సామాజిక జీవి. అతని వ్యక్తిత్వ వికాసములో సమాజ ప్రభావము ప్రత్యక్షముగనో, పరోక్షముగనో గోచరింపక తప్పదు. తన యదృష్టము కొలది తనకొక యున్నత పదవి సంప్రాప్తమైనపుడు తనకన్న న్యూనముగ నున్న సామాజిక స్థితిగతులకు సంచలించి వానిని సమున్నత మొనర్చు మానసిక స్థితినే సామాజిక స్పృహ యనవచ్చును. ఈ స్పృహ, యే కొంతమందికో పరిమితమైనదని భావింపరాదు. అన్యులకు లేని యే కించి దవకాశమైన అనుభవించు ప్రతివ్యక్తి యందును నిది పొడగట్టినపుడు సమాజ సముద్ధరణ మనివార్యము. కాని స్వార్థము పేరుకొని పరార్థమును విస్మరించి బ్రతుకుట కలవాటు పడిన వ్యక్తులలో నీ సామాజిక స్పృహ పొడగట్టదు.

సంనియమ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితే రతాః.[1]

జగద్ధితమున నియుక్తులగు వారలే తనను పొందెదరని శ్రీ గీతాచార్యోక్తి. సర్వభూత హృదయాంబుజ వర్తియగు తన్ను అవజ్ఞ చేసి విగ్రహారాధనా విడంబనమున మూఢుడగువాడు భస్మకుండమున వేల్చిన యట్టివాడగునని శ్రీమద్భాగవత కపిలాచార్య ప్రబోధము.[2] శ్రీహరి అర్చా విగ్రహమునే పూజించుచు భక్తులను గాని అన్యులను గాని సేవింపనివాడు సాధారణ భక్తుడు.[3] ఈశ్వరునిపై ప్రేమను భగవద్భక్తుల తోడ మైత్రిని, భగవద్భక్తు

1. భగవద్గీత 12.4 2. ఆంధ్ర మహాభాగవతము 3. 955
3. అర్చాయా మేవ హరయే పూజాం యః శ్రద్ధయే హతే
న తద్భక్తేషు చాన్యేషు సభక్తః ప్రాకృత స్మృతః. సం. భాగ. 11.2.47

లపై కృపను చూపువాడు మధ్యమ భక్తుడు.[1] సకల భూతములందు తన యొక్క పరమేశ్వరుని యొక్క సత్తను, తనయందు భగవంతునియందు సకల భూతముల సత్తను సందర్శించువాడు భాగవతోత్తముడనియు ఆ మహాత్ము లొనర్చు సమాజ పరమేశ్వర సంసేవనమే పరమేశ్వరున కత్యంత ప్రీతిపాత్ర మనియు శ్రీమద్భాగవతోపదేశము.[2]

కర్మఠి స్వకర్మానుష్ఠానమునకు ఆరాటపడును. అన్యుల గూర్చిన చింత కాని స్పృహ కాని వాని కనవసరము. ఎవరి కర్మ వారిది. "అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అని అతని సిద్ధాంతము. అనుభవము వలనగాని మనసు పరిపక్వము గాదని ఆతని మతము. అందుచే నాతడు సామాజిక స్పృహకు దూరుడు. కాని విశ్వకల్యాణార్థము యజ్ఞయాగాది క్రతువు లొనర్చు నిష్కామ కర్మయోగులను కొంతవరకు సామాజిక చైతన్య సము పేతులే యని తలంపవచ్చును.

పరోక్షజ్ఞానులు స్వకీయతరణోపాయ సంసర్గ చిత్తులు. "ఆత్మనో మోక్షార్థమ్" అని మాత్రమే భావింతురుగాని "జగద్ధితాయ చ" అను నాలోచన కాయత్తులు గారు. శ్రీ శంకర భగవత్పాదులు "దేయం దీనజనాయ చ చిత్తమ్"- అని ప్రార్థించుట యిట్టిదే. తన దేశములో నొక కుక్కయైనను ఆకలితో బాధపడునంతవరకు తానెన్ని జన్మలనైన నెత్తెదననిన వాడపరశంకరా చార్యుడు శ్రీ వివేకానందస్వామి.

కర్మజ్ఞానులకు సాధనావస్థలో నన్యస్థితుల గూర్చిన యాలోచనముండదు. కాని భక్తుడు సాధనావస్థలో గాని, సిద్ధావస్థలో గాని సర్వభూత నివాసుడగు శ్రీ వాసుదేవుని ఆరాధించు సమున్నత పథగామి. అందుచే జగన్మిథ్య యను సిద్ధాంతము భక్తునకు యుక్తము గాదు. విష్ణువు విశ్వమయుడైనప్పుడు విశ్వము విష్ణుస్వరూపమే యగును, అట్టి విశ్వారాధనము భక్తునకు అన్వయమార్గమున

1. ఈశ్వరే తదధీనేషు బాలి శేషు ద్విషత్సు చ
ప్రేమ మైత్రీ కృపో పేక్షా యః కరోతి స మధ్యమః. సం. భాగ. 11.2.46

2. సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః. సం. భాగ. 11.2.45

అత్యంతానుకూలమై ముక్తిప్రద మగుచున్నది. అందుచే నతనికి సామాజిక స్పృహ అత్యంతోత్కటము. జీవిహృదయస్థ పరమశివ సందర్శన మతని పరమోన్నత భక్తి సోపానము. అతనికి కులమత విభేద సంకుచితదృష్టి యేమాత్రము ండదు. ఇట్టి సంసారదృష్టితో నటమటించు మూఢులను గూర్చి భక్తవరేణ్యులు సదా పరితపింతురు. ఇట్టి జీవారాధనమునే 'సామాజికభక్తి' యననగును. భవభూతి దీనినే 'లోకారాధన'మని పేర్కొనెను. ఏవంవిధ లోకారాధనము కొరకు శ్రీరామ చంద్రుడు స్నేహమును, దయను, సౌఖ్యమును, అవసరమగుచో సీతను సైతము పరిత్యజింతు ననెను.[1] ఆయన సామాజిక భక్తి తత్పరుడు కావుననే ఆయనది 'రామరాజ్య' మని కీర్తి గాంచినది.

భాగవత కులశేఖరుడు ప్రహ్లాదుడు పరమేశ్వరునితో నీ విధముగ మొర పెట్టుకొనెను—

> భగవద్దివ్యగుణానువర్ణన సుధా ప్రాప్తైకచిత్తుండనై
> బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్, భిన్నాత్ములై తావకీ
> యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్య భావంబులన్
> సుగతిం గానని మూఢులంగని మదిన్ శోకింతు సర్వేశ్వరా![2]

ఇట్లు విమూఢచిత్తులగు జనానీకమును గూర్చి ప్రహ్లాదుడు పరితపించుట ఆధునిక దృష్టిలో సామాజిక స్పృహయే యగును. కాని యిది పరోక్షమగు సామాజిక స్పృహ. ప్రత్యక్షమగు సామాజిక స్పృహకు ననన్యమగు నిదర్శనము భాగవతోత్తముడగు రంతిదేవుని చరిత్రము.

సకల దిగంత వ్యాప్త యశోవిరాజితుడు రంతిదేవుడు. అతడు సర్వస్వ మును దీనులకు సమర్పించి పేదరికమును వరించెను. కూటికి నీటికి కరువేర్పడి నను అతని ధైర్యము సడలలేదు. సకుటుంబుడై యొకచో నలువది యెనిమిది దినములు నిత్రుపాస ముండవలసి వచ్చెను. ఆ మరునాడే ఉదయమున ఆ మహా

---

1. స్నేహం దయాం తథా సౌఖ్యం యది వా జానకీ మపి
   ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా. (ఉత్తరరామచరితమ్ 1.5)
2. ఆంధ్ర మహాభాగవతము 7.365

తృనకు కొలదిగ ఘృతము, పాయసము, సలిలము సంప్రాప్తించెను. ఆకలి గొనిన కుటుంబముతో వానిని స్వీకరింప నతడు సంసిద్ధమాయెను.

అంతలో క్షుధార్తుడైన భూసురు డొక్క డతిథియై వచ్చి ఆహారము నర్థించెను. రంతిదేవు డతిథిదేవు నర్చించి "హరి సమర్పణ" మంచు పాయ సాన్నమున సగపాలు భూసురునకు సమర్పించెను. ఆతడు సంతృప్తుడై వెడలిన పిమ్మట నొక శూద్రు డశనార్థియై వచ్చెను. రంతిదేవుడు తన వద్దనున్న యన్నములో నొక భాగమిచ్చి సంతుష్టు నొనర్పగా నాతడు నిష్క్రమించెను. అనంతరము వేరొకడు కుక్కగమితో నేతెర నన్న శేషమిచ్చి వానికి మ్రొక్కి సాగనంపెను.

రంతిదేవుడు నీరము మాత్రము గ్రోలి తృప్తి పడదలచెను. అంతలో నొక్క చండాలుడు "మానవ కులనాథ! దప్పిగొంటిని. ఆకలిచే నడుగు వేయ జాలను. నీ కడ నున్న పానీయము బోసి నన్ను బ్రతికింపగదే"[1] అని ప్రార్థించెను. ఆతని దీనాలాపములకు ఆ దయామయ హృదయములోని సదా శివుడు సంచలించెను. వ్యాసభగవానుని రంతిదేవు డిట్లు ప్రసంగించెను- "అణిమాద్యష్ట సిద్ధులను, తుదకు మోక్షమునైనను అపేక్షింపను. సకలభూత సుఖార్థము తదీయదుఃఖమునే అనుభవింపగోరుదును."[2] ఈ మాటలను బట్టి రంతిదేవుని విశుద్ధాశయ మెట్టిదో తేటపడును. కాని పోతనార్యుని రంతిదేవు డిట్టి యాశయోద్ఘాటనమున నాసక్తి గొన్నవాడు కాడు. నిజమున కది సమయమును గాదు. పోతన రంతిదేవుడు సానుతాపయోగి. అందువలననే ఆర్తునితో తాదాత్మ్య మొంది యిట్లు పలికినాడు-

---

1. ఆంధ్ర మహాభాగవతము 9.645
2. న కామయేఽహం గతి మీశ్వరాత్పరా
మష్టర్ధియుక్తా మపునర్భవం చ
ఆర్తిం ప్రపద్యేఽఖిల దేహభాజా
మంతస్థితో యేన భవం త్యదుఃఖాః.
(సంస్కృత భాగవతము 9-21-12)

అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న! రా
వన్న! శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్నన( దాల్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే
లున్నదె? నాకు దిక్కు పురుషోత్తము( డొక్క(డు సుమ్ము పుల్కసా![1]

ఆంధ్రులు ఆర్ద్రహృదయముతో నాలపించు పద్యములలో నిది యొకటి. 'అన్న' యన్న సంబోధన మాత్రమేడితమై రంతిదేవుని యనుకంపాత్మకమైన హృదయమును స్పందింపజేసెను. స్వకీయ ప్రాణరక్షణము నుల్లంఘించి పతిత సామాజిక ప్రాణసముద్ధరణమునకు సంసక్తుడైన రంతిదేవుని త్యాగ గరిమ యీ పద్యమున రసమార్గమున నావిష్కృతము. "నేడు నా జలదానమున వీని తాపము, ఆయాసము, ఖేదము నశించు గాక" యని యాత డా హరిజనునకు తన వద్దనున్న సలిలము ధారవోసి సంతుష్టు నొనర్చెను.

అనంతరము బ్రహ్మాది దేవతలు ముదమొంది రంతిదేవుని ముందు సాక్షాత్కరించిరి. ధైర్యపరీక్షార్థము తాము చేసిన వృషలాది రూపములగు విష్ణుమాయ నెరిగించి వరము కోరుకొమ్మనిరి. రంతి దేవుడు నిష్కాముడు. వారల నత డేమియు నడుగక నారాయణ భక్తి మనమున వెలుగొందగా ధీరుడై పరమ పదము పొందెను. ఆ రాజర్షిని గొలిచిన వారెల్లరును శ్రీ నారాయణ చింతనులై యోగీశులగుచు సిద్ధపదము నొందిరి.

'మానవ సేవయే మాధవ సేవ' యని సంభావించు వారి కందరకును రంతిదేవుడు సమున్నతాదర్శము. అతని నిష్కామసేవాదృష్టి, నారాయణ భక్తి పరాయణత్వము సంఘసేవకుల కున్నచో వారి కవశ్యము పరమేశ్వర దర్శనము సంప్రాప్తించును. సంఘమును నే నుద్ధరించుచున్నానను నహం భావముతో గాక ఏవంవిధ సేవా భాగ్యము పరమేశ్వర కరుణా సంప్రాప్తమను భావముతో గావించు లోకారాధన మంతయు విస్తృత భక్తి సముల్లసితమే కాని అన్యము కాజాలదు. అట్టి భక్తి కుదురుటకు మున్ముందుగా పరమేశ్వర సమర్చన మత్యంతావశ్యకము. మాధవు డెట్టివాడో విదితమైన గదా మానవునిలోని మాధ

1. ఆంధ్ర మహాభాగవతము 9.649

వుని సందర్శింపగల్గుట. అందుచే 'సేవ సేవకారకే' యను విమతభావముతో గాక, సేవ సంస్కారార్థ మని, అట్టి సంస్కారము విస్తృత పరమేశ్వర సందర్శన సంప్రాప్తికి దోహదమని భావింపగలిగనప్పుడు లోకారాధనము ఈశ్వరారాధనమే యగును. ఈశ్వరారాధనము పరోక్షముగ లోకారాధనమే. ఏల ననగా.- ఈశ్వరు డన్న విశ్వరూపుడు. పర్యవసానముగా భక్తుని భావ సమన్వయ మిట్టిదిగా నుండవలెనని భాగవత సందేశము. ఈశ్వరు డనగా విగ్రహమాత్రుడు కాడు. అతడు విశ్వవటవృక్షమునకు బీజమైనవాడు. జగత్తనగా భౌతికమగు విశ్వము కాదు. అది పరమేశ్వరుని దివ్యకళామందిరము. అట్టి దివ్యకళామందిరము సేవించువాడే పరమేశ్వర ప్రీతిపాత్రుడు.

*(శ్రీమదాంధ్ర మహాభాగవత భక్తితత్త్వోన్మీలనము)*

* * *

కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికింగొనిపోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెట వేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పెనీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్త నిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు నిర్జరీ గళ
న్యస్త సువర్ణ సూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్.

# భాగవత భక్తి–ప్రహ్లాదుడు

—శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

"భజ సేవాయాం" అను ధాతువునుండి భక్తి శబ్దము నిష్పన్నమైనది. విశుద్ధమైన తన వాఙ్మనః క్రియలతో పరమేశ్వరుని సేవించుటయే భక్తి యనబడును.

బ్రహ్మ సృష్టి సేయదలంచి ఉపాయము గానక విచారించుచున్న సమయమున అతనికి 'తప' అని ఆకాశవాణి వినబడినది. అపుడా బ్రహ్మ తపస్సు చేసి ప్రత్యక్షమైన పరమేశ్వరుని "నా యహంకారమును బాపి నీ తత్త్వమును ఉపదేశింపు" మని యర్థించెను. అంత పరమేశ్వరుడు హయగ్రీవమూర్తియై బ్రహ్మకు ఆత్మతత్త్వమును నాల్గు శ్లోకములలో ఉపదేశించెను. ఇట్టి తత్త్వోపదేశము భగవత్ప్రోక్తమగుటచే నయ్యదియే భాగవతముగా రూపొందినది. దీనిని పరాత్పరుడు హయగ్రీవరూపములో బ్రహ్మకుపదేశించుటచేత భాగవతమునకు "హయగ్రీవ బ్రహ్మవిద్య" అను ప్రత్యేక ప్రశస్తి కూడ ప్రాప్తించినది.

భాగవతమును బ్రహ్మ నారదునకు, నారదుడు వ్యాసునకు ఉపదేశించిరి. ఈ విధముగ ఆత్మతత్త్వప్రబోధరూపమైన భగవద్భక్తిని సప్రపంచముగా సులభసుందరరీతులలో లోకమునకు ప్రబోధించి తత్ప్రబోధము ద్వారా మానవులను మోక్షభావనాప్రభావితులుగా తీర్చి దిద్దుటకే సంస్కృతములో వ్యాసమహర్షి, తెలుగులో పోతన మహాకవి తమతమ భాగవతములను వెలయించినారు. భక్తితత్త్వ ప్రకాశమునకు ప్రథమసాధనమైన ఈ అధ్యాత్మజ్ఞానప్రబోధము భాగవతములో ప్రకాశించిన రీతిని ఈ పోతన పద్యము తెలుపుచున్నది.

కార్యవర్గంబును గారణసంఘంబు
నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ
దెలియఁజేయఁగఁజాలు దీపమగుచు

సకలవేదములకు సారాంశమై యేక
మై యసాధారణమగు ప్రభావ
రాజకంబైన పురాణమర్మంబులు
గాఢ సంసారాంధకారపటలి

దాటఁ గోరెడివారికి దయ దలిర్ప
నే తపోనిధి వివరించె నేర్పడంగ
నట్టి శుకనామధేయు మహాత్మగేయు
విమలవిజ్ఞాన రమణీయు వేడ్కఁ గొలుతు. (1.56)

భక్తులు నాల్గు విధములుగా శ్రీకృష్ణపరమాత్మను సేవించుచుందురనియు, వారిలో ఆత్మజ్ఞానము కలవాడే పరమాత్మకు ముఖ్యుడును ప్రియతముడును కాగల్గునని యీ క్రింది గీతా సూక్తులు తెలుపుచున్నవి—

చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతి నోఽర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్ష భ
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏక భక్తిర్విశిష్యతే. (7.17)

ఇట్లు అధ్యాత్మ జ్ఞాన జ్యోతీరూపమైన భక్తిని సాంగోపాంగముగ విశదీక రించుచున్న భాగవతము అజ్ఞానాంధకారములో చిక్కుకొన్న దీనప్రజల నుద్ధరించుటకై ఉద్దేశింపబడుట అందలి ప్రత్యేకత. దీనివలన లోకోద్ధరణ విషయమున భాగవతమునకు గల పాత్ర ప్రకాశితమగుచున్నది. ఈ విశిష్ట విషయమునే పోతన భంగ్యంతరముగ తన భాగవతాదర్శము నిట్లు ప్రతిబింబింప జేసినాడు:

వినుమీ సంసారం బను
వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడు వానికి వి
ష్ణుని గుణవర్ణనము దేప సుమ్ము మునీంద్రా ! (1.181)

విశేషముగ నీ పురాణ రాజములోని భక్తి జ్ఞాన వైరాగ్యముల సంపుటి మానవ ప్రేమగ రూపొంది అది భక్తి రహితుల శుష్క హృదయములల్లో

దివ్యజ్యోతిని వెలిగించి వారి జీవితములను రసమయములుగ తీర్చి దిద్దగలిగి యున్నది. "జ్ఞానవైరాగ్య సంయుక్తభక్తిః ప్రేమరసావహా" అని గదా సూక్తి. భక్తి జ్ఞాన వైరాగ్యములతో గూడిన భాగవత పురాణ రత్నము పతిత మానవులకు గూడ సులభ సుందరరీతులలో తరణోపాయము జూపగలిగి యున్నది.

ఇక భిన్నభావ దూషితులైన వారి నందరిని ఈ భాగవతము భక్తి రూపమైన తన యలౌకిక ప్రేమ సూత్రములతో నొక్కచోటికి జేర్చి వారిలో పరస్పర ప్రేమ భావమును, మానవత్వములో మాధవత్వమును సుప్రతిష్ఠితము చేయజాలియున్నది. ఇట్టి అనితర సాధారణములైన ప్రత్యేక సన్నివేశములను బట్టియే భాగవత విషయమున దేశీయులందరికిని అనిదంపూర్వమైన ఆత్మీయత యేర్పడినది. కనుకనే దేశ చరిత్రలోను వాఙ్మయ చరిత్రలోను ఇది యొక విశిష్ట స్థానము నేర్పరచుకొన్నది.

భారత దేశములో వ్యాప్తి చెందిన వివిధములైన సూరదాస తులసీదాసాదుల భక్త్యుద్యమములకును తక్కిన భక్తి సంప్రదాయములకును నీ భాగవతములోని భవ్య దివ్య నవ్య భక్తి సంప్రదాయమే సర్వ విధములుగా మార్గదర్శకమై యున్నదని నొక్కి వక్కాణింపవలసియున్నది.

సర్వబంధవిముక్తికి కారణమైన ముక్తికి, శ్రీకృష్ణపరమాత్మకు నాయికా నాయకభావము నేర్పరచి వర్ణించుటలో మన పోతనదే అగ్రతాంబూల మనవలసి యున్నది. ఈ భావమే మనకు గోపికల మధురభక్తి ఘట్టములలో గానవచ్చును. ఆత్మ పరమాత్మతో ఐక్యము చెందినట్లు భాగవతములో గోపికలు శ్రీకృష్ణునితో "ప్రకృతి పురుషునితో నైక్యము చెందినరీతి" కాంతాసమ్మితమైన కమనీయ కావ్య పద్ధతిలో వర్ణితమైనది. ఈ దివ్యసన్నివేశముతో సర్వప్రాణి సాధారణమైన లౌకిక కామము శ్రీకృష్ణభక్తి రూపములో దివ్యప్రేమగ, విశ్వప్రేమగ పరిణమించి ముక్తికాంతామనోమోహనముగ చరితార్థత నందినది. దివ్యప్రేమరూపమైన యిట్టి భక్తియే భాగవతములోని ప్రధాన వస్తువు. ఇట్టి దివ్యవస్తు సమాశ్రయము చేతనే గోపికలు బంధరహితలై ముక్తిని బడయగల్గినారు. గోపికల ప్రేమ ముక్తిగా పరిణమించుటకు వారి అనన్యభక్తియే మూలమైనది. గోపకాంతల యీ ముక్తతను గూర్చి శుకమహర్షి పరీక్షిద్రాజేంద్రునితో ముందుగానే యిట్లు తెలిపెను-

తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి జారుఁడనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై. (10.967)

పరీక్షిన్మహారాజు ఈ విషయమును విని "మూఢలైన స్త్రీలు తమ గుణ దేహము లెట్లు విడువం గలిగిరి?" అని ప్రశ్నింపగా శుకయోగీంద్రుడు మహారాజునకు-

బాంధవముననైనఁ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులైయుంటు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప! (10.972)

అని తెల్పెను. కనుక మానవులు ఉత్కటమైన ఏ భావముచేతనైనను తప్పక శ్రీహరిని జేరవచ్చునని తెలియుచున్నది.

సర్వాంగసుందరమైన భాగవత భక్తికి మోక్షమే చరమలక్ష్యము. తత్సాధన సామగ్రిలో భక్తియొక్కటే సర్వాధికము. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని శాంకరసూక్తి. శుకముఖసంగసంజాత సుధాసజ్జితమైన భాగవతఫలమును ఆస్వాదించి పరీక్షిన్మహారాజు సప్తరాత్రములలోనే ముక్తుడైన ప్రత్యేక సన్నివేశము భాగవతమును మోక్షశాస్త్రముగా రూపొందించినది. ఈ విషయమునే పోతన మహాకవి తన అమూలకపద్యములో నిట్లు ప్రకాశింప జేసినాడు-

నిగమములు వేయుఁ జదివిన
సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్;
సుగమంబు భాగవత మను
నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా! (1.140)

భాగవత గతమైన ఈ ప్రత్యేకప్రభావమే పోతనకు పునర్జన్మము లేకుండ జేసినది. కనుకనే ఈ భక్తకవి తన గ్రంథమును "శ్రీకైవల్య పదంబుఁ జేరు

టకునై చింతించెదన్...మహానందాంగనాడింభకున్'' అను పద్యముతో ప్రారంభించి భాగవతముయొక్క మోక్షశాస్త్ర రూపప్రశస్తిని చాటినాడు.

భక్తి, తద్వారమున మోక్షసాధకత్వము కొరకే భాగవతము జనించినది. వ్యాసుని వ్యాకులతకు కారణము తెలుపుచున్న నారదుని మాటలలో మీది సత్య మీరీతిగ ప్రతిఫలించినది-

అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి; వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక, నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా! (1.95)

ఇట్లు వ్యాసమునీంద్రుని యశాంతికి ''హరిఁ గోరి నుతింపమి'' కారణమైనది. కనుక శ్రీహరిస్మరణము శాంతికి కారణమగును గదా!

ఇక పోతన మహేశ్వరధ్యానము చేయుచుండగా నతనికి శ్రీరామ చంద్రుడు ప్రత్యక్షమై ఆ కృతిని తన కంకితమిమ్మని యానతిచ్చుట, పోతన తన చిత్తములో శ్రీరామచంద్రుని సన్నిధానము గల్పించుకొని భాగవతమును ''గోపికానివహమందిర యాయికి శేషశాయికి'' సమర్పించుట, స్కంధాద్యంతములందు ''శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్రుడైన'' పోతన శ్రీరామునే కీర్తించుట అను సన్నివేశములు తన యిష్టదైవమున సర్వదేవతాత్మకత్వమును సందర్శించుటను స్పష్టము చేయును. అంతేకాదు, అవి భాగవత భక్తియొక్క విశ్వభావనకును విశిష్టకారణములు. ఏవంవిధ ప్రభావభాసురమైన భక్తిని గూర్చి మరికొన్ని నిర్వచనములను జూపి భాగవతమణిహారమునకు నాయకమణియైన ప్రహ్లాదభక్తికి ఆ నిర్వచనములు సంగ్రహముగ సమన్వయించుదము.

1. ''స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే'' అని శంకరుల వివేక చూడామణి. ప్రాణుల నిజస్వరూపమైన ఆత్మతో తాను ఐక్యము చెందుటే భక్తి యని భావము. ఈ క్రింది పద్యము ప్రహ్లాదుని స్వస్వరూపానుసంధాన రూపమైన భక్తికి చక్కని నిదర్శన మగుచున్నది-

పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీచింతామృతా స్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా ! (7.128)

ఇందు సర్వకాల సర్వావస్థలలో ప్రహ్లాదుడు తచ్చింతామృతాస్వాద సంధానమం చెంది, అనగా తనలోని ఆత్మతో ఐక్యము నొంది విశ్వమును విస్మరించుట యనున దాతని స్వస్వరూపాను సంధానమును ప్రకటించుచున్నది.

2. మధుసూదన సరస్వతి తన భక్తిరసాయన గ్రంథమున నిట్లు సెలవిచ్చెను-

ద్రుతస్య భగవద్ధర్మా ద్ధారావాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తిః భక్తిరిత్యభిధీయతే.

అనగా సర్వదా సర్వేశ్వరుని సంస్మరించుట చేత ద్రవించిన చిత్తములో ఏకధారగా బయలుదేరిన ఏకాకారవృత్తియే భక్తియనబడునని యర్థము. మానవుని చిత్తము ఇష్టవిషయములను గాఢముగా చింతనజేసి ఆ విషయములతో ఐక్యము చెందిననాడు ఏకాగ్రత యేర్పడును. ఈ వృత్తి ప్రభావము చేతనే అన్యవిషయ విస్మరణము సంభవించును. ప్రస్తుతము ప్రహ్లాదుని చిత్తవృత్తి కూడ ఇట్టిదేనని పోతన యొక్క యీ స్వతంత్ర పద్యము తెల్పుచున్నది.

అడుగడుగునకు మాధవానుచింతన సుధా
మాధుర్యమున మేను మఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగలేని
హరిభక్తి పుంభావమైన వాని
మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగాఁ
జిత్తమచ్యుతు మీఁదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు
శ్రీ విష్ణుమయమని చెలఁగువాని (7.160)

ఇంతేకాదు-

హరిపదాంభోజయుగచింతనామృతమున
నంతరంగంబు నిండినయ్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడునిభంగి. (7.122)

మొదలగు భక్తివర్ణన చిత్రములు కూడ నిట్టివే.

8. "అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా...
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే"

అని శివానందలహరిలో ఆచార్య శంకరుల యభిభాషణము. క్రిందకు రాలిన ఊడుగుగింజలు అప్రయత్నముగా ఆ ఊడుగుచెట్టు మొదటిని చేరుకొన్నట్లు, సూది సూదంటురాయిని చేరుకొన్నట్లు, పతివ్రత తన పతి సన్నిధిని చేరుకొన్నట్లు ఎవ్వని చిత్తము పరమేశ్వరుని పాదారవిందముల చెంతకు సహజముగా చేరి, అచ్చట స్థిరముగా నిలిచి, పరమానందభరిత మగుచుండునో అట్టి చిత్తవృత్తియే భక్తియనబడును. ఇందుకు-

ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమునఁ
గరఁగు చున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు. (7.149)

ఇక ఈ క్రింది నారదభక్తి సూత్రములకు ప్రహ్లాదుని భక్తిమయ జీవితమే సంపూర్ణముగ లక్ష్యప్రాయమగుచున్నది.

నారదస్తు తదర్పితాఖిలాచారతా
తద్విస్మరణే పరమవ్యాకులతేతి. (21 సూ.)
యథా వ్రజగోపికానామ్. (25 సూ.)
సాతు కర్మజ్ఞాన యోగేభ్యోఽప్యధికతరా. (23 సూ.)
సైవ గ్రాహ్యా ముముక్షుభిః. (33సూ.)

మానవుల పూర్వజన్మసంచిత సుకృత విశేషము చేతనే వారికి 'అనన్య భక్తి' ఏర్పడును. "మదీయ పూర్వజన్మసంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాకుతూహలుండనై" అను పోతన వాక్యములు మీది విషయమును ధ్రువపరచుచున్నవి. ఇక మన బాల భక్తశేఖరుడైన ప్రహ్లాదుడు "శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతా స్వాదసంధానుండై" విశ్వమును విస్మరించియున్న సమయమందు అప్పటి ఆ బాలుని భవ్యస్థితిని పోతన తన పద్యములో నిట్లు ప్రకటించినాడు-

వైకుంఠ చింతా వివర్జిత చేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢ చిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁడను నిధానముఁగంటి నేనని
యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ

బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయ హర్షజనిత బాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు. (7.124)

మధుసూదన సరస్వతి తన 'భక్తి రసాయన' గ్రంథములో భక్తికి సాంగముగా రసత్వమును జూపినాడు. విభావానుభావ సాత్విక సంచారిభావములతో పుష్టి చెంది స్వాదుత్వమును గాంచిన స్థాయిభావమే రసమనబడును. ఆలంకారికమైన ఈ రస లక్షణమును బట్టి పై పద్యములో పోతన ప్రహ్లాదుని యందు భక్తిని సలక్షణముగా నిరూపించిన రీతిని తిలకింతము. సీసము మొదటి నాలుగు పాదములలో వరుసగా నిర్వేదము, ధృతి, హాసము, ఆవేగము అను సంచారి భావములు వర్ణింపబడినవి. ఇక ఆటవెలదిలో ప్రహ్లాదుని నిర్భరభక్తిలోని స్థితిభేదము లను దెలుపుచున్న బాష్పపులకాదులు స్తంభ ప్రళయరోమాంచాశ్రువు లను సాత్విక భావములకు నెలవులై యున్నవి. ఈ పద్యములోని 'ఉబ్బి గంతులు

వైచుట' ఉద్దీపనవిభావమును సూచించుచున్నది. ఇందలి ప్రహ్లాదుని భక్తిభరిత పరిస్థితి భేదము లన్నింటికి పరమేశ్వరుడు కేంద్రముగా నుండుటవలన నిట 'పరమేశ్వరుడు' అను ఆలంబనవిభావము వర్ణితమైనది. ఉక్తరీతిగా పైపద్యము లోని భక్తిరసము విభావానుభావ సాత్త్విక సంచారి భావములతో స్వాదుత్వము గాంచి 'ఒక్కచోట నిలిచి యూరకుండుట' (శాంతి) అను నేకాకారవృత్తి రూప మైన స్థాయిభావముతో పరిపుష్టమై సంపూర్ణ రసరూపము గాంచినది. ఇంతకు ముందు చెప్పిన నారద భక్తి నిర్వచనాదులు కూడ మీది పద్యార్థములో గతార్థము లగుచున్నవి. ఇట్లే నవవిధభక్తిని దెలిపెడు- "తనుహృద్భాషల సఖ్యమున్" అను పద్యములోను, పిమ్మట గల పద్యషట్కములోను నీ బాలభక్తశేఖరుని భక్తి సోదాహరణముగా నిరూపితమైనది. ఈ విశిష్ట విషయములన్నియు "భక్త పోతన - మహాభాగవత రచన" అను మదీయ భాగవత విమర్శ గ్రంథములో సప్రమాణముగ వివృతములై యున్నవి.

ఇక భగవద్గీతలో భక్తియోగములో పదమూడవ శ్లోకమునుండి పందొమ్మిదవ శ్లోకము వరకు చెప్పబడిన ఉత్తమభక్తుని లక్షణములన్నియు ప్రహ్లాదుని పట్ల సమన్వితములై బాల ప్రహ్లాదుని దానవత్వములో మాధవత్వమును ప్రవేశ పెట్టినవి. భాగవతభక్తి ఇంతటి ప్రభావభరితమైనది.

లోకములో మమతాహంకారములు ప్రబలి సామాన్య మానవులను పీడించి పీల్చి పిప్పి చేయుచున్నవి. ఇవి అర్జునుని వలె పరీక్షిన్మహారాజును గూడ ఒకప్పుడు వివశుని గావించినవి. లౌకికముగా గల్గిన ఆ పరీక్షిద్విషాద భారమును బారద్రోలి వాసరసప్తకములోనే ఆ రాజేంద్రుని మోక్షానందభరితుని జేసినది- ఒక్క ఆ భాగవతసుధయే. కలికాలములో బడి నానాక్లేశసమన్వితులైన దీన ప్రజలను ఉద్ధరింపజాలినది కూడ ఈ భాగవతసుధయే.

భారత సంహితారచనచేత బడయజాలని మనస్సంతృప్తిని వేదవ్యాసుడు భాగవతరచనము చేతనే బడయగల్గినాడు.

భాగవతము అమృతద్రవ సంయుతము. అనగా మోక్షానంద రసభరిత మైనది. కనుక-

"వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు."

* * *

# పోతన–సూరదాసు

— శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

'సూర సాగరము' న కావ్యమహత్త్వము గల యమూల్యరత్నములు కొల్లలుగా నున్నవి. పుష్టి మార్గానుసారముగ సూరదాసు వాత్సల్య, సఖ్య, మాధుర్య భావములతో పొంగారుచున్న పదము లనేకములు రచించెను. శ్రీకృష్ణుని లీలాస్వరూప మాధుర్యమును జూఅగొనవలె నన్నచో సూర సాగరమునే చదువవలెను. బాల్యలీలల వర్ణించుటయందు సూరదాసు నెఱపిన ప్రజ్ఞాప్రాభవములు విశ్వసాహిత్యమునందే మరియొక కవి చూపలేదు- లేదు అనిన సత్యమున కెంత మాత్రము దూరము కాజాలదు. శ్రీకృష్ణుని వివిధానుభావ వర్ణనమున నేమి, యశోదానందుల వాత్సల్య ప్రేమను చిత్రించుట యందేమి సూరదాసునికి సాటి సూరదాసే.

వస్తుసామ్యమును బట్టి తెలుగు సాహిత్యమునందలి మహాభక్తకవి శిరోమణియైన బమ్మెర పోతరాజుగారి భాగవతమును సూరసాగరముతో తులనాత్మక పరిశీలనము గావింపవచ్చును. వస్తు వొక్కటియే యయ్యును ఇరువురి కవుల దృక్పథములు వేరని మనము గ్రహింపవలెను. పోతన తన యనువాదమును క్రమబద్ధముగా నొనరించి మూలానుసరణముగా సాగించెను. కావున నన్ని స్కంధముల యందలి కథావస్తువునకును తగినంత న్యాయము జరిగియున్నది.

సూరదాసుని దృక్పథము వేరు. వల్లభ సంప్రదాయమున ముఖ్యాంశమగు శ్రీకృష్ణ లీలావైభవము గానము చేయుటయే యాతని పరమ లక్ష్యము. కావున దశమస్కంధము పూర్వార్థము ఉత్తరార్ధములతో పోల్చినప్పుడు సూరసాగరము నందలి యితర భాగములు పరిమాణమున వెల తెలబోవుచుండును. దశమస్కంధ వర్ణనమున సూరదాసునిది పైచేయి యనవచ్చును. ముఖ్యముగా బాలలీలల వర్ణించుట యందును, భ్రమరగీతలను పెంపొందించి వ్రాయుటయందును పోతనగారిని మించెనని చెప్పవచ్చును. అందుకు కారణము స్పష్టము. పోతనకు

సమగ్ర భాగవతమును సర్వాంగ సుందరముగా నిర్వహింపవలసి యుండెను. అందుచే నేదేనొక్క విషయమునే యతివేలముగా వ్రాయుటకాతని కవకాశము లేదు.

భక్తిపద్ధతుల యందును పోతన సూరదాసులకు అంతరువు కలదు. పోతనగారిది అద్వైతపరమగు భక్తి. రామకృష్ణ భేదముగాని, శివకేశవ భేదము గాని వారియందూహింపరానిది. ఈ విషయమును పోతనగారు తమ రచనమున చక్కగా సూచించియే యున్నారు. చేసినది మహేశ్వరధ్యానము. ప్రత్యక్షమై భాగవత రచనమునకు ప్రేరణ కలిగించినది శ్రీరామచంద్రమూర్తి. కవి తానుగా షష్ఠ్యంతములు పలికినది శ్రీకృష్ణునుద్దేశించి! ఇంతకు నిది నవధా భక్తియందు దాస్యభక్తి యని చెప్పవచ్చును. సూరదాసునిది యట్లు గాక సఖ్య మాధుర్య భావములచే పొంగారు భక్తి. పోతనగారి గంటము దాస్యభక్తి ప్రధానములైన గజేంద్రమోక్షము, ప్రహ్లాదచరిత్రము మొదలగు సన్నివేశములయందే పరవళ్లు త్రొక్కి పతితపాలకమున కమృతత్వము ప్రసాదించినదని భావింతును. రచనా తంత్రము నాకోచించిన సూరదాసునిది పదకవిత్వము. పోతన గారిది పద్య కవిత్వము.

*(హిందీ సాహిత్యము - ప్రథమ సంపుటి)*



ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మే
ల్గాదే! రాజ్యము గీజ్యమున్ సతతమే! కాయంబు నాపాయమే!

వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ తేరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీవడుగ నీభాగ్యంబు లీపాటి గా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీయల్పంబు నీనేర్పునే?

# తపః ఫలము

— శ్రీ కేశవతీర్థస్వామి

పరమపవిత్రమైన భారతవర్షానికి ఆంధ్రదేశం సర్వవిధాల శోభను కూర్చింది. భారతాదర్శమైన బ్రహ్మజ్ఞానశ్రీని పండించటంలో కూడా ఆంధ్ర ధాత్రి తీసిపోలేదు. శ్రీ వల్లభాచార్యులు, త్యాగరాజు, వేమనయోగి, త్రైలింగ స్వామి, బమ్మెర పోతనామాత్యులు, మహాయోగి తుంగదుర్తి బుచ్చయ్య, భద్రాచల రామదాసు, నారాయణతీర్థులు, తూము నరసింహదాసు, తరిగొండ వేంకమాంబ మొదలైన పరమభక్త శిఖామణులు ఆంధ్ర ధాత్రిలోనే అవతరించారు. మహారాష్ట్రాది ఇతర రాష్ట్రాలలో అవతరించిన భక్తజనసంఖ్యకు పోల్చినప్పుడు ఆంధ్రదేశ భక్తజనసంఖ్య అల్పంగానే తోస్తుంది. సంఖ్యలో అల్పమైనా ఉదయించిన కొలదిమందైనా తమ అద్భుతాదర్శ జీవితాలతో మనకు గౌరవవిశేషాలను కలిగించారు. మనకు తగినంత గౌరవ భక్తులు ఆంధ్రగౌరవప్రతిష్ఠాతలైన ఆదర్శజీవనులైన ఈ మహాపురుషులందు లేకపోయినా వారు మాత్రం మనకు మాసిపోని మహాశ్రీని ఆర్జించి యిచ్చారు. ఒక్క పోతనవంటి సర్వాదర్శ భాగవత శీలుని చూచుకొనియైనా ఆంధ్ర ధరిత్రి "ధన్యోస్మి" అనుకోవచ్చు.

ఆంధ్ర మాగాణములను తన గంటమనే నాగలితో దున్ని మధుర కవితా జలాలతో ఆర్ద్రంచేసి భక్తి అనే పంటను పండించి సర్వప్రజానీకానికి భక్తి భిక్ష పెట్టిన కర్షకకవి తపస్వియైన పోతన మనకు సర్వదా ఆరాధనీయుడు. శ్రామిక మహాయోగియైన పోతన మహాకవి తన శ్రీమదాంధ్ర మహాభాగవత ప్రదానంతో ఆంధ్రజాతికి వెలుగు చూపాడు. ఆ మహాభాగవత కవిశేఖరుని మహాభాగవతం త్రిలింగ ప్రజల దీర్ఘ దీర్ఘ తపః ఫలం! చక్రవర్తిత్వాలు కూర్చలేని తృప్తిని, ఏ యింద్రలోక సౌఖ్యాలైనా ఇవ్వలేని ఆనందాన్ని, ఏ ఆయుధాలు బలాలు సమకూర్చలేని శక్తిని, భూమండలం మీద ఏ వస్తువూ ఇవ్వలేని ఉత్తేజాన్ని పోతనామాత్యుని మహాభాగవతం మనకు ఇస్తున్నది. భాగవతమే ఆయన జీవితం. ఆయన జీవితమే భాగవతం: భాగవత

శీలము యొక్క సమగ్రత్వం పోతనగారి జీవితంలో మనం సాక్షాత్కరించుకో గలం. సత్యభక్తి రూపం, వైరాగ్య గరిమ, ఆత్మ స్వాతంత్ర్యబలం, విశ్వ ప్రేమ, క్షమా సౌశీల్యాదులన్నీ పోతనగారి జీవితంలో మనం ప్రగాఢంగా అధ్యయనం చేయవలసిన పాఠాలు.

(భక్త పోతనామాత్య)



గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగేనెక్కడ ! భూములెక్కడ ! కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ ? నిత్యోచితకర్మమెక్కడ ! మదాకాంక్షామితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోయ కిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్.

"విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాద ధరణీం దాస్యామి" యంచున్ గ్రియా
క్షిప్తుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాచి పూజించి బ్ర
హ్మప్రీతంబని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందగన్.

బలిదైత్యేంద్ర కరద్వయీకృత జలప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థిత శ్రీదమున్
గలితానమ్ర రమాలలాట పదవీ కస్తూరికాశాదమున్
నళినామోదము రత్ననూపురితనానావేదముం బాదమున్.

# పోతనామాత్యుని అభేద దృష్టి-
# పాఠ పరిశీలనము

—శ్రీ మిన్నికంటి గురునాథ శర్మ

సహజ పాండిత్యుడగు బమ్మెర పోతనామాత్యుడు వ్యాసవిరచితమగు సంస్కృత భాగవతమును ఆంధ్రీకరించెను. అన్ని పురాణముల వంటిది కాదు భాగవతము. దీని శైలి మిక్కిలి ప్రౌఢమైనది. అదిగాక-

అమరుల బాస చిత్రమయినట్టిది; యొక్కొక యక్షరంబె య
ర్థ మొసఁగు; నుండు నొక్కొక పదంబునకే వివిధార్థముల్; పద
క్రమమును మార్చ పీలుగ విరాజిలి దాన నొసంగుఁ బెక్కు భా
వములను; బై మునీంద్రు నుడి భాగవతమ్మన నేమి మాటలా?

అని నా గురుభాగవతమున వ్రాసితిని. భాగవతమును తెనిగించుట సామాన్య కార్యము కాదు. ''భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు'' అట్టి దానిని సహజ పాండిత్యు డెట్లు తెనిగింపఁబూనె నందురా? ఆ మహాతపస్వికి భగవత్సాహాయ్య మున్నది.

''ఒక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనాను మతంబున నభ్రంకషశుభ్ర సముత్తుంగభంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతట మంటప మధ్యంబున మహేశ్వర ధ్యానంబు సేసి కించిదున్మీలితలోచనుండై'' యున్న పోతన్నగారికి శ్రీరాముడు ప్రత్యక్షమై ''నీవు రచింపఁబూనిన భాగవతమును నా కంకితమి''మ్మన్నాడు. ఇదేమిటి? నేను మహేశ్వరుని ధ్యానించినచో రామభద్రుడు గోచరించి ''నేను రామభద్రుడను నీ భాగవతము నా కంకితమిమ్మ'' అనినాడు అని పోతన భావింపలేదా? లేదు. అట్లు పోతన భావింపలేదు. గోచరించిన పురుషుని మొదట చంద్రశేఖరు డను కొన్నాడు. అప్పుడా పురుషుడు తాను రామభద్రుడ నన్న పిమ్మట శివకేశవులకు భేదము లేదు కాన పోతన్న శంకింపలేదు. ఏల శంకించును?

"చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
కలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు"

అని యిరువుర సమదృష్టిం దిలకించునుగా. మరియు-

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః
యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయ శ్శివః
యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తి రాయుషి"

అని తాను ప్రతినిత్యము సంధ్యావందనమున స్మరించుచున్నాడుగా. అందువలన పోతనామాత్యుడు నేను రామభద్రుడ నని అమ్మహాపురుషు డనుట తోడనే పరమానంద భరితుడైనాడు.

శివరూపమును ధ్యానించుచున్న విష్ణురూపమును ద్వేషింపవలెనా? విష్ణు భక్తులు శివుని ద్వేషింపవలెనా? కూడదు. తన భజించు దైవము కంటె నితర దైవమును ద్వేషించువాడు నిందించువాడు మూర్ఖుడు. ఔపనిషద తత్త్వ రహస్య మెరుగని పండితపాంసనుడు.

మన పోతరాజు వివేకవంతుడు. విజ్ఞాని. సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుడు లీలావశమున లోక సంరక్షణార్థము ఏ నామరూపగుణ వృత్తుల నైన స్వీకరించును. నామభేదమున్నను పరమార్థ వస్తువొకటే గదా యని హరి హరాభేదభావమున నుండెను. అంతేకాని, పండితమ్మన్యుల వలె భేదభ్రాంతిలో పడి తలమున్కలై తన్నుకొనుచు నుడ్డు గుడుచుకొనలేదు.

పోతన వేదవిహితాచరణ భక్తి విశేషముల వలన నంతశ్శుద్ధి గలవాడు. యజ్ఞము చేసి సోమపీథియైన కొట్టరువు తిక్కనామాత్యునంతటి వానికిని హరి హరనాథస్వామి స్వప్నమందు సాక్షాత్కరించెనే గాని జాగ్రద్దశయందు గాదు. తరువాతి కవుల కెవ్వరికైనను ఇష్టదైవము ప్రత్యక్షమైనచో అది స్వప్నదశ యందే కాని జాగ్రద్దశయందు గాదు. ఒక మన పోతన భాగవతోత్తమునకే యా యదృష్టము పట్టినది. పోతన కనులు మూసికొని ధ్యానమందుండ రామభద్రుడు

కన్పించెంగాని నిద్రపోవుచుండగా గాదు. ఆయన ధ్యాననిష్ఠ యట్టిది. ఆయన తన సాత్వికాంతఃకరణ వృత్తిని ధ్యేయపదార్థమునందు నటునిటు చెదరిపోకుండ తైలధారవలె నెడతెగకుండ స్థిరముగా నిల్పినాడు. బుద్ధి వృత్తిపాశముచే దృఢముగా బంధింపబడిన వస్తువింక కన్పింపక తప్పించుకొని యెట్లు పోగలదు? అందువలన జాగ్రద్దశలో ధ్యాన సమయమందు ఉపవిష్టుడై యున్న పోతనకు భగవంతుడు ప్రత్యక్షమైనాడు. అంతేకాని, శయ్యపై పరుండి నిద్రించుచున్నప్పుడు కాదు, కూర్చుండి నిద్రించుచున్నప్పుడును కాదు. ధ్యానించుచు 'కించిదున్మీలిత లోచనుండై' ఎదురుగా నిటలాగ్రమును జూచుచున్నప్పుడు కన్పించినాడు. గట్టిగా కనులు మూసికొన్నచో తారకము కదలదు. అపుడు కటికి చీకటి కన్పించును.

విషయ మిట్లుండ పోతనను గూర్చి వ్రాసిన వారందరు ఇతర కవులకు వలె పోతనకును స్వప్న సాక్షాత్కారమనియే వ్రాయుట మిక్కిలి యన్యాయము. రాముడు "తిరోహితుండైన సమున్మీలితనయనుండనై" అని పోతన వ్రాసెను గాని నిదురనుండి మేల్కాంచితినని వ్రాయలేదు. కనులు తెరచితినని మాత్రమే వ్రాసినాడు. ఇది అననుభూతులకు వింతగా విడ్డూరముగా నుండును. ఏమి చేయుదము!

అయితే, రామభద్రుడు భాగవతమును దన కంకితమిమ్మన పోతన అట్లు చేయలేదే. ఏ కవియైన తన రచించు గ్రంథమున కాదిని దన యిష్టదైవమును స్మరించుకొని పిమ్మట తదితరదైవములను స్మరించునుగాని పోతన అట్లు చేయలేదు. శ్రీరామచంద్రుని ప్రప్రథమమున స్మరింపక కృష్ణుని స్మరించెను.

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నా కంజాత భవాండకుంభకు మహానందాంగనాడింభకున్.

అని బాలకృష్ణుని స్మరించెను. పోనీ, యెట్లో సరిపెట్టుకొందమన్న షష్ఠ్యంతము లందును— "హారికి నందగోకుల విహారికి" అనుచు "గోపికానివహ మందిర యాయికి శేషశాయికిన్ సమర్పితంబుగా నే నాంధ్రంబున రచియింపం బూనిన

శ్రీమహాభాగవత పురాణంబునకు...' అని శ్రీకృష్ణునికే భాగవతమును సమ ర్పితము చేసెను. పోతరాజునకు శివకేశవులందు వలె రామకృష్ణులందును భేదము గోచరింపదు. రామపదమును కృష్ణపదమును భేదదృష్టితో వాడలేదు. కృష్ణపదమును వాడి రామపదమును వాడకపోలేదు.

పలికెడిది భాగవతమఁట,
పలికించెడివాఁడు రామభద్రుండఁట, నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా?

అని రామస్మరణముతోనే గ్రంథారంభ మొనర్చినాడు. రామాజ్ఞను శిరసా వహించి ప్రతి స్కంధాద్యంతములందు రామస్మరణ మొనర్చినాడు. 'జానకీ చిత్తచోరా' అనియు, 'రాఘవ రామా' అనియు, 'దశరథ రామా' అనియు, 'దశాననవిరామా' అనియు, 'రఘువీర' అనియు, 'కణకంఠకార్ముక విఖండన ఖేలన' అనియు, 'రామచంద్రనృపాలా' అనియు, 'రఘుకుల తిలకా' అనియు, 'జగదభిరామా' అనియు, 'రామచంద్ర నరేంద్రా' అనియు అనేక విధముల రామపదమును పోతన భక్తిశ్రద్ధలతో నిలిపినాడు.

గ్రంథము మొట్టమొదట "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్... మహానందాంగనా డింభకున్" అని కృష్ణస్తుతి కలదు గదా అందురా? అందులకు ప్రబల కారణమే కలదు. రామాయణము రాముని జెప్పుచున్నట్లు భాగవతము కృష్ణుని జెప్పుచున్నది. ప్రసంగవశమున రామకథ నవమ స్కంధమునం దేక దేశమున మాత్రము కలదు. తక్కిన స్కంధములందు లేదు. శ్రీకృష్ణుని చరిత మట్టుగాదు. దశమస్కంధ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు శ్రీకృష్ణమయ ములు. కావున భాగవతము శ్రీకృష్ణుని గురించినదనుటకు పోతన గ్రంథాదిని ఔచిత్యమును పాటించి శ్రీకృష్ణుని ప్రార్థించి వస్తుసూచనాదు లొనర్చెను. "వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్" అనునొక కట్టుబాటున్నది గదా. అందుచే పోతన యట్లు చేసెను. ఆ పట్టున ఆ గంటముతోనే షష్ఠ్యంతములను వ్రాసి ఆ ప్రక రణము ముగించెను. రామబ్రహ్మము, కృష్ణపరమాత్మ ఒక్కడే. పద భేద మున్న నేమి?

భూతేష్వంతర్యామీ జ్ఞానమయ స్సచ్చిదానందః
ప్రకృతేః పరః పరాత్మా యదుకులతిలకస్సఏవాయమ్..

అని ప్రబోధసుధాకరము కృష్ణుని సచ్చిదానందు డనుచున్నది. అట్టి పరాత్మ సంస్మరణము గ్రంథాదిని పోతన వంటి జ్ఞాని చేయుట సముచితము గదా!

పోతన భాగవత పంచశతి మహోత్సవముల బురస్కరించుకొని పోతనను గూర్చి అనేకు లనేక వ్యాసములు వ్రాసిరి. ఒక ఆచార్యుల వారు పంచశతి ప్రత్యేక సంచికలో పోతన విశిష్టాద్వైతి యని వ్రాసిరి. అందుకు వారు శ్రుతి గీతల ఆంధ్రీకరణమును ప్రమాణీకరించిరి. శ్రుతిగీతల ఆంధ్రీకరణము పోతనది కాదు. నారయది. నారయవ్రాతలంబట్టి పోతన మతముం బరిగణించు టేమిటో? నారయ ఆంధ్రీకరణము సరిగా లేదు. ''సత ఇద ముత్థితమ్'' అను శ్రుతి గీతను మిక్కిలి చెడగొట్టెను. నారయ విశిష్టాద్వైతి యైన కావచ్చునేమో కాని పోతన మాత్రము కాదు.

పోతన ఓమ్ ప్రథముననే ''శ్రీకైవల్యపదము'' ను గోరెను. కైవల్య మోక్షము అఖండాద్వితీయ సచ్చిదానంద బ్రహ్మాత్మైక్యస్థితి. విశిష్టాద్వైతులకు జీవబ్రహ్మైక్యలక్షణ కైవల్యముక్తి లేదు. వారికి సాలోక్య సారూప్య సామీప్య ముక్తులే కలవు. పోతన నోరార కైవల్యముం గోరుచున్నారు. మరియు ఆయన తాను మహేశ్వరధ్యాన పరాయణుడనని చెప్పుకొన్నారు. విశిష్టాద్వైతులకు శివుడు చుక్కెదురు. వారు హరిహరులకు భేదము పాటింతురు. పోతన అభేదము పాటించును. ఇట్టి పోతన విశిష్టాద్వైతి యని ప్రపంచమునకు చాటిన వచ్చు లాభమేమో?

పోతన నారాధింపబూనిన ప్రభుత్వమువారు వేలు లక్షలు ఖర్చు చేయు చున్నారు. అందువలన పోతనకు ఒరగునది ఏమియు లేదు. ఆ లక్షలతో ఆంధ్ర మహాభాగవతమును అందముగా నిర్దుష్టముగా నచ్చువేయించి వేలకొలది ప్రతులను ఉచితముగా ప్రజలపై వెదజల్లినచో పోతన ఆత్మ సంతోషించును. పోతన ఆరాధన సఫలమగును. నిర్దుష్ట భాగవతమునని ఏందులకంటినో వినుడు.

శ్రీ హయగ్రీవ శాస్త్రిగారి వారి దగ్గరనుండి నేటిదాక ఎందరో పండితులు భాగవతమును పరిశోధించి సవరించిరి. అచ్చు వేయించిరి. కొందరు వ్యావహారిక భాషావాదులు తమ పిచ్చి నందులో దూర్చిరి. కొందరు నిర్యతి ప్రాస వాదులు తమగోడు నందులో జొన్పిరి. కొందరు తాళపత్ర పుస్తకాభిమానులు తమ కండూతి దాని కంటించిరి, ఇట్లు భాగవతమునకు బహు నాయకత్వము పట్టినది. కాన నిష్పక్షపాతముగా శ్రద్ధగా మూలానుసారముగా భాగవతమును బరిశోధించి నిర్దుష్టము చేసి మన భవిష్యత్సంతతికి ఆ యమృతభాండము నందింపవలసి యున్నది. ఇంత మంచిపనిని గొప్పపనిని భాగవతాభిమానముగల ప్రభుత్వము తప్ప మరొకరు చేయలేరు. రాజు తలచుకొన్న (దెబ్బలకు) డబ్బులకు కొదవా ?

ఆంధ్ర మహాభాగవతమును నూరేండ్లకు పైబడిన కాలమునుండి యెందరో పండితులు పరిశీలించుచున్నారు గదా! వారందరి దృష్టులనుండి కొన్ని దోషములు దొంగలవలె తప్పించుకొని తిరుగుచున్నవి. ఆ దోషపదముల కేదో యొక అర్థ మొంటచే అవి గుణములుగా పైకి గన్పించుచున్నవి. దొంగయు మనుష్యుని వంటి వాడేగా! అర్థముండనిచో వెంటనే గుర్తించి సవరించెడివారే. అట్టివానిం గొన్నిటి మీ ముందుంచెదను.

1. ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపల నుండు లీనమై,
యెవ్వనియందు డిందుఁ, బరమేశ్వరుఁ డెవ్వఁడు, మూలకారణం
బెవ్వఁ, డనాది మధ్యలయుఁ డెవ్వఁడు, సర్వము దానయైన వాఁ
డెవ్వఁడు, వాని నాత్మభవు, నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. (8.78)

గజేంద్రుడు పరమేశ్వరుని ప్రార్థించు సందర్భములోని ఈ పద్యము. ఈ పద్యము రాని కవిగాని పండితుడుగాని భక్తుడుగాని గాయకుడుగాని ఉండడు. కొందరు సభా ప్రారంభము నందును దైవ ప్రార్థనగా చదివెదరు. ఇంత ప్రసిద్ధమైన పద్యమునందు దొంగ దాగుకొని యున్నాడు. జగమెవ్వని యందు లీనమై యుండును. ఎవ్వనియందు డిందును. ఈ రెండు వాక్యముల కర్థ భేద మున్నదా? లీనమగుట, డిందుట ఒకటి గాదా ? పోతన మహాకవి యిట్లు పునరుక్తిదోషగ్రస్తముగా వ్రాయునా ? చెప్పుడు.

కవి యిందు మొదటి మూడు వాక్యములలో జగముల సృష్టి స్థితి లయములను జెప్పినాడు. మొదటి వాక్యమున సృష్టిని జెప్పి, రెండవ వాక్యమున 'ఎవ్వని లోపలనుండు లీలమై' అని స్థితిని జెప్పినాడు. అచ్చులో 'లీల' అను పదములోని 'ల' స్థానమున 'న' అను అక్షరమును కంపోజర్ పెట్టినాడు. 'లీలమై' అనునది 'లీనమై' ఐనది. రజ్జువందు సర్పము వివరముగా నున్నట్లు ఈశ్వరునందు జగము లీలగా నున్నది. లీల యను పదము వివర్తముం దెల్పును. మూడవది 'ఎవ్వనియందు డిందు' అను వాక్యము లయము దెల్పును. కాన 'ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపల నుండు లీలమై' అను పాఠము సాధువు.

యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయం
యోస్మాత్పర స్మాచ్చ పర స్తం ప్రపద్యే స్వయంభువమ్. (8.3.3)

అను మూల శ్లోకమునకు ఔపనిషద పద్ధతిలో గాక అందరకు తాత్పర్యము బోధపడునట్లు పౌరాణిక పద్ధతిలో పోతన తెలుగు పద్యము వ్రాసెను. ఈ గజేంద్రుని స్తోత్రములో సగుణ నిర్గుణములు మాయతో దాగుడుమూత లాడుచుండును. సామాన్య కవికి కొరుకుడు పడదు. అందులకే 'భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు' అని పోతన పల్కినది.

2. సర్వాగ మామ్నాయ జలధికి (8.81) అను సీసమున 'గుణలయో ద్దీపిత గురుమానసునకు' అని గలదు. లయ పదమున కర్థముంటచే దానిపై పెవ్వరు చూడలేదు. 'గుణలయోద్దీపిత' గాదు 'గుణచయో ద్దీపిత' అనవలె. 'తత్‌క్షోభ విస్ఫూర్జిత మానసాయ' (8.3.16) అని మూలము. సత్వ రజ స్తమోగుణములు సమస్థితిని వదలి కలత చెంది ఉద్దీపించిన గాని ఈశ్వరుడు సృష్టికి గడంగడు. 'సోకా మ యత బహుస్యాం ప్రజాయేయ' అని శ్రుతి. గుణలయమైన యింకేమున్నది? సర్వశూన్యము.

3. వచ్చు నష్టమ వసువు సావర్ణి వాడు. (8.416)
'అష్టమ వసువు' అని పడినది. తప్పు. 'అష్టమ మనువు' అనవలె. సావర్ణి అష్టమ మనువు.

4. మహిత రౌద్రంబున మల్లుర కళనియై (10.1326) అను పద్యమున 'ఖలులకు విరసంబుగా దండియై' అని కలదు. ఈ పద్యమున నవరసములు చెప్పబడినవి. 'ఖలులకు విరసంబుగా' అని కాదు. 'ఖలులకు వీరంబుగా' అనవలె. వీర రసము లేకున్న నొక రసము తగ్గును.

5. చంపె రక్కసిఁ బట్టి చక్రవాకుని గూల్చె (10.1382) చక్రవాకుని గాదు. 'చక్రవాతుని గూల్చె' అనవలె. 'చక్రవాతశ్చ దానవః' అని మూలము. 'ఆలోఁ జక్రసమీరదైత్యుడు' అని (10.271) పద్యము.

6. విజ్ఞాన రాగాది విరహిత స్వాంతుండు (10.ఉత్తర. 985) కుచేలుడు విజ్ఞానము లేనివాడు కాడు. 'విజ్ఞాని; రాగాది విరహితస్వాంతుండు' అనవలె.

7. భూపాలకుఁడు నిద్రపోయెడి అను (7.58) పద్యమున 'ప్రాణి దేహములకు వేఱై తాను ముఖ్యుఁడై' అని కలదు. 'ప్రాణ దేహములకు' అనవలె. 'సచాన్యః ప్రాణదేహయోః' అని మూలము.

8. మునీంద్రులు నిజవిముక్తకాములై (7.466) 'నిజవిముక్తి కాములై' అనవలెను.

9. ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి పీఠఁగా
నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్ళి కల్ల మా
టాడదు మిన్నకేని సుగుణావళి కిందిర గాక సాటి యే
చేడియ లేదు చూరికులశేఖరు కన్యయమమ్మకున్. (6.27)

ఇందు 'ఇందిరగాక యే చేడియ లేదు.' ఇంతవర కర్థము సరియే. అటుపై 'చూరి కులశేఖరు' అని కలదే ? చూరి కర్థమేమి ? అదిగాదు. 'ఇందిర గాక సాటి యే చేడియ లేరుచూరి కులశేఖరు కన్యయమమ్మకున్' అని యుండవలెను. ఏ చేడియలు-ఏరుచూరి కులశేఖరు' అని విభజనము. ఎఱ్ఱన యింటిపేరు 'ఏర్చూరు.' అదియే యిచట గణానుకూలముగా 'ఏరుచూరు' ఐనది. మాది ఏర్చూర్లు. మేమును పద్యములలో ఏరుచూరు అని వ్రాయుదుము.

10. ఆ గుణంబులకు సాక్షి మాత్రంబగు శరీరంబు వేఱని యెవ్వ దెఱుంగ నోపు. (6.417)

శరీరము పాంచభౌతికము. జడము. అది సాక్షిగా నుండలేదు. శరీరము గాదు. అచట 'శారీరి' అని యుండవలె. శారీరి ప్రత్యగాత్మ సాక్షి.

11. స్వప్నంబు నందుల సౌఖ్య మాకారంబు నందుల నిత్యమై యంతలేని యట్టి చందంబున (5.1.158)

'ఆకారంబు'గాదు 'ఆ కాలంబు' అనవలె. స్వప్న సుఖము ఆ కాలమున నుండును. తరువాత నుండదు.

12. అచ్చట విప్రసూనుఁడు భయం బొక యించుక లేక, చంపఁగా
వచ్చినవారి యందుఁ గరవాలము నందును గాళి యందుఁ దా
నచ్చుత భావముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయున్.
(5.1.186)

ఇచట మూడవ పాదముం గూర్చి అకాడమీ భాగవతమున నిట్లున్నది. "అచ్చట విప్రసూనుఁడు అను పద్యమున 'అచ్యుత భావము' అని అన్ని అచ్చు ప్రతులలో నున్నది. అచ్చుతభావము వ్యాకరణ సమ్మతము కాకపోయినను పోతన రచనలో నిట్టి సమాసములు తరచు కనబడుచుండుటను బట్టియు, ప్రాసము ననుసరించియు 'అచ్చుతుడు' అనుట వాడుకలో నుండుట వలనను ఇదే కవి పాఠముగా గ్రహింపబడినది."

ఈ వ్రాతతో నాకు పనిలేదు. ఈ పద్యమును పోతన గాదు, బొప్పరాజు గంగన వ్రాసెను. 'అచ్చుత భావము'గాదు. 'అచ్యుత భావము' గాదు. 'అచ్చితి భావము' అని గంగన కవి వ్రాసియుండును. 'చితి' అన పరబ్రహ్మము. అ+ చితి = అచ్చితి. భరతుడు మహాజ్ఞాని. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతి నెఱిగిన భరతుడు నామరూపాత్మకమైన యీ సర్వ జగమును బ్రహ్మముగా చూచుచున్నాడు. కాననే ఆయన చంపబడి అవమాన మొందలేదు. పద్యములో 'అనుమానము' అని యున్నది. అది తప్పు. 'అవమానము' అని యుండవలె.

"అచ్చితి భావముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యవమానము నొందక యుండె నెంతయున్."

అని పద్య ముండవలెను.

13. ఈశ్వరుని వలనం జేటు లేని కాయంబులు గలిగి. (5.2.105)

ఈశ్వరుడు నశింపని దేహముల నీయడు. పుట్టిన దేహములు శాశ్వతముగా నుండవు. అచట 'కాయంబులు' గాదు 'కామంబులు' అని యుండవలె. 'ఈశ్వరాద ప్యప్రతిహత కామాః' (5.24.6) అని మూలము.

14. అట్టి నిన్నుఁ బరమాణుకారణవాదులైన కణ్వ గౌతమాదులును (10 ఉత్తర 1220)

ఇట 'కణ్వ' తప్పు. 'కణాద' అని యుండవలె.

ఇట్టి దోషములు భాగవతమున నింకను గలవు. మాదిరికి కొన్ని చూపితిని. ఆ దుష్టపదము లొక యర్థముం గల్గియుంటచే వాని నెవ్వరును బరికించి చూడమి వలన నవి తప్పించుకొని తిరుగుచున్నవి. బహుళ ప్రచారమందున్న గ్రంథము గాన అనోట నానోట బడి కొన్ని పాఠాంతరముల గూర్చుకొన్నది. తప్పులు లేకున్న చిక్కులేదు గాని తప్పు లున్నచో నెట్లు ? చూడుడు- "ఓ కమలాక్ష ! యో వరద !" (8.93) అని గజేంద్రుడు మొరపెట్టుచున్నాడు. ఇచట అకాడమీ ప్రతిలో "ఓ కమలాత్మ!" అని గలదు. వావిళ్ళ ప్రతిలో "ఓ కమలాప్త !" అని గలదు. వాడుకలో "ఓ కమలాక్ష !" అని గలదు.

ఇంకొకటి. "పలికెడిది భాగవతమఁట పలికించెడివాఁడు రామభద్రుండఁట" అని వాడుకలో గలదు. అకాడమీ ప్రతిలోను, వావిళ్ళ ప్రతిలోను "పలికించు విభుండు" అని గలదు. పూర్వము హయగ్రీవ శాస్త్రిగారి పాఠము "పలికించెడి వాఁడు" అనియే.

"ఈ వత్సార్భకులన్ భుజంగపతి తా హింసింప" (10.487) అని కవి వ్రాసిన దానిని కవి గాని ప్రత్యంతరము వ్రాయువాడు 'తా' ఎందుకనియో, పొరపాటుననో "ఈ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ" అని వ్రాసినాడు. ఇచట యతి తప్పినది. అథవా సందిగ్ధములో పడినది.

అందువలన నిర్దుష్ట భాగవతామృతమును సిద్ధము చేసికొనుట యందు దోషము లేదని నా యభిప్రాయము.



# భాగవతము - రసపోషణము

—శ్రీ సేపూరి లక్ష్మీనరసయ్య

ఆంధ్రదేశమున వేరెన్నిక వడసిన పవిత్రగ్రంథ రాజములలో భారత భాగవతములు ముఖ్యములు. అవి రెండును సర్వాంగ సుందరమగు గ్రంథములు. వాని కింతటి పవిత్రత వాని కథాంశముల వలనను, వాని యందలి కవిత్వసరణిని బట్టియు వచ్చినది. ప్రకృతము భాగవత ప్రాశస్త్యమును కొంతవర కారయుదము.

భాగవతము నందలి ప్రధాన కథ భగవంతుని లీలావతారముల వర్ణనము. ఇందు తరచుగ భగవద్భక్తులగు రాజన్యుల యొక్కయు, భగవంతునకు ముందు పిమ్మట నున్న మనువుల యొక్కయు చరిత్రములు మనోహరముగా వ్రాయ బడినవి. భగవద్భక్తుల మహిమలు, భరతఖండమున గల రాజుల పూర్వ చరిత్ర ములు, దివ్యావతార ప్రభావములు నీ గ్రంథమున వేర్కొనబడినటు లితరపురాణ గ్రంథములలో గానరాదు. ముఖ్యముగ భాగవతమున శ్రీకృష్ణావతార ప్రభావమే యెక్కువగ నభివర్ణింపబడినది. హైందవ తత్త్వసార మీ గ్రంథమున సంగ్ర హముగా చెప్పబడినది. దానంజేసి ప్రతి హైందవునికి నీ గ్రంథము పవిత్రమై పఠనీయమై యున్నది.

భాగవత కవితా శిల్పమిక విచారింతము. దీని యందలి భావవైశద్యము, రసౌచిత్యము, అలంకార సంపద, కల్పనా చమత్కారము, పాత్ర పోషణ, భావనాశక్తి, అర్థబాహుళ్యము లోనగునవి వర్ణనాతీతములు.

పోతరా జవసరమగు చోటుల సమయానుసారముగ రసపోషణ చేసి యున్నాడు. ఎట నే రసము వ్యక్తీకరింపవలయునో పోతన కంటె నెరగిన కవి యింక నొకడు గానరాడు. ప్రథమ స్కంధములో నశ్వత్థామ యవమాన సమ యమునందు భయానక బీభత్సరసములును, అర్జునుడు కృష్ణనిర్యాణవార్త ధర్మజునకు దెలుపునపుడు కరుణరసమ్మును, సప్తమ స్కంధములో ప్రహ్లాద

చరిత్ర యందు శాంత కరుణరసములును, నృసింహావతార ఘట్టమున వీరరౌద్రా ద్భుతరసములును, దశమ స్కంధములోని రుక్మిణీ కల్యాణమున శృంగార భక్తి రసములును, నరకాసురవధ యందు వీర శృంగార రసములను పరమ రణీమయముగ వర్ణించియున్నాడు పోతన.

"రసో వైసః" అనుసూక్తి నెరిగినవా డగుటచే రస స్వరూపుడగు భగ వంతుని దివ్యమంగళ విగ్రహమును భాగవత రచనారంభముననే పోతరాజు వర్ణించెను. ఆ మంగళమూర్తిని వర్ణించుటలో ఆతడు తన్మయుడై కావ్యప్రపంచ మును సైతము మరచిపోవుట కలదు. పాఠకులకు, భక్తులకు నాయా భాగములు సుధావర్షముల వంటివని చెప్పవచ్చును.

ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు వివిధోపాయముల హింసించుట యందును, ఆ హింసల నన్నింటిని దీనభావము లేక ప్రహ్లాదుడు భరించుట యందును శాంత కరుణాద్భుత బీభత్సరసములు వర్షించినట్లుండును.

తన్ను నిశాచరుల్ వొడువ దైత్యకుమారుఁడు మాటిమాటి "కో
పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా
పన్నశరణ్య! యో నిఖిలపావన" యంచు నుతించుఁగాని తాఁ
గన్నుల నీరు దేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా! (7.193)

అను పద్యాదులందు శాంతకరుణరసములును—

ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి
కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన
విసరి కుమారుని వ్రేయఁ బంపు
నొకమాటు విషభీకరోరగశ్రేణులఁ
గడువడి నర్భకుఁ గఱవఁ బంపు
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో
మొత్తించి బాలకు ముంపఁబంపు

విషముఁ బెట్టఁ బంపు విదళింపఁగాఁ బంపు
దొడ్డకొండచఱులఁ ద్రోయఁ బంపుఁ
బట్టి కట్టఁ బంపు బాధింపఁగాఁ బంపు
బాలుఁ గినిసి దనుజపాలుఁ డధిప! (7.198)

ఎఱుఁగడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలం
దరలఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచు నున్నవాఁ డొంౕ నిమేషము దైన్యము నొందఁ డింక నే
తెఱఁగునఁ ద్రుంతు వేసరితి దివ్యము వీని ప్రభావ మెట్టిదో! (7.202)

లోనగు పద్యములందద్భుత బీభత్సరసములు వెదజల్లబడినవి. అదియును గాక కుళింగపక్షి శోకమునందు జాతిదైన్యము నెట్లు మేళవించెనో గమనింపుడు—

అడవుల మేత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గు సేయ కి
క్కడ విహరింప నేఁ డకట! కట్టిడి బ్రహ్మ కిరాతుచేతిలోఁ
బడుమని వ్రాసెనే నుదుటఁ బాపపుదైవము కంటి కింతయె
క్కుడు బరువయ్యెనే బ్రదుకు గోమలి! యేమన నేర్తుఁ జెల్లరే. (7.61)

ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటినుండియు మేఁతగానమిం
బొక్కుచు గూఁటిలో నెగసి పోవఁగనేరవు మున్ను తల్లి యీ
దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కినిక్కి న
ల్దిక్కులఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా! (7.68)

గజేంద్ర మోక్షణ కథ యందు గజేంద్రుని భక్తి, ఆయాసము, సందేహము, భయము నిపుణతతో నీ క్రింది పద్యములం దిముడ్చబడినవి.

వినుదుట జీవుల మాటలు
చనుదుట చనరాని చోట్ల శరణార్థులకో
యనుదుట పిలిచిన సర్వముఁ
గనుదుట సందేహమయ్యెఁ గరుణావార్ధీ! (8.91)

కలుగఁడే నా పాలి కలిమి సందేహింపఁ
గలిమిలేములు లేక కలుగువాఁడు
నా కడ్డపడరాఁడె నలినసాధువులచేఁ
బడిన సాధుల కడ్డపడెడువాఁడు
చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ జూచువాఁడు
లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల
మొఱలెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు

అఖిల రూపముల్ దనరూపమైనవాఁడు
ఆది మధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె వేగరాఁడె. (8.87)

గజేంద్రుని మొరయం దెంత కరుణరస మున్నదో !

ఇక కుచేలోపాఖ్యానము నందలి దారిద్ర్యావస్థ దైన్యస్థితి వర్ణన సర్వ విధముల పోతన జీవితముతో పోలియున్నట్లు తోచుచున్నది :

అనుడు వేదవ్యాసతనయుఁ డా యభిమన్యు
తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
''జనవర ! గోవింద సఖుఁడు కుచేలుండు
నా నొప్పు విప్రుండు మానధనుఁడు;
విజ్ఞాని, రాగాది విరహిత స్వాంతుండు;
శాంతుండు; ధర్మవత్సలుఁడు; ఘనుఁడు;
విజితేంద్రియుఁడు, బ్రహ్మవేత్త; దారిద్ర్యంబు
బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి

నడుగఁ బోవక తనకుఁ దానబ్బినట్టి
కాసు పదివేల నిష్కముల్గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభిరక్ష
యొక విధంబున నడపుచు నుండునంత. (10. ఉ. 965)

లలిత పతివ్రతాతిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దుస్సహదరిద్ర
పీడచేఁ గడునొచ్చి పెదవులు దడుపుచు
శిశువు లాఁకటిచిచ్చుచేఁ గృశించి
మలమల మాఁడుచు మానసం బెరియంగఁ
బట్టెఁ డోరెము మాకుఁ బెట్టు మనుచుఁ
పత్రభాజన ధృతపాణులై తనుఁ జేరి
వేఁడిన వీనులు సూడినట్ల

యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె "నో జీవితేశ!
తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్లు
నొంప దీని కుపాయ మూహింపవైతి." (10. ఉ. 966)

నరకాసుర యుద్ధము వర్ణించుట యందు కనబరచిన భావ ప్రకటనము, కల్పనాసౌష్ఠవము ప్రశంసనీయములై మనోజ్ఞములై యున్నవి :

వీఁకఁ జక్కఁగఁ బట్టి వెర వెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు పట్టనేర్చె
మ్రాఁకునఁ దీఁగెఁ గూర్పంగ నేరని లేమ
గుణము నే క్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరము ముత్యము గ్రువ్వఁజాలని యబల యే
నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు చెప్పనేరని తన్వి
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ

బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ
చారు సత్యభామ సత్యభామ. (10. ఉ. 181)

సత్యభామ వీరాకారము, ధనుస్సు సగుణమును చేయుట లోనగునవి యీ క్రింది పద్యమునం దిముడ్పబడినవి-

ఆ విల్లంది బలంబు నొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోక దుర్లోకయై
తా వేగన్ సగుణంబుఁ జేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడామహోత్కంఠతోన్.(10.ఉ.175)

యుద్ధ రంగమున కురికి భయంకర మృత్యుదేవిని నరకాసురుని కౌర కాహ్వానించు సత్యభామా స్వరూపము నరకాసురుని కెట్లు గనవచ్చుచున్నదియు ప్రేమమూర్తి యగు కృష్ణుని కెట్లు గనపచ్చుచున్నదియు పోతరా జొక్కమారె మనోజ్ఞముగ చెప్పియున్నాడు. వీర శృంగార రసముల కొక ప్రత్యేకత సంఘ టించి యొకే పద్యమున రచించుట పోతరాజు వంటి రౌచికునకు దప్ప మరి యొకనికి సాధ్యము కాదు.

రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు
భావజు పటిభియై ప్రళయాత్క పరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁత చాప
మమృత ప్రవాహమై యనల సందోహమై
తనరారు నింతి సందర్శనంబు

హర్షదాయియై మహారోషదాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీర రసము లోలి విస్తరిల్ల. (10. ఉ. 183)

ఒక వ్యక్తి యవస్థ నేకవిధముగ వర్ణించుటలో భావనాశక్తి మెండుగా గావలయును. అట్టి శక్తి పోతనయందు మిక్కుటముగా గలదనుట నిక్కువము. ఇట్టి దుష్కరనియమముతో పద్యములు పూర్తిచేసి రసమును గాపాడిన వారరుదు. రసము మించిన యలంకారములు గూర్పనెంచి కృతార్థులు గాలేక వ్యర్థ పదములతో పద్యములు పూరించువారిని గర్హింపనగు. సహజమైన శైలిలో నెట్టి దుష్కర నియమమేని రసవంతముగ దీర్చు పోతరాజు సర్వ విధముల ప్రశంసనీయుడే.

పోతన భక్త్యుద్రేకములచే పరవశుడై యందందు దేవతా స్తోత్రములు మిక్కుటముగా వ్రాసియున్నాడు. షష్ఠ్యంతములతోపా టీక్రింది పద్యము నందలి రసము, భావబోధనము కడు విచిత్రము :

ఒక చెలికానిపై నొకచేయి సాఁచి వే
　　ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు
　　సెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుఱుచచుంగులు వ్రేల్చి కొమరారఁ గట్టిన
　　పసిఁడి వన్నియ గల పటమువాని
నొదలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన
　　దట్టంపుఁ బించెపు దండవాని
రాజితోత్పల కర్ణపూరములవాని
మహిత పల్లవ పుష్పదామముల వాని
భువనమోహన నట వేషభూతి వానిఁ
గనిరి కాంతలు కన్నులఁ గఱవుదీఱ. (10. పూ. 868)

ఈ క్రింది పద్యమునందలి వర్ణన క్రమమును, శయ్యామార్దవమును జవి చూతురు-

దేవకీసుతుకోర్కి తీఁగలు పీడంగ
　　వెలఁదికి మైదీఁగె వీఁదదొడఁగెఁ
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ
　　గాంతి నింతికి ముఖకమల మొప్పె

మధువిరోధికి లోన మదనాగ్ని పొడసూపఁ
బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె
శౌరికి ధైర్యంబు సన్నమై దయ్యంగ
జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె
హరికిఁ బ్రేమబంధ మధికంబు గాఁ గేశ
బంధ మధికమగుచు బాల కమరెఁ
బద్మనయను వలనఁ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనంబు నిండియుండె. (10. పూ. 1694)

పోతరాజు శబ్దాలంకార ప్రియుడు. అంత్యనియమము నేర్పుగ గూర్పు జేయుట యందు, మత్తేభవృత్తముల రసవంతముగ రచించుట యందు నీ కవి యసమానుడు. పోతరాజువలె ధారాశుద్ధి గల కవితలో అంత్యనియమాది శబ్దాలంకారములతో భావానుకూలముగ వ్రాయుట దుష్కరము.

అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడువఁడని నడ యుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. (8.103)

ఈ పద్యమున తన కవితాశిల్పము ప్రకటించుటకై సర్వలఘునియమము, శుద్ధాంధ్రభాష, వృత్త్యనుప్రాసము కాపాడి రసపోషణముతో జీవమును నెలకొల్పినాడు పోతన. ఇట్టి కూర్పు బిగి, కయిత విన్నాణము, పలుకు పొందిక తరచుగ నితరులలో కానరావు. పద్యమునందే కాక గద్యమునందును నిట్టి శబ్దార్థాలంకారములు రసపుష్టి కాననగును. ఇట్టి పద్యములు పోతరాజు కవిత్వముతో ననేకములు గలవు.

పదప్రయోగము నందు కొందరు సంస్కృత పదబాహుళ్య కవితాభిమానులు. మరికొందరు ఆంధ్ర పదబాహుళ్య కవితాభిమానులు. ఈ రెండు తెగల రసజ్ఞుల ''మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్'' అని పోతరాజు ప్రతినబూని సర్వజనసమ్మతముగ పండితపామరుల కుపయోగించునట్లు ఉభయ భాషలను సమముగ సంధించి భాగవతమును జనాహ్లాదకరముగ వ్రాసెను.

పోతనయం దితరకవుల యందు లేని యమోఘశక్తి యొకటి కలదు. దృశ్య ప్రబంధము ప్రదర్శించు తరి నర్తకుడు తానే కథాపాత్రము ననుకొని నర్తనమును గావించినట్లు ఒక భక్తుని చరిత్రము వ్రాయునప్పుడు ఆ భక్తుడు తానే యనుకొని తాదాత్మ్యము పొంది యా భాగమును రసవత్తరముగ తృప్తి కరముగ ననన్య సాధ్యముగ వ్రాయును. ఇట్టి తాదాత్మ్యముతోనే ప్రహ్లాద చరిత్రమున, గజేంద్ర మోక్షమున, కుచేల చరిత్రమున, శ్రీకృష్ణ జీవితమున పాత్రములలో లీనమై పోతన యా యా ఘట్టములకు ప్రాణదానము కావించియున్నాడు. కావుననే భాగవతమునందలి పై కథాంశములు రసవత్తరములు కాగలిగినవి. విచార కరములగు నంశములు కవితా సృష్టిలో నిముడ్చు తరి తానేడ్చుటయు, శృంగార రసము వర్ణించు తరి నాయకోద్రేకము లోన నడంచుకొనుటయు, వైరాగ్యము వ్రాయుతరి తన యాశ్రిత హితభావము ప్రకటించుటయు, భక్తి వ్రాయుతరి తన నిశ్చల హృదయము ప్రదర్శించుటయు- ఇంత యేల ఏ రసము పోషించునప్పు డా రసములో లీనమగుట పోతరాజ కవివర్యునకు సహజస్వభావము. రసమున తాదాత్మ్యము పొంది వ్రాయుట చేతనే భాగవతమున కింత యనరాని విలువ గలిగినది.

భక్తునకు, సంగీతమునకు నవినాభావసంబంధము గలదు. కావున భక్త కవి తన కవితను వృత్త్యనుప్రాసములతో నంత్య నియమములతో యమకములతో సంగీతమున కనుకూలముగా వ్రాయుట సహజము. పోతన భక్తుడగు గాయకుడు గాననే సంగీత సంప్రదాయమున కనుకూలముగ శబ్దాలంకారములను పోషించె నని తోచుచున్నది. ఇట్లే దాశరథీశతకకర్తయు చేసియున్నాడు.

ముఖ్యముగ పోతన భక్తిరసమును, కరుణరసమును పోషించెను. శృంగారమును సరసముగ రమణీయముగ నిర్వహించెను. భక్తిరసమున నాంధ్ర వాఙ్మయమున ప్రధాన పీఠము పోతరాజుదే. ఆతని నా పీఠము నుండి తొలగింపగల కవి "న భూతో న భవిష్యతి" యని సాహసముతో చెప్పవచ్చును.

*(ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, మార్చి 1925)*



# మహాకవి — పోతన

— శ్రీ కల్లూరు వేంకట నారాయణరావు

ప్రతి గ్రంథమును తత్కర్త యొక్క జీవితాశయమును వ్యక్తీకరించును. ఆ వ్యక్తీకరణమున రచయిత జాతీయత ప్రతిబింబితమై యుండును. దానియందే కవి కాలపు సాంఘిక రాజకీయస్థితు లప్రయత్నముగ ప్రదర్శితములై యుండును.

పోతన భాసిల్లినది పదునైదవ శతాబ్ది. ఆ శతాబ్దియందు భారతదేశములో పతానురాజ్య మస్తమించినది. ముఘల్ చంద్రు డింక నుదయింపలేదు. విజయ నగరరాజ్యమున నరసింహనాయకుని వంశ తటిల్లత తలయెత్తలేదు. కాకతీయ రాజ్యము భామినీ విక్రమాబ్ధిలో మునిగిపోయియున్నది. ప్రసిద్ధమైన యాంధ్ర రాజ్యమేదియును అప్పటికి రేకెత్తలేదు. కాని ద్వితీయ దేవరాయని సేనానాయకుల విజృంభణములో భవిష్యద్విజయనగర సామ్రాజ్యవైభవమును సూచించు నురుము లురుముచునే యున్నవి. అంతయు నంధకారావృతము. భామినీ రాజ్యమున మహమ్మదు గావను రాజనీతి, వంగదేశమున చైతన్యుని శిష్యుల భక్తి తత్త్వము, పంజాబున నానక్ అంతేవాసుల అమలబోధ, హిందీ మహారాష్ట్రి వాఙ్మయముల కబీరు తుకారాముల వచస్సరణి విరాజిల్లుచున్న సమయమది. ఈ సమయముననే గాఢతమఃపటలి నపనయించుటకై ఆంధ్రదేశమున భక్తాగ్రగణ్యుఁ డగు పోతన యవతరించెను.

పోతన యవతరించినది సంధిసమయము. ఆంధ్రమహాజనుల రసనారంగమున నుదయించి గుణగ విజయాదిత్యుడు, యుద్ధమల్లుడు మున్నగు వారిచే సీసములు తరువోజలు కొన్ని నేర్చి వారి శాసనముల లోగొని, నన్నయచే సభా మధ్యమున నిలువగరచి, కుండలీంద్రునిచే నర్థసంపద నొంది, ప్రబంధ పరమేశ్వర నాచనసోమనలచే ప్రౌఢపదవిన్యాసము వడసి బాల్యదశను గడచి నవయౌవన రససౌభాగ్యము నందు స్థితి అప్పటికి ఆంధ్రభాషాయోషకు చేకూరినది. ఐనను ఆమె యుద్విగ్న మనస్కయై యుండెను. సాంఘికస్థితి స్వమతా

వేళ పరపక్షులగు మహమ్మదీయుల దుండగములచే కళంకితమగుచుండెను. అట్టి తరి నహంకారభూయిష్ఠులగు భూపతుల నిరసించుటయు, నాంధ్రభాషారమణికి నూత్న యౌవనసందర్భ సముచిత స్వాతంత్ర్య గౌరవ మానంబుల గరపి సరసవిభవముచే నుద్బోధించుటయు, భగవద్భక్తితత్త్వ ప్రకాశీకరణముచే మహమ్మదీయమతధ్వాంతమును బాపుటయు నను నాదర్శకార్యములు పోతనపై నాధారపడినవి.

భగవత్తత్త్వార్థ ప్రతిపాదనమునందు భగవద్గీతకు పిమ్మట భాగవతమే లోకోత్కృష్టమైన గ్రంథరత్నము. దానిని మూలానుసారముగా తెన్గింప వేదాంత పరిజ్ఞానమును, నిస్తులమేధావిస్ఫురిత నిరంకుశకవితా వేగమును గల మహాకవికి దప్ప నొరుల కసాధ్యము. సహజకవితామృత తరంగిత దుర్వార ప్రతిభాసము ద్రుడైన యట్టి మహాకవి పోతన్న.

ఆ కాలపు రాజులను సమకాలికులగు కవులవలె నింద్రుడు చంద్రు డుపేంద్రుడని భూషింపక వారి నాశ్రయించి యాచించుటకు తుచ్ఛీకరించి స్వతంత్ర దృక్పథము నాంధ్ర వాఙ్మయమున ప్రప్రథమమున నిర్మించిన ఖ్యాతికి పాత్రుడై తన కాలపద్ధతిని విడనాడి కాలమునే శాసించినవా డీతడు. ఇట్లీతడు తత్కాలశాసకుడై భక్తిభావప్రాధాన్యైకేశ్వరోపాసన వెలయు నద్వైత తత్త్వ మును ప్రచురించుటచే నుత్తర దేశమున కబీరు తుకారామ చైతన్యు లెట్టి మహాత్ములో యట్టి మహాత్ముడే యట్టి యుగోద్ధారకుడే యాంధ్రదేశమున కనుట సాహసము గాకున్నది.

శ్రీకారముననే కృష్ణస్తుతి. తరువాత శివబ్రహ్మస్తోత్రములు. అనంతరము గణనాథ సరస్వతీ పార్వతీ లక్ష్మి వ్యాస వాల్మీక శుకాభివాదనము. పిదప సంస్కృతాంధ్రకవి జనాభివందనము. ఆ పైని భావికవి బహూకృతి. పదంపడి కృతిపతిత్వ నిర్ణయము. ఆంధ్ర కవులలో నన్నయ తిక్కన లిద్దరే పేర్కొన బడిరి. కాని సంస్కృత కవులు పెక్కురు స్తుత్యులైరి. సంస్కృత సాహిత్యమున పోతన కధిక ప్రాచుర్యము కల్మియే దీనికి హేతువై యుండును. కొండొకచో ననుసరణమున కనువుపడిన సోమన భాస్కరుల దలంపలేదు. వారును "ఇతర పూర్వకవి" సంభావనలో జల్లిపోయినారు. కృతిపతిత్వ నిర్ణయారంభ

మునసే ''ఇమ్మను జేశ్వరాధముల'' నని యప్పటి నరనాథుల తిరస్కారసరణి. ఈ వ్యత్యస్తతకు ఆంధ్రసరస్వతి వల్లె యన్నది. పోతనా ! నీవే ధన్యుడవు. అన్ని కష్టములను నిరసించి, రాజభీతికి దలంకక స్వాతంత్ర్యశీలుడే మహాకవి యని తేటపఱచితివి.

''వేద కల్పవృక్ష విగళితమై శుక
ముఖ సుధాద్రవమున మొనసి యున్న
భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవి గనుఁడు రసికభావవిదులు''

అని పరిశీలకులకు హెచ్చరిక గొలిపి ప్రథమస్కంధ మన నగు భాగవతావతారిక నారంభించినాడు. నైమిశారణ్య వర్ణనము మొదటి దీర్ఘ వచన రచన. దీనిలో శ్లేషానుప్రాణితాభేదాధ్యవసాన మగు నర్థాలంకారము మెండుకొని యున్నది. ఈ యలంకారమును సాధారణముగ పోతన వచన రచనలందే గుప్పించినాడు. ఇయ్యలంకృతి యష్టమస్కంధమున సరోవరవర్ణనమున ద్వ్యర్థ పదవిన్యాస ప్రౌఢిమను సూచించి, హాలాహలోదయ సందర్భమున నుపమాలంకార సహజ సౌభాగ్యము వడసి, గంగావతరణమున నసదృశ గంభీరభావరస సముత్తేజితమై పొంగి కట్టు తెగి విశృంఖల కల్పనా ప్రవాహముగా పరిణమించినది.

ఇతని వచనరచనలు నిడుదలైన యెడల వర్ణనావసరములందెల్ల కోమల పదమాధురీఝరీ విలసితములగు వృత్తములనియే యెన్నవలసియుండును. నృసింహావతార ఘట్టము నందలి వీరరసభాసురములైన శబ్దార్థాలంకారములును, మోహినీ విలాస ప్రదర్శన వేళలోని యనన్యసాధ్య శృంగార రససన్నివేశ సముంచితానల్పకల్పనలును, అమరావతీ నగర వర్ణనమందలి ప్రకృతి సౌందర్య ప్రత్యక్షీకరణ మొనరించిన ప్రతిభావిభవమును ఈ మహాకవిని సర్వజ్ఞునిగా వేనోళ్ల జాటుచున్నవి. ఎన్నిమారులు చదివినను తనివిదీరక నవనవభావస్ఫూర్తి దోపించు నాతని కవితారచన మితరకవుల కెవ్వరికిని సర్వసమగ్రముగ నలవడ లేదన్న సాహసోక్తి కానేరదు.

పద్యము లన్నిటను నొకవిధమగు తూగు కన్పట్టును. అది యీతని కవితకు స్వాభావికము. మచ్చున కొక్క పద్యము—

మలగున్ మెల్లని గాలికిన్, బటురటన్మత్తద్విరేఫాళికిన్
దలఁగున్, గోయిలమ్రోఁతకై యలగు, నుద్యత్కీరసంభాషలన్
గలగున్, వెన్నెలవేఁడిమిన్ నలగు, మాకందాంకురచ్ఛాయకున్
దొలఁగున్ గొమ్మ మనోభవానలశిఖాదోదూయమానాంగియై.

యతి ప్రాసములందు వెదకికోలు గన్పింపక శబ్దాలంకార వైచిత్రితో సరసపదాభినివేశము వెలయ రసపుష్టి నొదవించుటలో నిత డసమానుడు. రుక్మిణీ కల్యాణ ఘట్టమున—

ఘను డా భూసురుడేగెనో! నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో!
విని కృష్ణుండిది తప్పుగా దలచెనో! విచ్చేసెనో! యీశ్వరుం
డనుకూలింప దలంచునో! తలపడో! యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో! యెఱుగదో! నా భాగ్య మెట్లున్నదో!

అను పద్యమును పఠించినదో రసానురూపముగ పద్యమెట్లు సువిభక్తమై యుండు నదియు గోచరించును.

సంగీత పరిజ్ఞానమును రసోత్కృష్టతతో మేళవించిన తురంగలించు తెరంగున ప్రతి పద్యమును నీతడు శ్రావ్యముగా ఘటించినాడు. అందరకు సమ్మోదావహమైన దాశరథ్యావైయాత్యము. చూడుడు—

అంగీకృత రంగన్మా
తంగీమదగంధమగుచు దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల
భృంగీగణ మొప్పె భ్రమనువెట్టెడి మాడ్కిన్.

కంటే జగముల దుఃఖము;
వింటే జలజనితవిషము వేడిమి; ప్రభువై
యుంటకు నార్తుల యాపద
గెంటించుట ఫలము; దాన గీర్తి మృగాక్షీ!

పోతన యాంధ్ర ప్రపంచమునకును తద్ద్వారమున ప్రపంచమునకును నర్పించిన సందేశమెద్ది? భక్తిప్రాధాన్యేకేశ్వరోపాసనాద్వైత తత్త్వాలంబనము గల్గి సాత్త్వికగుణ విశిష్టమగు నిష్కామ కర్మయోగముచే పరమపద రూపమగు జీవయాత్ర గడదేరి మానవుడు సుఖింపవలయునన్నదే యాతని సందేశము.

కర్మతంత్రుడగుచు గమలాక్షు గొల్చుచు
నుభయనియతవృత్తి నుండుచుండ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన;
ప్రబలమగుచు విష్ణుభక్తి చెడదు.

మొదలైన కథాంత్య తీర్మాన పద్యము లందెల్ల నీయర్థమే ప్రతిధ్వనించుచున్నది.

ఆంధ్ర సరస్వతికి రూపకల్పన జేయగోరు చిత్రకారులున్నచో ననన్య సాధ్యార్థగభీరతయు వ్యాకరణవైచిత్రీ సమంచిత పదప్రయోగ పటిమయు గల తిక్కనను భారతీ వదనముగను, రసౌత్కృష్ట్యగరిమయు సుకుమార రచనా ప్రసన్నతయు గల పోతనను భారతీ హృదయముగను ఏర్పరుపవలసి యుండును. తిక్కన పోతనలను మించు కవి జనించువరకు ప్రపంచ దేశభాషామతల్లు లెల్లరు నొక్క సమావేశము గావించుటయే యెప్పుడేని తటస్థించినచో నాంధ్రవాణి తనపాయులై వెన్క నరుగుట కిర్వురు మాత్రమే సర్వవిధముల నర్హులు. వారే తిక్కన పోతనలు. యోగ్యతను బట్టి యాంధ్ర సారస్వతమున తిక్కన ప్రథముడు. పోతన ద్వితీయుడు.

*(ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1923)*



ఇంతింతై వటుఁ డింతయై, మఱియుఁ దానింతై, నభోవీధిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రునికంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

# పోతన తాత్త్విక చింతన

— శ్రీ ఎ. వేంకట సుబ్బయ్య

తాత్త్విక చింతన భారతదేశమున అనాదికాలమునుండి వచ్చుచున్నది. ఈ చింతనకు మూలము శివుడు. తత్త్వశాస్త్రమునందు ఏకమాత్ర తత్త్వము శివుడే. అతనిలో అన్ని పదార్థములు ఆవిర్భూతమగుచున్నవి. అతనిలోనే మరల లీన మగుచున్నవి. శివుని యిచ్ఛానుసారముగా నానా రూపాత్మకమగు జగత్తు సృష్టింపబడుచున్నది.

తాత్త్వికుడు, కవి - ఈ యిద్దరిలో భిన్నత్వమున్నది. ఒకరిది బుద్ధి గమ్యము, రెండవ వారిది హృదయగమ్యము. ఇద్దరి పనులలో గూడ భేద మున్నది. తాత్త్వికుడు తన సిద్ధాంతములను శాస్త్రీయశైలిలో చెప్పును. కవి దానినే తన జీవిత సిద్ధాంతము నాధారముగ చేసికొని కావ్యమయశైలిలో తెలుపును. కవి గంభీరుడైన తాత్త్వికుడు కూడ నగును. ఈ కారణము వలననే తన భావనాబలమున జనులకు అపురూపమైన రూపమును ప్రదర్శించును.

పోతన భక్తకవి. అతడు శివకేశవులకు సమాన ప్రాధాన్యము నిచ్చి నాడు. అతని ఆంధ్ర మహాభాగవతమున తాత్త్విక చింతన మిట్లున్నది;

**జీవము :**

వల్లభాచార్యుని ప్రకారము పరబ్రహ్మ కోరికచే "ఏకోఽహం బహు స్యామ్" అన్నట్లు బ్రహ్మభూతాంశముచే అసంఖ్యాకజీవములు పుట్టుచున్నవి. అగ్ని స్ఫులింగానుసారము బ్రహ్మచిదంశము నుండి అసంఖ్యాకములైన నిరాకారజీవులు పుట్టుచున్నవి. సదంశము నుండి జడప్రకృతి ఆనందాంశము నుండి వాని అంతర్మయ స్వరూపములు పుట్టినవి. జీవము అంశమైనది. పరమాత్ముడు అంశి. ఆనందాంశము తిరోభావము చెందుటచే జీవములో దీనత్వము, పరాధీనత, దుఃఖము, హీనత, జన్మ, మరణము, విపరీతజ్ఞానము మున్నగునవి కలుగు చున్నవి. ఆసక్తికరమైన భ్రమలో బంధింపబడి జీవము తిరుగుచున్నది. భగ

వంతుని దయచేత అది భ్రమజాలము నుండి ముక్తి పొంది ఆనందాంశము నంద గలుగుచున్నది. జీవాత్మలు నిత్యములు. ఇవి అనంతములు. శరీర భేదము వలన భేదించును. అవి ప్రతిజ్ఞానమున ముఖ్యాంశముగ నుండునవి. జీవాత్మలు కర్తృ భోక్తృ విభు పదార్థములు.

పోతన అద్వైతవాది. అనగా జీవాత్మకు పరమాత్మకు భేదము లేదని చెప్పు వాడు. "ఎవ్వడీ సర్వప్రాణులను పుట్టించునో, కాపాడునో, సంహరించునో, ఎవనికి నాశనము లేదో, ఎవడు సర్వవ్యాపకుడై ప్రభువుగ నుండునో వాడే యీ రీతిగ జీవులను బ్రతికించుటకు వృద్ధి నొందించుటకు సమర్థుడగును. ప్రపంచ మండలి జీవులన్నియు కాలకర్మవశమున పుట్టుచు గిట్టుచు నుండు" అని ఆంధ్ర మహాభాగవత సప్తమస్కంధమున పోతన తన తాత్త్విక భావనను ప్రదర్శించి నాడు. ఇచ్చట పోతన జీవికిని బ్రహ్మకును అభేదము తలచెను. భగవంతుడు సర్వాంతర్యామి. కర్మబంధముల నుండి విముక్తుడు. ఈ ప్రాణిని సృష్టించువాడు బ్రహ్మయే. జీవములో బ్రహ్మయే యుండును.

ప్రారబ్ధము :

తరచుగ ప్రజలు లోకములో కష్ట సమయము లందు దుఃఖముచే నిరాశను పొంది తమ కష్టములను ఇతరులకు చూస తెలుపుకొనుచుందురు. భక్త కవులు మానవుని సుఖ దుఃఖములకు పూర్వజన్మ సుకృతముల దెల్పినారు.

పోతన జీవియొక్క సుఖ దుఃఖములకు ప్రారబ్ధమే కారణమని చెప్పి నాడు. సుఖము కలుగుటకు దుఃఖము తొలగుటకు హరిసేవ చేయుటే ప్రధాన మనినాడు. దేహ మనగా పృథివ్యాపస్తేజో వాయురా కాశాత్మక మగు నొక గృహమని, ఆ గృహమందు జీవుడు పూర్వకర్మవశమున వర్తించునని, జీవు డెంత వరకు శరీరమందుండునో అంతవరకే కర్మసంబంధము గాని అటు పిమ్మట ఉండదని పోతన బోధించినాడు.

జగత్తు :

ప్రత్యభిజ్ఞ దర్శనానుసారము ఈ ప్రపంచము మహాచితివలె సత్యసుందర మంగళమయమై యున్నది. ఈ ప్రపంచము హరి రూపములో నున్నది. అయి నప్పటికిని మాయాకృత మనుకొనవలసి యున్నది.

పోతన జగత్తు మాయచేత నిర్మితమైనదని తెలిపినాడు. అది సంపూర్ణముగ మిథ్య. స్వప్నానుభవములు నిజములు కావు. అట్లే పంచేంద్రియముల అనుభవములో వచ్చెడి యీ ప్రపంచము కూడ కేవలము మిథ్యాపూర్ణమైనది. పోతన వాస్తవముగా బ్రహ్మ-జగత్తుల నొక్కటిగా భావించినాడు. దీని నాతడు అద్వైత దర్శనానుసారముగా చెప్పియున్నాడు. "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై" అను పద్యమున పోతన జగత్తును గూర్చి స్పష్టీకరించినాడు. తన లీల కొరకు భగవంతు డీ ప్రపంచమును సృష్టించెననియు దీని నాయన రక్షించుటయే కాక సంహరించుటయు చేయునట. "మహాత్మా! బీజంబు నందు వస్తుమాత్ర భూత సౌక్ష్మ్యంబును వృక్షంబునందు నీలత్వాది వర్ణంబునుం గలుగు తెఱంగున విశ్వంబునకు నీయంద జన్మస్థితి ప్రకాశ నాశంబులుం గలుగు. నీ చేతనయిన విశ్వంబు నీ యంద నిలుపుకొని..."(సప్తమ స్కంధము, 360) అను వచనమునందు జగత్స్వరూపము విపులీకరింపబడినది.

భక్త వత్సలత :

భక్తవత్సలత భగవంతుని ప్రధాన గుణమై యున్నది.

ఈ విషయమును పోతన గజేంద్ర మోక్షణ ఘట్టమునందును, ప్రహ్లాద చరిత్ర ఘట్టమునందును సుస్పష్టము గావించినాడు. మకరికి చిక్కిన కరీంద్రుని కాపాడుటకై ప్రియురాలికి చెప్పకయే, శంఖ చక్రములను ధరింపకయే, గరుత్మంతుని పిలువకయే త్వరితుడై బయలుదేరినాడు శ్రీ మహావిష్ణువు. భక్తుని కరుణార్ద్ర ప్రార్థన నాలకించుటతోడనే వెనుకముందు లాలోచింపక సన్నద్ధుడైనా డాయన. కనుకనే ఆయన భక్తపాలన కళా సంరంభుడు. భక్తుని ఆదుకొనుటలో నెట్టి జాప్యముగాని, అశ్రద్ధగాని, నిర్లక్ష్యముగాని జరుగలేదు.

అవతార కారణములు :

అవతారముల సంఖ్య పదియని అందరు అంగీకరించిన విషయమే. దుష్టశిక్షణకు శిష్టరక్షణకు ధర్మ సంస్థాపనకు విష్ణువు అవతారము లెత్తవలసి వచ్చినది. ఒక్కొక్క దుష్టుని సంహారము కొరకు ఒక్కొక్క రూపమును ధరింపవలసి వచ్చెను.

పోతన కూడ ఈ తాత్త్విక దృక్పథముతోనే భాగవతము నందవతారముల విషయమును ప్రస్తావించెను. సప్తమ స్కంధములో నరసింహుని, నవమ స్కంధములో శ్రీరాముని, దశమ స్కంధములో శ్రీకృష్ణుని అవతార మహనీయతలను ప్రదర్శించినాడు.

**విరాట్ స్వరూపము :**

విష్ణువు స్వరూపము అనంతము. ఆ స్వరూపమును దర్శించుట బహు కష్టమైన విషయము. అది పోతన్నవంటి మహాభక్త కవులకే సాధ్యమైనది. ఆయన ప్రహ్లాదునిచేత విష్ణువు యొక్క విరాట్ స్వరూపము నిట్లు పలికించెను-

కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గలఁ డోంకారమునం త్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుఁడు గలండు తండ్రి! వెదకం గానేల యీయా యెడన్.

ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి! వింటే. (7.274,275)

**మాయ :**

తాత్త్విక స్వరూపములలో మాయ యొకటి. ఈ మాయ రెండు విధములుగ నుండును - విద్యామాయ, అవిద్యామాయ యని. విద్యామాయ భగవంతుని శక్తి. అవిద్యామాయ అసత్య జ్ఞానము నాచ్ఛాదించి అహంభావము కలిగించును. అజ్ఞానము, భ్రమ, స్వప్న మనునవి అవిద్యా మాయకు పర్యాయ పదములు. విద్యామాయ సత్యజ్ఞానమును కలిగించి సాత్త్విక చింతనను చేకూర్చును. దీనివలన జీవునికి పరమపదము లభించుచున్నది.

పుట్టువు లేని నీ కభవ! పుట్టుట క్రీడయ కాక పుట్టుటే!
యెట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవుల యం దవిద్య దాఁ

జుట్టుచు నుండుఁ గాని నినుఁ జుట్టినదిం బలెఁ బొంత నుండియుం
జుట్టఁగ లేమిఁ దత్క్రియలఁ జొక్కని యెక్కటిఁ గంటి మీశ్వరా !
(10.1.99)

ఈ పద్యమున పోతన అవిద్యామాయ విషయమును ప్రస్తావించినాడు. మాయ ఈశ్వరునిపై ఆధారపడి యున్నది. ఆయనచే ప్రేరేపింపబడి సృష్టి రచనలో పాల్గొనుచున్నది. పోతనామాత్యుని తాత్త్విక చింతన మేవంవిధమై నట్టిది.

*(తెలుగు విద్యార్థి, జూన్ 1981)*



చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగనేటికిఁ దల్లులకడుపుచేటు.

నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార ! నాకు దయసేయఁగదే!

పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవ పదసేవనముల్.

# పోతన స్వప్నచర్చ

— శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

పోతన భాగవతమును వ్రాసిన విషయములో సత్యాన్వేషణ మించుక చేయుదము. ఆయన శ్రీరామచంద్రుడు తనకు సాక్షాత్కరించి భాగవతమును వ్రాయ మనగా వ్రాసినవాడు. అంతియకాని కలలో కనబడి చెప్పగా వ్రాసిన వాడు గాదనుట నగ్నసత్యము. ఇందులకు మన యభూతకల్పన లేమియు నక్కరలేదు- ఆయనయే కంఠోక్తిగా చెప్పికొన్నాడు గనుక. భాగవత రచనకు కారణము నాయన తన గ్రంథములోనే స్పష్టముగా నిట్లు తెల్పినాడు-

''మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమో పరాగంబు రాకం గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్రసముత్తుంగ భంగయగు గంగకుంజని క్రుంకులిడి వెడలి మహనీయమంజుల పులినతల మంటపమధ్యం బున మహేశ్వరధ్యానంబు సేసి కించిదున్మీలిత లోచనుండనై యున్న యెడ-

మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడి
　　నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
　　ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగి
　　బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహితభానుని భంగి
　　ఘనకిరీటము దలఁ గలుగువాఁడు

పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు
వెడఁదయురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యు డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

ఏను నా రాజశేఖరుం దేఖి చూచి భాషింప యత్నంబు సేయునెడ నతండు దా 'రామభద్రుండ' మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతంబుఁ దెనుంగు సేయుము నీకు భవబంధంబులు దెగు'నని యానతిచ్చి తిరోహితుండ యిన సమున్మీలిత నయనుండనై వెఱఁగుపడి చిత్తంబున-

పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండుగాథ వలుకఁగ నేలా!'' (1.16-18)

అని వ్రాసికొనియున్నాడు. ఈ భాగములో నిదియంత స్వప్నములో జరిగిన దనుకొనుట కేమైన నాస్పద మున్నదా? ఈ సంఘటన జరిగిన దెక్కడ? గంగా పులినతలమున. ఏ తరుణమున? చంద్రగ్రహణ పుణ్యకాలమున. గ్రహణ పుణ్యకాలమున కర్మఠులు నిద్రవోవు నవకాశముండునా? నిద్రపోవుటకే యైనచో గంగా పులినతలమునకే పోవలయునా? గంగలో స్పర్శస్నానము చేసి పావన పులినతలమున కూర్చుండి ధ్యాన మొనర్చుచు కించిదున్మీలితనయనుడై యున్న యెడ నెదుట ప్రత్యక్షముగ రాముడు కన్నుగవకు కనబడినట్లుగా పోతన చెప్పు కొని యున్న సందర్భములో స్వప్నమున కవకాశ మెక్కడిది?

ఇట్లుండగా శ్రీ వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రలో 'బమ్మెర పోతనామాత్యుడు తాను భాగవతము రచింపబూనుటకు కారణము నా గ్రంథము లోనే యీ క్రింది వాక్యములలో దెలిపియున్నాడు' అని వ్రాసి 'మదీయ పూర్వ జన్మ...' అన్నది మొదలు 'వెఱగుపడి చిత్తంబున...' అన్నంతవరకే కాక 'మరలి కొన్ని దినంబుల కేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధబంధుజనానుజ్ఞాతుండనై' అన్నంతవర కుదాహరించి యావల నిట్లు వ్రాసి యున్నారు-

'ఇతడు మొదటినుండియు శైవుడయి యుండియు నొక చంద్రగ్రహణ సమయమునందు గంగాస్నానమునకు బోయినప్పు డక్కడ నాకస్మికముగా స్వప్నమున రామభద్రుండు ప్రత్యక్షమై తన్నామాంకితముగా శ్రీ మహాభాగవత

మును తెలుగు చేయుమని యానతిచ్చుట చేత భాగవత రచనమునకు బూనెను' అని వ్రాయుటయేకాక మరల 564 వ పుటలో 'శ్రీరామమూర్తి భాగవతమును తెనిగింపవలసినదని చెప్పినట్లు స్వప్నము రాగా నితడు శ్రీరామాంకితముగా భాగవతపురాణమును తెనిగించెను' అనియు వ్రాసియున్నారు. ఇచ్చట స్వప్న ప్రసక్తి కవకాశ మెచ్చటనున్నదో బోధపడదు. ఇంటివాడు పాడిగేదె యనగా ఐయటివాడు వట్టిగేదె యన్నట్లే ఆయె గదా!

ఇందువలన గలిగిన యనర్థ మెంతవరకు పోయినదో చూడుడు- ఒక సుప్రసిద్ధపండితు డొక యుపవాచకములో పోతనను గురించి వ్రాయుచు 'భాగవత రచన' యను శీర్షిక క్రింద 'ఒక దినమున పోతన నిదురించుచున్న సమయమున మెఱుగు చెంగటనున్న మేఘంబుకైవడి నువిద చెంగట నుండ నొప్పువాడు... రాజముఖ్యు డొక్కరుడు స్వప్నమున సాక్షాత్కరించి భాగవత మను వదించి తన కంకిత మీయవలసిందిగా నాజ్ఞాపించినాడు' అని వ్రాసి యున్నారు. వీరి కాధార మాకవుల చరిత్రములోని వ్రాత తప్ప మరేమున్నది?

ఇంకను దీని పరిణామ మెంతవరకు వచ్చినదో చిత్తగింపుడు. 1958 స్కూలు ఫైనల్ పాఠ్య భాగములో 'నా కథ' యను పాఠ మొకటి వేయబడినది. అది గోదావరి తన కథ చెప్పుకొన్నట్లుగా వ్రాయబడినది. రచయిత్రి శ్రీమతి గరిమెళ్ల గురులక్ష్మీదేవి గారు. ఆ పాఠములో మారాకు హత్తించి వ్రాయబడిన దిట్లు- 'గ్రహణవేళ గృతావగాహుడై పోతానామాత్యుడు నా తీరమున జెట్టు నీడ శయనించి భాగవతావతరణమును గూర్చి కలగనుట యే నెరుగుదును' అని-

గ్రహణ పుణ్యకాలమున తనలో స్నానము చేసి తన పులినతలములనే ధ్యానము చేసికొనుచున్న పోతనకు శ్రీరామచంద్రుని సాక్షాత్కరింపజేసిన గోదావరి, గ్రహణవేళను స్నానము చేయించి గట్టున చెట్టునీడలో పరుండబెట్టి నిద్రపుచ్చి కల వచ్చునట్లు చేయుట కేమాధారమో !

ఈ యథార్థకల్పన యింతటితోనే ఆగిన దనుకొనరాదు. పలువలు చిలువలతో ఎంత యనర్థమునకు దారితీసినదో చూడుడు- 1959 మార్చి పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షా పత్రమున 'ట్రాన్సులేషను' కీయబడిన దానిలో పోతనను

గురించి యిట్లున్నది– "...పోతన ప్రతిదినము ఆ దేవాలయమున కేగి స్వామిని సేవించుచుండెడివాడు. ఒకనాటి రాత్రి స్వామి అతని స్వప్నమున సాక్షాత్కరించి భాగవత రచనకు అతనిని పురిగొల్పెననియు, ఆ మరునాటి నుండియే అతడు భాగవతరచనలో నిమగ్నుడయ్యె ననియు చెప్పుదురు" అని.

ఈ యద్భుత సృష్టికిని ఈ యనర్థపరంపరకును అంతులేకపోయె గదా ! సత్యబద్ధమైన దానికిని ఇట్టి యపకల్పనలా ? ఏదియో యొక మార్పు చేసినచో నది గుణావహమైనచో నాటకాదులలో వలె సంతోషింతము గాక. ఉన్న సత్యమున కన్న లేని యపకల్పన అపకర్షకమైనపు దేమనుకొనవలె ? ఇక బాగుపడున దెట్లు ? "గతానుగతికో లోకో న లోకః పారమార్థికః."

*(భారతి, ఏప్రిల్ 1961)*



# పోతన పద్య రత్నములు

శ్రీపంబులు ఖండిత సం
తాపంబులు గల్మషాంధతమస మహోద్య
ద్దీపంబులు పాషండ దు
రాపంబులు విష్ణువందనాలాపంబుల్.

చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

ఏలితివి మూడు జగములు
దోలితి వింద్రాది సురలఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణములఁ
జాలితి వీ రాక్షసులను సంరక్షింపన్.

ఏలా బ్రహ్మపదంబు ? వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీ లోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్తభావములు నీయందే సమర్పించు నీ
వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే.

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలార ! మీ పొదల మాటున లేఁడు గదమ్మ ! చెప్పరే.

చెలియా ! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ నయ్యా క్షణం
బులు నా కన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబులై సాగి లో
పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై.

నా మోసంబున కెద్ది మేర వినవే నా పూర్వ జన్మంబులన్
లేమా ! నోములు నోఁచుదో నకట ! కాళిందీతటిన్ వేణువై
భూమిన్ బుట్టెద నంచు గోరఁ దగదే భోగిల్లి యట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధర సుధాపానంబు గల్గుంగదే.

మమతన్ మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీగానామృత శ్రేణి క
ర్ణములన్ గ్రోలుచు మేత మాని గళితానందాశ్రులై చిత్రితో
పమలై గోవులు చూచుచున్న వదిగో ! పద్మాక్షి ! వీక్షించితే.

జగతీజంతుల శాఖ లెక్కి మురళీ శబ్దామృత స్యందముల్
మిగులన్ వీనులఁ ద్రావి వ్రేగుపడు నెమ్మిం గృష్ణ రూపంబు చి
త్రగమై యుండఁగ నడ్డపెట్టు క్రియ నేత్రంబుల్ దగన్ మూసి యా
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులం గామినీ ;

ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్
జగతీనాథులఁ జైద్య పక్షచరులన్ సాళ్వాదులం గెల్చి భ
ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా
భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్.

కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణింపుచున్ ముక్తవై
కల్యం బెవ్వఁడు తృప్తుఁడౌ నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ ! యెఱుంగం బల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్.

శ్రీయుతమూర్తి ! యో పురుషసింహమ ! సింహము పాలి సొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయిని యైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ
డా యధమాధముం డెఱుఁగ డద్భుతమైన భవత్ప్రతాపముల్.

ధన్యున్ లోకగుణాభిరాముఁ గుల విద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీ బలదాన శౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ ! నా వలననే జన్మించెనే మోహముల్ !!

ఆ యెలనాగ నీకుఁదగు నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగుఁ దప్పదు; జాడ్యము లేల నీవు నీ
తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి
చ్చేయుము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్.

జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీ కృపం బ్రతికితిన్ నీ యట్టి పుణ్యాత్మకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ గావింపఁగానేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!

దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు చూడఁ గోరుదుఁ గదా ప్రాణేశ! మన్నించి నన్
నీ వెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్ నేఁజూచి యేతెంచి నీ
దేవీ సంఘములెల్లఁ జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్.

వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీచీ జాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభ యై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్.

పరుఁజూచున్ వరుఁ జూచు, నొంప నలరింపన్, రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో, వీరంబు శృంగారమున్
జరగన్, గన్నులఁ గెంపు సొంపు బరఁగన్, జండాస్త్రసందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్, జంద్రాస్య హేలాగతిన్.

జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ సారంగయూథంబుగా
నా విల్లింద్ర శరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగా,
దా విద్యుల్లత భంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ
బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్.

కుండల దీప్తగండమును, గుంచిత కుంతల పాలమున్, సుధా
మండిత పల్లవాధరము, మంజులహాసవిలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁ గని యుండఁగ వచ్చునె మన్మథేషు కో
దండ విముక్తబాణముల దాసుల మయ్యెద మాదరింపవే.

ఒనరన్ వ్రేతల కించుకేనియును లేకుండంగ గోపాలకృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబుఁ గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్శించెఁ బూర్వంబునన్
వనితా ! యెట్టి తపంబు చేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్ !



# అనుబంధము-I

# 'బాలరసాలసాల' పద్యార్థపర్యాలోకనము

—శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి

బమ్మెర పోతరాజు మహాకవి. ఈత డొనరించిన పద్యశిరోరత్నము ప్రతి మానవుని శిరోభాగము నలంకరించుచున్నది. అయ్యది యేది యన-

బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదర పోషణార్థమై.

ఇందలి కథాసందర్భము బాగుగ గ్రహింపజాలక కొంద రీ పద్యరత్నమును సరిగా సమన్వయింపలేకున్నారు. ఆ సమన్వయింప లేకుండుట పండితుల పాండిత్యలోపము వలన కలిగినది కాదు. పూర్వాపరకథా విశేషము బాగుగా గ్రహింపలేకపోవుటచే గలుగుచున్నది. కావున నా కథాసందర్భమెద్దియో యిచ్చట బాగుగ పర్యాలోకింతము.

పోతనార్యుని పూర్వచారిత్రము గొప్పదే కాని వైరాగ్యవంతము కాదు. మొదట ఆయన సరాగియే కాని విరాగి కాదు. భాగవతము రచించు నాటికి పరిపూర్ణవిరాగి యైనాడు. ఈతడు మొదట సరాగియై యున్నప్పుడు 'భోగినీ దండకము' అను నొక చక్కని దండకమును రచించి, రావు సర్వజ్ఞ సింగభూపాలుని ఉంపుడుకత్తెకు కృతి యిచ్చెను. తరువాత భగవద్భక్తుడై విరాగియై తాను చేసిన పని మంచిది కాదని గ్రహించుకొని చప్పున మానసమును త్రిప్పుకొని మంచి మార్గమును స్వీకరించెను. ఇదియే 'బాలరసాలసాల' యను పద్యమునకు సరిగా సమన్వయము కుదుర్చునదై యున్నది. లేకుండిన ఈ పద్యమునందలి 'కూళ' లెవరో 'పడుపుకూ' డెద్దియో మనము తెలిసికొనలేక విహ్వలపడిపోదుము,

ఇప్పుడు 'కూళ' సర్వజ్ఞ సింగభూపాలుని ఉంపుడుకత్తెయగు 'భోగిని' యనియు, 'పడుపుఁగూడు' ఆమెవలన కలిగిన ఐశ్వర్య మనియు మన మూహించుకొనగలుగుదుము. అంతేకాని పద్యమందు దోష మెద్దియును లేదు.

కావున 'బాలరసాలసాల నవపల్లవ కోమలకావ్యకన్యక' యా దండక మనియు, నందలి యా కూళ యా వేశ్య యనియు, ఆ పడుపుగూ డామె వలన వచ్చిన ఐశ్వర్యమనియు మనకు బాగుగా తెలియవచ్చి 'బాలరసాలసాల' యను పద్యము హృద్యానవద్య భావభరిత మనియు నిది ప్రతి హృదయకుహరము నందును గనకాక్షరములతో ప్రకాశింప జేయ దగిన దనియు ఇంతటి మనోహర పద్యరాజము మరి యొకటి లే దనియు నిందు మూలమున గ్రహించుకొన వలయును.

“సత్కవుల్ హాలికులైన నేమి గహనాంతరసీమల కందమూలకౌద్దాలికులైన నేమి” యని కదా పోతనార్యుడు చెప్పినాడు. ఈ మాటల భావమేమందురా— “వడి గల ఎద్దులఁ గట్టుక మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ!” యన్నట్లు నీచాశ్రయము మానుకొని—

మాతర్మేదిని! తాత మారుత! సఖే తేజః! సుబంధో జల!
భ్రాత ర్వ్యోమ! నిబద్ధ ఏష భవతా మంత్యః ప్రణామాంజలిః
యుష్మత్సంగవశోపజాత సుకృతస్ఫారస్ఫురన్నిర్మల
జ్ఞానా పాస్త సమస్త మోహమహిమా లీయే పరబ్రహ్మణి.

అని చెప్పినట్లుగా వైరాగ్యబోధ బాగుగా గలిగిన తర్వాత “కందమూల కౌద్దాలికులైన నేమి నిజదారసుతోదర పోషణార్థమై” అను నీతిని ఆ పద్యమునందలి చివర వాక్యములు స్పష్టము చేయుచున్నవి. మొత్తము మీద పద్యమంతయు భోగనిరోధకమై పరమార్థ సాధకమై వైరాగ్య బోధకమై విరాజిల్లుచున్నది.

(ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ప్రమాది-చైత్ర వైశాఖములు)



# "పుట్టం బుట్ట" పద్యార్థము

—శ్రీ కుమారదేవ

ఆంధ్రభాగవతమున స్తుత్యాదికములందు పోతన మహాకవి తన నమ్రతను స్పష్టీకరించుచు—

పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను గాళిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటి మీఁ
దెట్టేవెంట రచింతుఁ దత్సరణి నీ వీవమ్మ! యో యమ్మ! మేల్
పట్టున్ మానకువమ్మ! నమ్మితిఁజుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ!

అని సరస్వతిని ప్రార్థించినారు. ఈ పద్యమునకు సాధారణముగా మనలో నించు మించందరు జెప్పుకొనెడి యర్థము: పుట్టంబుట్ట=వాల్మీకిని గాను, శరంబునన్ మొలవ=శరవణభవుడను గాను, అంభోయాన పాత్రంబునన్ మెట్టన్ గల్గను =వ్యాసుడను గాను, కాళి గొల్వను = కాళిదాసుడను గాను, పురాణింపన్ దొరంకొంటి=పురాణింప బూనుకొంటిని.

ఈ పద్యమును చదివినప్పుడెల్ల రెండవ వ్యక్తియగు శరంబునన్ మొలచిన శరవణభవుడు కవియని గాని, పురాణకర్తయని గాని ప్రసిద్ధి యెచ్చటను గన పడక పెద్దల ననేకులను ప్రశ్నించితిని. అందరు "అచ్చటనే మాకును సందేహ" మనెడు వారును, "చూడవలెను" అనువారును దప్ప ఒక్కరైన సుబ్రహ్మణ్య దేవుడు కవియని గాని, గ్రంథకర్త యని గాని నిరూపింపరైరి. సందేహనివార ణార్థము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న వ్రాతప్రతు లన్నిటిని శోధించి చూచితిని. అన్నిటను "బ్రౌను దొరవారు శుద్ధం చేయించిన గ్రంథము" లో గూడ "శరంబునన్" అనియే యున్నది.

వాల్మీకి, వ్యాసుల నడుమ జిక్కిన "శరంబునన్ మొలవ" శబ్దములను మరల మరల మననము చేయుచుండగా నొక్క పాఠము స్ఫురించినది. అందలి

సామంజస్యమును పెద్దలకు వదలి నాకు దోచినది పాఠక లోకమునకు సమర్పించు కొనుచున్నాడను.

పద్యమును ప్రతి పదార్థమునకు విరుచునపుడు "పుట్టంబుట్ట శరంబునన్ మొలవ" అను రెండు భాగములుగా విరువక ఒక్కటిగా "పుట్టన్ పుట్టశిరంబునన్ మొలవ" అని శరమును శిరముగా చదివినచో "పుట్ట = వల్మీకము, శిరంబునన్ మొలవ=తలపై పుట్టునట్లుగా, పుట్టన్=పుట్టలేదు. అంభోయాన ...=పడవ యందు పుట్టలేదు. అనగా వ్యాసుడను గాను" అనుకున్నచో అన్వయార్థాదులు చక్కగా లభించుచున్నవి. ఏనాడో ఎవ్వరో తాటాకు వ్రాత ప్రతుల నుండి యుద్ధరించిన తొల్లిటివారు 'శిరంబునన్' అను దానిని 'శరంబునన్' అని చదువుకొని దానికి ఏదో అర్థమును సమన్వయించుకొని యుండ వచ్చును. తెలుగక్షరములలో 'శి' 'శ' గా మారుటయందు వింతలేదు. ఉన్నదాని కేదో యొక అర్థము కుదిరిన వెనుక దానిని గురించి యాలోచన కూడ తప్పి యుండవచ్చును. కావున నీ పద్యమున పై పాఠాంతరమును పాటించినచో విద్యార్థులనేకుల కిట్టి సంశయములు మానగలవు.

*(భారతి, నవంబరు 1935)*



# "పుట్టం బుట్టు" పద్యార్థ పరామర్శము

— శ్రీ నల్లాన్‌చక్రవర్తుల వరదాచార్యులు

కడచిన నెల భారతిలో పై శీర్షికలోని పద్యానికి ''కుమారదేవ'' అనే సాంకేతికనామంతో ఎవరో అర్థాన్ని వారికి తోచినట్లు పాఠం మార్చి వ్రాశారు. దాన్ని చూసి పోతన మహాకవి నిశ్శరీరాత్మ కొంచెం బాధపడి ఉంటుందని నే నెంతో కటకటపడ్డాను. ఉన్న దానిని మార్చకుండా తెలిసికోగలిగితే మంచిది. లేదా ఎవరివల్లనైనా తెలుసుకోవాలి. అంతేగాని పాఠం మార్చడం చాలా అన్యాయం. దాన్నే పెద్దలు—

సుకవి వచసి పాఠా నన్యథా కృత్య మోహాత్
రసగతి మవధూయ ప్రౌఢ మర్థం విహాయ
విబుధవరసమాజే వ్యాక్రియా కాముకానాం
కవికుల విముఖానాం ధృష్టతాయై నమోఽస్తు.

అని కోప్పడ్డారు. అంచేత మనం పాఠం మార్చకుండా అర్థం చెప్పుకోవాలి. కాబట్టి నాకు తోచిన విధానాన్ని బట్టి దానికి ''మనలో నించుమిం చందరు జెప్ప కానెడి యర్థము''ను సమర్థిస్తున్నాను. ''శరంబునన్ మొలవ = శరవణభవుడను గాను'' అని 'కుమారదేవ' గారు సూచించిన పై యర్థమే చెప్పవలె. ఇప్పుడు ''శరవణభవుడు కవి యని గాని పురాణకర్త యని గాని ప్రసిద్ధి యెచ్చటను గనపడదు'' అనే సంశయం యెదుర్కొంటూంది. దానికి సమాధానం మనవి చేస్తున్నాను.

రాజశేఖరకవి కావ్యమీమాంసలో కావ్యపురుషోత్పత్తిని తెలిపే తృతీయాధ్యాయంలో ''పిమ్మట ఆ కావ్యపురుషుడు రోషముతో వెనుకకు మరలి వచ్చెను. ఇతనికి ప్రియమిత్రమగు కుమారస్వామి కావ్యపురుషుని యీ స్థితిని జూచి సహింపజాలక పెద్దపెట్టున నేడ్చుచుండ సవతి తల్లి యగు గౌరిచే నిట్లని చెప్ప బడినాడు - 'బాబూ ! నీ వూరకుండుము. ఇదిగో నేను నీ మిత్రుని మరల్చి రప్పించెదను.' అని చెప్పి...'' అని కావ్యపురుషుడికీ, కుమారస్వామికీ గాథ

మైన మైత్రి ఉన్నట్లు వ్రాసియున్నారు. కావ్యపురుషుని ఎడబాయజాలనంత మైత్రి కలవాడంటే అతడు గొప్ప కావ్యరసికుడని అర్థం. ఎంచేత అలాంటి అర్థం చెప్పుకోవాలంటే ఆ ప్రకరణంలో వర్ణించిన సందర్భం అంతా విచిత్రమైన అంత రార్థం కలదిగా కనిపిస్తూంది. కావ్యపురుషుడూ, సాహిత్య విద్యావధువూ ఏయే దేశాల్లో ఏయే వేషాలతో ఏయే విధాలైన గీతవాద్యాదులతో విహరించారో ఆయా దేశాల వాళ్ళకు అటువంటి వేషభావలూ, కవిత్వమూ అబ్బినట్లు వర్ణించడం వల్ల ఆయా దేశాల రీతులు వర్ణించబడినట్లు తెలుతూంది. వైదర్భి, గౌడి, పాంచాలి అనేవి ఆవే. కాగా ఈ మిథునం విహరించిన దేశాల వాళ్ళకే యింత గొప్పతనం రాగా, కావ్యపురుషుని ప్రియమిత్రమని వర్ణించబడిన కుమారస్వామి యెంతటి కావ్యరసికుడై ఉంటాడో ఊహించండి.

ఇంతేకాకుండా షణ్ముఖుని గొప్ప పండితునిగా కూడా ఉదాహరిస్తున్నారు. రత్నఖేట దీక్షితుణ్ణి గూర్చి చెప్పే చాటువులో—

విపశ్చితా మపశ్చిమే వివాద కేళి నిశ్చతే
...అనమ్ముఖశ్చ షణ్ముఖ శ్చతుర్ముఖశ్చ దుర్ముఖః

అని షణ్ముఖునికి బ్రహ్మతో పాటు స్థానం యిచ్చారు. అతణ్ణి పండితు డనండి, కవి యనండి మీ యిష్టం.

ఆత్రేయ వేంకటాధ్వరి తన లక్ష్మీసహస్రం ప్రారంభ స్తబకంలో మన పోతన మహాకవి చెప్పుకున్నలాంటి సందర్భంలోనే-

చక్షుష్మంత శ్చరణకమలే చక్షుషా శ్రోత్రవంతః
శ్రోత్రే భూమే ర్జనని జగతాం జన్మవంతోఽపి నస్మః
వక్త్రైర్వ్యాసన్ భగవతి! న షట్పంచ చత్వారి వా నః
కస్మా దస్మా న్నహసతు జనస్తోష్యత స్త్వద్గుణౌఘమ్.

అని వ్రాశాడు. ఇందులో వాల్మీకినీ, షణ్ముఖుణ్ణీ కూడా స్మరించాడు. అంచేత కుమారస్వామి యే గ్రంథాన్నీ రచించకపోయినా (ఏమైనా రచించాడో లేదో నేను వెతికి చూడలేదు) కవుల మర్యాదనుబట్టి అతణ్ణి ఈ వర్గంలో వర్ణించటానికి ఏమీ అభ్యంతరం లేదు.

(భారతి, డిసెంబరు 1935)



## అనుబంధము–II

# పుష్పాంజలి

ఈ మహాకవీశ్వరుని కవిత్వ మతిసుకుమార సరసవచన రచనా ధౌరేయమై నాతి కఠినమై శబ్దాలంకార శోభితమై కోవిద పామరజన హృదయంగమమై వీనులవిందై చదువువారి కమందానందము కలిగించును. ఈయన పదము లతికోమలములు. అలంకారములు మనోజ్ఞములు. రచనలు సరసములు. పాకము మధురము. హరిభక్తి యగ్గలము. పాండిత్యము మిక్కుటము. లోకానుభవం బహీనము. వేదాంతార్థ చింతనము మెండు. పురాణ రత్నంబగు నిమ్మహాభాగవతము నాంధ్రీకరించి యీయన సాహాయంబగు కాయంబు దొరంగియు జీవించియే యున్నవాడు.

—శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య

శ్రీ రామానుగ్రహ సమాసాదిత సరస కవితాసామ్రాజ్య ధురంధరుండగు బమ్మెర పోతనామాత్యుడు మృదుమధురాతిసుందర పద సందర్భ సౌభాగ్యంబు దీపింప నవరసభావ బంధురంబుగా నిమ్మహా గ్రంథంబు నాంధ్రీకరించె. పదలాలిత్యమును, ప్రసాద వైభవమును, సులలిత సరళధారయు పోతన కవితా కమనీయతకు ముఖ్య హేతువులు. ఈయనకవిత్వ ధార యన్నిట నతిశయించినది. అది యెందును గుంటులేక కటుపదంబుల గడుసుగాక యతి ప్రాసములందు మెలిగొనక యొక మహానదీ నిర్మల ప్రవాహము వలె నిగనిగలాడుచు నిరర్గళముగా ప్రవహించుచుండును. తిక్కన కర్థ సారస్యమునందు కన్ను. పోతనకు రససౌభాగ్యమునందు దృష్టి.

—శ్రీ తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య

పోతన పాండిత్య విశేషంబులు పూర్వపు కవులవానితో సమానముగను, కొంచె మధికముగను నుండును గాని న్యూనంబుగ నెన్నండు నుండవు. తిక్కన

సంగ్రహాశయ్యకును, పోతన యమక కవనంబునకును ప్రసిద్ధులు. తిక్కన రౌద్ర బీభత్స రస ప్రధానంబులగు నారభటీ వృత్తులును వీర భయానక రస ప్రధానములగు సాత్వతీ వృత్తులును జెప్పెడి స్వభావము కలవాడు. పోతన శృంగార కరుణారసంబులంచే నొప్పు కౌశికీ వృత్తులును, హాస్య శాంతాద్భుత రస ప్రధాన భారతీవృత్తులును జెప్పెడి స్వభావము కలవాడు. సోమయాజి తెలుగు పదంబులు ప్రయోగించుట యందు విశేషాసక్తి కలవాడు. పోతన సంస్కృత పదప్రయోగ పటిష్ఠుడు. శృంగార వర్ణనల దొంటి పురాణకవులలో పోతన కవనమే మిగుల శ్లాఘనీయము.

—శ్రీ గురజాడ శ్రీరామమూర్తి

భక్తిరసపారావారమున నోలలాడు నట్టింధ్రభాగవత ప్రబంధమును రచించి యంధ్రలోకము ననుగ్రహించిన పూతచరిత్రుడు బమ్మెర పోతరాజు సుకవి.

—శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

పోతన పేరు తలచడమే తడవుగా ఆంధ్రుల హృదయం పులకరిస్తుంది. పండితులు, కవితాపిపాసువులు మాత్రమే కాక మధ్య తరగతి కుటుంబాల్లో విద్యావతులు కాని స్త్రీలకు కూడ గజేంద్రమోక్షం, ప్రహ్లాద చరితం, భ్రమర గీతలు మొదలగు కొన్ని ఘట్టాలైనా తప్పక కంఠస్థమై యుండడం గమనించ దగింది. ఈనాటి మాట చెప్పలేను కాని మొన్నమొన్నటి వరకు తెలంగాణంలో అక్షరాభ్యాసంతోపాటు "తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్" అనే పద్యం నేర్పేవారు. పండిత పామరులకు ఉభయులకూ అభిమానకవి ఎవ్వ రని ప్రశ్నిస్తే ఏ దృష్టితో చూచినా 'పోతన' అనే చెప్పవలసి వస్తుంది.

—శ్రీ పి.వి. నరసింహారావు

పోతన మహాకవి తన యపార రామభక్తిచే తాను తరించుటే కాక అష్టా దశ మహా పురాణములం దుత్తమోత్తమమై, విష్ణుభక్తి ప్రబోధకమై, సులభ మోక్షప్రదమై, వ్యాసప్రోక్తమైన శ్రీ మద్భాగవత పురాణమును భక్తి రసఘుటి కగా భవ్యసాహితీ రీతిని మధురాతిమధురఫణితి నాంధ్రీకరించి ముముక్షులోకము

నకు మోక్షభిక్షను ప్రసాదించినాడు. పోతన భాగవతము వలె తెలుగుదేశము నందలి ఆబాలగోపాలమునకు నత్యంతాదర పాత్రమైన యుద్గ్రంథము మఱి లేదు.

—డాక్టర్ పల్లా దుర్గయ్య

మహాకవి పోతన కలవడిన భక్తిసాతత్య మితరాంధ్ర కవులందు విరళము. శ్రీకృష్ణపరమాత్ముడు భక్తసులభుడగు శృంగారమూర్తి. జానపదుల పామర హృదయములం దాతని పాదపంకజము లతిసాంద్రముగా ముద్రితములు. వేదాంతవేత్త యగు పోతనను భక్తి విషయమున జానపదు లందుకొన గలిగిరి. శృంగారమున వారిదే ముందడుగు. భక్తి యాత్మగా, శృంగారము శరీరముగా జన్మించిన జానపదులు (గోపస్త్రీలు) తాము కృష్ణతత్వ మనుభవించి తేన్చినప్పటి పరిమళమే శిష్టుల కాస్వాదయోగ్య మైనది.

—ఆచార్య బి. రామరాజు

పోతన శబ్దార్థముల రెండింటికి సమాన గౌరవము నిచ్చి సామర్థ్యాతిశయముతో శబ్దార్థాలంకారముల నుపయోగించెను. ఆత్మగౌరవము గల కవిసత్తముడు పోతన.

—శ్రీ ఆంధ్ర శేషగిరిరావు

పరమ భాగవతోత్తముడగు బమ్మెర పోతనామాత్యుడు భాగవతమును తెనుగున రచించి తెనుగులోకమున కంతకును భుక్తిముక్తులను సమకూర్చెను ఆ మహానుభావుని వదనారవిందము నుండి వెల్వడిన కవిత మరందధార. దాని బిందువులు పద్దెములు. అవి మధుర భక్తిని, మధురసభుక్తిని కలిగించుట తెలుగు లోకమున కంతకును అనుభవపునరుక్తమే. భక్తిరసప్రవాహ మా మహనీయుని కవితాధారగా స్రవంతిగా ప్రవహించినది.

— శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

పోతన భాగవతమున వ్రాసినంత శృంగార రసము నెవ్వరును రచియింపలేదు. కాని యావద్గ్రంథమును పఠించిన తరువాత పర్యవశించునది భక్తిరసము. శృంగారము అంగరసము. భక్తి అంగిరసము. దీనిని మధురభక్తి యందురు.

— శ్రీ కురుగంటి సీతారామయ్య

పోతనామాత్యుని కవిత్వము అతిమృదుమధురపద సంఘటితమై శబ్దార్థాలంకార పరిశోభితమై వీనులకు విందొనర్చుచు అమందానందము కలిగించుచుండును. తెలుగుదేశములో ఆంధ్ర భారతమును జదువనివా రుండిన నుండ వచ్చును. కాని ఆంధ్ర మహాభాగవతమును జదువనివారు చదువనేర్చినవారిలో అరుదు.

— శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

అనితరసాధారణ మృదుమధుర చిత్రనిసర్గ నిరర్గళధారాధోరణి భాసురుడు పోతన. ఆయన కవితాధార ధారాశుద్ధమై సౌకుమార్య భూయిష్ఠమై యుండును. ఆయన కవితావిషయమున తాను చేసిన ప్రతిజ్ఞ శ్లాఘనీయముగ నిర్వహించి అజరామరకీర్తి గడించెను.

— శ్రీ శేషాద్రి రమణ కవులు

స్వామి దేవకి కన్నవాడు. యశోద పెంచినవాడు. భాగవతాన్ని వ్యాసర్షి కన్నవాడు. పోతన (వ్యాసుణ్ణి మరపించేట్టు) అనువదించి పెంచి పెద్ద చేసిన వాడు. ఈ సారస్యం గ్రహించదగ్గది.

— శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

భాగవతము నందలి పద్యమొక్కటి యైనను కంఠస్థముగ రాని తెలుగువా రుండరు. అందుకు పోతనార్యుని కమ్మని కవితా శైలి, భాగవత గ్రంథప్రాశస్త్యము కారణములు.

— శ్రీ డి. నాగసిద్ధారెడ్డి

భక్తిరసప్రధానమైన భాగవతము పండితపామర సాధారణముగా తెలుగు వాట ప్రతియింటను వెలయుచు నెల్లవారిచే సంభావింపబడుచున్నది. పోతన భాగవత మాంధ్రులకు పరమ ప్రియమైన గ్రంథము. అందును అష్టమస్కంధములోని గజేంద్ర మోక్షమును, దశమస్కంధములోని రుక్మిణీకల్యాణమును ప్రత్యేకముగా నాంధ్రులకు ప్రాణతుల్యములైనవి.

— శ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి

భాగవతం భావగతం అయినా కాకపోయినా భావగతం చేసుకున్న సహజపండితులైన పోతన్న పొదిగిన పదాల శబ్దమాధుర్యానికి మనం పరవశులం కాక తప్పదు. ఆ మాధుర్యం ప్రతి పద్యంలోనూ, ప్రతి పదంలోనూ

ప్రతి అక్షరంలోనూ అనుభూతమవుతుంది. అర్థం తెలియకపోయినా సామాన్య జనానీకం కూడా ఆ మరంద మాధురీ మాధ్వాకు దాసోహం అంటుంది. అందుకే "ముద్దులు గార భాగవతమున్ రచియింపుచు పంచదారతో నద్దితివేమొ గంట" మని శ్రీ జంధ్యాలవారు పోతన శబ్దమధురిమకు ఒక కారణం అభ్యూహించారు.

—శ్రీ గుమ్మా శంకరరావు

పోతనామాత్యుడు ఒక కవితా నిర్మాణదక్షుడు. అతడు నిరాడంబరమైన కర్షక కవి. ఒకచేత కలము ఒకచేత హలము పట్టి "మందార మకరంద మాధుర్య" జ్ఞానరాసులను, ధాన్యరాసులను పండించిన సవ్యసాచి.

—డాక్టర్ నేతి అనంతరామశాస్త్రి

పోతన కవిత్వమందలి యాధిక్యమును వర్ణించి చెప్పలేను. ఏ కవిత యందును గానని మాధుర్య మీతని కవిత యందు పొంగి పొరలుచుండును. భాగవతము నందు భక్తిని, వేదాంతమును ప్రబోధించు కథలు విశేషముగా గలవు. ఈ రెండును పాఠకుని హృదయమున దృఢముగ నాటుకొనునట్లు చేయుటలో నీ మహాకవి కడునేర్పరి. అందులకు కావలసిన పదజాల మీతని కవిత యందు సహజముగా వచ్చిపడినది.

—శ్రీ చాగంటి శేషయ్య

పోతన మహాకవి రచనలో అటు శిల్ప వైదుష్యమును, ఇటు కళాకౌశలమును ఉభయ తన్మయ పరిపాకము నందినవి. ఆయన శీలాది గుణగరిష్ఠతచేత నిర్మలుడు. సహజ పాండిత్యముచే సాంగసంపన్నుడు. భాగవత వ్రతసిద్ధిచే జీవన్ముక్తుడు. శ్రీరామప్రసాద కవితా ప్రభావముచే మహాకవీశ్వరుడు. తన్మయుడై భాగవతమును తెనిగించి చిన్మయమైన ఆనందమును పొంది పంచిపెట్టిన పుణ్యరచయిత. ఆయన రచనలో దోషాలు వెదకి రోమల మైనాము. ఆరాధనకు మారుగా అపరాధము జరిగినది. ఆయన వాక్కును ఆర్షప్రయోగముగా పరిగ్రహించి పరమ ప్రమాణముగా శిరసావహింప వలసినది.

సంపాదకులు

అకాడమీ మహాభాగవత పీఠిక



## అనుబంధము-III

# కవితాంజలి

ఎమ్మెలు సెప్పనేల జగ మెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు సేసినవాని భక్తి లో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెర పోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.

- సింగయ-ఆంధ్రమహాభాగవతము, షష్ఠస్కంధము

వాగీశాగోచరమగు
భాగవతాగమము రామభద్రుని పేరన్
ధీగరిమఁ దెనుఁగు చేసిన
భాగవతుం బోతరాజు బ్రణుతింతు మదిన్.

- తామరపల్లి తిమ్మయ్య - శేషధర్మము

పరుల కసాధ్యమై పరగు భాగవతంబు రహస్యమంతయున్
హరికృపచే నెఱింగి మృదులాంధ్రవచో రచనా చమత్క్రియా
కరణ మహాప్రబంధమునుగా రచియించిన భానుతేజు బ
మ్మెరపుర పోతరాజును సమీకృత తేజు నుతింతు నెప్పుడున్.

- పట్టమెట్ట సరస్వతీ సోమయాజి - పృథుచరిత్ర

సమ్మతిగాను భాగవతసారముఁ దీసి, తెనుంగుఁ జేసి, లో
కమ్మునయందు నిల్పి కవికాంత సమాజములోన నెక్కుడై
తమ్మిసుహృత్కులోదితుని దల్చి భజించి మహాత్ముఁడైన యా
బమ్మెర పోతరాజకవి పాదయుగంబున నేను మ్రొక్కెదన్.

—బసవరాజు నాగేంద్రకవి-ఆనందసుందరీచాతుర్యలీలావిలాసము

పదలాలిత్యము పాకశుద్ధి భగవద్భక్తాగ్రసంసేవ్యమున్
పదమత్యున్నతమున్ మహాశుభదమున్ పద్మోద్భవానందమున్
చిదచిద్రూపవిభాగ భాగవతమున్ చింతింతు నాంధ్రంబుగా
సదయం జెప్పిన పోతరాజు పదముల్ సత్ప్రేమ నే మ్రొక్కెదన్.
-చిదంబరకవి - అంగద రాయబారము

అఖిల వేదాంత విద్యారహస్యవిదుండు
సహజపాండిత్య విశారదుండు
మర్త్యక్షితీశాధమస్తోత్ర విముఖుండు
శంభుపదాబ్జ పూజారతుండు
పటుతర కవితా విభాసిత ప్రతిభుండు
సకలాంధ్ర లక్షణ చక్రవర్తి
రఘుకులేశనిదేశరచిత మహాభాగ
వతపురాణుడు పుణ్యవర్ధనుండు
బుధజనహితుండు బమ్మెర పోతసుకవి
యెన్న రేఫ రకారంబు లెరుగడనుచు
నజ్ఞు లొకకొంద రాడుదు రమ్మహాత్ము
కవిత నెందును లోపమ్ము కలుగ దభవ!
- కూచిమంచి తిమ్మకవి - సర్వలక్షణసార సంగ్రహము

తుచ్ఛులు సరిగాదనినను
స్వచ్ఛపుఁ బోతన కవిత్వ సంపద చెడునే?
స్వేచ్ఛ జలధి దూషించిన
నచ్ఛపతివ్రతకుఁ బాప మంటుట గలదే?
-వావిలికొలను సుబ్బారావు - ఆంధ్ర వాల్మీకి రామాయణము

పేదరికంబు; కాపురము పెద్దది; దేహియనంగ నాల్కయున్
రాదు; మనంబు స్థైర్యమున గ్రాంక గ్రంథము వ్రాయ శక్యముం
గాదు; గురుండు లేఁడు; బహుశాస్త్రములన్ నిగమాంత విద్యఁ; యె
ట్లిడితివయ్య పోతన కవీశ్వర! భాగవతాబ్ధిపీఠులన్.
- మిన్నికంటి గురునాథశర్మ - గురుభాగవతము

కవు లెవ్వారును తెల్గుసేయుటకు సంకల్పించనేలేని భా
గవత గ్రంథము విన్పగుగ్గిళుల ద్రాక్షాపాకరమ్యంబుగాఁ
దవు రీతిం దెలఁగించి యుంచిన మహోదారుండు మా పోతరా
ట్కవితావల్లభు దివ్యమూర్తికి నమస్కారంబు గావించెదన్.

- పురాణం సూర్యనారాయణ తీర్థులు - భారతి, జనవరి 1943

వినుతకవీంద్ర! కొంద అవివేకులు కాకవు లందునం 'దలా
క్షణికుఁ' డటంచు మిమ్ములను జాటిరి దానఁ గొఱంత గల్గునే!
ఘనతర గంధసింధురము గ్రామమునం బయనం బొనర్చుచో
శునకము లన్నియున్ మొఱుగుచో గజరాజున కేమి లోటగున్ ?

తుమ్మల సీతారామమూర్తి - ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1923

రామచంద్ర సాక్షాత్కార రమ్యహృదయ
జనితభవ్య భావోత్ఫుల్ల సరసవచన
గుంఫితాశేష కవితానిగూఢ భక్తి
పరవశా! పోతనా! నీకు వందనంబు.

- చిలుకూరి నారాయణరావు - భారతి

దైవము మానుషాకృతినిఁ దాల్చి జగద్ధిత భక్తి నిల్పఁగా
భావమునందలంచి వరభాగవతంబునుఁ దెల్గుబాసలో
ఠీవి ననన్యసాధ్యమగు తేవ రచింపఁగఁజేసి లోకసం
భావన మీఱి దా వఱలు బమ్మెర పోతన నెంతు సత్కవిన్.

-నందిరాజు చలపతిరాయ కవి - మంగళగిరి మాహాత్మ్యము

ఉన్నాఁడా యనిపించె నైజకవితాభ్యున్నత్యహోవాద సం
పన్నుండై నరపాలదర్శనము సంభావింపఁగాఁబోని యా
మన్నీఁడే కవి లోకమందు నతనిన్ మారందధారోర్మి వై
యన్నద్యంబుపవిత్రమంజుపదుఁ బోతన్నం బ్రణామించెదన్.

- మల్లంపల్లి వీరేశ్వరశర్మ - శంకరారాధ్య చరిత్రము

సమ్మతమైన భాగవతసార వియద్ధుని సంస్కృతాంతరి
క్షమ్మున నుండఁ, దన్నదినిఁ జయ్యన భూమికిఁ దెచ్చి ఘోరపా
పమ్ము లడంపఁగా దెలుఁగుఁ బల్కిన మత్కుల పావనుండునౌ
బమ్మెర పోతనార్యుఁడను భవ్యభగీరథు నాశ్రయించెదన్.

—కొమ్మద్ది సుబ్బరాయకవి - సూక్ష్మతనువిద్యావిలాసము

"భాగవతంబు సర్వరసబంధురమున్ దెలిగించినాఁడు స
ర్వాగమసారవేది జఠరార్థముగాఁ జెయిసాఁచకే మహా
భాగుఁ డితం" డటంచు నరపాలురు మెచ్చఁగ జీవితంబు సొం
పౌ గతి నోమినాఁ డితరు లౌదురె పోతనవంటి సత్కవుల్!

—తిరుపతి వేంకటకవులు- చాటుపద్య సంపుటము

సిరిని దరిద్రదేవతను చిక్కని చూపుల నొక్క వైఖరిన్
నిరతము జూచుచున్ మనసు నీరజనాభుని వంక ద్రిప్పి యి
ద్ధరను సమత్వ మిచ్చుటన తాండవ మాడుచునున్నదో యనన్
బరగెడు పోతనార్య కవిభాస్కరు నాత్మ దలంతు నిచ్చలున్.

—దేశిరాజు రామదాసు- ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1922

భ్రమరపదంబులందు భగవత్ప్రకృతి ప్రణయానురాగత
త్త్వమును సమన్వయించి, పసి పచ్చిక మేయుచు తప్పిపోవు వ
త్సములకు కృష్ణగానమున దారులు సూపి, సుధాధునీతరం
గ మృదుమృదంగ భంగి కవికాంతుఁడు పోతన విన్చె తెన్గునన్.

—రాయప్రోలు సుబ్బారావు- ఆంధ్రావళి

భాగవతాఖ్యతో నమృతభాండము తెన్గున నిచ్చె నమ్మహా
భాగుని బోతనన్ బరమభాగవతోత్తము నాంధ్రభాగ్యదా
టీ గురుశోకవారణ పటిష్ఠుఁ దలంత్రు గవిం దలిరింప జ
న్మాగతుఁడైన ముక్తితనయా జనకున్ సనకున్ శుకార్భకున్.

—వానమామలై వరదాచార్యులు, పోతన చరిత్రము

పసిడిమేడ లొసంగు ప్రభువతంసము లుండఁ
బూరిండ్ల యందునే చేరినావు
రత్నాంబరము లిచ్చు దారాజు లుండఁగఁ
గదురు బట్టలఁ గట్టఁ గడఁగినావు
మృష్టాన్నములు గూర్చు మేదినీశ్వరు లుండఁ
దైదంబలినె త్రాగఁ దలఁచినావు
అగ్రహారము లిత్తు మను ధరాధిపు లుండ
దారిద్ర్యభారమే తాల్చినావు

కోరికల నెల్ల నొనగూర్చు ధీరులుండ
పరుల సాయంబు రవ్వంతఁ బడయకుండ
జీవయాత్రను జెల్లించినావు బళిర!
పూత గుణధుర్య! బమ్మెర పోతనార్య!
—శ్రీ ఖాసీం అలీషా, నమదర్శిని, శుక్ల ఉగాది నంచిక, 1929

తన కవితాకుమారికను తద్ధ ధనంబును నగ్రహారముల్
గొను మని యిచ్చు భూమిధవకుంజరులున్నను లేమిఁ గుందుచు
న్నను హరికిచ్చి రాజులఁ దృణంబుగ నెంచి యశంబు గన్న యా
యనఘునిఁ బోతనన్ దలఁతు నాదృతి భాగవతోత్తమోత్తమున్.
—చింతలపల్లి నరసింహశాస్త్రి, శృంగార కాదంబరి

పులకింపఁగ జడదేహముఁ;
బలికింపఁగ నంతరాత్మ, భాషామృతమున్
చిలికించి, భక్తి బీజము
లలికించెను పోతరాజు నాంధ్రధనలందా!
—నిడుదవోలు వేంకటరావు

అమృతమహాంబురాశి తెలుగై మఱి భాగవతమ్మునై త్రిలిం
గమునకు దిగ్గనేమొ యనఁగా హృదయమ్ముల నాడు నేడు నా
ట్యము లొనరించు పోతనమహాకవి ముద్దులపద్దెముల్ కృతా
ర్థము లయిపోవుగాక మఱవన్ తరమే రసిక ప్రజాళికిన్!
—దాశరధి- ఆంధ్రజ్యోతి, 14-3-1982

వ్యాసపీఠము పజ్జ వాసికపట్టుతో
భావగతమ్ముగా భాగవతము
భారతీ తీర్థంబు, బాదరాయణ మౌని
సాధుమేధా సహస్రారధార,
శుకముని ముఖవినిస్స్రుత సుధాపూరంబు,
రసనిర్భర కవితారామ సరసి,
భక్తిభావతరంగ బంధురాపగ, భగ
వద్దివ్య గుణగణ వర్ణనా మ
హార్ణవమ్ము నాపోశనం బవధరించి
ఆంధ్రమున నమ్మహాకృతి నక్షరాకృ
తిన్ వెలార్చిన కవిలోక దివ్య సంయ
మికిని మా పోతనామాత్యునకు జోహారు!

—యస్వీ జోగారావు, పంచకల్యాణి

భవదమృత నామకీర్తనోత్సవము నందు
పరవశత్వంబు నొంది భావముల డింది
మించి యాత్మార్పణంబు గావించుకొందు
పుట్టు కవిరాజ! బమ్మెర పోతరాజ!

—తిరుగుబోతు, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1925



అనుబంధము-IV

# మౌక్తిక మాల

నిత్య సత్కీర్తి పోతనామాత్యసుకవి

(పుత్తేటి రామభద్రకవి-సకలకథాసార సంగ్రహము

శ్రీ భాగవతసుధాసేవాభిరతుని బ

మ్మెర పోతరాజు వర్ణనము చేసి

(కావూరి యెల్లన- బ్రహ్మాండ పురాణము

ఆంధ్ర సద్భాగవతకర్త నభినుతించి

(అయ్యలరాజు రామభద్రుడు- రామాభ్యుదయము)

ధీనిధి బమ్మెర పోతనార్యు

(తెనాలి రామభద్రకవి- ఇందుమతీ పరిణయము)

సహజపాండిత్యుని సంస్మరించి

(కాకునూరి అప్పకవి- అప్పకవీయము

వచనసంగతుల నేర్పడ విలాసము గుల్క

పోతనామాత్యు విఖ్యాతి నుడివి

(కొచ్చెర్లకోట రామకవి- ప్రభులింగలీల)

బమ్మెరపోత కవీంద్రశేఖరున్

(వెనుమళ్ళ సోమకవి- సీమంతినీ పరిణయము)

మిక్కిలి భక్తితోడ ప్రణమిల్లెద భాగవత ప్రబంధకున్

(కాళ్లకూరి లక్ష్మీపతి- భద్రాకల్యాణము)

పూని కొలిచెద బమ్మెర పోతవిభుని

(గరికపాటి తమ్మయ- సిరియాళు చరిత్ర)

రసికు బమ్మెర పోతరాజు వర్ణించి

(చేకుమళ్ల రంగశాయి- ద్విపద భాగవతము)

అనఘమతిన్ బోతరాజు నభినుతి సేతున్
(నాగలింగకవి - పట్టాభిరామవిలాసము)

భూరి సత్కళా ద్విజరాజు బోతరాజు
(కొక్కొండ వేంకటాచలపతి - శివరహస్య ఖండము)

పోతన కవీంద్ర! రససుధాపూర్ణచంద్ర!
(కల్లూరి వేంకటనారాయణరావు - అశోకచరిత్రము)

"పోతన్న తెలుగుల పుణ్యపేటి"
"ఆతడె తోడు గల్గినను నచ్చములో కలకండయచ్చులన్
బోతలు పోయకుండుదుమె పోతనగారి విధాన..."
(విశ్వనాథ సత్యనారాయణ - రామాయణ కల్పవృక్షము)

పోతనవంటి సత్కవులు పుట్టరు; పుట్టిన నట్టిరీతిగా
వ్రాతలు వ్రాయువా రరిది; భాగవతంబది ముద్దులొల్కు-
(శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి - శ్రీకృష్ణ భాగవతము)

భాగవతంబు నా బాలశిక్ష
(గుఱ్ఱం జాషువా - ఖండకావ్యము)



# అనుబంధము V

# మహాకవి పోతన

ముద్దులు గార భాగవతమున్ రచియించుచు పంచదారలో
నద్దితివేమొ గంటము మహాకవిశేఖర! మధ్య మధ్య అ
ట్లద్దక వట్టిగంటమున నట్టిటు గీచిన తాటియాకులో
పద్దెము లందు- ఈ మధురభావము లెచ్చటనుండి వచ్చురా?

గంటమొ చేతిలోది ములుగఱ్ఱయొ? నిల్కడ యింటిలోననో
పంటపొలానొ? చేయునది పద్యమొ సేద్యమొ? మంచమందు నా
ర్చుంటివొ మంచెయందొ? కవివో గడిదేరిన కర్షకుండవో?
రెంటికి చాలియుంటివి సరే కలమా ప్రియంబగున్?

కాయలు గాచిపోయినవిగా యరచేతులు! వ్రాత గంటపున్
రాయిడి చేతనా? మొరటునాగలిమేడి ధరించి సేద్యమున్
జేయుట చేతన్నా? కృషికకృషీవల! నీ వ్యవసాయదీక్ష "కా
హా"యని యంతలేసి కనులార్పక చూచిరిటే దివౌకసుల్.

మెత్తని చేయి నీది; సుతిమెత్తని చిత్తమువాడ వంచు నీ
పొత్తమె సాక్ష్యమిచ్చు; పొలమున్ హలమున్ గొని దున్నుచో నెటుల్
గిత్తల ముల్లుగోల నదలించితివో! వరిచేలపైన ను
వ్వెత్తుగ వ్రాలుచో పరిగపిట్టల సెట్టుల తోలినాడవో!

"నమ్మము తల్లి నాదు వచనమ్ము; ధనమ్మునకై బజారులో
అమ్మనుజేశ్వరాధముల కమ్మను ని"న్నని బుజ్జగించి నీ
గుమ్మములోన నేడ్చు పలుకుంజెలి కాటుకకంటి వేడి బా
ష్పమ్ములు చేతితో తుడిచివైచెడి భాగ్యము నీకె యబ్బెరా!!

గంటలు కట్టుకొంటివటగా! "పిటగాంౘ్రడను బోలునట్టి యా
కుంటి కురూపి భూపతులకుం గవితాసుత నీయ'' [illegible]; ఆ
పంటవలంతి యల్లునకె భాగవతమ్మును ధారవోసి ని
ష్కంటకవృత్తికై నడుముగట్టితి వెంతటి పుణ్యమూర్తివో!

అచ్చపు జుంటితేనియల, నైందవబింబసుధారసాల, గో
ర్వెచ్చని పాలమీగడల, విచ్చెడి కన్నెగులాబి మొగ్గలన్
మచ్చరికించు ఈ మధురమంజుల మోహనముగ్ధశైలినే
వెచ్చట నేర్చినావు? సుకవీ! సుకుమార కళాకళానిధీ!

కమ్మని తేటతెల్గు నుడికారము లేరిచి కూర్చి చాకచ
క్యమ్ముగ కైతలల్లు మొనగాండ్రు కవీశ్వరు లెంతమంది లో
కమ్మున లేరు - నీ పగె నొకండును భక్తిరసామృత ప్రవా
హమ్ముల కేతమెత్తిన మహాకవి యేడి తెలుంగుగడ్డపై?

ఎండిన మోడుతే కిసలయించెనొ! యేకశిలాపురమ్ములో
బండలు పుల్కరించెనొ! అపారముదమ్మున తెల్గుతల్లికిన్
గుండెలు పొంగిపోయి కనుగొల్కులు నిండెనొ! పచ్చిపైరులే
పండెనొ! జాలువాఱిన భవత్కవితామృత భక్తిధారలన్!

భీష్మునిపైకి కుప్పించి లంఘించు గో
పాలకృష్ణుని కుండలాల కాంతి;
కరిరాజు మొఱపెట్ట పఱువెత్త కటివేల్పు
ముడివీడి మూపుపై బడినజుట్టు;
సమరమ్ము గావించు సత్య కమ్ముల స్పంది
వెడలు ప్రేమ క్రోధ వీక్షణములు;
కొసరి చల్దులు మెక్క గొల్లపిల్లల వ్రేళ్ల
సందు మాగాయ పచ్చడి పసందు;

ఎటుల కనుగొంటివయ్య! నీ కెవరు చెప్పి
రయ్య! ఏ రాత్రి కలగంటివయ్య! రంగు
కుంచెతో దిద్ది తీర్చి చిత్రించినావు!
సహజపాండితి కిది నిదర్శన మటయ్య!!

"భాగవతమ్ము భాగ్యపరిపాకమ ఆంధ్రుల కెల్ల - దానిముంద
దాగగజాల వేకవిత" లంచు నభంబున దేవదుందుభుల్
మ్రోగినవేమొ! నీవు కలముం గొని కావ్యము వ్రాయ బిందిబో
సాగినవేమొ! తీయని రసాలరసాలు త్వదీయలేఖినిన్!

వేసము మార్చి యిన్ని దిగవేసి 'యథా' సొనరింపకుండ శ్రీ
వ్యాసుని గ్రంథ మాంధ్రమున వ్రాసితి వందము బింద; నీద అ
గ్రాసనమయ్య; ఆంధ్రకవులందు; వరాలకు నెత్తు కెత్తుగా
ఆ సొగసైన పద్దెము లయారె! తయారగు నీ కలానసే!!

ఖ్యాతి గడించుకొన్న కవులందరు లేరె! ఆదేమి చిత్రమో
పోతన యన్నచో కరిగిపోవు నెడంద, జొహారుసేతకై
చేతులు లేచు; ఈ జనవశీకరణాద్భుతశక్తి చూడగా
నాతని పేరులో గలదా! ఆయన గంటములోన నున్నదో!!



(కరుణశ్రీ - ఉదయశ్రీ)

